# తెఱచిరాజు

[నవల]

Terachiraju

కవిసమ్రాట్


శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

Sri Visvanatha Satyanarayana.





రసతరంగిణీ గ్రంథమాల

గవర్నరుపేట : విజయవాడ-2

# తెఱచిరాజు

## ౧

మలయాచల తట చందన మహీరుహ శాఖావల్లరి
గిలగూహన పవమానము కదలివచ్చె నిచ్చోటికి॥
తరుకోటరలీనాహి మహీధర నిశ్వాస నిలరేఖా
భరకటువులు గాలిపెరలు పయనించెడి నిచ్చోటికి॥

సామాజికు లిసుకచల్లిన రాలవట్లున్నారు. సూది నేలపడిన సవ్వడి వినిపించునట్లున్నది. మలయమారుతరాగము రంగదేశమునుండి సామాజికుల తలల మీదనున్న మిన్నున పవిత్రాచులు తారాడినట్లు. చలించని గాలిలో నిఱకటము పొందినది. కదలనట్లు కనుపించినను గాలి కదలుచునేయుండును. లేనిచో నా సవ్వడి సామాజికులకు వినిపించదు. ఎక్కువగా కదలని గాలి తరగలలోకంటె కదలీకదలని గాలి తరగలలోననే సవ్వడియొక్క వినుకలి మిక్కిలిగా కలుగును. సామాజికులు మంత్రముచేత గదలని త్రాచుపాములవలె నుండిరి. ఈ నిముసము కొరకు పెలదినములనుండి పురమంతయు నెదురుచూచుచున్నది. ఆ నిముసము వచ్చెను. వచ్చిన నిముసము పచ్చని పచ్చికబయలులమీద పిల్లగాలులు పరువెత్తినట్లు లుదయించి యప్పుడే ఎరుపువిరిగిన తెలిచందురునిమీద తెలనిమూడి పింజలవంటి మొయిళ్లు పరగళ్లు తోలినట్లు వచ్చినది. ఆహాయన్న పలుకు సవ్వడి కూడ లేకుండ సామాజికు లందరు పటముమీది బొమ్మలవలె నిలచిరి. ఆమలయ మారుతము వారి వీనులలో జొరబడి యెదలలో జొచ్చి మనసును కదలకుండ నియమించి వారి నొక రెండు నిముసముల వేళకు తన యదుపులో పెట్టుకొన్నది. ఒక సంతోషపు తరగలో తలమునుకలైన యీ సామాజికులకు నొక మహాద్భుత భావము కలిగి వెంటనే మెలకువ కలిగినది. తొలి మలయమారుత రాగాలాపనమునకు సవ్వడిమాలి చేతనారహితులవలెనున్న యా సామాజికులు వెంటనే వచ్చిన యీ యచ్చెరువునకు తాళుకొనలేక సభయంతయు ప్రతిరావము లిచ్చునట్లు కరతాళధ్వనులు చేసిరి. ఆహానినదితముఖాంభోజులైరి.

ఆ మలయమారుతరాగము పాడినది వాసంతి. ఈ యచ్చెరువుభావము కలిగించినది సారధి. సారథి మహానటుడు. వాసంతి గొంతులో సంతానతరుశాఖికాకిసాలయఖాది యయిన వేలుపులవీటికోకిల కాపున్నది. వాసంతి కనులలో తొలుకాడు మెయిళ్ళ క్రొత్తగా కాపురమునకు వచ్చిన లేతపెండ్లము సన్నని మెఱపువెన్నెలవత్తు లాడెను. వాసంతి తనూలతికలో నేటిదరి పాటిపొలములో మంచుకాలమున దెలవాఱుజాముగాలులకు రే గురిసిన మంచుతుంపురులు చేఁరుచున్న తెలిపూవుల తలలు కలిగిన కొత్తిమెర చేల నిగనిగలు పరాచికము లాడుచున్నవి. ఆనాడు వాసంతి తాల్చిన చీరలో నువ్వుచేనుపూచి నలుపు విఱుచుకొన్నట్లున్నది. ఆ వాసంతి తాల్చిన రయిక యమవసనాటి శుక్ర బృహస్పతి మొదలయిన నక్షత్రములు పొడుచుకొనివచ్చినట్లున్నది.

ఈ పాట నామె ప్రత్యేకముగా నీ వేసముమీద పాడుటకు వ్రాయించుకొన్నది. ఆమె మోహినీవేషము ధరించినది. అది రుక్మాంగదనాటకము సారధి రుక్మాంగదుడై ప్రవేశించెను. ఆప్రవేశించిన తీఱు అతని శరీరముయొక్క భంగిములోని లోకోత్తర రమణీయత్వము. అతడు మోహినివంక చూచిన చూపులోని శృంగారరసలహరీపరీవాహ రేఖావిలాసము సామాజికుల కచ్చెరువు గొల్పినది. సారధి పురీ నాట్యదిదృక్షా పరమావధి. వాసంతిపురీ సంగీతశుశ్రూషాపరమావధి. ఇరువురు రుక్మాంగదుడును మోహినియునగుచున్నారు. వాసంతి మోహినియగుటలో నచ్చెరువులేదు సారధి రుక్మాంగదు డగుట యాశ్చర్యము. సారథికి నలుబదిఅయిదేండ్లు. అతడు మహానటుడని యందరకు దెలియును. అతడెప్పుడును శృంగారరసప్రధానమైన నాటకమున నాయకపాత్ర ధరించలేదు. భారత నాటకములలో కృష్ణపాత్ర వహించును. రాజపుత్ర చరిత్ర నాటకములలో ప్రతాపసింహుడు మొదలయిన వీరపాత్రలు ధరించును. హిరణ్యకశిపుడు, నరకాసురుడు యుగంధరుడు మొదలయిన వేసములు ధరించును. అతడు నాట్యధురంధరుడు. భారతకథ నాటకములుగా తిరుపతి వెంకటేశ్వరకవు లతనికోసమే విరచించిరని చెప్పుదురు. అతడు వట్టి నటకుడు కాడు. అతడు సూత్రధారుడు. పలుచని మనిసి. దృఢమైన దేహయష్టికలవాడు. మొగములో నందమునదిలేదు. మిడిగ్రుడ్లవాడు. పండ్లెత్తు. కంటికి కనులక్రింది చెక్కిళ్ళపైని బొమికలు పొడుచుకొనివచ్చును. ఈ సారథి దారివెంట బోవుచుండగా జూచి మంచిసకిన మైనదిరా యని విహ్వలించదగినవాడు. ప్రతాపుడో కృష్ణుడో హిరణ్యకశిపుడో అయినపుడు వాని మొగములోని వికార మెవ్వనికిని గనిపించదు. అప్పు డతడు సాక్షాత్తు ప్రతాపుడే. సాక్షాత్తు కృష్ణుడే. అతనికి దత్పూరీభావుకులు జేజేలు వెట్టుదురు. అతనికి సంగీతము పుట్టుకతోడి శత్రువు. కాని యతడు రంగము

మీద వేదోరాగముతో శ్రుతితో బద్యములు జదువును. ఆ చదువుట మరియెవ్వ డైననైనచో సభాభివనముయొక్క యింటికప్పును గోడలును మిగులవు. అతడు పద్యము చదివినచో సంగీతము కొఱకతని పద్యమును వినరు. ఆ పద్యమునకెట్లు వ్యాఖ్యానముచేయునని విందురు. ఆ పద్యములోనే శ్రోత్రభావము స్ఫురించు నని విందురు.

వాడు సారథి.

వాసంతి వయసు పదునారేండ్లు. ఆమె నాలుగేండ్లనుండి యీ నాటక సమాజమున నున్నది. ఆమె సంగీత శారద. ఆమె పసితనము పదుచుతనముగా మారిన యీ నాలుగేండ్లు తత్పూరీసుకుమార సంగీతశ్రవణ కుతూహల రసికులు వాసంతితో బెరుగుచునే వచ్చిరి. ఆమె సంగీతమునకు నామె యౌవనము మెఱుపు తెచ్చినట్లున్నది. సామాజికు లామె వయసు నిగనిగల చకచకలకు దాసులో యామె గొంతులోని తీయని సవ్వడియొక్క యలతియలతి యలలకు దాసులో తెలియదు.

ఆరు నెలల క్రింద నొకరిద్దరనుకొనిరి. వాసంతి తాను మోహిని వేయు నట్లు సారథిని రుక్మాంగద వేషమును ధరించు మనుచున్నదియని, సారథి తానొప్పుకొనలేదని. ఈ యొకరిద్దరి మాట నెలలు సాగిన కొలది పదిమంది వంద మంది చెప్పుకొనిరి. నెల దినముల క్రితము నిశ్చయమైనది. ఊరు పలుపోకల్లది. దాని ప్రేమకు దాని యుబుసుపోకకు సంబంధములేదు. సారథిని మిక్కిలి గౌరవించును. వాసంతిని మిక్కిలి ప్రేమించును. పసిబిడ్డవలె చూచును. కాని వారిరువురికి సంబంధముండునని కొందరు, ఉన్నది మే మెరుగుదుమని కొందఱు. ఛీ ఛీ తండ్రియు కూతురు వంటి వారని కొందఱు మీకేమి తెలియునేయని కొం దఱు. ఇది వారి యుబుసుపోక. ఉన్నచో సంతోషింతుమని కొందఱు. అంతటి నటుడు-ఇంతటి గాయని వారు పొత్తు కోరదగినదని మనసులో, గొందఱికి. కాని యాతనికి నలుబదియైదేండ్లు వాసంతికి, బదునారేండ్లు అని మనసులో విఱుపు.

వాసంతి సారథితో మీరు రుక్మాంగదుడు వేయవలయును నేను మోహినీ వేషము ధరింతును. అని తొలుత బలికినపుడు సారథి పెదవి విఱిచి వెక్కిరిం చెను. అతడు సామాన్యముగ నట్లు వెక్కిరించినచో నెదుటివారు గుండెజారి పోవుదురు. అప్రసక్తి మఱల నాతనివద్ద తేరు. కాని వాసంతిః మీరు నాకోసము వేయవలయును. మీరు రుక్మాంగద వేషము ధరించినచో నెట్లుండునో చూడ వలయునని యున్నది. అందరును మీరు శృంగారరసమభినయించలేరని చెప్పు కొనుచున్నారు. మీ రభినయించలేని పాత్రయుండనే యుండదు. ప్రసక్తావ

పంతరించుకొనుటకు వెనుక [నొక యార్ద్ర]పరిస్థితియుండవలయును. ఆ పరిస్థితి వాగ్దశను చేరనిది. మనోదశయందున్నది. మనోదశయందున్నదని యుభయపక్షములకుఁ దెలిసినది. వాగ్దశకువచ్చుటకు బహిఃపరిస్థితులనుకూలించనది. అట్టి యొకవిచిత్రమైన, యాత్మసంబంధమైన, మనఃపర్యాప్తమైన యొక యార్ద్ర ప్రవృత్తి యిద్దరి వ్యక్తుల నడుమనున్నచో నది యొకానొక క్రియావ్యవసాయమునందుఁ బ్రత్యక్షఫలముగా భాసించును. అట్టిపరిస్థితి యవధానిరంగనాథుల యీనాటక మాడవలయునన్న విషయముదాకఁ దెచ్చినది.

అవధానియెదుట రంగనాథ మేమియు మాట్లాడలేదు. అవధాని రంగనాథముయొక్క రచనను బ్రత్యక్షముగా విమర్శించును.

రంగనాథమును ముఖతః తూలనాడును. రంగనాథము పెద్దవాడని యూరకుండును. ఊరకుండక చేసెడిదేమియు లేదు. జమీందారును పట్టణములోని పెద్ద యుద్యోగస్థులును నవధానిపక్షము. వారందరకు నవధాని గొప్పకవియని యభిప్రాయము. రంగనాథము నందాదరము. అవధానియందు గౌరవము. తదితర సర్వప్రజకు నవధానియందనాదరము. రంగనాథమునందుఁ బ్రేమ.]

చివఱకవధాని వ్రాసిన నాటకమునే సారథి గ్రహించెను గ్రహించెను గాని యా నాటకమిదియేయని గుర్తుపట్టుటకు వీలులేదు. అట్లు మార్చివేసెను. అవధాని నాటకములో వందపద్యములు వ్రాసెను. ఆడెడునాటకములో మిగిలినవి పదిపద్యములు. అవధాని వ్రాసినవచనమొక్కటియు లేదు. ఆ పదిపద్యములుకూడ సారథి వందసార్లు తిరిగివ్రాయించెను. ప్రస్తుత పద్యములలోనున్న భావములన్నియు సారథివిగాని యవధానివి కావు. ఈరీతిగా సన్నివేశములవధానివి కావు. అవధాని వ్రాసిన వచనపుముక్క యొక్కటి లేదు. పద్యములలోని భావము లవధానివి కావు. అది యవధాని వ్రాసిననాటకముగా, ప్రకటింపబడినది. తాను వ్రాసిననాటకమని యవధాని సంతోషించుచుండెను. ఈ రహస్యములన్నియుఁ దెలిసిన జనులే యా నాటక మవధాని వ్రాసెనని చెప్పి యతనిని గౌరవించుచుండగాఁ దెలియని ప్రజలు దానినట్లు నమ్మి యవధాని మహాకవియని చెప్పికొని గర్వపడుటలో నాశ్చర్యమేమున్నది.

వాసంతిమాత్రము తాను రెండుపాటలు రంగనాథముచేత వ్రాయించికొనెను. ఈ సంగతి యవధానికిఁ దెలియును. అతడు తొలుత నభ్యంతరపెట్టెను. కాని వాసంతి తనయొక పద్యమును జదువుట కంగీకరించినందున నతడు దాని కంగీకరించెను. పైగా నాటకమంతయు, దాను వ్రాసినదాయెను. రంగనాథము వ్రాసిన రెండుపాటలతోఁ దన ప్రతిష్ఠకేమి భంగమువచ్చును. మరియు వాసంతిసారథిమాటకూడ వినదు. వాసంతిమాట సారథివినవలయును.

గాని సారధిమాట వాసంతి వినదు. సారధిమాట వినని వారు సమాజములో నుండుటకు వీలులేదు. వాసంతి వినదు. సమాజములోనున్నది అద్భుత నవధాని యేమియుం జేయలేదు.

ప్రదర్శనము జరుగుచుండగా సభాభవనమున ముందటివరుసలో జమీందారుగారు వారి ప్రక్కనే యవధానియు గూర్చుండిరి. రంగనాథుడు వెనుకటి వరుసలో గూర్చుండెను. ముందువరుసలో రాచరికపు టుద్యోగస్థులు గూర్చుండిరి. "మలయానిల" యన్నపాట వాసంతి పాడుచున్నప్పుడు సభయంతయు దిగ్భ్రాంతి పొందుచుండగా నవధాని మొగము మురకటించుకొనెను. ప్రక్కకుం దిరిగి రాజుగారితో నిట్లనెను! వట్టి మెత్తని మెత్తని మాటలు తెచ్చి వాడు మోసము చేయును. అందులో భావము పాడు నేమియునుండదు. వీడొక పెద్దకవి. అవి నాలుగుపంక్తులు. దానినిండ నక్షరక్షరముతప్పే. దానికి చందస్సులేదు. ఈనాటిలో నిట్టి కవులకే జనము జేజేలు పట్టుచున్నారు." రాజుగారేది చెప్పిన నూకొట్టుటలేదు. కనుబొమలాడించుటయు నుండదు. కాని వారి కదలని మొగము వెనుకకలదు వేదనువాదములకోర్చిన మనోదుర్గమునకున్న యినుపకవాటమును భేదించి లోనికి పోయి తొంగిచూచినచో నచట నవధానిగారు చెప్పినమాట కాభిముఖ్యమేయున్నది. అవధాని రాజుగారి చెవిలో నూదలేదు. పదిమంది వినునట్లే చెప్పెను విన్నవారందరు మొదటివరుసవారే, రాజుగారితో నవధానిగారు చెప్పినమాటలో—ఇదే కాదు ఏదైనను సరే—అబద్ధముండునా యనుకొనెడువారు. అది వేదవాక్యముగా నమ్మువారు.

వాసంతియా పాటపాడినంతన సభయంతయు దిగ్భ్రాంతిమంతమయ్యెను. ఈసభలో మొదటివరుసను మినహాయించవలయును. రెండవవరుసలో రంగనాథుడు కూర్చుండెను. రంగనాథునకటునిటు వెనుకపీటని రంగనాథునియొక్క స్నేహితులు కూర్చుండిరి. స్నేహితులనుటకన్న భక్తులనుట సముచిత శబ్దప్రయోగము. వారు "నస్వామీ మమదైవతం తదితరో నాస్మాకమీశాయతే" యన్నంతటివారలు. సభయంతయు నొకవిచిత్రమైన యానంద పయస్సాగర వీచీడోలామధుర హేలాభిరామమైనచో రంగనాథుడు స్వాత్మీయతన విశ్రాంతి పొందెను. ఈవాక్యమున నాత్మశబ్దమునకంటె స్వశబ్దమునకుం బ్రాధాన్య మెక్కువ. రంగనాథుడు పొందిన యనుభూతి యట్టిది. యతనికి వాసంతీ సౌందర్యము తత్కంఠగత మాధుర్యము రంగప్రసాధన వైశిష్ట్య సమన్విత తత్సన్నివేశ చారుత్వము సభాగత సహృదయభావుకమనః ప్రసన్నత ఇవి యన్నియుం దాను వ్రాసిన పాటచేతనే సమకూడినవని తనపాట లేనిచోం దక్కిన వేవియు లేవని తనపాటయే తక్కినవాని నన్నింటిని సృష్టించెనని యతని భావన. ఒక ఇంద్రి

యాతీతమైన యనుభూతి విశేషమున్నచో దానికిని రంగనాథమునకేమియు సంబంధము లేదు. అతని సర్వానుభవ మింద్రియావశమైనది. వాని యింద్రియములు వానినే స్థాపించును. వాని సర్వేంద్రియోపరతియు మనస్సునందు. మనస్సునకతీతమైన వస్తువు వానికి లేదు. అతనికి మనోవిషయమైనది కీర్తి. ఆకీర్తి దిగ్దిగంతరములందుఁ బరిమళించుచున్నది. తన మనస్సునందుఁ దన భక్తుల మనస్సులయందు నభివ్యాప్తమైయున్నది. తక్కినవారు మొరటులు. వారికిఁ దన కవనములోని మెత్తదనము తెలియదు. ఇట్టిపురుషులు-ఆపాటవిని యెట్టియానందము పొందవలయునో యట్టియానందము రంగనాథము పొందెను. ఆయానందము వాని నవ్వులోని సెలవులు చెక్కిళ్ళ నడుమునొమ్మటలోఁ గనుఱెప్పలుదగ్గఱకువచ్చి కనులు సన్నని గీతలవలెఁ గనిపించుటలో వంగి తల ముందు వ్రాలుచుటలోఁ గనిపించును. అది యతనియొక్క హేల. ఆహేలను జూచినచోఁ దద్భక్తులు పరమానందము వహింతురు. వారందరింద్రియాతీతమైన యొక యనుభూతి పొందుదురు. వారికది సాయుజ్యము.

వాసంతి యాపాట పాడినంతనే సభాసదులకొక యాశ్చర్యము కలిగెను. ఆ యాశ్చర్యము సారథియొక్క రంగప్రవేశ పరమ రమణీయభంగిమ దర్శనమువలన గలిగినది. అందరును కరతాళధ్వనులు చేసిరి. ఆరంగప్రవేశ భంగిమ చాతురి యావధాని చూచెను. సభలో కరతాళధ్వను లెందుకు, జెలరేగినవో వానికిఁ దెలియలేదు. రంగనాథము చూచెను. అతని యర్ధనిమీలితములైన నేత్రములు విస్ఫారితములైనవి. అతని కాశ్చర్యము కలిగినది. ముందటి పీఠముయొక్క వెనుక భాగమున వ్రాలి నోరు తెరచి చూచెను. అంతలోఁ బ్రక్కనున్న భక్తులవంక, దిరిగి యెంతబాగుగానున్నదో చూడుడన్నట్లు ఎడమచేయి నాడించెను. రమణీయ విషయ దర్శనానుభూతియొక్క స్వరూపము రంగనాథములో నట్టిది. దాని యుపరితలము తన యుపరిభాగముతో సమ్మేళనము చేయును. దానియందు రమించి తన్మయుఁడు కాఁడు. దానినిఁ బ్రశంసించి తదితరులకుఁ జూపును. ఎప్పుడైన రాజుగారి నిశ్చల ముఖలక్షణముల వలన కలదు లేదనువాదముల కోర్చిన మనోదుర్గము యొక్క యినుపకవాటమును భేదించి లోనికిఁబోయి చూడవచ్చును. కాని చలనము కలిగిన ముఖలక్షణములు కలిగిన రంగనాథముయొక్క నిశ్చలముగానున్నదన్న మనోదుర్గముయొక్క వజ్రకవాట మెవ్వరును భేదించలేరు.

మొదటివరుసలోఁ గూర్చున్న యందరు కరతాళధ్వనులు చేసిరి. సభ యందరు చేయుచుండగా, జేయకుండుట మర్యాదకాదు. సారథి యెడమవైపున నున్న ప్రక్క తెరలోనుండి వచ్చెను. సభలో ముందటివరుసలో నెడమవైపున గూర్చున్నవారికతఁడు కనుపించలేదు. కాని వారును కరతాళధ్వనులు చేసిరి.

తమవరుసలో జమీందారుగారు కూర్చుండిరి. వారి మర్యాద కాపాడవలయును. గ్రామములోఁ బెద్దమనుష్యులనిపించుకొన్న వారందరు రంగభూమికి ముందున్న గర్తములోఁ బీఠములమీద నాసీనులైయుండిరి. తక్కినవారందరు వెనుక నెత్తయిన నేలమీదఁ బఱచిన చాపలమీదఁ గూర్చుండిరి. చాపలమీదఁ గూర్చున్న వారికి సభలో దొరగారున్నారు. మనము వినయముతోఁ బ్రవర్తింపవలయు నన్న భావమేలేదు. పీఠికాధిష్ఠులైన వారందఱకుఁగలదు. మొదటివరుసలో కూర్చున్నవారికే తాముకూడఁ జప్పట్లు చఱచవచ్చునా చఱచరాదా యన్న యనుమానము. జమీందారుగారు చప్పట్లు కొట్టరు. తాము కొట్టరాదు. ఐన నాయూరిలో తహశీలుదారందరికంటె గొప్పయుద్యోగస్థుడు. అతడు కొంచెము స్వతంత్రుడు. రాజుగారు కొట్టకపోయినను తాను కొట్టెను. అతనిని జూచి తక్కినవారును కొట్టిరి. ఇందువలన తహశీలుదారుమీద రాజుగారికి కోపము రావచ్చును. వచ్చునో రాదో, వచ్చెనో రాలేదో యెవరికిఁ తెలియును. అది కాలాంతరమున దెలిసికోవలసిన విషయము.

అవధాని చప్పటు కొట్టలేదు. రంగనాథము వ్రాసినపాట యెట్లున్న తన కేమి. తిరువాత దాను వ్రాసిన పద్యము సారథి చదువును. ఆపద్యమునకు సభాసదులందరు సంతోషింతురు. దానికి దీనికినున్న తారతమ్యము సభాసదులకే తెలియును. అవధాని యాపద్యముకొఱకుఁ బ్రతీక్షించుచుండెను. సారథి యాపద్య మెంతసేపటికిని చదువడు. అతడు రంగముమీదికివచ్చి యొకతీవిగా రెండుమూడడుగులు వేసెను. ఆమూడడుగులు వేయుటకు రెండు నిమేషములు పట్టెను. ప్రక్కనొక చెట్టు కొమ్మవలె రంగముమీద నేర్పాటుచేసిరి. సారథి దానినానుకొని నిలుచుండెను. ఆయానుకొని నిలుచున్న వైఖరి మరల సభయందు దాహోనినాదము పుట్టించెను. అతడు సామాజికులవంకనే చూడడు. అతడు నిలుచుండి వాసంతి వంక చూచుచుండెను. సభయొక్క దృష్టియంతయు నటువాసంతివంక నిటు సారథివంక నొక్కసారిగా బర్యాయముగా దిరిగిన తిరుగులు తెలియకుండ జూచెను. అహో! ఇది యేమి వాసంతి. సిగ్గుల బరిణియైనది. ఆమె తనూవిలాసము చకచ్చకిత మైనది. వాసంతి యభినేత్రిగా నెవ్వరు అనుకొనరు. ఆమె గొంతులోని కాకలీస్వర మధురిమయె జను లెఱుగుదురుగాని యామె హావభావ విలాసముల కొలపట్టని యెవ్వరు ననుకొనలేదు. ఈమె యీ యభినయ మామె నేర్చికొనినవిద్యయా? సహజమైనదా, యది నిజముగా నభినయమా? తత్కాలమున సారథియొక్క లోకోత్తర శృంగార రసాభినయ దర్శనముచేత నామెయందుఁ గలిగిన సహజాపతితమైన వికారమా!

సారథియే నివ్వెఱపోయెను. సారథి తొలుతనుండి భయపడినది నిజము కాదు. అభినయ పరమార్థము తెలియని వాసంతితో, దన మహాభినయ మేకదేశ నిపతితమయి సగము వ్యర్థమగునని సారథి భావించెను. సారథికి వాసంతియొక్క సంగీత కళయందు నెంత యభిమానమో యామె యభినయమునం దంత నిరాదరణ. అది యభినయ శబ్దవాచ్యము కాదని యతనికిఁ దెలియును. సారథి వాసంతిని చిన్నప్పటినుండి యెఱుఁగును. సారథికి వాసంతి తండ్రికి మిక్కిలి స్నేహము. వాసంతిని జేతులలో నెత్తుకొని పెంచినాడు. ఈ నాటక సమాజములో వాసంతిని చేర్చుటకు సారథి యంగీకరించలేదు వాసంతి చేరుదు నన్నది. వాసంతిమాట వారి యింటిలో వేదము. తండ్రి కామె యొక్కతయే కూతురు. ఆమెకు సంగీతము చెప్పించినాడు. ఆమె చేత సభలు చేయించవలయునని వీణ ధనమ్మాళ్ళంత దానిని చేయవలయునని యతని సంకల్పము. ఆమె యిదివఱకే గానసభలు చేయుచుండెను.

వాసంతి చిన్నప్పటినుండి సారథి నాటకములు చూచినదే. ఆమెకుఁ దా నభినయ మెంత చేయలేదో పరుల యభినయ మంత తెలిసికొను శక్తి పరమేశ్వర దత్తమైనది. ఆమెకు సారథి భరతాచార్యుడు. అతని సమాజములో దాను వేషము వేసితీరవలయును. తొలుతటిదినముల లోపల జెప్పినట్లనును గాని చెప్పినట్లు చేయలేని వాసంతిని సారథి పలుసార్లు కోపపడెను. ఆమె కన్నీళ్లు పెట్టుకొనెను. ఇతడు లాలించెను. చివఱకు సరేలేయని యూరకుండెను. సామాజికులామెయందభినయమును వాంఛించుటలేదు. ఆమెకంఠ మాధుర్యము నే వాంఛించుచున్నారు.

సారథి యీనాడు వాసంతిలోని యీసాత్త్విక భావోదయమునకు నివ్వెఱబోయినాడు. ఆమె యనుభావము విచిత్రముగానుండెను. తదనుభావదర్శనముచేత సారథి తనకు దెలియకుండ నొక శృంగారమూర్తి యగుచుండెను. సారథి వాసంతివంక జిత్రచిత్రముగా బులుకుబులుకున జూచుచుండెను. వాసంతి మధుర లజ్జామూర్తియై తనకుఁ దెలియని కదలికలు తన దేహాంచలమున గదలించుచుండెను. రెండు నిముసములు నాల్గు నిముసములయ్యెను. సభ నిశ్శబ్దముగా నుండెను. అందరు కనులప్పగించి కూర్చుండిరి. అవధాని తన పద్యముకోస మెదురుచూచుచుండెను. అనుభూతి మనస్సుదాటిపోని రంగనాథము మనస్సుచేత దిగ్భ్రమపొంది యటునిటు చూచుచుండెను. ఆశ్చర్యమునుకూడ బొందుచుండెను. అట్టి పరమరమణీయమై భావైకవేద్యమై మనోద్వారము తెఱచికొన్నగాని యనుభవ పరమార్థమును సంబాళించుకొనలేని సన్నివేశమతనికిఁ జికాకుకలిగించెను. ఆ చికాకులో వెలివస్తువునందలి యస

హ్యత లేదు. తనయందు, దనకుఁగలిగిన యసహ్యత. ఆ యసహ్యత యిట్టిదని యతనికిఁదెలియదు. ఆ యసహ్యత నిశ్శేషముగాఁ గూర్చుండలేనియవస్థ గలిగించును అంతే.

సారథికిఁ దన గొలుసులు తనకుఁదెలిసెను. తెలిసినవెంటనే వాసం తిని వాసంతిగాఁ జూపలేదని తెలిసినది. ఇంకొక సమయమునందైనచో నా మనస్సును తుడిచి పరిశుభ్రముచేసి మరల యథాస్థానమున ప్రవేశ పెట్టెడువాఁడే. ఇప్పుడా వ్యవధి లేదు. తాను రుక్మాంగదుడు. వంటనే పద్యమందుకొని చదువ వలయును.

అతడు పద్యమును చదివెను. అది పద్యము కాదు వచనము. వచనము కాదు పద్యము. జనమాశ్చర్యము పడిరి. అతడు పద్యము చదివెడి వైఖరి యాంధ్రులకు తెలియును. పద్యమును విఱుచును. పదవిభాగము చేయును. సంధులు తెగ గొట్టును. ఏదోయొక మాటకు గనులతో చేతులతో వ్యాఖ్యానము చేయును. పద్యములో గొంత భాగమునకు బ్రాధాన్య మిచ్చును. తక్కిన భాగమున కప్రాధాన్యమిచ్చును. ఉదాత్తానుదాత్త స్వరితములు వెలయించును. ఈ పద్య మట్లు చదువలేదు. ఆ పద్యములోని భావము 'ఈమె యెవ్వరు, నా మనసులో నున్న స్త్రీ వాంఛ కొంతాకృతిపొంది నా యెదుట వచ్చి నిలుచుండెనా' యని. ఆ పద్యమును సారథి చదివెను. ఆ నటపరమేశ్వరుడు తన మనసులోని స్త్రీ వాంఛ జగన్మోహనాకారముతో వెలికి వచ్చుట నభినయించెను. అతడు వెనుకముందు పింజెలుపోసి జరీయంచులేతగులాబిపట్టుతాపితా కట్టుకొనెను. చమ్కీ పని చేసిన నల్లని ముఖమల్ పట్టీ నడుముకు గట్టెను. మెడలో బది వరుసల హారములు వేసెను. చేతులకు సింహతలాటపు కడియములు దాల్చెను. కేయూరములు ధరించెను. మేన నంతట నొకానొక వన్నెకల యంగదళము పూసెను. అతడు రంగులు కలుపును. ఆ రంగుల కలయిక యతనికే తెలియును. అతని శరీరమును జూచినచో 'నేరెటేటియసల్తెచ్చి నీరజాప్తు సానపట్టిన తాపాడి చల్లి మెదిపి పదను సుధనిడి చేసెనో పద్మభవుడు'-యనిపించెను అతడు నిత్య వ్యాయామము చేత కఠినీకృతాంగుడు. ఇంత ఱొమ్ము, సన్నని నడుము, ముంజేయి వంచినచో నూర్ధ్వ బాహువునందలి కండలు కనిపించును. అతని మేనికండలన్నియు గదలాడెను. అతని హృదయములో నుండి నిజముగా నొక స్త్రీమూర్తి సమావిర్భవించుచున్నట్లే యతని మేని యొక్క కండల మూర్ధ్వచలనము భాసించెను. అతని మొగములో మధురసృష్టి సేయు ప్రజాపతి యొక్క యొక సమాధిస్థితి కనిపించెను. అతడు నిత్యయోగాభ్యాసివలె, గనుగ్రుడ్లు నాసాగ్రమునందలి యిరు ప్రక్కలకు మలచి

భూనిహితదృష్టియై నిశ్చలముగా నొక లిప్తకాలము నిలుచుండెను. ఓహో! ఆయూరి ప్రజల సౌభాగ్యమెట్టిది? అతని యభినయపరమ రహస్యము తెలిసిన వారు తత్పట్టణమున లెక్కకు పదిమంది యుండిరో లేదో. ఆ సూక్ష్మదృష్టి కల వారంతకంటె నెక్కువమంది లేరు. స్థూలముగా నతడు మహానటుడని యందఱకు దెలియును.

రంగనాథము ప్రక్కనున్న ప్రియభక్తునితో 'మంచి యోగాభ్యాసము చేసినవాడు కాని యట్లు చేయలేడు' యనెను. అవధానిరాజుగారితో మాడుచు చక్కగా బద్యమల్లుంపవలయును. ఒక చక్కని భావము గణయతి ప్రాసలు లేనిచో పద్యమేమిటండి' యనెను. అనెనే గాని యా పద్యమునందలి భావ మవధానికి నచ్చలేదు. అతడు తొలుత నొక పద్యము వ్రాసెను. ఆ పద్యము లోని భావమిది "ఓహో! ఈమె యెవ్వతె నారాయణముని యూరువునందు సముద్భవించిన యూర్వశియా! దాని శిరోజముల నుండి చీకట్లు వెలువడుచున్నవి ఆమె కన్నులు తామరపూవులవలె నున్నవి. ఆమె చేతులు తామర కాడలవలె నున్నవి. ఈమె ననుభవించుటకు బరమేశ్వరుడెవనిని నిర్మించెనో."

తొలుత నవధాని యీ పద్యము చదివి "యీ చివరి భావమును మొదట కాళిదాసు వ్రాసినాడు. తరువాత నేను వ్రాసితిని. కాళిదాసు కొన్ని యనౌచిత్యములు చేసినాడు. నేను దానిని బాగుచేసితిని' అన్నాడు. అపుడు సారథి తనలో నవ్వుకొనెను.

మోహినీ రుక్మాంగదుల సమాగమమునందు సారథికి దనస్మృతి తనకు లేదు. ఆమె నిజముగా మోహిని. తాను నిజముగా రుక్మాంగదుడు. తాను ధరించిన పాత్రతో దా నేకీభవించుట సారథి కిది క్రొత్తకాదు. కాని శృంగార రసము క్రొత్త. మోహినీపాత్ర వహించినది వాసంతియై యిట్లనుభవించుట చిత్రము తుదకు నేకాదశీ శబ్దశ్రవణముతో నిజముగా మోహము విచ్చెను. అంతటి యేకీకృతిలో గూడ సారథికి దనసారథిత్వ విస్మృతి కల్గెనా! ఒడలెఱుగని సినముండునా! ఐనను ఈ పాక్షికమైన యేకీకృతి చమత్కారమైనది. సంపూర్ణమైన తాదాత్మ్యమువలెనే భాసించును. తన యభిజ్ఞ యుండియు లేనట్లుండును. సర్వమానసిక వ్యవహారము తదారోపిత విషయికముగానే యుండును ఏకాదశీ శబ్దశ్రవణముచేత సారథి తల్లక్రిందులయ్యెను. తెరలో నుండి మూడుసారులు డప్పుమ్రోత వినిపించెను. దానిని వించు సారథి ప్రచండమైనమార్పు పొందెను. అదియొక విచిత్రమైన నిమేషము. సారథికి తాను సారథినని తెలియును. రుక్మాంగదుని యందధ్యాస పొందితినని తెలియును. అధ్యాసపాశైక్కువయని తెలియును. మోహితుడైన రుక్మాంగదుని యధ్యాస

పోయి యేకాదశీవ్రత నిష్ణాతుడైన రుక్మాంగదుని యధ్యాస ప్రారంభించెను. ఈ మార్పులో సారధిత్వము 'విస్పష్టమయ్యెను. తాను సారధినని కాక రుక్మాంగదపాత్రము నభినయించుచున్నానని పూర్వమునకంటె విస్పష్టముగా జ్ఞప్తికివచ్చెను. కాని రుక్మాంగదభావము వదలలేదు. ఒక సముద్రమథనము జరిగినట్లు జరుగుచున్నది. అందునుండి హాలాహలము వెలికి వచ్చుచున్నది. తత్కాలమున సారధియొక్క శరీరవిన్యాసము ముఖాంగవిన్యాసము చూచుటకు భయంకరమయ్యెను. సభాసదులు నిస్తబ్ధులైరి. అవధానికూడ దనరచనయందలి ధ్యానముపోయెను. రంగనాథము ప్రశంసాపూర్వక మందహాసానుడయ్యెను. అతని వసలు మిడిగ్రుడ్లు. ఆ కన్నుల కదలిక తిర్యక్ప్రసార విధురమయ్యెను. అతని మొగము చూచుటతోడనే యేదో రాక్షసుడు శాపవిముక్తిపొంది దేవతాకార వివర్తదశా మహాబాధ ననుభవించుచున్నట్లు గోచరించెను. పదునాలుగేండ్ల పసిబాలిక వాసంతి చూచుచుఁ జూచుచుఁ దన్మూర్ఛ వికృతి నోర్వలేకపోయెను. ఆమెకు వయసువచ్చినదే కాని సృష్టి రహస్యమేమి తెలియును? పదునాలుగేండ్లు వచ్చినంత వయసు సమకూరుటయుఁ దద్గత భావనా పరంపరయు సర్వజంతువులకు సహజము. ఈ కామభావము జీవునియొక్క వికాసముకాదు అది శరీరముయొక్క వికాసము. ఆమె కదలిపోయెను. వణకుచుండెను కన్నులయందు నీరుబుకుచుండెను. ఆమెస్థితిని సారధిచూచెను. ఆమె తలుముకొని నేలబడి పోవుచుండెను. "నాయనా భయములేదు భయములేదు ఓర్చుకొనుము ఓర్చుకొనుము" అని నోటతో సారధి యామెను సమాశ్వసించెను, ఆమెకు ధైర్యము కలుగుటకు నామె భుజముపైఁ జేయినైచెను. ఆమె మొగముఁ దన భుజముపై నానించికొనెను. ఇంక తన మొగమామె చూచుటలేదు. అప్పుడు సారధియొక్క విచిత్రమైన యాభినయము ప్రకటించెను. దోసమంతయుఁ దనదికాని తన్ను మోహింపఁ జేసిన స్త్రీదికాదు ఆమెయందుఁ గోపించుట న్యాయముకాదు. లాలనచేయుచు నామె నాదరించుట యుత్తముని ధర్మము. అచ్చట రెండు పద్యములున్నవి. సారధి వానినిఁ జదువుట మానివేసెను. అతని కనుసైగతోఁ దెర దింపఁబడెను.

అవధానికిఁ దన రెండుపద్యములు చదువుట మానివేయుట మిక్కిలి నెగులు కలిగించెను. ప్రక్కనున్న రాజుగారును మరియొక పెద్ద యుద్యోగస్థుడును నివ్వెఱ ననుభవించుచుండిరి అవధాని వారితో "రత్నపు గుళికలండీ రత్నపు గుళికలు. రెండు పద్యములు. నా కవితాశక్తియంతయు వానియందుఁ బెట్టితిని అవి చదువుట మానివేసినాడండీ. అవి చదువుట మానివేసినాడు" అని మొఱపెట్టెను. మానవునియోగ్యు చిత్రమైనది. నిజముగా మాటాడినచో నెందుఁ

జిత్రములేదు. అతడు పొందు సమాధి బహిర్వ్యాపకస్పర్శి. దానినుండి వెలికి వచ్చుట మిక్కిలి తేలిక. 'అవధాని గొప్పకవి డెబ్బదియేండ్లవాఁడు' అన్న లౌకిక భావము పెడది. సారథియొక్క యభినయ దర్శనము చేతఁగలిగిన నిర్వ్యాజలిక్షిప్త సహస్రాంశభాగ సంబంధమైన పరిచితముకాని యొక యనుభవము. అవధాని మాటలువిని వారు వెంటనే తేరుకొనిరి. అహో! మానవుని యనుభూతి భిన్న సంస్కారములుకలిగిన మానవుల యనుభూతి, లోకరూపములయిన విషయము లందుఁ దగుల్కొని రసజగత్తుయొక్క పొలిమేరలు చాల దవ్వునుండి చూచిన యన్యానుభూతి యొట్టిది.? ఆ కనిపించినవిషయమే తెలియని యనుభూతి యొట్టిది. అవధాని వయసుచేతఁ బెద్దవాఁడు. అతఁడు గొప్పకవి యగునో కాదో వారికిఁ దెలియదు. లోకమునందభివ్యాప్తమైన యొక ప్రతీతిని నమ్ముటయే కాని వేఱు కాదు. ఆ పద్యములలోని మాటలే యితనివి కాని భావములితనివి కావని రాజుగారికిఁగూడఁ దెలియును. వినినతఁడే కవియని రాజుగారనుకొందురు. సృష్టికంటె విచిత్రమైనది యిదే.

కొంతసేపటికి నాటకమైపోయెను. చివరిభాగమున సారథి వైరాగ్యభావ ప్రదర్శనము చేసెను. యోగశాస్త్రములోని రహస్యముల నన్నింటి నభినయ పూర్వకముగా వెల్లడించెను. సభలోఁ దచ్ఛాస్త్ర రహస్యములు తెలిసినవారెవ్వరు లేరు. అభినేత సారథి గనుక నేదో గొప్పగా చేసినాడన్న ముగ్ధభావమే కాని సునిశిత పరిజ్ఞానములేని యా సభ సంగీతసాహిత్యాభినయ శిల్పవిద్యలను సామాన్యముగా నెట్లు చూచునో యట్లే చూచెను. ఇదియిది యని నిరూపించుకోఁగలిగిన పరిజ్ఞానములేని మానవుని యనుభూతి యేమియనుభూతి? సారథియొక్క యభినయమంతయు మొత్తముమీద నిట్లేయనుభవింపబడుచున్నది. వరదల మీదనున్న గోదావరిని మనుజుడు చూచును.

హృషీకేశమువద్ద శిలల యొఱపిడిచేత వేగాతివేగమున మలకలై ప్రవహించుగంగానదిని జూచును. హిమవంతమునుజూచును. వర్షకాలమున సస్యసమృద్ధమై పచ్చికలతో నిండి బహు పుష్పములచేతఁ దెల్లగాగరా తాల్చిన శబరకన్యలవోని వృక్షములు నిండియున్న దక్షిణదేశ మహాపర్వతములను జూచును. ఎదో కొట్టవచ్చినట్లున్న స్థూలభావమే కాని మనుష్యుడింకేమియు ననుభవించలేదు. విద్యాప్రదర్శనముజూచిన తరువాతఁ గలుగు ననుభూతియు నపండితుల కిట్టిదే, పండితులకది విచిద్యమానమై తదనుభూతి స్వరూప లక్షణము గోచరింపజేయును. అతనియొక్క ఈ యభినయ రహస్యము తెలిసినవారు సభలో నలుగురైదుగురు.

నాటకమైపోయినది. చివరిసారి నేపథ్యము జారినది. తొలుతటి వరుసలో గూర్చున్న పెద్దలు కొందఱవధానిని మాటాడుమనిరి. ఇంచుమించుగా నందరును

కోరిరి. అవధాని లేచెను. వృద్ధుడయ్యు దేహపటుత్వము తగ్గనివాడు. కనులు సరిగా కనిపించవు. కనుల కద్దములున్నవి. యవి లేకపోయిన నే యెక్కువ కనిపించును. రంగస్థలమున ధిరోహించుటకు గొంచెము కష్టపడెను. చిన్న యుద్యోగస్థు లొకరిద్దఱు సహాయముజేసిరి. ఆయన నిలుచుండి తొలుత గొంతుసవరించుకొనెను. దంతములు సగానికి సగము లేవు. ఇట్లుపన్యసించెను "సారధి చాల గొప్పవాడు. అతని నే నాశీర్వదించుచున్నాను. మహాకవి వాక్కు యథార్థము యథార్థము. మన దేశములో నింతకంటె గొప్ప నటుడు లేడు, లేడు ముమ్మాటికిని లేడు అని నేను చెప్పుచున్నాను. నాటకమంతయు జక్కగా జేసినారు. అందరుచేసినారు. చిన్నపిల్లవానిదగ్గఱనుండి చక్కగాఁ జేసినారు. అంతయు బాగుగనేయున్నది కాని రత్నపు గుళికలవంటి పద్యములను వదలిపెట్టినాడు. వానిని నేను కష్టపడి వ్రాసినాను, నెత్తురోడ్చి వ్రాసినాను. నా మనస్సునకు గష్టము వేసినది. కాని సారధి గొప్ప నటుడు. నాటకములలో వేషము వేసిన వారి నందరిఁ దీవించుచున్నాను."

## ౨

వేషధారణాపాకరణములకు నేపథ్యముల వెనుకనున్న స్థలములో స్త్రీల కొక ప్రత్యేక స్థలమున్నది. ఆ సమాజములో స్త్రీవేషములు పూర్వము స్త్రీలే వేసెడివారు. ఈ స్థలము వాసంతి కొఱకే యేర్పాటు చేయబడినది. ఆ సమాజములో వాసంతి తప్ప మరొక స్త్రీ లేదు. పురుషు లెవ్వరా కెలనబోరు. మొదట నొక కొన్ని నెలలు వాసంతికి వేషనిర్మాత వేషము నిర్మించెడివాడు. తిరువాత వాసంతియే వేషము వేసికొనుట నేర్చినది. వేషము వేయుచుండగా దీయుచుండగా వాసంతి వందసార్లు సారథిని పిలుచును. కొబ్బెరనూనె సీసా యెచ్చటనున్నదో ఫలానా ద్రవ్య మెచ్చటనున్నదో మాటిమాటికి సారథిని పిలిచియే యడుగును నీ వెచ్చట పెట్టుకొంటివో నా కేమి తెలియునని వచ్చి వెదకి యిచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు కోపబడును. సారథికోపబడినచో వాసంతి నవ్వును. అతనికి కోపము పోవును.

సారధి వాసంతి నెత్తి పెంచెను. చిన్నప్పుడాడించెను. ఆమె కైదేండ్లప్పు డామెను చంక కెత్తుకొని యంగళ్లకు దీసికొనిపోయి వాహ్యాళికి గొనిపోవుచుండెను. ఆమెకు వయసు వచ్చిన తరువాతగూడ నతనికి నామె తన బిడ్డవలెనే కనిపించెను. చిన్నప్పుడు వాసంతి యతని పేరు సరిగారాక యా ఆధి యని యనెడిది. అది క్రమముగా 'ఆధి' యని పిలుచుటగా మారెను. పెద్దయైన తిరువాతకూడ ముద్దునకు గొన్నాళ్లు లాధియనియే పిలిచెడిది. అది రూఢమై

యామె యెప్పుడు నతని నాధి యనియేపిలుచును అందఱును సారథిగా రందురు. ఆమె తండ్రియు సారథిగారే యనును. ఆమె తండ్రి కూతురతో నెన్నియో సార్లు చెప్పెను. "అధియేమిటె నీ మొగము. సారధిగా రనవలయును" అని. ఆమె తా నాధియే యందు ననును. సారథి నేను వాసంతి కాధినే. సారథిని కా దనును.

ఆనాడు నాటకమయినంత నే వాసంతి తన గదిలోనికి బోయెను. తన వేషమును తా నే తీసికొనెను. ఆ వేషము సరిగా దిసికొనుట చేతకాలేదు. చేతకాక కాదు. లోకములో నెవ్వరి కేపని చేతకాదు. ఇతరుల సాహాయ్యముతో మనుష్యు డొకపని చేయుచున్నచో నా సాహాయ్యము లేనప్పుడు తన కా పని సాధ్యముకా దనిపించును. ఆ సాహాయ్యము లేదన్న దిగులెక్కువై శ్రద్ధతక్కువై యాపని చేత కానట్లే జరుగును. ఆమె మొగమున రంగు సరిగా పోలేదు. మరియు నా రంగు పోయెనో పోలేదో యామెకు తెలియనేలేదు. ఆమెమనస్సు వేషాపాకరణమందే లేదు. తాను వాసంతి నన్న యభిజ్ఞయున్నది. తాను మోహినీ వేషము వేసితినన్న యభిజ్ఞ యున్నది. ఆ వేష మిప్పుడు తీసివేయ వలయునన్న యభిజ్ఞ యున్నది. ఈ సర్వమైన యభిజ్ఞలను మించి యేదో యొక భావ మామె మనస్సు నావరించియున్నది. ఆ భావ మీ యభిజ్ఞల నావరించి యున్నది. ఈ యభిజ్ఞలను క్రిందుసేయుచున్నది. ఆభావము ఇదమిత్థమని తెలియ లేదు. ఆ భావ మిట్టిదని తెలిసికొనుటకు ప్రయత్నముకూడ లేదు. సారథి శృంగారాభినయముకూడ లోకోత్తరముగా జేయగలడని యామె విశ్వాసము. లోకమున కా సంగతి తెలియదు. అతడేరసము నభినయించ లేడు! లోకమున కీ సంగతికూడ ఋజువు చేయవలయునని యామె యుద్దేశము. అందుకోసమే యింత ప్రయత్నము. ఇంతపట్టుదల. ఆ విషయము లోకమునకు ఋజువు చేసినది. ఆ ఋజువు చేయుటలో దన హృదయమునకు మరి యేదో సంగతి ఋజువై నట్లున్నది. ఆ ఋజువైన దేదో తనకు తెలియదు. ఆ ఋజువైన భావము విస్పష్టము కాలేదు. అది యొక బెలుకుగా సిగ్గుగా నామె యందు గనిపించుచుండెను. ప్రతి నాటకాంతమునందువలె నే సారథిని పిలువవలె ననుకొనును. పిలువదు. ఏదో పిలువవద్దనుచున్నది. అది లజ్జయా భయమా సారథి తనకు గనిపించకూడ దన్నట్లున్నది. వేషము తీసివేసి సారథికి గనిపించకుండ నింటికిబోదమనిపించుచున్నది. ఆమె యాలోచించుటకును దోచుటలేదు. నిలువుటద్దము ముందు గూర్చుండి కర్ణాభరణములు తీసివేసినది. మరల దనకు తెలియకుండనే పెట్టుకొన్నది. కర్ణాభరణములు తీసివేసిన గుర్తేగాని మరల దాల్చిన గుర్తులేదు. ఈ వేషము తీసివేయుట తనకు సాధ్యముకాదు. సారథిలేకుండ తన కేపనియు

సాధ్యము కాదు. తన వేషధారణము వేషాపాకరణము సారథి సాహాయ్యము లేక తనకు గొనసాగునదిగా కనిపించలేదు. ఆమె యెంత తొందరగా వేషముతీసి వేసి సారథికి గనిపించకుండ నేదొక త్రోవ నింటికిఁబోవుటకు వీలగునో విచారించు చున్నది. విచారించుటలేదు. అట్లు చేయుటకు నామె ప్రకృతి తొందరించు చున్నది.

సారథి తన వేసమును తాను తీసికొను చుండెను. తాను పూర్వమిటి వేషమును వేయులేదు. ఈ యాభరణములు ధరించలేదు. పూర్వము తాను వేసెడి వేషముల యందలి యాభరణములును దుస్తులును నాలోచన లేకుండ దీసి వేసెడివాడు. అది యతనికి బాతిక ముప్పదియేండ్ల యనుభవము. ఈ కుండలములు కేయూరములు హస్తాంగుళీయకములు మొదలయినవి తానుతీయుట కష్టమయ్యెను. అతడిబ్బంది పడుచుండగా మఱియొక వేషధారి వచ్చి యతనికి సాహాయ్యము చేసెను. సామాన్యముగా దాను వేషము తీసికొనక ముందు వాసంతి పిలుపు వినిపించెడిది. ముందచ్చటికి బోయి యామెకు సాహాయ్యము చేసి తరువాత తానుతన వేసము దీసికొనెడివాడు ఈనాడు వాసంతి పిలుపురాలేదు. పిలుపు రాకపోయినను తన యంతటదాను పోవచ్చును గద, నేడామె పిలుపు రాదన్న విషయము సారథి మనస్సునకెట్లో తెలిసినట్లుండెను. ఆ పిలుపు వచ్చినను తాను వెళ్ళకూడదని తనకేదో చెప్పుచున్నట్లుండెను.

సారథి ప్రౌఢుడు. అవివాహితుడు. అతని శీలమును గూర్చి యెవ్వరికిని మంచి యభిప్రాయములేదు. ఉండవలసిన యవసరము లేదని యతడే చెప్పుచుండును. లోకమునందు శీలము ద్విధాభూతము. ఈ రెంటిని రెండుగా చూచుట లోకము నేర్చుకొనవలయును. ఒకటి స్త్రీ సంబంధమైన శీలము. రెండవది తదితర సర్వవిషయములకు సంబంధించినది. అబద్ధములు చెప్పుట మోసములు చేయుట దురహంకారమవలంబించుట పరద్రవ్యాపహరణము – నితరుల నొక కాళ్ళక్రింద గోతులు తీయుట తడిగుడ్డలతో గొంతులు కోయుట, నిలువున దీపమార్పుట తానయోగ్యుడై యోగ్యత కలవాని నుచిత కార్యమునుండి బహిష్కృతునిగా జేయుట ఇట్టివి లోకమునందు శతసహస్రాధికములైన దుష్టత్వములు కలవు. ఇవి యన్నియు నొకరాశి. స్త్రీగతకామ మొకరాశి. మంచి చెడ్డలు లేవు. వావివరుసలు లేవు. బంధువులు మిత్రులని లేదు. ఉచ్చనీచములు లేవు. ఇది యొకరాశి. ఈ రెండుపక్షముల యందుదరతమ భావములు కలవు. ఈ రెండు పక్షములలో జాలభేదము కలదు. స్త్రీ విషయమున నామెయొక్క యానుకూల్యము నామెయొక్క యంగీకృతి యామెయొక్క సమానతయు గలవు. మొదటి కక్ష్యలోనవి యెప్పుడు నుండవు. మొదటి కక్ష్యకు సంబంధిం

చిన యవినీతి సంపూర్ణముగా నవినీతి. స్త్రీసంబంధమైనది యుభయానిష్టమై పరులకు నపకారికాక రెంటిలో గొంతమంచిది. తన భార్య తనచెల్లెలు పరపురుష సంగమము చేసినదని వానికి దెలియనిచో వాని మనస్సునకు గష్టములేదు. వాడు పడెడుబాధ లేదు. తెలిసిన తరువాత వాడు బాధపడినచో వాడు తన మీద నది యారోపించుకొనిన బాధ. కొన్ని యూహాలు పెట్టుకొని యాయూహాలవలన దెచ్చికొనిన బాధ. ధనాది విషయమునట్లు కాదు. ఆబాధ ప్రత్యక్షముగా నన్నోదకముల విషయమున బ్రదుకుట విషయమున నాపత్తు కలుగ జేయుచున్నది.

మరియు స్త్రీ విషయమున నామె శీలవతి కానిచో సంసారిణి కానిచో నాపనివలన నొక గొప్ప యింటిప్రతిష్ఠకు భంగమురానిచో దానిలో, దప్పేమున్నది. కామము జంతు సహజము. స్త్రీ విషయమున నుత్తమకులముల యందు శీలవతులయందు స్వామ్యముండవచ్చును. బహుపురుషసంగమము చేయు స్త్రీ విషయములో స్వామ్యభావ మెందుకవలంబించవలయును. ఇది వట్టి స్వార్థపరత.

ఇది సారథియొక్క నీతిభావములో గొంతభాగము. సారథి యట్టివాడు. అతడు నీతిమంతుడనియే చెప్పవలయును. ఒక కులస్త్రీని తాను కోరి యామెను ధనాదులచేత మోహపఱచి యామెను వశపఱచుకొనుటకు దానెప్పుడు ప్రయత్నించడు. కులస్త్రీయె తన యందభిలాష ప్రకటించినను సత్కుల మర్యాద పాటించి తానావంక తిరిగి చూడడు. మిత్ర గృహముల యందతడు పరమ సాధువు పరమయోగి. అతని స్నేహితుల యిండ్లలో స్త్రీలతనితోనున్నంత చనవుగా మరియే యింటలో నుండరు. అతడందరిని చెల్లెండ్రవలె గూతుండ్రవలె జూచును. అతనికంటె నుచితానుచితజ్ఞుడు లేడేమో!

అతని నొక కామమావేశించి మనసు త్రిప్పలు పెట్టి గగ్గోలు పఱచిన ఘట్టమతని జీవితములో లేదు. అతనికి స్త్రీయనగ స్త్రీ. కామోద్రేక నివారకమయిన యొక సాధనము. తక్కినప్పుడు నామెయునొక జీవుడు. ఇట్టి సారథి మనస్సులో నెవ్వోయొక బెరుకు ఒక పనుకొడుట తానొక దోషిగానైనాడేమో యన్న యనుమానము వీనికి మించి పూర్వమందననుభూతమైన యొక విచిత్రమైన సంతోషమేమో యనిపించుచున్న యొక రేఖ-యతనియంతఃకరణ ప్రవృత్తి యందు గదలాడెను. తనంతటతానే పోయి నాసంతికి సాహాయ్యము చేయవలెననిపించెను కాని మనస్సు తూగలేదు. అంతఃకరణము చేయుమన్నట్లున్నది. మనస్సు వద్దన్నట్లున్నది. ఇదియేదియు నతని మనస్సులో విస్పష్టముగా లేదు.

అతని మనస్సులో నొకయూహాతోచినది. తానే వేసము ధరించినను సగానికి మించి తత్పాత్రతో దానేకీభవించుచుండును. అదియే తన్నింత

మహానటకునిగా జేసినదని యతని యభిప్రాయము. తనయారుణమునందు దనకత్యంతాభిమానము. ఈనాడు నట్లే జరిగినది. కాని యీనాటి తనయేకీకృతి తనకనభిమతమైనది. ఈ నాటియేకీకృతిలో నొక యనిష్ట విషయము సంక్రమించినది. పూర్వము తాను హిరణ్యకశిపుకు వేసెను తానారాక్షస భావమునంతయునసుభవించెడివాడు. ప్రహ్లాదుడున్నచో గోపము. నారాయణుడున్నచో ద్వేషమునసుభవించెడివాడు. కాని ప్రహ్లాద వేషము వేసిన పిల్లవాని మీద గోపములేదు. నృసింహ వేషధారియందు ద్వేషము లేదు. తన హిరణ్యకశిపు భావమునందలి యేకీకృతి ప్రహ్లాద నృసింహభావములలో బర్యవసించెడిది. ఈనాడట్లులేదు. తాను రుక్మాంగదుడుగా నభినయించినంతసేపు తాను మోహినీ భావమును జింతించలేదు. వాసంతిని జింతించెను. తన శృంగారభావము వాసంతియందు పర్యవసించెను. వాసంతిని మోహినిని విడివిడిగా చూడలేకపోయెను. ఇది ఏలనిట్లు జరుగవలయును. పట్టుదలగా వాసంతి తానీ వేషమును ధరించునట్లు చేసినది. ఆ పసిదాని పట్టుదలయు నామె యందలి తనకైన జాలిచేత ముద్దుచేత నామెకుదనమీద గలిగిన యధికారము వీనినిగూర్చి భావించుచు వాసంతి మోహినీపాత్ర నెట్లు నిర్వహించును, తానే పాత్ర నిర్వహించును. తానేదో సంగీతము పాడుకొనును గాని తన కభినయ మేమిచేతనగును. తన కాపట్టుదల యెందులకు. తాను తన శృంగార రసాభినయము జూడవలయునన్నచో తానే నాయక పాత్ర యేల ధరించవలయును. ఇటి యూహాలన్నియు గలిసి జాలితోగూడిన యొక కోపము, ముద్దుతోగూడిన యొక నిరాకరణము ప్రేమతో గూడిన యొక నిరాకరణభావము సారధి మనస్సు నావరించెను, ఆరునెలలుగా నిట్టిభావము క్రమక్రమముగా వృద్ధిపొందెను. తానానాడు రంగమునందు ప్రవేశించిన తోడనే పరమ హేలామనోహరమూర్తియై సామాజికులను దిగ్భ్రాంతిపొందించు భంగిమతో రంగప్రవేశము చేయును. వాసంతి తెలతెలపోవును. తానేమి చేయవలయునో తనకు దెలియదు. తాను నవ్వుకొనును. పైకి నవ్వును. అభినయించుచు నామెవద్దకుబోయి సామాజికులకు వినిపించకుండ రంగముమీదనే లోగొంతుతో నామెతో 'పెద్దయభినేత్రివలెనన్నీ వేషము వేయుమంటివి నీవెప్పటి కొయ్యబొమ్మవే' యని నామె నేడిపించవలయునని తలచెను. రంగముమీదఁ దనయట్టి ప్రవేశముచూచి వాసంతి మధుర లజ్జాభినయము చేయుటతో పరమసాత్వికాభినయము చేయుటతో నతిడనుకొనిన పథకమంతయు మాఱిపోయినది. ఆమె యభినయమునజూచిన యానందము సారధిని సారధిగా నుంచలేదు. అనుభవపరమార్థతయందు వానిని శృంగారనాయకునిఁజేసినది.

విచిత్రమైన సన్నివేశము వాసంతియందు మోహినీభావము నపాకరించి వాసంతీభావమును స్థిరపఱచినది. వాసంతీభావము నిరాకృతము కాలేదు. ప్రథమ నిమేషమున వాసంతీ ప్రశంసగానుండి మరునిముసమున యతని సహజముపోనటుకుని ప్రకృతిచేత శృంగారరసముగా మిగిలిపోయినది. ఉభయులు తదభినయ వేళ వారువారుగాలేరు. శృంగారభావముచేతనే వారి యాత్మలు సమావృతములై యుండెను. ఏకాదశీ శబ్దశ్రవణముచేత నతని మనస్సునకుఁ దెలివచ్చెను. మిగిలిన నాటకము జరిగినంతసేపు వాసంతిలో నేమియు మార్పులేదు. వాసంతి నటియా, కాదు కనుక తాను దేవతలచేతఁ బంపింపబడిన యొక సాధనముగా భావించికొని రుక్మాంగదునియందలి మోహమువిడిచి కొన్న భావము కలిగించుకొనుటకు?

జంతువులయందు యౌవనోదయమైనంతనే స్త్రీపురుషభావన యంకురించును. ఈ భావనకు సంఘము నియమములు మేరలను కల్పించును. అవి సంఘమునందు సహజమైయున్నవి. ఈ నియమములచేత మేరలచేత నా స్త్రీపురుషసంబంధమైన భావన సహజముగనే పెరుగును సోదరులయందు, దంపతులయందు వరుసకానివారియందు నాగరకసంఘమునందు తద్భావాంకుర మేర్పడదు. ఇది సంఘము పెట్టినహద్దు. ఒకానొక ప్రకృతి సంఘమందుండి సంఘమర్యాదలయందు నిరాదరణకలిగినవాడైనచో సహజముగా సంఘమర్యాదల నెదిరించువాడైనచో నా యెదిరించుట కామభావమునందభివ్యాప్తమైనచో నా వ్యక్తియందు కామభావన సహజముగానుండి యీ నియమములను మేరలను పాటించదు. కామమందఱియందొక్కతీరుగానుండదు. ఇదియుఁ దక్కిన గుణములవంటిదే. శారీరక మానసిక గుణములు పలుమందియందు పలువిధములుగానుండును. ఒకనికి బౌమిక పుష్టియుండును. మరియొకనికి లేదు. ఒడలిలో నొకనికి జీవితము సాగుటకు కావలసినంత బలమేయుండును. అట్లే కామముకూడ నొకనియందు మిక్కిలి తక్కువగానుండును, ఒకనియందు సంసారపక్షముగానుండును. మఱియొకనియందు నధికముగానుండును. ఈ యధికముగానున్నవారే లోకమునందు జారులు. వారికది సహజముగదా. దానియందు దోషమేమియుండదు. లోకములోనున్న దుర్మార్గుల గుణములన్నియు సహజములే. వానికి శిక్షలెందుకు. నాగరకజాతి శిక్ష విధించుచున్నది. అనాగరకజాతియందుఁగూడ సంఘము శిక్షించుచున్నది. నాగరకతయు సంఘమును మానవప్రకృతి నియమితము కావలయునని వాంఛించుచున్నవి. ఈ నియమమునకు మతము పారలౌకిక ఫలమున్నదని చెప్పుచున్నది. పారలౌకిక విషయములందు విశ్వాసములేనివాడైనను సంఘసుస్థితికొఱకు మానవునియొక్క సహజప్రవృత్తియొక్క నియమ

ములు వాంఛించును. ఒక మహాబలవంతుడు బలహీనులందఱనుఁ జంపుచున్నచో సంఘము తూష్ణీంభావము వహించదు. అట్లే యధికకాముకుడు పరభార్యా రతి చేసినచో సంఘము సహించదు. ఒక మహాబలవంతుడు బలహీనులను పది మందిని జంపినచో తప్పేమి? రాజ్యముయొక్క సుస్థితికి మంది బలముకావల యును. ఇది నేటి రాజ్యాంగవిధాన పరమార్థము. ఒక వ్యక్తి చనిపోయినను యుద్ధభటుడు చనిపోయినట్లు, ఆ నష్టము రాజ్యమునకుఁ గలుగుచున్నది. అధిక కాముకుని బహు స్త్రీ సంగముచేత సంఘమునకుగాని, రాజ్యాంగమునకుఁ గాని యెట్టి దోషము సంభవించుటలేదుకదాయని ప్రశ్నయైనచో జరుగుటలేదు. శిక్ష శిక్షించువానిమీదనే యాధారపడియున్నదా! శిక్షించువాని ప్రయోజన మునుబట్టియే శిక్షయా! ఐనచో నొకనియాస్తి మరియొకడు తీసికొనినచో శిక్షిం చనక్కఱలేదు. ఆ యాస్తి యెవడు తినుచున్నను రాజునకు వచ్చెడి పన్ను వచ్చును. కనుక వేఱొకధర్మమున్నది. ఆధర్మము స్త్రీ విషయమునగూడనున్నది.

ఇట్టి విచారణ యౌవనోల్బణదశలో నుండదు. మఱియు నొకస్థలమునందలి యధికశక్తి బహువిధములుగా నుపయోగపడుటకు వీలున్నను నా వ్యక్తియొక్క విశిష్ట ప్రకృతి హేతువున నేకవిషయముననే దాని యుపయోగము జరుగుచుం డును. ఒకడు మహాబలశాలి. అతడు తన బలమును పరులకు సాధ్యముకాని పను లయందే వినియోగించును. ఇతరులమీదికి పోనేపోడు. అట్లే యధికకాముగల యొక ప్రకృతికూడ దత్కాముభావ సర్వస్వము నొక వ్యక్తియందే వినియోగిం చును. వాసంతి యట్టిది. తన యధిక కామ భావమును మఱియొక వ్యక్తి సంఘ విద్రోహకరము కాకుండ కులటాత్వముసందు నెఱవేర్చుకొనుచుండును. సారథిఅట్టివాడు.

ఒక్కొక్కప్పుడొక్క కామభావన కలదు లేదన్నట్లుండును. ఒక వ్యక్తియందు గౌరవముగా భాసించును. ఒకచోట జాలిగా భాసించును. ఒక చోట ముద్దుగా భాసించును. ఆ వ్యక్తియొక్క వివేకాదులను ప్రశంసించుట గా భాసించును. ఈ యీ భావములు యోగ్య సన్నివేశ సన్నికర్ష జరిగినపుడు కామముగా పర్యవసించును.. వాసంతీ సారథుల యీ భిన్నప్రకృతులు నీవిల క్షణ ప్రకృతులు నేటి నాటకరంగముమీద గామభావనాభిముఖముగా మరలి నట్లు వారిద్ద ఱనుకొనలేదు. మనస్సులలో నట్లున్నది. సారథియన్నచో వాసంతికున్న తిదభినయ విద్యాపురస్కృత గౌరవ ప్రశంసా భావముల కవధి లేదు. వాసంతియన్నచో సారథికి సహజముగా ముద్దు. ఆమె దక్కని గొంతు నకు చిన్నతనములో నంత సంగీతవిద్య నేర్చినందులకు నా ముద్దు ప్రశంసగా గౌరవముగా వృద్ధిపొంది యామె తనకంటె మిక్కిలి చిన్నదియగుటచేత నీ

రెండు భావములు నా మొదటి భావములో లీనమై యదియొక విలక్షణమైన భావసంపుటి యైనది. పరస్పరము వారి యిరువుర నడుమగల యీ భావములు కామముగా పరిణమించుటకు వీలులేనంత వయస్తారతమ్యము కలదు. ఈ వయోభేదము వారి పరస్పర మృదుగౌరవములకు నడ్డుగా మహాపర్వతమువలె నిలిచినది. కాని కామభావన పొంగెత్తిన తుపానువంటిది. అది పర్వతములను లెక్కజేసెడిదికాదు. చూచెడివారికి నది యెంత నదియైనను పొంగి కొండను ముంచునా యనిపించును. ఆ నదికి పట్టరాని వఱద వచ్చినపుడు కొండను ముంచివేయును. నదికిఁగల పొంగునదికే తెలియును. ప్రక్కనున్న చెట్లకు తెలియదు. ఊళ్లకుఁ దెలియదు. ఈ ప్రేమయే యా చెట్టులోననో యాయూరిలోననో పుట్టినచో నవియు నట్లే పొంగును. కాని యవి దూరముగా నిలుచుండి నదిని విమర్శించును. అది యట్లు పొంగుటయు నివి విమర్శించుటయు లోకసహజము. ఆ పొంగిననదికి కట్టలుకట్టి మరల నూళ్ళమీదికి రాకుండ మెట్టలు ముంచకుండ దాని నడుపులోఁ బెట్టుటయు లోకోపకారకమని తలచుటలోకము యొక్క సహజత్వము.

సారథి వేసము తీసివేసికొనుచుండెను. రాజువేషము వేసినవారు సామాన్యముగా కేయూరములు కట్టరు. కేయూరభావమే వారికి లేదు. కేయూరములని గ్రంథములలో జదువుటయేకాని వాని స్వరూపమెట్టిదియో యెవ్వరికిఁ దెలియదు. ఆ సారథియొక విచిత్ర పురుషుడు. అతడు వట్టి నటకుడు కాడు. అంతకుమించిన సూత్రధారియుఁగాడు. అతనికిఁ దెలిసిన యాహార్యక విద్య యతనికే తెలియును. అతడొక వేసము వేయ సంకల్పించినచోఁ దొలుత వేషధారణలను గుఱించియే కొన్ని నెల లూహించును. అతడెన్నాళ్ళూహించెనో తెలియదు. ఒక విచిత్రమైన కేయూరములు భుజముల నవధరించెను. అవి దూరమునుండి చూచినచో నొక పట్టుతువాలా రెండు బుజములమీదికి వచ్చినట్లు కప్పినట్లు కనిపించును. ఆ తువాలకు రెండువైపులఁ ద్రాళ్లు పేని ముళ్లువేసినట్లుండెను. ఆ ముడులకు బదులు సన్నని ముత్యములు వ్రేలాడుచుండెను. అచ్చముగా జరీపోగులతో నేసిన సన్నని గుడ్డవలె నుండెను. అతని యొడలికి వేసికొనిన బంగరు రంగునకు నీ కేయూర వర్ణమునకు ఛాయాభేదము కలదు. ఆ కేయూరవర్ణమే యతని ఱొమ్మునందుకూడఁ గలదు. వక్షః ప్రదేశమునకు దిగువ నాభిపర్యంతము వేసిన వన్నియ కొంచెము తక్కువ మెఱుపుకలదిగానుండెను. ఎదు ఱొమ్మంతయు బంగారువన్నె. వక్షఃస్థలము మిక్కిలి పసిమి. కుక్షిభాగమున నా పసిమియే కొంచెము వన్నెతక్కువ. గుండెకడనుండి నాభి పర్యం

తము సన్నని శ్యామరేఖ. బొమ్మకాంతిలోఁ గేయూరకాంతి కలసి పోవుచున్నది. కాని వర్ణవిభాగమును జూపించుచునే యున్నది.

అట్టి కేయూరమును సారథి తీసివేసెను. నక్కగుడ్డ తెచ్చి దాని నేదో విలక్షణముగా కుట్టించెను. నాటిరాత్రికి నాటకమనగా లేదా నాటకము రేపురాత్రి యనగా నతడు గుడ్డలదుకాణమునకు పోయి చిన్న చిన్న పేలికలు కొనును. అవి యెవరికిఁ గావలయు ననుకొన్న చీటిగుడ్డలు. పేలికలు పేలికలుగా రెండంగుళములు మూడంగుళములుగా కొనును. వానిని దర్జీవాని ప్రక్కన గూర్చుండి కుట్టించును. కొన్నిటిని తానే కుట్టును. ఆ దర్జీవాడొకడున్నాడు. వానికరువదియేండ్లు. అతడు జంగము. అతనికిని సారథికిని నెయ్యము. అతడు నలుబదియేండ్లుగా సారథి నెఱుఁగును. ఆ దర్జీవానికి సారథియన్నచోఁ జెప్పరానంత గౌరవము. సారథికంటె మహానటుడు సృష్టిలోఁ బుట్టడని యా దర్జీవాడు చెప్పును. వాని పేరు తుండి. నలుబదియేండ్లలోఁ గనీసము ముప్పదియేండ్లలో సారథి వేసిన యొక్క వేసమైనను తుండిమూడలేదు. తుండి గొప్ప దర్జీపనివాడు. అతని చేతి క్రింద నలుగురైదుగురెప్పుడు పని చేయుచుందురు. యంత్రముమీదఁ దక్కిన వారు కుట్టగా నతడు చేతిపనిని జేయును అతనియొద్ద నొకసారి చొక్కా కుట్టించినవాడు మరియింకొకనివద్దకు పోనేపోడు. అతడల్పపు పనులుముట్టుకొనడు. చిన్న పనులతనివద్దకుఁ దీసికొనిపోయినచో నతడు నిరాకరించును. ఏవగించుకొనును. సారథి యీ గుడ్డపీలికలు తీసుకొనిపోయి కుట్టుమన్నచోఁ దాను సొంతముగాఁ గుట్టును. అతడు తప్పుగాఁ గుట్టినచో సారథి వానిని తిట్టును. తుండి యెవ్వరి చేతను 'ఒరి' యనిపించుకొనడు. సారథి 'ఒరీ' మాత్రమే కాదు. "నీవు జంగమువాడవు కాదురా. కొండెమంగలివాడవు." అనును. తుండి నవ్వును. తుండిజుట్టు ముగ్గుబుట్టవలె నెఱసెను. అతని మొగము కండలు తేరి యుండును. తెల్లని గుబురుమీసముల గుబురు వాని చెక్కిళ్లయందు గంభీరముగ నుండును. అతని మొగమునందలి గాంభీర్యము చూచియే వానినెవ్వరు చులకనగా మాటాడరు. తుండికిఁ గొమరులున్నారు. వారికిఁ దండ్రియన్నచో నమితప్రేమ సారథి వచ్చి తండ్రిచేత నిట్టిగుడ్డలు కుట్టించుకొనునపుడు తుండినతడు తిట్టుచున్నపుడు వారతనిని జూచి యాశ్చర్యపడుచుందురు. సారథి వెడలిపోయిన తరువాత తుండి వారితోననును. "మన కుట్టుపనివిద్య సారథికింత యెట్లు తెలియునో" యని.

తుండి యిదివఱకెన్నిసార్లో 'సారథికి' చిత్రచిత్రములైన పనులు చేసిపెట్టెను. ఈ కేయూరములు కుట్టినపుడు అనగా కడచినరాత్రి తుండి పొందిన యచ్చెరువుకు మితిలేదు. ఒకసమయమున వాని చేతిలోని సూది పనికి

రాలేదు. ఇది యెట్లు పుట్టుట యని యడిగెను సారథి చిన్నకత్తి తీసికొని యోషను బొట్టనవ్రేలి గోరును అంపమువలెకోసి దానితో కొన్నిచోట్ల నొక్కించి పుట్టించెను. తుండి "నీవెవరవు. పూర్వ మేమహాచక్రవర్తికో దుస్తులుకట్టినవాడవు ఇప్పుడీ జన్మమెత్తితి"వనెను. సారథి బ్రహ్మానందపడెను. తుండిని కౌగిలించుకొనెను. "ఔనోయి! నేను నటకుడనుకాను. పుట్టుపని వాడను. అందుకనియే నీకు నాకు నింతచెలిమి" యనెను.

ఆ కేయూరము సారథికిఁ బరమప్రియమైనది అది పుట్టించినవెవరికిఁ దెలియదు. నాటకములోని వేషధారులందఱు సారథి రంగముమీదికి వచ్చుచుండగనే దానిని జూచిరి. అదియేమిటో వారెవ్వరికిఁ దెలియలేదు. కాని యది బుజములమీద వేసికొనుటచేత సారథి చక్రవర్తివలెఁగనుపడుచుండెను. అంత చక్రవర్తిలక్షణము తత్పాత్రధారికిఁ బ్రసాదించిన యా కేయూరములను భావించిన సారథి యూహాయెట్టిదో యెవ్వరికి దెలియదు. వాసంతి తానభినయించినంతసేపా కేయూరములవంకనే జూచుచుండెను. ఒకసారి యా కేయూరముల స్పృశించెను. సారథి యామెను నివారించెను. "కేయూరములు రాజచిహ్నములు. వానిని తాకరాదు. తాకినచో నభినయము తెలియదన్నమాట" యనెను. వాసంతి కఠినిమాటలువిని భయము వేసెను. అంతలో నామెను లాలించెను. ఆమె భయమువాసెను. కేయూరములు తీసి సారథి చేతితోఁ బూనెను. అతనిసద్యస్స్ఫురణగా వాసంతి దానిని తాకుటయు తాను వలదనుటయు జ్ఞాపకమువచ్చెను. వాసంతి యేమనుకొనినదో! చిన్నపిల్ల. వానిని తాను స్పృశించుట ప్రేమాధిక్యము సూపించుట యనుకొనెను.

ఈభావము వెంటనే సారథికి మఱియొకభావము గోచరించెను. వాసంతి యట్లనుకొనినదా యనుకొనకుండ చేసినదా! వచ్చినయూహను సారథి వెంటనే పరిహరించెను. కాని యా యూహ మరల మరల వచ్చుచుండెను. ఆయస్పష్టమైనభావము విస్పష్టతాదశకు తీసుకొనివచ్చుటకు సారథికి మనోబలము చాల లేదు. వాసంతిచేతికిఁ గుంకుమవన్నె యలఁదఁబడియుండెను. ఆమె చేయివేసిన చోటఁ గేయూరము కొంచెమెఱ్ఱవన్నె కలిగియుండెను. ఆ కేయూరమునుండి ఆయెఱ్ఱరంగును దీసివేయుట యెట్లు? అదియుదుకరానిగుడ్డ, సబ్బు పెట్టరాని గుడ్డ. ఇంతలో సారథికి నవ్వువచ్చెను. మరల నీకేయూరములతోడి పనియేమి? ఇంక తానెప్పుడును రుక్మాంగదుని వేషము ధరించడు. ఇదియే మొదటి సారి ఇదియే తుదిసారి. మరి యా కేయూరము నంతిజాగ్రత్తగాఁ దానెందుకు జూచుచున్నాడు. అది తన నేర్పునకు లక్ష్యముగానుండెను. దానివెల యెంత? అది

యంతయుఁ గలిపి రెండురూపాయల లోపయ్యెను. ఆకేయూరములయందుఁ దనకొక మమకారము కలిగినట్లు భాసించెను. వాసంతి దానిని ముట్టుకొన్నచో దానట్లనవచ్చునా! వాసంతి పసిపిల్ల. నొచ్చుకొనదా. నొచ్చుకొనదా యేమిటి నొచ్చుకొన్నది. నిజముగా కేయూరములను ముటుకొనరాదు. అట్లు తాకినచో రాజమర్యాదకు లోపము. అంత సూక్ష్మమైన తాను భావించిన యాచార రహస్యము సామాజికులలో నెవరికిఁ దెలియును. అభినయము తానంతసూక్ష్మముగా నభివ్యాప్తమైయుండునని సామాజికులలో నెవ్వరికిఁ దెలియును ఇది తెలిసిన వాడు సామాజికులలో ఒకడుండెను. ఈయూహ వచ్చిన వెంటనే సారధి మనస్సునకు వెంటనే మతిడు తగిలెను. అతడెంతవాడనగా దానిని తాకవలదని తాను వాసంతితో రహస్యముగా జెప్పినదికూడఁ దెలిసికొనఁగలవాడు. సారధి యొక లోకోత్తరమైన యనుభవము చేసినచో సభలో నతడున్నాడనియే చేయును.

ఇంతటి సారధియుఁ గొన్నికొన్ని సభలయందు సరిగాఁ జేయలేదనిపించుకొనుచుండును. ఆసమయములామహాభావుకుడు గ్రామములో లేనిసమయములు, అతడు నాటకమునకు రాలేదని సారధికిఁ దెలిసిన సమయములు. ఆమహాభావుకుని పేరు ఉమాపతి ఉమాపతిని దలచినంతనే సారధికి వాసంతిని గూర్చిన భావన సన్నగిల్లెను. అతనిలో నొక యానందరేఖ తోచెను. మరునాడుమాపతితో తాను కలిసికొనును అతడు తన కేయూరమునుగూర్చి యేమనునో వినవలయును. సారధికి ఉమాపతియొక్క ప్రశంస వినుటయే పరమానంద హేలాడోలావిహారము. తన నాట్యవిద్యకు నుమాపతి ప్రశంస పరమార్థము. అతడుమాపతికొఱకె యభినయించును. అతనికిఁ దన యభినయము చాలదు. ఉమాపతి దృష్టిలోఁ దానొక నారాయణుడు. తాను మహాశిల్పి. తాను భట్టాచార్యుల యపరావతారము. ఒహో యేమిశిల్పము ఒక మహాశిల్పియొక్క శిల్పసర్వస్వము నాశిల్పి యెఱిగియున్న యొకమహాభావుకున కభిముఖముగాఁ బోవుచుండును. అతని ప్రశంస చూఱగొనుటకే యాశిల్పము సూక్ష్మసూక్ష్మశెలందుచుండును. ఆయుమాపతి సారధి మనోవీధిని స్పృశించినంతనే సారధి కేయూరములు తీసి దాచెను. ఆ వెనుకటి సారధి వేఱు. ఈసారధి వేఱు. తత్పూర్వనిమేష సారధి వాసంతీ మనస్కుడు. ఒకానొక యవిస్పష్టమైన సంశయితమైన యస్తినాస్తి విచికిత్సా హేతువైన యొక శృంగారభావసముపేతాపేతచిత్తుడు. ఈసారధి వట్టిశిల్పి. తానొక మహానటకుడు. తన నాట్యచాతుర్యమంతయు మఱునాడుమాపతి ముఖమునఁ బ్రశంసించుకొనుటకుఁ దొందఱపడుచున్న మనస్సు కలవాడు. ఉమాపతి మనస్సునకుఁ దగిలినంతనే యతని మనస్సు

నుండి వాసంతి నిష్క్రమించెను. ఆమె తిరోహిత యయ్యెను ఆమె తిరోహిత యనగా మోహినీ రూపధారిణియైన వాసంతియొక్క తిరోహితత్వము. ఆ వేషము తాల్చిన సమయమునందలి వాసంతి నావరించియున్న యొకానొక భావముయొక్క యంతర్హితత్వము. సారథి తొందర తొందరగా వేషమును దీసి వేసికొనెను. వాసంతి పాప మిబ్బందిపడుచున్నది. ఆమెవద్దకు బోవలయును. పసిపిల్ల ఆమె కేమి తెలియును. ఉమాపతి భావనాభిభూత రేఖాభూతత్వంగా రభావ సముచిత మనస్కుడైయున్న సారథికి వాసంతి మరల బసిపిల్లగా భాసించెను. తన ముద్దునకు తన జాలికి స్థానముగా భాసించెను. ఈ కేయూరము తెచ్చుట నెట్లు పదిలపఱుపవలయునో యాతనికి దెలియలేదు. అవి కుట్టించినపుడు వానిని దాచవలసిన ప్రదేశమును గుఱించి భావించలేదు క్రొత్త వస్తు వొక చమత్కారము. అందులో వస్త్రసంబంధ మొకసారి ధరించువఱకు దాని భద్రపఱచుటలో గష్టములేదు. ఒకసారి తాల్చినతరువాత దానిని భద్రపఱచుటలో నొక క్లేశమేర్పడును. తొలుతటి మడతయు సగానువలయుబోయి యాది మఱియొకరకపు ముడుతలతో దొలియాణగుదల లేకుండ మఱియొక వస్తువువలె గన్పించును. అప్పుడు దాని దాచుట కష్టమగును. వస్త్రమునకు శరీరముతో సన్నికర్ష జరుగువఱకు నది కన్నెవంటిది. ఒకసారి ధరించుటతో దాని కన్నెతనము చెడినది.

సారథి నవ్వుకొనెను. తాను దుస్తులు పెట్టుకొను పెట్టెయుండెను. అందులో నొక పెట్టెయంతయు నీ కేయూరముకొఱకు తడతర వస్తువిరహితము చేయవలసివచ్చెను. అల్లే చేసి కొన్ని వస్తువులు బయటనే పెట్టె పెట్టెకు దాళము వేసి యొంటరి రంగంతయు గడిగికొనకుండగనే వాసంతి గదిలోనికి బోయెను. వాసంతి యచటలేదు. నారిసిరిని నడిగెను. వారు దమకు దెలియ దనినారు. ఆమె గదిలోనుండి దొడ్డినపునకు ద్రోవ కలదు. అతడు దొడ్డిలోనికి బోయిచూచెను. ఆమె యచ్చటనులేదు. సామాజికు లెవరిదారిని వారుపోయిరి. మఱియొవ్వరినో యడిగెను. అతడు వాసంతియు నామెతండ్రియు కలసి వెడలి పోయిరని చెప్పెను. నాటకమైనంతనే వారిద్దరు వత్తురు. వాసంతితండ్రి తన్నెప్పుడు ప్రశంసించును. తరువాత తండ్రి కూతురు లిద్దరు కలసి పోవుదురు. ఇది యలవాటు. ఈనా డిదియేమి? వాసంతి భావనావిగళిత చేతస్కుడైయున సారథి వాసంతీ భావనాపునస్సహిత చేతస్కుడు. వాసంతియొక్క వేషపరికరములుంచు పేటిక సారథికి దెలిసినంతగా వాసంతికి దెలియదు. అతడామె గదిలోనికిబోయి పేటికను బరిశీలించెను. పేటిక యంతయు జిక్కిబిక్కిగా నుండెను. ఆమె వేషము తీసివేసినట్లేలేదు. అతడేమిచేయవలయును. పోయి

తన యొడలు కడిగికోనవలయును. ఒడలంతయు సూనియరాచి గుడ్డతో తుడిచికొని సబ్బుతో దోమికొనవలయును. తా నా సంగతియే మరచిపోయెను. అప్పటి కెన్నిగంట లైనదో యతనికి తెలియదు. కాని యతని కాకలి వేయుచుండెను. అతడు వేషము వేయవలసి వచ్చినచో నారాత్రిపూట భోజనము చేయడు. వేసము పూర్తియైన తరువాత దగినంత ఫలహారము చేసి కాఫీ త్రాగి పోయి నిద్ర పోవును. తనకు నేడు ఫలాహారము తెచ్చిపెట్టుమని వాసంతి యొక్క తండ్రితో చెప్పెను. అతడు తెత్తుననెను. ఆ ఫలాహారము కనిపించలేదు. ఆకలి యగుచుండెను. తాను వాసంతి యింటికిబోయి ఆమె యెట్లున్నదో కనుగొనవలయునా? తాను ముందర నేదైన దినవలయునా! తన వేసముపాకరించుకొనవలయునా అత డేమియు దోచక యూరక యటు యిటు తిరుగుచుండెను.

కొన్ని మనస్సున కందని యూహాలు ప్రయత్నము చేసి మనస్సుదాక తీసికొనివచ్చుటకు తగని యూహాలు మనుజునకు గలిగినచో వాని స్థితి యెట్లుండునో సారధి స్థితి యట్లుండెను. కాలువ నిండుగా ప్రవహించుచున్నది. రైతు గండి పడకుండ నడ్డుకట్టవేసెను. గండిపడినచో నేపుగా వచ్చుచున్న పైరంతయు వఱదపాలై మురిగిపోవును పైన వాన కురియుచున్నది. తలపైన గూడ వేసికొని పొగ క్రమ్మి కనపడీ కనపడని లాంతరు చేత బుచ్చుకొని గండివంకనే చూచుచున్న కృషికు డెట్లుండునో సారధియట్లుండెను. ఎచ్చటనో గండిపడ బోవుచున్నదని భయము. పడ్డదని భయము. ఏ సుంత చెమ్మగిలినను నింత గట్టిమన్ను తీసికొనిపోయి దానిపై మెత్తును. సూర్యోదయమునకు గండిపడుటకు నేమియు సంబంధము లేదు. సూర్యోదయమైన తరువాత గూడ గండిపడవచ్చును. కాని యా పొలము కాపు సూర్యోదయము కొఱకు ప్రతీక్షించుచుండును. సూర్యోదయ మైనంతనే గండిపడు ప్రదేశము వదలి తానింటికి బోవచ్చును. సూర్యోదయమైన తరువాత గండిపడిన సంగతి యెవరైన వచ్చి చెప్పగలరు. వెంటనే తాను పోయి దానిని మూయు ప్రయత్నము చేయవచ్చును. అర్ధరాత్రముననే వేళనో యా గండిపడినచో దెల్లవారులు నది పెరిగిపెరిగి సూర్యోదయ వేళకు దానిని మూయుట యసాధ్యమగును. తన పొలమే కాదు. ప్రక్కనున్న పది పొలములు పాడగును.

సారధి సూర్యోదయ ప్రతీక్ష చేయుచుండెను. ఆ సూర్యోదయమింతలో నగునట్లు లేదు. ఆకలియగుచున్నది. తానొడలు కడిగికొనవలయును తొలుత వాసంతి పెట్టి సవరించవలయును. ఇందులో నేది ముందు మొదలుపెట్టినను క్రమముగా నన్నిపనులును సమకూడును. ఏదియు మొదలుపెట్టక పోయినచో నన్నియు నట్లే యుండును.

మనస్సును శరీరము నివి రెండు వస్తువులు. వాని కెప్పుడు ఒకదానితో నొకటిపోటి. సామాన్యముగా మనస్సు శరీరమును దిగద్రొక్కి తాను ముందుకు పోవుచుండును. మనస్సు నిస్సందేహముగా శరీరము కంటె శక్తికలది. కాని శరీరము నిజముగా దానధికారినని తనకు దెలియును. అది యొక్కొకప్పుడు తన ప్రభుత్వమును నిరాటంకముగ జెల్లించుచుండును శరీరము తన యధికారమును జెల్లించుటకు దానికి గొన్ని యాయుధములు కలవు. అందులో నాకలి యొకటి. ఆక్షుత్తు ప్రకోపించినపుడు దాని బలము మిక్కిలి తీక్ష్ణమైనది. తక్కినవన్నియు వదలిపెట్టి సారథి తినుటకేమైన దొరకునేమో యని రంగభూమియంతయు వెదకెను. వాసంతియొక్క తండ్రి ఫలాహారము తెచ్చియుండును ఎచ్చటనో యుంచి యుండును. అంతయు వెదకెను. ఎచ్చటను కనిపించలేదు. తొలుత వాసంతి పెట్టె సర్దదమును కోసెను. దానికంటె ముందు దనయొడలే కడిగికొనెను.

ఇంటికి బోవలయును. తాను వసువలేననిపించెను. యథార్థమున కతనికిల్లు వంటిదో నాటకశాలయు నటువంటిదే. ఇంటికంటె నాటకశాలయే భద్రము. అతని యిల్లొక పూరిపాక. అది యితనికి గంటె సూర్యచంద్రుల కెక్కువ నివాస భూమి. అది నాల్గు వందల గజముల స్థలము. అందులో నొకమూలనీపాక. దొడ్డి యంతయు బూల మొక్కలు కూరపాదులు. ఆ పాకలో నొకమడత మంచమున్నది. దానిమీద నొక దుప్పటి యొక దిండు. దిండు తాతలనాడు కుట్టించినది. దుప్పటి యెన్నియేండ్ల క్రింద నుదికినదో తెలియదు అది యింటి క్రింద లెక్క. అచటికిబోయి పండుకొనినచే సుఖముగా నిదుర పట్టును. ఇది మనో లక్షణము నిదురయాధిక్యముగా వచ్చుచున్నచో శరీరము తన్ను దాను నిలువ ద్రొక్కుకొని యీ మనోలక్షణము నతిక్రమించి యెచటబడిన నచట నిదుర పోబెట్టును. ఆకలికి నిదుర వారసుడు, ఆకలినంటనే నిదురవచ్చును. ఆకలి తీరిన తరువాత గూడ నిదుర వచ్చును. క్షుత్తునకు బూర్వాపరముల యందు నిదుర దౌవారికునివలె వేచి యుండును.

సారథికి నిదుర వచ్చెను. అతడచట నున్న యొక బల్లపై బండుకొనెను. అతని యొడలతనికి తెలియదు.

నాటకశాల రంగభూమియందే తలుపులు వేసి భద్రముగా చేయదగినది. తెరముందునుండి సామాజికులు కూర్చుండు స్థలమునకు బోవచ్చును. సామాజికోద్దిష్టమైన విశాలశాలకు దలుపులు లేవు. భద్రతవీధిగుమ్మము దగ్గర మాత్రమే. కాపలాకాయువాడు సర్వజనులు వెడలిపోయిరనుకొని వీధిగుమ్మమునకు దాళము వేసి వెడలిపోయెను.

సారధి నిదురపోవుచుండెను. జనము నివసించని యొక యింటి స్థితి యెట్లుండును. జనము నివసించుటకుద్దేశించిన ప్రదేశమది. నాటక మాడునపుడు నాటకశాలయందు జనము క్రిక్కిరిసి యుందురు. నాటకశాల కళకళలాడుచుండును. పరిసర ప్రదేశమంతయు సంగీత నిస్వనములతో గుబాళించుచుండును. నాటకము లేనప్పుడు తత్ప్రదేశముయొక్క దారిద్ర్యమెట్టిదో యొకానొకపుడు ఛలించి డబ్బుండి యధేచ్ఛముగా వ్యయపెట్టినవాడు మఱియొకవేళ నిర్ధనుడైనచో నెట్లుండును? ఆ నాటకశాలలో నన్ని మూషికములు తిరుగుచుని కలకలలాడునప్పుడు వచ్చి చూచెడివారికేమి తెలియును. వాసంతియొక్క వేష ధారణా పేటిక మూషికములకు క్రీడాస్థాన మయ్యెను. ఒకటి రెండెలుకలు సారధిమీద ప్రయాణము చెసెను. అతడు నిదురలోననే జేతితో ద్రోసి వేయుట వలన దూరముగా బోయెను.

ఇంతలో సూర్యోదయ మయ్యెను. క్రమముగా సూర్యకిరణములు కంచెలు దాటి గోడలు దాటి యిండ్లలో ప్రవేశించుట కారంభించెను. ఇంచుమించుగా నలుజాము ప్రొద్దెక్కు వరకు సారధికి మెలకువ రాలేదు. లేచి చూచెను. అంతయు క్రొత్తగా నుండెను. ఆకలిమాత్రము దందహ్యమానముగా నుండెను. కాల్యకృత్యములు దీర్చి పెఱటిలో నున్న బావిదగ్గఱ స్నానము చేసి కాఫీహోటలువకు బోయి పది పెసరట్లు పది యిడ్డెనలు నర్ధరూపాయ యుపాహ్మతి సెను. వాల్గుగిన్నెల కాఫీ త్రాగెను. అప్పటి కతని ప్రాణము చేరుకొనెను.

సారధి వడుము సింహమధ్యము. క్షుద్విషయమున నతడు వృకోదరుడు. భీముని విషయమున దుర్యోధనుని యుపాంశువధ ప్రయోగము లెట్టివో యితని విషయమున స్వయంకృత నిరాదృత మరణహేతు బహుకార్యము లట్టివి. ఒక మిత్రుని యింటనొక యౌషధముండెను. ఒకప్పుడతడది యేమని యడిగెను. అతడౌషధమని చెప్పెను. అందులో విసమున్నది కొద్దికొద్దిగా బుచ్చుకొనవలయు నని చెప్పెను. అంతయు నొకసారి త్రాగినచో జచ్చిపోదుమాయని సారధి యడిగెను. ఆ స్నేహితుడు నిస్సందేహముగానని చెప్పెను. సారధి దానిని గడ గడ త్రాగివేసెను. స్నేహితుడు చాలభయపడెను. అతడేమి చేయును. రేపో మాపో సారధి చనిపోయినాడనియో యతనికి ప్రాణముమీదికి వచ్చినదనియో వార్త వచ్చుననుకొనెను. ఆ మరునాటి సాయంకాలము సారధియే వచ్చెను. ఇట్టి యఘాయిత్యపు బనులు సారధి యెన్నియైన జేయును.

నిజానికొ తిండి యతనికి సరిపోలేదు. అతడు కాఫీహోటలులో, పెస రట్లు వేయు పెనముదద్దనే కూర్చుండును. అతడు వెళ్లువఱకె ప్రొద్దెక్కును. అతడు తినవలయుననినను బసలోనేమియు లేదు. తరువాత బయలు దేరెను.

ఆయూరు సముద్రతీర గ్రామము. సముద్రమున కాయూరికి రెండు క్రోసుల దూరముండును. ఈ రెండు క్రోసుల మేర్కట్టి బంగరు బయలు. అది యంతయు సారధికి విహారస్థలము. రెండు మైళ్ళడ్డముగా బది మైళ్ళు నిలువుగా పెంజలోనైనను సరే యర్ధరాత్రమునసైనను సరే తిరిగినచో వలదనెడువారు లేరు. సారధి పగలంతయు నాపట్టిలలో బడి తిరిగినవాడు తిరిగినట్లె యుండెను. అతడు రాతిరి యింటికి జేరెను.

## 3

మఱునాటి సాయంతనమున సముద్రపు టిసుకపట్టిలమీద సారధియొక్కడు కూర్చుండెను. ఆ గ్రామమునుండి సముద్రపు టిసుకలదాక నొక తాతి బాట యున్నది. దానిపైన బండ్లుకూడ బోవును. తత్పురీజనులు సాయంవాహ్యాళికి నా బాటనంట వచ్చి ప్రక్కనున్న యిసుకలమీద గూర్చుందురు. కొంత ధనవంతుల కుటుంబములు కాని ధనవంతులు కాని బండ్లమీద వత్తురు.

సారధి తాతిబాటకు దూరముగా నొక యేకాంతస్థలమున గూర్చుండెను. అతనికి సుపరిచితులైన ముగ్గురు నలుగు రతనివద్దకు బోవుదురే కాని తక్కిన రెవ్వరు నతనివద్దకు బోరు. అతడు పదిమందితో గలిసియుండడని తా నొక కీవి వేదాన్తియని నలువురు చెప్పుకొనుట కలదు. అట్లు దూరముగా కూర్చున్న సారధి వద్దకు నొక యతడు వచ్చెను. అతడు బక్క పలుచనివాడు. తలయంతయు నరసి యుండెను. ఉదికిన దోవతికి తెల్లనికంటె మెడచొక్కాయ మాత్రమే ధరించెను, కనుల కద్దములు గలవు. మనిసి పొడుగరి. అతని మొగములో వివేకము తొణుకుచుకొని వచ్చుచుండెను. అతడు సారధివద్దకు వచ్చి కూర్చుండెను ఒకరి నొకరు చూచి నవ్వుకొనిరి. కొంతసేపు మాటాడలేదు. సారధి కొంతసేపటికి ఏమి విశేషము లన్నట్లు కను లెగురవేసెను. అతడు పెదవి విఱచెను. మరికొంత సేపటికి "నిన్న కనిపించ లేదేమి" యనెను. అతడు "నీ కొఱకె వచ్చితిని. నీవు లే వనెను. సారధి నవ్వెను. సారధి నవ్వుట యనగా నతని కొంచెమెత్తయిన దంతములు కనిపించకుండ మూతి మొగ్గవలె పెట్టుట. అతని స్నేహితు లెప్పుడును నీయిల్లనలేదు. మరియు నొక నిమేషము మౌనముగా గడచెను. స్నేహితు డిట్లనెను. అది యేమిటి? కేయూరములా? కేయూరము లట్లుండునని నీ వెట్లూహించితివి?" సారధి నవ్వెను. అతడు మరల "నింక నా కేయూరములు పనికిరావు. అంతమెత్తని జరీగుడ్డమీద దాకిన కుంకుమ తీసివేయుట యెట్లు?"

సారథి-నీ వొక డున్నావు గనుక నా నాట్యము ప్రకాశించుచున్నది.

ఉమాపతి-ప్రకాశించుట మరియొకని బుద్ధిలోననే కాని వట్టిగాలిలో నుండెదా?

సారధి-అపుడు మనకు దృష్టి లేదు.

ఉమాపతి-నీప్రక్కన మోహినీవేషమును వేయవలెనని నాకనిపించినది.

సారధి-వాసపు బుల్లకు జీరకట్టి నిలబెట్టినచో జాలదా?

ఉమాపతి- నేను వాసపు పుల్లను. నీవు దిష్టిబొమ్మవు. సరిపోయెడిది.

సారధి నవ్వెను.

ఉమాపతి-వాసంతి సాత్త్వికాభినయ మెప్పుడు నేర్చుకొన్నది?

సారధి- నేను శృంగారరసనాయకుడు వేసినపుడు

ఉమాపతి- నేను వాసముపుల్లనైనను నీకు నాకు నీడు సరిపోవును మన యిద్దరి నడుమ నైదేండ్లే వారడి.

సారధి కనులువిచ్చి యుమాపతి వంక తీక్ష్ణముగా జూచెను. సారధి కనులలో గన్నీళ్లు నిలచెను. ఉమాపతి యిట్లనెను. "నాకు దెలియునయ్యా కొన్ని జంతువులుండును. అవి యడవిలో దిరుగుచుండును. ఆయడవిలో నొకచోట దేవీ విగ్రహ ముండును. ఆ జంతువు లా విగ్రహము పొంతకుబోవు. ఒక్కొక్కప్పుడు తన యెంట విగ్రహము పొంత నుండును. ఐనను దూరమునుండియే యేలను జూచును. ఎట అచ్చోటు వదిలి తన దగ్గరకు వచ్చుటకు బ్రతీక్షించుచుండును."

సారధి నవ్వెను ఉమాపతి యిట్లనెను. "సారధీ! నీవంటి మహానటుడు బ్రతికియుండగా నతడు పుట్టినచోటనే నేనుపుట్టి యాతనితో సమానవయస్కుడ నగుట నా జన్మలోని రహస్యము. నేను నీవు బ్రతికియుండగనే బ్రతికియుంటిని. కాని నేను బాలుడనైనచో నీ యీ వైభవము నాకు తెలిసెడిది కాదు. ఇది యొక యదృష్ట విశేషము. నేను పరీక్షలు తప్పితిని. నా కెవ్వ డుద్యోగ మీయడు. ఎటు తిరిగినను నా వేళకు గొంపకు బోయినచో నాల్గు మెతుకులు వేయుదురు. భగవంతుడు నన్ను నీ మహాభినయము తెలిసికొని యానందింప గలుగు టొకటియే పరమార్థముగా సృష్టించియున్నాడు."

సారధి-మరల నేమైన గొంపలో నొత్తిడి కలిగినదా యేమి? నా సమాజములో వేషము వేయుమన్నచో వేయవు. ఇచట నేనో కొంత గిట్టునుకదా.

ఉమాపతి-అది యేమయ్యా యట్లందువు. నేను వేసము వేసినచో, జూచెడివారి కోకిలింతలు కలుగును. నీవు వేషము వేయవలయును. నేను సభలో

నుండి చూచుచుండవలయును. ఇంటిలో క్రొత్తగా నేమియు రాలేదు. అదుగో అవధానిగారు నీ విచ్చట కూర్చున్నావని యెవరుచెప్పిరో నీ కొఱకు వచ్చుచున్నారు. నేను పోవుచున్నాను."

ఉమాపతి వెడలిపోయెను. అవధాని వచ్చెను. చేతిలో నొక పొన్నుకర్ర యొక తెల్లని యంగీ? బొద్దైన మనిసి. కొంత పొట్టివాడు. బుజాలమీద నాకు పచ్చని కాశ్మీరపు శాలువ, కన్నులకు దళసరి యద్దములు. ఆయన కనులు చికిలించుకొనుచు కనులెత్తి చూచుచు, దగ్గఱకు వచ్చెను. సారధి తాను లేచి నిలుచుండకయే యాయనను వచ్చి కూర్చుండుమనెను. ఆయూరిలో నవధాని వచ్చినచో లేచి నిలుచుండని వాడు సారధియొక్కడే. అవధాని కూర్చుండెను. ఇదుగో సారధిగారూ! మొన్నటిరాత్రి రాజువేష మెంత బాగుగా జేసినావయ్యా శెహబాసు సెహబాసు. నేను నాటకము వ్రాయవలయును. నీవాడవలయును మన యిద్దఱికే పేరుపోయినది. రాజాగారెంత సంతోషించినారు. అదుగో ఆ పద్యమున్నదే దానినెంత బాగుగ జదివినావు. నీకు సంగీతము రాదు గాని వచ్చినచో నెంత బాగుగా నుండెడిది. నిజముగా నచ్చముగా నీవు రాజువలె నున్నావు. నీ వట్లుందువని నేననుకొనలేదు. మరల నీ వింకొకసారి యా నాటకమును వేయవలెను. నాకు జూడవలయునని యున్నది. "నాకిప్పుడు డెబ్బది యేండ్లు. నేనింకెన్నాళ్ళు బ్రదుకుదునో" యని యవధాని యేడ్వ నారంభించెను. సారధి నవ్వుచు "ఫరవా లేదవధానిగారూ! మీరు నూటయిరువది యేండ్లు బ్రదికెద"రనెను.

అవధాని—"మీరు మహానటులు. మీ మాట నిజము కావలయునని నేనాశీర్వదించుచున్నాను. ఇంత నటుడవు నీ నోటివెంట నబద్ధము రాదు. ఔను ఔను నేను చేయవలసిన పనులు చాల కలవు. సర్వభారత దేశమునందు నింతకంటె మహాకవి లేడని నాకు బట్టాభిషేకము జరుగవలయును అది యైపోయినతర్వాత చనిపోవుటకు నా కభ్యంతరము లేదు. ఔను కాళిదాసు వ్యాసుడు వాల్మీకి యందఱు తప్పులు వ్రాసిరయ్యా తప్పులు వ్రాసిరి. అనౌచిత్యములు అనౌచిత్యములు" అని యవధాని తన కుడిచేతితో దనరొమ్ముపై జఱచుకొనుచు "నా యంతటి మహాకవి యీ సృష్టిలో నింతవరకు బుట్టలేదు. ఇది వట్టి వెధవదేశమయ్యా వెధవదేశము. గొడ్డుపోయిన దేశము. ఒక్క రాజాగారున్నారు గనుక, ఆయన యెంతటి రసికుడు, కవిత్వములోని సూక్ష్మసూక్ష్మ విషయములు కూడ యాయనకు తెలియును. ఆయన నాకుటుంబమును బోషించుచున్నాడు. ఇదిగో రోజును నేను సాయంకాలపు వాహ్యాళికి వత్తును. ఆ ప్రభువు యొక్క గుఱ్ఱపు

ఇసుకమీద వత్తును. పూర్వము పెద్దన్నను కృష్ణదేవరాయలవారే యాదరించిరి. తురిల నన్ను ప్రభువుగారే యాదరించుచుండిరి".

సారధి-"మీరు పెద్దన్నకంటె గొప్పవారు కనుక రాజాగారి గొప్ప యేమి యులేదు."

అంతట నవధాని ముక్కుమీద వ్రేలుంచికొని "మహాపాపము మహాపాపము. అట్లనరాదు అట్లనరాదు. రాజాగారి గొప్ప మీకేమి తెలియును కృష్ణరాయలు భోజుడు విక్రమార్కుడు వారందఱికంటె గొప్ప ప్రభువు. చాల గొప్పవారు. సాయంకాలముల దీపము వెలిగించి యాయనకు నమస్కారము చేయవలెను. అంతదాక యెందుకయ్యా! నాయొక్క పద్యము ఒక్క పద్యము నగా నొక్క పద్యము మా రాజాగారు మెచ్చుకొన్నట్లుగా నా భోజుని మెచ్చుకొమ్మనుము. ఆ కృష్ణరాయల మెచ్చుకొమ్మనుము. ఆమను చరిత్ర నిండ నన్నియు బూతులు బూతులు. శివశివా! ఏకపత్నీ వ్రతస్థుడైన నా ప్రభువు దానిని వినగలడా? మన రాజాగారు హరిశ్చంద్రుడయ్యా! అబద్ధమునునది వారి నోటవెంటరాదు. పరస్త్రీ వంక గన్నెత్తి చూడడు. అగ్నిహోత్రము వంటివాడు.

సారధి యవధాని యెప్పుడు లేచిపోవునాయని యెదురు చూచుచుండెను. కొమరపు జీడివలె నవధాని యంత తేలికగా లేచిపోయెడివాడు కాదు. అంతట సారధి "అవధానిగారూ! తమరు పెద్దలు. కొంచెము దగ్గుచున్నారు. మీ యారోగ్యమును మీరు రక్షించుకొనవలయును. ఒకగంటసేపు మాట్లాడకుండ సముద్రపు గాలిపీల్చినచో మీకు క్షేమము. కనుక లేచి తమరు విడిగా నొకచోట కూర్చుండుడు. నేను మనసులో నేదియో యాలోచించుకొనుచున్నాను. అవధాని "ఔనౌను నేను పోదును పోదును. ఏమియు లేదు మీ రిచ్చట కూర్చున్నారని యెవరో చెప్పిరి. నాకు మిమ్ము జూచినచో బ్రహ్మానందముగా నుండును. అహా! ఏమి నటకుడవయ్యా ఏమినటకుడవు. భరతాచార్యుడే నీవలె బుట్టినాడు. అసలు నీముందు భరతాచార్యు డెందులకు."

అని చదువుచుండగా సారధి యాయనను జెక్కపట్టుకొని లేవదీసి దారిని బట్టించెను. అవధాని వెడలిపోవుచు వెనుదిరిగి చేయెత్తి "మిమ్ము నాశీర్వదించుచున్నాను. మిమ్ము నాశీర్వదించుచున్నా"ననుచు వెడలిపోయెను.

అంతిలో సంజ చీకటు వచ్చెను. అవి రావణాసురుని మీసములకు నలుపెక్కించెను. సన్నని గాలులు చెలరేగెను. ఇసుక యులిపిరి కొంగితములవలె నేలమీదనే కొట్టుకొనిపోవుచుండెను. సముద్రపుగాలి పోసిన యుక్కను తొలగించువేగాని యొడల మప్పుచెముట పట్టించును. శరీరమంతయు జల్లపడి

యింటికిబోయిన తరువాత నుష్ణోదకస్నానము చేయవలయుననిపించును. సారథి తన జన్మములో నుష్ణోదక స్నానమెఱుగడు. అతడుసామాన్యముగా దన తోటలో నుదయ సాయంకాలములయందు బావి బుచ్చికొని పనిచేయుచుండును. ఈ రెన్నాళ్లు పాలచేతితో బుచ్చుకొనలేదు అత డేమి యూహించుచున్నాడో అతనికే తెలియదు. అతడు పోయి తన తోటలో గూర్చుండెను. ఆ కంచెల వెంట బాములున్నవి. తొండలు బల్లులు సమృద్ధిగా గలవు అతనిపాకయంతయు గండుచీమలు. ఇంటిలో దీపముండదు. ఒకనాడు కిరసనాయిలుండును. ఒకనాడుండదు అత డట్లే కూర్చుండెను. రాత్రి రెండుజాములయ్యెను. అప్పటికి తాను భోజనము చేయలేదని యతనికి దెలిసెను. అతడు పూటకూటింటికి బయలుదేరెను పూటకూటిల్లు తలుపువేసియున్నది. తలుపు తట్టగా విశాలాక్షి తలుపు తెరిచెను సారథి యన్నమున్నదా యని యడిగెను. ఆమె యన్నమున్నది తక్కిన వేమియు లేవనెను. తానేపోయి కూరల బుట్టనుండి రెండు దోసకాయలు ముక్కలు తరిగి పచ్చిమిరపకాయలతో, బచ్చడిచేసి తానన్నము పెట్టుకొని తినెను. మఱునాటి పెరుగు కొఱకు తోడుపెట్టినపాలు కూడ కూడని వానిని విశాలాక్షి గోలపెట్టుచుండగా తోసికొని యారగించెను. విశాలాక్షి పెట్టి వద్దకు బోయి తాళము తీయుమనెను. ఆమె డబ్బు లేదనెను. సారథి నామెనొక చెంపకాయలాగెను. ఆమె పెట్టెలో బన్నెండు రూపాయలున్నవి. ఆమె తానే పెట్టితీసి రెండు రూపాయలిచ్చెను. సారథి రెండు రూకలు చేత బుచ్చికొని పోబోవుచుండెను. విశాలాక్షి యతడు పోకుండ దలుపు వేసెను. ఆ రాత్రి యతడచటనే నిద్రించెను.

మఱునాడు తెల్లకు దెల్లవారి యతడు మేల్కొని తన తోటకు వెళ్లిపోయెను అప్పటి కెనిమిది గంటలయ్యెను. పండ్రెండుగంటలవఱకు దోటలో ద్రవ్వుపనిచేసెను. అపుడు దంతధావనము చేసి స్నానముచేసి తన మంచముపై బండుకొని నిదురపోయెను. అతనికి మెలకువ వచ్చుసరికి సూర్యాస్తమయము కావచ్చెను. అతడు లేచి మొగము కడిగికొని తన కాకలియగు చున్నదని తెలిసికొనెను. ఇంతలో నాటకశాలలో దివిటీలు లాగు కుఱ్ఱవాడు వచ్చెను. వాని చేతికొక రూక యిచ్చి కాఫీహోటలునకు బోయి పది పెసరట్లను పది యిడ్డెనలను దెమ్మనెను. వాడుపోయి తెచ్చెను. సారథి వానినన్నిటి నారగించి కడుపునిండ మంచినీళ్లు త్రావి తోటలో గూర్చుండెను. కొంచెము చీకటి పడెను. అతడు కూర్చున్న చోట నతని చుట్టున పూలమొక్కలే. చంద్రకాంతములు జాజులు చేమంతులు, నతని వెనుకతట్టున ముద్దమందారము విరిసియున్నది. అతనినప్పుడు చూచినచో నితడేమి పుష్పప్రియుడు. ఏమి వనమాలియనిపించును. అతనివలెనా

భాగ్యమంతయు నతనిపూదోట అతని కాంతా సౌభాగ్యమంతయు నభినయము. తక్కిన సారథికట్టి యిసుకపట్టు. లోకమతని నటకునిగా నెఱుగును. స్నేహితుల తనిని తోటమాలిగా నెఱుగుదురు.

అతడు తోటలో గూర్చుండెను. కప్పడు కప్పడు చీకటి. మందారపూల యెఱ్ఱదనము చీకటిని దిరస్కరించుచున్నది మరల జెలిమియు జేయుచున్నది. జాజిపూల తెల్లరంగు చీకటిని తిరస్కరించుచున్నది చీకటికి దనకు ఒడుట లేదు.

అప్పుడు వాసంతియు నామె తండ్రియు వచ్చిరి. వాసంతి తండ్రి పేరు శిరీషకుమార్. అతనికి దలితండ్రులు పెట్టిన పేరు కాదది ఆయన మార్చుకొనెను. సారథి యిద్దఱను చూచెను వాసంతి నవ్వుచున్నది. చీకటిలో సారథికి కన్పించ లేదు. సారథి యిద్దఱను గూర్చుండుమనెను. పూలమొక్కలకు దూర్పున గొంచె మెత్తుగా నొక నాపరాయి వేసియున్నది. వారిద్దఱను నాపరాతిమీద గూర్చుండు మనెను. వాసంతి నాపరాతి మీద గూర్చుండెను మీరు క్రింద గూర్చుండగా నేను పైన గూర్చుందునా యని రెండుపూలమొక్కలనడుమ గూర్చుండెను. పూలమొక్కలు చెడిపోవునని సారథి భయము. శిరీష కుమారుడు దాని నూహించడు.

వాసంతి- సారథిగారూ! మేము ప్రొద్దున వచ్చితిమి నిన్న సాయంకాలము వచ్చితిమి. మీరు లేరు. ఎప్పుడు వచ్చినను మీరుండరు.

సారథి-ఇప్పుడున్నాను గదా.

శిరీష-ఇప్పుడున్నారు. ఇది మీ యిల్లనుటకు వీలు లేదు. కాదనుటకు వీలు లేదు. మీరు భోజన మెచ్చట జేయుదురు.

సారథి- సన్యాసి వానికిల్లెందుకు?

వాసంతి- మీరు సన్యాసులు కారు. మహారాజులు. రుక్మాంగద చక్రవర్తులు.

సారథి- నట్టియేకాదశీ బ్రాహ్మణుడను.

వాసంతి- రాజర్షులండీ! రాజర్షులు! బ్రాహ్మణులుగారు.

సారథి- ఎట్లైనను సన్యాసము తప్పదు కదా.

వాసంతి- క్షత్రియులు వానప్రస్థమవలంబింతురు కాని సన్యాసము పుచ్చుకొనరు. విశ్వామిత్రుడు కొన్ని వేల యేండ్లు ఘోరతపస్సు చేసెను. ఒక వైపున తపస్సు చేయుచుండెను. మరియొక వైపున బిడ్డలను గనుచుండెను. నడుమ నొక మేనక.

శిరీష-సారథిగారి విషయములో మేనక యెవరు?

సారథి-మేనకలకేమి చాలమంది యున్నారు. అసలు భార్యయే లేదు.

వాసంతి-భార్య లున్నచో మేనకలక్కరలేదు.

సారథి-విశ్వామిత్రునకు భార్య లుండగనే మేనక యున్నదికదా. ఆయనకు మొదట భార్యయున్నది. నడుమ మేనకయున్నది. నాకు మొదటనుండి మేనకలే.

వాసంతి-మీకు జనకుడు భార్య నిచ్చును. విశ్వామిత్రుడు లోకమునకు దలక్రిందులైనచో మీరు విశ్వామిత్రునకు దలక్రిందులు.

సారథి-నేడో రేపో నీ పాట కచేరీ యున్నదటకదా!

వాసంతి-నేడైనచో నిచ్చటికి వచ్చుటయే జరుగదు.

శిరీష-రేపు కాదండి. ఎల్లుండి సాయంకాలము శర్మగారి కుమార్తె వివాహము. ఆయన యమ్మాయికచేరీ పెట్టుమనుచున్నారు.

వాసంతి-ఎల్లుండి మీరు నా సంగీతమును వినుటకు వచ్చితీరవలయును. మీరు నా కచేరీ యెప్పుడును వినలేదు. మిమ్ము బిలుచుటకే వచ్చితిని. మీరు రానిచో నేను కచేరీ చేయను.

సారథి-దీనివలన నష్టము శర్మగారికి. ఆయన కూతురు పెండ్లి చేసికొనుచు నిన్ను పాడుమని యడిగినాడా నన్ను రమ్మని యడిగినాడా?

శిరీష-ఆయన మిమ్ముగూడ బిలుచునండీ. అమ్మాయి పాట మీరు వినవలయునని యమ్మాయి పట్టుపట్టుకొని కూర్చున్నది.

సారథి-నాకు సంగీత మేమైన దెలియునా? నా కేమియు దెలియదు.

వాసంతి-మీ కన్ని రాగములు తెలియును. పాడుట చేతగాదు. నాటక మాడునపుడు మీరు రాగములు మార్చి పద్యములు చదువరా. పది పదేను రాగములు పాడుదురు. నాకు దెలియును. సంగీతము రానిచో నా పాట నెట్లు మెచ్చుకొనుచున్నారు?

సారథి-నీ కంఠము కోకిల గొంతువలె నుండును. ఎటువంటివానికైనను నీ కంఠమునందలి మాధుర్యము తెలియును. పద్యము పాడినచో రాగాలాపన చేసినచో నందరానందించగలరు. కీర్తన పాడినచో స్వరము వేసినచో బల్లవి యెత్తిన నందరికి దెలియదు. సంగీతశాస్త్రము తెలిసినవారికే యవి తెలియును. నాకు సరిగములైనను రావు.

వాసంతి-సరిగములు రానక్కరలేదు. సంగీతము నానందించవచ్చును.

సారథి-నేను చెప్పినదదే. అందులో భేదమున్నది.

శిరీష-మతి సారధిగారూ, మీరు వాసంతితో నింత మర్యాదగా మాటా డుట యిదివర కెప్పుడు నెఱుగను. నోరుమూయుమని పిల్లకాకి కేమి తెలియురా యుండేలు దెబ్బయని, వాగితివా, లెంపకాయ వేయుదునని యిటిమాట లవ కుండ వాసంతితో మీరైదు నిముసములు మాటాడుట నే నెన్నడు నెఱుగను. నేడు వాసంతిని మర్యాదగా జూచుచున్నారు. చనువుగల పిల్లతో మాటాడు చున్నట్లే లేదు.

సారధి:-ఏదో యాలోచించుకొనుచున్నాను. మీ రింతలో వచ్చితిరి.

వాసంతి-పైగా జీకటిలో నేను కనుపించుటలేదు. చీకటి హాస్యరసము నకు ప్రతిబంధకము. హాస్యము చేయుట కెదుటివారి మొగము మన కగుపించు చుండవలయును. వారు నవ్విరో కనుబొమలు ముడిచిరో పెదవి విఱచిరో యాప డించిరో లజ్జపడిరో యిని యన్నియు దెలిసికొనకుండ హాస్యరసమునకు విందు లేదు అందుచేత సారధిగారు మర్యాదగా మాటాడుచున్నారు.

సారధి-నీవు నన్ను సారధిగారని యెప్పుడు మాటాడలేదు. నీవు వచ్చి యంతదూరముగా నెప్పుడును గూర్చుండలేదు. నా నెత్తినపడి త్రొక్కుడిదా నవు. మరి నీ వెందు కంత దూరముగా గూర్చున్నావో. నే నంత మర్యాదగా నందుకనియే మాటాడుచున్నాను. ఈ మాట యనుమనే సారధికి దప్పు టడుగు వేసితినని తెలిసెను. కాని వాసంతి కూర్చున్నచోటనుండి కదలలేదు. ఆమె పోయి సారధివద్ద గూర్చుండునని శిరీష కుమారు డనుకొనెను. మంచియో చెడ్డ యో హాస్యమో కాదో వా రిద్దరు మాటాడుచుండగా నవ్వులే నవ్వులు. మనసు పులకరించునట్లు మాటాడుదురు. నేడు వాక్య ప్రతివాక్యములు చేసినను వారి యిద్దరియుందు గదలిక లేదు అతడు తలవంచుకొని కదలక కూర్చుండెను. చీక టిలో నతని ముఖరేఖలు సువ్యక్తముగా లేకున్నను సారధి వంక జూచుచునే వాసంతి కూర్చుండెను.

తిరువాత నైరుని మేషము లట్లె వారు మాటాడక కూర్చుండిరి. వాసంతి హఠాత్తుగా లేచి "ఇంతకు మీరు వత్తురా, రారా? మీరు వచ్చితీరవలయును. మీరు రాకున్నచో నే నానాడు క చేరియే చేయను. మీరు వచ్చితీరవలయును" అని తండ్రితో 'నాన్నగారూ! రండిపోదము' అని బయలుదేరెను. శిరీషకుమా రుడు లేచెను. వారితో సారధితోటవెలుపలదాక నడచుచుండెను. శిరీషకుమారుడు సెలవు తీసికొందునండీ యని చెప్పి ముందు నడచుచుండెను. వాసంతి వెనుక దిగా నడచుచుండెను. సారధి తన తోట వదలిపెట్టి ప్రక్కసందులో వాసంతి తో నడచుచుండెను. పదిగజాలదూరము వెడలిన తిరువాత వాసంతి సారధి దగ్గ రగా వెళ్లి యతని బుజముమీద చేయివైచి కుడిచేయి యతని రొమ్మున వైచి

"మీరు తప్పకుండ రావలయును. రాకపోయినచో నామీద ఒట్టు" అనెను. సారధి "నేను నీకు మీరా" యనెను వాసంతి "సారధీ! నీవుతప్పకుండ రావలయును." అని నవ్వెను. సారధియు నవ్వెను.

సారధి తిరిగి తన తోటలోనికి వచ్చెను. చీకటి బాగుగా బలిసెను. మందారములు జాజులు నోరుమూసికొని కూర్చుండెను. కంచెనంట నేదో ప్రాకిపోవుచున్నట్లుండెను. సారధి పాకలోనికి బోయెను. సారధి బీడీలు వెదకును. తన దిండుక్రింద జూచెను బీడీలు లేవు. బీడీ కట్టకు చుట్టు కాగితముమున్నది మరియొక రూపాయకలదు. ఇందాక వఱ్ఱవానిచేత బీడీలు తెప్పించలేదు. బీడీలు లేనిచో తన కొక నిముసము గడువదు కాని యతడు త్రాగకుండ గడపిన దీర్ఘరాత్రులు కలవు. అతని కిది కావలయునని లేదు. ఇది యక్కరలే దనునది లేదు. అతి చెడుగాని దురభ్యాసము లేదు అది మానివేసినచో జరిగిపోవుదు మను మోహము లేదు. అతని యూహలో లేనిది యతని యూహ. అతని బుద్ధి యతని యంతఃకరణము నతని యాత్మ వాని యూహలలో నున్నవి. అతని మనసు పాము మెలికలు తిరుగుచుండును. జీవునకేదో సుఖముగా నున్నట్లనిపించిన కొన్ని యూహ లతడు నిగ్రహించకుండ జేయుచుండును. వట్టి యూహవలన లాభము వచ్చునని యతనికి నమ్మకము లేదు. ఒక యూహ చేసికూడ కోరికలను నశింప జేయవచ్చునని కూడ నతడు చెనుకొనుచుండును. అతడు తెల్లవారులు దోటలో గస్తీ దిరిగెను కోళ్లు కూసెను. అతడు పోయి మంచముపై బండుకొనెను. దాని కుంతట నదియే నిదురపట్టెను.

మఱునాడు సారధి నిద్రమేల్కొను సరికి, బది గంటలయ్యెను. అతడు కాల్యకృత్యములు తీర్చి స్నానము చేయుసరికి బదునొకండయ్యెను. బీడీల కొఱకు వెదకికొనెను. అవి కనిపించలేదు. స్నానముచేసి పూటకూటింటికి బోయెను. అతడు పోవువేళకు పూటకూటింట భోజనము సేయువారందఱు వెడలిపోయిరి అచ్చట గళాశాలా విద్యార్థులు నుద్యోగస్థులే కాని పల్లెటూరి వారెవ్వరు రారు. పేరునకు బ్రాహ్మణుల పూటకూటి బసయే. కాని విశాలాక్షి బ్రాహ్మణియో కాదో యెవ్వరికిని దెలియదు. విశాలాక్షిచేత బసపెట్టించినది సారధి. ఆయూరిలో నొక యింగ్లీషు వైద్యుడు తన భార్య యేండ్లతరబడి వ్యాధిగ్రస్తురాలై యుండగా వంటమనిషికోసము వెదకి యూరిలోని వంటచేయు బ్రాహ్మణులచేత మిక్కిలి యిబ్బందులు పడి యామె నెచ్చటి నుండియో తీసికొని వచ్చెను. కొందఱు పాలఘాటునుండి తెచ్చెనందురు. మఱికొందఱు మైసూరు నుంచి తీసికొని వచ్చెనందురు. ఆ వైద్యుడామెను తెచ్చి పది పదునేనేండ్లయినది. ఆమె యప్పటికి బదునేనేండ్లరువదేండ్లు పిల్లవలె నుండెడిది.

ఇప్పటికి నిరువది యేండ్లు పిల్లవలెనే యుండును, కొందరామెను వాయా బ్రాహ్మణ స్త్రీ యందురు కొందరు బ్రాహ్మణియని చెప్పుచున్నది కనుక బ్రాహ్మణి యనియే యందురు. ఆమె యా వైద్యునింట రెండేండ్లున్నది ఒకనాడు మంచినీళ్ళకొఱకు వీధిలోని నీటిగొట్టము దగ్గఱ నిలుచుండియుండగా సారథి యామెను జూచెను. ఆమెతో మాటాడెను ఆమె యా వైద్యునింట వంటకత్తె యని తెలిసికొనెను ఆమె యాకారము కోకిల యాకారము కోకిలల కామె కొక్కటియే భేదము. కోకిల వసంతకాలము రాగా సన్నగా గూయును. ఆమె కన్నికాలము లొక్కటియే. ఆమెపొట్టిది. బక్క పలుచనిది. ఆమె కన్నులెప్పుడును నవ్వుచునే యుండును ఆమెను జూచినంతనే సర్వజనులకీమె యెంత మంచిదిరా యనిపించును. మంచియో చెడ్డయో మనుష్యుడు డెందుండునని చెప్పుటకు వీలులేదు కదా, వేదవేదాంగపారంగతుడైనను సోమయాజియైనను పాము లోకోపకారియైనను నా గుణముల కొఱకునులే. మనుష్యునకు మనుష్యుడే స్త్రీకైనను తే. సారథి యామెనట నుండి లేవదీసి యామె చేతికూటికూటి బస పెట్టంచెను. ఇది పది పదునాలుగేండ్ల క్రింద జరిగినపని. ఏడాది రెండేండ్లపాటు సారథియే యామెకు డబ్బిచ్చి బసనడిపించెను. ఇప్పుడామె బస పాతిక మంది నెలసరి భోజనము చేయువారితో బస్తీగా నుండెను. ఆమె పరమదయాళువు. ఇద్దఱు ముగ్గురు పేదవిద్యార్థులకు డబ్బియ్యకుండ నామె బసలో భోజనము చేయుచుందురు. వారి జీతములు కట్టుకొనుటకు గూడ నామె డబ్బిచ్చుచుండును అందులో నెవరికైన జ్వరము మొదలైనవి వచ్చినచో వారికి పథ్యపానములు చూచుచుండును ఆమె బస యేర్పడిన తరువాత సారథికి భోజనమునకు వెదకికొనుటక్కఱ లేకపోయెను అదనుకతనికి జేతిలో డబ్బుండును. ఉండకపోవును. ఆకలియై భోజనము చేయవలెననిపించి చేతిలో డబ్బులేనపుడు సారథి చాల యిబ్బంది పడుచుండెడివాడు అతని యాకలి కనేకవిధములు. ఒకప్పుడు భోజనము చేయవలయును. మరియొకప్పుడు పెసరట్టు మొదలైనవి తిన్నచో చాలును. మరియొకప్పుడు పండ్లుకొని తినవలయును. ఇంకొకప్పుడు రెండుమూడు సేర్ల పాలు త్రాగును. ఈ భోజనములు దినమునకు రెండుసారులు చేయవలయునని గాని నియమిత కాలములయందు జేయవలయునని గాని లేనేలేదు అతడు నిద్రా భోజన శరీర వ్యాయామములు తానిప్పుడు చేయును ఇప్పుడు చేయును, అన్న నిబంధన లేదు. ఒకనాడర్ధరాత్రిమున లేచి తోటత్రవ్వును. తెల్లవారు జామాలుగు గంటలకు భోజనము చేయును పవలు నిద్రపోయి రాత్రులందు మేలుకొనును. రెండు మూడు నాళ్లు భోజనము లేకుండ నుండును. నిద్రమాత్రము ఇరువది నాల్గు గంటలలో బది పండ్రెండు గంటలెప్పుడో యొకప్పుడు పోవును.

అతని కెప్పుడో యాకలి యనిపించును. ఆయనిపించినప్పుడు వృకోదరుడే. అన్నములోనికేది యుండవలయునని లేదు. కట్టె యావకాయ వేసికొని సేరు బియ్యపన్నము తినును. తరువాత రెండు సేర్ల పెరుగు త్రాగును అతడు వ్యాయామ ముగా భోజనము చేయుట యొక విలాసము.

నాడు విశాలాక్షి యింటికిపోయి భోజనమున్నదా యని యడిగెను. ఆమె "అన్నము మిగులలేదు వంట చేయుదు" ననెను. అతడు సరే యని కూర్చుం డెను. ఆమె వంట చేయుచుండెను. విశాలాక్షి చదువుచు వదలిపెట్టిన యొక యెవ్వడో వ్రాసిన నాటకమును దీసికొని తానుజదువుచు బండుకొనెను నాటక మంతయు జదివెను. అతడు పుస్తకమును జదువుట యనగా బంజాబు మెయిలు పరుగెత్తుట ఆ పుస్తకమును చేతబూని విశాలాక్షివద్దకు బోయెను.

"ఓసి విశాలా! ఈ నాటకమును వ్రాసిన దవట యెవడు? ఎంత చక్కని కథను పాడుచేసినాడు; ఇది రాణా ప్రతాపచరిత్రము. దేశభక్తిపూరితమైన పద్యములే యిందులేవు. ఇట్టి వెధవపుస్తకములు చదువకుము. చెడిపోదువు" అనెను ఆమె తా నదివరకే చెడిపోయితినన్నది. ఆమె 'అన్నము దించినది పప్పున్నది కూరచేయుచున్నాను. పది నిముసములాగు' డనెను. ఇప్పుడే వత్తునని సారథి వెడలెను. సారథి రంగనాథము నింటికి వెళ్లెను. రంగనాథము భోజనము చేసి నిదురపోవుచుండెను. సారథి వారి సావడిలోనే కూర్చుండెను. రంగనాథము మేల్కొనువరకు మూడుగంటలయ్యెను. అతడు వచ్చి సారథిని జూచి 'యయ్యో! నన్ను మేల్కొలుపకపోయితిరా' యని నొచ్చుకొన్నట్లు మాటాడెను. రంగనాథము పండ్రెండుగంటలు మొదలు మూడుగంటలవరకు మంచముమీద పండుకొనును. ఈ మూడుగంటలలో నొక యరగంట యెప్పుడో నిద్రపోవును. కాని మూడుగంటలును నిద్రక్రింద లెక్కయే. ఈలోపల నెవ్వరు వానిని బలుకరింపరాదు. రాజుగారివద్దనుండి వారు వచ్చినను వాని నెవ్వరు లేపరు. అతడు లేవడు. అతనికి పాతిక యెకరాలు మాగాణి కొల్లేటిదగ్గర గలదు. దానికి నీటి ముంపును లేదు. అచటనుండి చేయించుకొన్నచో పాతికపుట్ల ధాన్యము వచ్చును. పది పుట్లు శిస్తుక్రింద వ్యయముక్రిందను బోయినను పదునేనుపుట్లు మిగులును. అతనికి పట్టణవాసము ప్రియము. ఆ పాతిక యెకరములు పదిపుట్లకు గౌలునకిచ్చి యతడు పట్నములో నివసించును. అతని కౌలుదార్లు పండలేదని చాము వేసిపోయినదని వరదకు గొట్టుకొనిపోయినదని పలువిధములుగా చెప్పి సంవత్సరము మొత్తముమీద వానికి రెండు మూడు పుట్లు కిమ్మత్తు డబ్బు చెల్లించిపోదురు. వాకిటిలోనికి రైతు వచ్చినతోడనే వానివిజూచి రంగనాథముకొక యాటవస్తువు దొరుకును. అతని భార్య పట్టుచీర కావలయుననును. కూతురు

మరొక వస్తువు నడుగును. ఆ రైతు నంగడికిబోయి మిక్కిలి యాదరముతో వా వస్తువులు కొనితెచ్చి పెట్టును. తక్కిన డబ్బడుగుటకు రంగనాథమునకు చేత గాదు. మరల పదిరోజులలో వత్తునను. ఏదో పనిమీద వచ్చితిని ఇంటికి వెళ్లి వంతనే పంపింతు ననును. ఇంక రంగనాథముయొక్క బ్రతుకు తాను కవిగా సంపాదించుకొనుటమీద. అతను కొన్ని గ్రంథములు వ్రాసెను. వాని విక్ర యముమీద కొంత డబ్బు వచ్చును మరియు నతని సభలకు బిలుతురు. తృణమో పణమో యిత్తురు. అతను బి యే. చదివెనుగాని యుద్యోగమునకు బనికిరాడు. ప్రొద్దుననే లేచి కాఫీహోటలునకుబోయి తా నారగించి పిల్లలకు భార్యకు బొట్లములు తెచ్చును మధ్యాహ్నము భోజనము చేయును. మూడుగంటలకు లేచును. స్నానము చేయవలయును. తల దువ్వుకొనవలయును. దుస్తులు ధరించ వలయును. ఇది తేలికగా రెండుమూడు గంటల పని. తర్వాత వాహ్యాళిపోవును. నలుగురైదుగురితని శిష్యులున్నారు. వారితో గలిసి యూరి ఏచివరికోపోయి రాత్రి తొమ్మిదగువరకు ప్రసంగములు చేసివచ్చును. ఊరిలో నేనాటక మాడి నను నతడు తప్పకుండబోవును. పాటకచేరీలకు బోవును. నాటకము లైనతరు వాత పాటకచేరీ లయినతరువాత నందరు నతనిని మాటాడవలయునని నిర్బంధిం తురు. అతను లేచి మాటాడును. మనిసి కొంత అందగాడు. అందముగానవ్వును. కన్నులు పొడుగెక్కువ. వెడల్పుతక్కువ. కనురెప్పలు కొంచెములావు. అతడు నవ్వినచో నదియొక యందముగా నుండును. అంద అతనిని ధనవంతు డనుకొం దురు. కాని యతనికి నూరిలో నున్న యప్పులు మరయెవ్వరికిని నుండవు. అతని పాతిక యెకరములు చూచి యందరు అప్పిత్తురు. అది యప్పు తీర్చినగా ఋణ దాత యొక్క యదృష్టము.

సారథి "నీతో బనియుండి వచ్చితినయ్యా" యనెను. రంగనాథము చెప్పండి, చెప్పండి యని వినయముగ నలంభించెను. సారథియిట్లనెను. "నేను రాణా ప్రతాపసింహుని వేషము వేయబోవుచున్నాను. నీవు నాకొక గీతమాలిక వ్రాసి పెట్టవలయును. అది విన్న వారి హృదయము దేశభక్తితో నిండిపోవలయును పద్యమంతయు రౌద్రరసముతో నిండియుండవలయును." రంగనాథము "నేనట్లు వ్రాయగలుగుదునా? నేనెట్లు వ్రాసిననేమి మీరు దాని యందు రసమును బుట్టింతురు. మొన్న నవధానిగారి పద్యములే యంతరసవత్తరముగా జదివితిరి. ఇంక నెవరి పద్యములు చదువలేరు." సారథి 'యాభావములు నేను చెప్పి వ్రాయిం చితినయ్యా' నాకు కవిత్వము రాదు లేనిచో నేనే వ్రాసికొందును. నీ కెందుకు. నీవు వ్రాసి పెట్టుము. రంగనాథము'-ఎన్ని పంక్తులుండవలయును. సారథి-ఒకవంద

పంక్తులు వ్రాయుము. రేపటికీయగలుగుదువా? రంగనాథము- నేనంతతొందరగా వ్రాయలేను. ఒక వారము రోజులలో నిచ్చెదను.

రంగనాథము సారథినాపి కాఫీయిచ్చెను. సారథి విశాలాక్షి యింటికి బోవుటకు బదులు తన తోటకు బోయెను. కూర్చుండి యా నాటకమంతయు గొట్టివేసి రంగములు మార్చి మాటలు దిద్ది క్రొత్త నాటకముగా దయారుచేసెను. నాటకములో బ్రతాపసింహుని భార్యయున్నది. ఆ స్త్రీ వేషమును తొలగించెను లేనిచో మరల వాసంతిని రమ్మనవలయును. సారథి తొలుత విశాలాక్షి చేత స్త్రీ పాత్రములు వేయింత మనుకొనెను. కాని విశాలాక్షి యంగీకరించలేదు. ఆమెకు సంగీతమును రాదు. మరియు నెట్టని రంగువేసినచో రూపసిగనే కనిపించును గాని మిక్కిలి పొట్టిదియు బక్కపలుచనిదియగుటచేత రంగమునకు నిండీయదు. తానామెకు మొదలుపెట్టి చదువు చెప్పవలయును. నాటకమంతయు సిద్ధము చేసిన తరువాత తెల్లకాగితములు కొనితెచ్చి శుద్ధప్రతి వ్రాసెను. పదిమంది పాత్రధారులేర్పడిరి. ఎవని భాగము వానికి విడివిడిగా వ్రాసెను ఇదియంతయు పూర్తియగు సరికి తెల్లవారెను అతనికప్పుడు తెలిసెను. పనుకటి దినము గడచిపోయినదని మరియొక దినము వచ్చినదని దంతధావనాదికములు చేసి స్నానము చేసి యీ పదిపాత్రల పఠనీయ భాగములు చేతిలో బుచ్చుకొని యూరివెంట బయలుదేరెను తన నాటకములో వేసములు వేయువారు పదిమంది. ఆ పదిమందికి, వది వాక్యముల నిచ్చెను. ఒకడు కళాశాలలోని కుఱ్ఱవాడు. మరియొకడు వైశ్యుడు. అతనిది కిరాణీకొట్టు. మరియొకడూరిలో గ్రామసంచారి ఒకడు కిల్లీదుకాణదారు. ఇట్టుండలు తెలా యొక చోట నుండిరి. రాజా మానసింగు వేషము సీతారామశాస్త్రియని యొకాయన కిచ్చెను. అతడు హరికథలు చెప్పును. అతడే నాటకసంఘములో నొక సభ్యుడు, అక్బరు వేషము పావనిరావని యొకడున్నాడు. అతనికిచ్చెను. పావనిరావు వ్యాపారి, అతనికా గ్రామములో రెండు గృహములున్నవి. ఎచ్చటనో రెండుమూడెకరములు పొలమున్నది. మనిసింహుందాగా నుండును. ఎప్పుడు త్రిగులతో గుబాళించుచుండును. చెంగావి పంచెకట్టును. బొద్దైన మనిషి కొంత పొట్టకూడ గలదు. కనుల చివర సద్దిన గందముతో మొగమున మసినిలువుబొట్టుతో జేతికి రెండుంగరములతో బొత్తము కోయతో పావనిరావు నాగరికుడు. సర్వసభలయందు నుత్తమ సభ్యులలో నొకడు. అతడే సమాజములోని మర్యాదగా నిద్దఱుముగ్గురు సభ్యులతో నొకడు.

నాల్గు దినములలో వారు వారు వారి వారి పాఠ్యములను చదివి యేనవ నాటి సాయంకాలమున నాటకశాలా భవనమున సమావేశపడవలయును. అంద

యును కలసికొని యివియప్పజెప్ప వలెను సాయంకాలము నాల్గు గంటలైనది. సారధి యింటికి వచ్చెను. ఈ పని యైనంతవఱకు వానికి నిద్రాహారములు పట్టలేదు. ఇంక నాలుగు దినముల వఱకు బనిలేదు. ముందు నిద్రపోవలయునా భోజనము సేయవలయునా యను ప్రశ్న కలిగెను. ఇంతలో నీ నాటకములో దనకు వేసము లేదని వాసంతికి దెలిసెను. ఆమెకు గోపము వచ్చెను. ఎప్పుడో తనతిడకల కొంపమీదికెత్తి వచ్చునన్న యూహ వచ్చెను. తన నాటకములో నింక వాసంతి వేసము వేయదు. వాసంతితో జోక్యము తగ్గించుకొనవలయును. ఇంక దాను వారింటికి బోదు. వారు వచ్చినచో మొగముచాటు వేయును. అసలీ నాటకములో వాసంతికి స్థానము లేదు. ఇది రౌద్రరస ప్రధానమైన నాటకము. ఇందులో స్త్రీ పాత్ర యెందులకు. రాణాభార్యయు బిల్లలు తిండిలేక యిబ్బందిపడినారు. అది కరుణరసము. రౌద్రరసములో గరుణరస మెందుకు అసలిది రౌద్రరసమేనా? వీర రసమా? వీరరసమై రాణాప్రతాపు దేశ సాధించినాడు. అక్బరునకు లొంగలేదు. అందులో రసమే లేదేమో! ఒక భావమున్నది. తన స్వాతంత్ర్యమును తన స్వేచ్ఛను తన మతముయొక్క స్వాతంత్ర్యమును నేనేమైనను సరే నేను చెడగొట్టనని పట్టుదలయున్నది. ఇది వీరరసమే. ధర్మవీరము. అది యేమైనను సరే నే నీ ధర్మమును జేయుదుననే. అందుచేత వీర రసమే. కర్ణుడు తన కవచకుండలములను బోగొట్టుకొనెను. తాను చనిపోవుటకు మార్గము లేర్పరచికొనెను. అతనికి శత్రువులను గెలుచుట ప్రధానము కాదు. తనదానము ప్రధానము. అది దానవీర రసము. అట్లే ప్రతాపునియందు ధర్మవీరమున్నది. వీర రసమునకు గరుణరసము సహకారియే భార్యయు పిల్లలును శత్రుచేత మాడుచున్నను ప్రతాపుడు తన ధర్మమును బరిత్యజించలేదు. ఇది ధర్మవీరము. కాని రౌద్రరసముకాదు. రౌద్ర మందముగా నుండవచ్చును.

సారధి తాను వ్రాసిన వ్రాతయంతయు దిప్పుకొనెను. వ్రాసిన నాటకమంతయు దిరిగి వ్రాయవలయును. పదిమందికిని తను బాకీయు భాగము లిచ్చి వచ్చెను. ఇప్పుడవి మరల దీసికొనవలయును మరల బయలుదేరి యుంపని దగ్గతి కాగితములను తెచ్చెను. అంతయు నగుసరికి రాత్రి పదిగంట లయ్యెను. ఇందాకటికంటె నిద్ర పదిరెట్లు వచ్చుచుండెను. ఇందాకటికంటె నాకలి యిరువదిరెట్లు వేయుచుండెను. అప్పుడతనికి జ్ఞాపకము వచ్చెను అతడీ పగలంతయు భోజనము చేయలేదు. నిన్నయంతయు, భోజనము చేయలేదు. మొన్నటి సాయంకాలమున నిడ్డెనలును బెసరట్లును దినెను. నిద్రకంటె భోజనమే ముందు జేయవలయును. బసకు బోయినచో విశాలాక్షి తిరిగి రానీయదు. తనకు నిద్ర చెడును. తనయంతట దాను తిని తనయంతట

దాను నిద్రపోవలెయును. మరల జ్ఞాపకమువచ్చెను. బీడీలు లేవు. కాగితములు కొనగా చిల్లరడబ్బులు మిగిలెను. ఇందాక నే బీడిలు కొన్నచో సరిపోయెడిది. నిద్రకంటె నాహారముకంటె బాగ త్రాగవలెనన్న కోరిక యెక్కువయ్యెను. వెంటనే పోయి బీడీలు కొని తెచ్చెను బీడీల కట్టలో నిరువది బీడీ లుండును. అవి పొడుగైనవి తన పాకలో గూర్చుండి కాల్చుట కారంభించెను. దూరమున నుండి దేవిడీ గంటలు వినిపించెను. వాడు పన్నెండుగంటలు కొట్టెను చీకటిలో బీడీకల చేతితో పట్టికొనగా నది పలుచబడుచుండెను. నాలుగైదుకన్న దానిలో నెక్కువయున్నట్లు లేదు బీడీలు త్రాగిన తృప్తి కలిగినట్టున్నది. మరల నాకలి వేయుచున్నది విశాలాక్షి బసకేగెను.

"ఇంకొక గంటవాచి పండుకొందమనుకొన్నాను ఇదిగోనని మీరు వెళ్లి రానే లేదు. రాత్రి మూడుగంటలవరకు మేలుకొనియుంటిని. మూడురోజులు క్రింద నిక్కడ దినిపోయిన యన్నమేకదా" "కాదు కాదు మొన్న సాయం కాల మిడ్డెనలును పెసరటు దింటిని. అన్నమున్నదా."

"అన్నము కూర పప్పుపులుసు పెట్టియున్నవి. మీరు రానిచో రేపు ప్రొద్దున బనిచేసెడిదానికి వేయుదునని యట్టిపెట్టితిని. అన్నము గాడిపొయ్యి మీదనే యుంచితిని పొయ్యిలో నిప్పు చల్లార్పలేదు వేడినీళ్లు కూడ గలవు. స్నానము చేయుడు"

తనకు వేణ్ణీళ్లు వలదనినను సారథికి వేణ్ణీళ్లు సేయుక తప్పినదికాదు. విశాలాక్షి నీవు తోడెను. సారథి యీగలు త్రాగుచున్నట్లున్నదనెను. సారథి భోజనము చేసెను. అనాటికి తాను తన తోటకుబోయి నిద్రపోవుటలేదని సారథికి దెలియును. స్నానము చేయుచు భోజనము సేయుచు "నే నిక్కడ నిద్రపోను. నా యింటికి బోదునని యైదారుసార్లనెను. మజ్జిగ యన్నము తినుచు సారథి యడ్లుగగా విశాలాక్షి "యిది యెవరి యిల్లు" అనెను. సారథి "యిది నీ యిల్లు. మీ డాక్టరుగారి యిల్లు. పాలఘాటునుంచి యెవరైనవచ్చినచో వారి యిల్లు" అనెను. "పదునాలుగేండ్లనుండి రానివాడు పాలఘాటునుండి రాడు. డాక్టరుగారికి నీ యింటికి సంబంధములేదు. నేను వారి యింటిలో వంట కత్తెను"

సారథి మాటాడలేదు. ఇద్దరును పండుకొనిరి. విశాలాక్షి యిట్లనెను. "నేను రుక్మాంగద నాటకమునకు వచ్చితిని. ఆ యమ్మాయిని నేను పూర్వ మెప్పుడును జూడలేదు ఎంత యందకత్తె. చిదిమి దీపము పెటవచ్చును. ఆమె పాడుచుండగా బంగారము తీగ దీసినట్లున్నది. ఆమెకు మీకు నేమైన సంబంధమా?"

సారథి పండుకొన్నవాడు లేచి కూర్చుండెను. తొందరగా మంచము దిగెను. వీధి తలుపు తెరచుటకు బోయెను. విశాలాక్షి యడ్డమువచ్చి బతిమాలెను. 'పొరపాటున నంటిని. చెంపలు వేసికొనుచుంటిని' సారథి తలుపు గడియ తీసెను. విశాలాక్షి పాదములమీదబడి కౌగలించికొనెను. సారథి వెనుకకు మరలెను. విశాలాక్షి మరల గడియవేసెను. మరల నిద్దరు నేకశయ్యాగతులైరి. సారథి యిట్లనెను. "ఓసీ విశాలా! మన యూరిప్రక్క పంట కాలువ నెఱుగుదువా యని యడుగుము. ఉప్పుటేరు నెఱుగుదువా యని యడుగుము. మునుగుకొల్ల చూచితివా యని యడుగుము. గంగానదిలో స్నానము చేసితివా యని నన్నడుగుము" అనెను. విశాలాక్షి మరల చెంపలు వాయించుకొని యతనిని కౌగలించుకొనెను.

అతడు తెలవారి వచ్చుచున్నదనగా దన తోటకు వెడలిపోయెను. పోయి మంచముపై బరుండెను. నిద్రపట్టలేదు. పాఱపుచ్చుకొని తోటలో బనిచేయుదమనుకొనెను. దానికిని మనస్సు తూగలేదు. మిగిలిన బీడీలు తగులబెట్టెను. ఊరి వెంట బయలుదేరెను. పదిబజార్లు తిరిగివచ్చెను. నడచుచున్నంత సేపు తానూహించుకొనుచుండెను. నాకిపుడు నలుబదియైదేండ్లు, చిన్నప్పుడే యింటిలో నుండి లేచివచ్చితిని. నేను గొప్పయింట బుట్టితిని. నా తాతగారి గ్రామములో ప్రసిద్ధుడు. ఆయన గొప్ప ధనవంతుడు. చాలమందికి జాల యుపకారములు చేసెను. నా నాయనగారు నాకు చిన్నప్పుడే చనిపోయిరి. నా తాత నన్నల్లారుముద్దుగా బెంచెను. ఆయన భార్య పూర్వమే చనిపోయెను. ఇంటిలో మా యమ్మయును మా తాతయు. నేను చదువుకొనలేదని మా యమ్మ కోపపడినచో మా తాత యామెను గోపపడుచుండెడివాడు. నాకారీతిగా జదువబ్బలేదు. నేనల్లరి పిల్లలతో గలిసి తిరుగనారంభించితిని. నాకు బదునాలుగేండ్లు వచ్చునప్పటికే నేనెందుకు బనికిరానని తెలిసిపోయినది. నా తాతగారు చనిపోయిరి. ఎటుపోయినదో నాకు దెలియదు. మా యాస్తియంతయు పోయినది. నాకు నాటకములలో వేషములు వేయుట యలవాటయినది. నన్నీ విద్యలోనికిదించిన వాడు శరభస్వామి. ఏమి శరభస్వామి. ఆయన యెంత పండితుడు. నేను పెద్దనటకుడనని వీరందఱను కొనుచుందురు. ఆయన ముందఱ నేనెంత. ఆయన నన్ను దగ్గఱకుదీసి 'నాయనా! నీలో మహానటునకుండవలసిన లక్షణములున్నవి. పరమేశ్వరుడు నీకందమైన మొగమీయలేదు అది యొక్కటియే లోపము. కాని నీ మొగములో నందము లేకపోయినను భావము సువిస్పష్టముగా భాసించు లక్షణములున్నవి. నటకునకు ప్రధానముగా గావలసినదదది. అది నీకు బరమేశ్వరుడు ప్రసాదించినాడు. అన్నాడు. నాకు దానితోబాటు శరభస్వామిగారి యాశీర్వచనము గూడ

లభించినది. నేను నా యింటిజోలి పట్టించుకొన లేను. చాప చుట్టగా జదిలి పోవ మిరుచున్నగదా! నా తల్లి మా యింటిలో నామె త్రిప్పంగామె పడుచున్నది. నాకు బిల్లనిచ్చువని వచ్చినవాడే లేడు. నేను మదరి పోయితిని యాదేచ్ఛముగా తిరిగితిని ఈ యూరిలో నటకుడని నాకెంత గౌరవమున్నదో అక్కడ నా ప్రవర్తనకు నంత యగౌరవమును గలదు. నేను సభలకే పోను. పోయినచో నాకు మర్యాదలేదు, ఒక రంగనాథము నన్ను మెచ్చుకొనును ఒక యుమాపతి నన్ను కేవ్వుచు కొనును అనాయకుడైన యవధానిగారు నలుపురనుచుంపెగా నన్ను మహాపండితుడను కొనును. తన నాటకము నేను వేయుట చేత తన నాటకమునకు గొప్పతనము వచ్చునని నన్ను గౌరవించును. నేనిప్పుడు లేకపోయినను విశాలాక్షి బ్రతుకగలదు విశాలాక్షి పాపము నన్నే నమ్ముకొని యున్నది. అదినమ్ముకొనుట యెంత నాటకములో వీరరసమే ప్రధానము. కరుణముంగముగా నుండవచ్చును. ఉండుటయే రసోద్దీపకము".

## ౪

వాసంతియొక్క సంగీతకచేరీ జరుగుచుండెను. ఏ సభలోనను కనుపించని సారథి యా సభలో ప్రధానముగా గనిపించెను. సారథి యట్టి సభకు వచ్చుట పూర్వ మెన్నడు జరుగలేదు. వచ్చి ముందుగూర్చుండుట యెవ్వరు నెఱుగనిది. అతినిన్నచో బట్టణమునందు గొప్పనటకుడను ప్రతీతికిగాని లోప మెప్పుడును లేదు. మర్యాదగలవాడని యెవ్వరు ననుకొనరు ఇతడు గొప్ప నటకుడని చెప్పికొనుటయే కాని యతని యభినయవిశేషమును జూచినవారు లేరు. చూచినచో తెలుసుకొనువారు నరుదు. రుక్మాంగద నాటకమునకు మాత్రము వారిలోని పెద్దలందరు వచ్చిరి దానికి నాల్గయిదు కారణములు కలవు. మొదటిది రాజాగారు నాటకమునకు వచ్చెదరని తెలియుట. రెండవది యవధానిగారు పెద్ద యుద్యోగస్థులందరిదగ్గరకుపోయి, నేడు తన నాటకమాడుచున్నారని సారథిగారు రాజవేషము వేయుచున్నారని మీరు తప్పకుండ రావలయునని ప్రతివారిని బిలిచి వాగ్దానములు పుచ్చుకొనివచ్చుట. మూడవది సారథి గొప్ప నటకుడటకదా యెటులుండునో చూతమని. అంతేకాని పెద్ద యుద్యోగస్థులును పెద్ద లనిపించుకొన్న వారును నాటకములకు బోరు. వారు నాటకముల జూచుటకేగుటకు ప్రత్యేక కారణము లుండవలయును. మరియు వారి యుద్యోగములలోనే వారు బ్రహ్మానందమును బొందుచుండగా గళలవలన గలుగు రసానుభూతి వారికెందుకు?

సారధి ప్రధానస్థాన మలంకరించి సభలో గూర్చుండెను. అతనికన్న ముందువాడు లేడు. కాని యతనికన్న పిగ్గరియు లేడు. అట్లు కూర్చున్న అతని యొడలంతయు దేళ్లను జెఱ్ఱులను బ్రాకుచుండెను. వాసంతి సంగీతము పాడుచుండెను. సభలో గొందరు పెద్దలు తాత్కాలికముగా సారధియొక్క యచ్చటి యునికి మరచిపోయి తాళము వేయువారు కొందరు తలలూపువారు కొందరుగా సాగుచుండెను. వాసంతి తానొక స్వరము వేసి రాగాలాపనములో నొక విశిష్టమైన సంగతి వేసి సారధివంక జూచును. సారధి తలయెత్తడు. నిశ్చలాంతస్కరుడైన యోగివలె గూర్చుండెను. తనలో దాను ద్రవ్వుకొనుచుండెను. "తానిచ్చటికి వచ్చుటచేత బరిహాసభాజనుడైనాడు. తాను సభాయోగ్యుడు కాడు. అందరి కన్నులు తనమీదనే యున్నవని తనకు దెలియును. విశాలాక్షి యేప్రశ్న వేసినదో యా ప్రశ్న యచట సమవేతులైన సర్వజనుల హృదయములందున్నది. తన స్త్రీ సంబంధమైన యవినీతి పట్టణములోనున్న వారందరకు గనులకు గట్టిన యద్దము వాసంతి యవివాహిత. పదునాలుగేండ్ల పిల్ల. తండ్రి కొక్కతెయే కూతురు. శిరీషకుమారు ధనవంతుడు. అత డామెకు వివాహము చేయలేదు. తన నాటకములలో నామె వేషము వేయును. ఆమె కోసమే తా నిక్కడికి వచ్చినట్లు విస్పష్టము. ఆమె మాటిమాటికి దనవంకనే చూచుచున్నది. అన్ని కారణములు సమకూడి తనకీ యప్రతిష్ఠ తొలగింపరానిదిగా నున్నది. కచేరీ జరుగుచుండగా తాను తొలగిపోవుట మరియాద కాదు, అది మరియాద నష్టపరచు మరియొక పని. సభ జరుగుచుండగా నడుమ లేచిపోయెడివాడు సభామధ్యమున గూర్చుండరాదు. చిట్టచివరనో యొక పెడనో కూర్చుండవలయును. సభ చుట్టు నిలుచుండి తడకకట్టెడివారికడనున్నచో మరియు లాభము. సంగీతకచేరీయనగా మూడుగంటలు. అంతసేపు కిక్కురుమనకుండా గూర్చుండుట సంగీత విద్యయందు ప్రవేశముకాని యభిమానముకాని లేనివారికి గష్టము. మరియు నెప్పుడెదో యొక దూహించువానికి మరియు గష్టము. సంగీతశాస్త్రము తెలియక పది పదేను రాగములు తెలిసి పాటకునియొక్క కంఠ శ్రావ్యతమీద నాధారపడి కచేరీ వినుటకు గూర్చున్నవాని దుర్దశ శోచనీయమైనది. రాగాలాపన చేసినపుడు మాత్రమే వాడు కొంత యానందించగలడు. తక్కినప్పుడు వాని కేదియు దెలియదు. పదిమంది తలలూచుచుందురు. పదిమంది తాళములు వేయుచుందురు. రెండుమూడు నిముషములు గాయకుడు స్వరము వేసినచో నందరు చప్పట్లుకొట్టుదురు. పరిశ్రమచేసి తద్విషయకమైన సంపూర్ణజ్ఞానము కలవాడే విద్యాప్రదర్శనము లాస్వాదించగలడు. అట్టి సభలో వందమందియున్నచో తొంబదిమంది యట్టివారే కాని ఊహాశాలులు కానిచో నచటే కూర్చుండవచ్చును. ఊహాశాలి

కూర్చుండలేడు. వాని మనస్సునకు నైశ్చల్యములేదు. దానికి దోషము మరి యేదో కారణముచేత బదియుండి కన్నులు తనమీద నున్నవని తెలిసినచో వానికి సభలో కూర్చుండుట మిక్కిలి కష్టమైన పని. అట్టివాడు లోక మేమను కొన్నను సరే తనకిష్టమైన పని తాను చేసెడివాడైనచో బరిహాస పాత్రుడగును. సారథి యీనాడు పరిహాస పాత్రుడయ్యెను. కచేరీ సగము జరిగెను. వాసంతి స్వరము వేయుచుండెను కొందఱు తాళములు వేయుచుండిరి. కొందఱాహాహా యనుచుండిరి. బయటికి లేచిపోవుటకు సారథి లేచెను అందరి కన్నులతనిమీ దనే నిలిచెను. అతడు బయటికి వెడలిపోయెను. సభికులందఱకేమి పారవశ్యమో యందేమి తన్మయత్వమో యొకవ్యక్తి లేచి వెళ్ళినంతలోనూగడితల లాగినవి. తాళము వేయు చేతులు నిలిచినవి సభలో గుసుగుసలు బయలుదేరినవి. సారథి కదలకుండ కూర్చున్నచో సభ రక్తికట్టియుండెడిదే, తరువాత వాసంతి యెంత ప్రయ త్నించినను సభలో నిశ్శబ్దత కలుగలేదు. ఆమె వెంటనే రాగాలాపన చేయ నారంభించెను. కల్యాణిరాగము పాడెను. సభ కొంత నిశ్శబ్దమైనది రాగా నంతరము మరల సభ యథాస్థితికి వచ్చెను. వాసంతి తరువాత నరగంట కన్న నెక్కువ పాడలేదు. సభలో నుండి యెవ్వరు లేచిపోరాదా. ఎందఱు లేచిపోరు. సారథి లేచిపోయినంత మాత్రమున యింతరసాభాస యేల కావలయును. ఈ జనుల దురూహ లేమి, పురుషుడు తనంతటి దాను వ్యక్తిగతముగ మంచివాడే. పది మందితో గలిసియున్నప్పుడు వానియంతటి దుర్మార్గుడుండడు. మనుష్యు డొక్కడున్నప్పుడు తానొక్కడే యైనపుడు తనకు దుర్మార్గపు టూహాలు వచ్చినను తనలోదానే యూహించుకొనగలడు. దానికి వాగ్వ్యవహారము లేదు. అధికముగా క్రియాచరణము నుండదు. రెండవవానితో గలిసినపుడు వాగ్వ్యవ హారము కలదు. క్రియాపర్యవసానము పొందును పొందదు. లోకమునకు సంబం ధించినంత వరకు దుష్టమైన నిందాపూర్వకమైన వాగ్వ్యవహారము మిక్కిలి చెడ్డది.

గోదావరి పొంగివచ్చినది. ఊళ్లు పాడుచేసినది. చనిపోయినవారు చనిపో యిరి. ఆస్తి నష్టపడినవారు పడిరి. వారి కష్టముకంటె జూచెడివారి కష్టము గొప్పది. కష్టమో సుఖమో అనుభూతిదశలో స్వల్పము. విచారణదశలో నధికము. రాబోవు నాపదనూహించినకొలది గడుపు చెఱువగును. ఆపద వచ్చినది ఆపద లోనున్నాము. మన యింద్రియములు దిమ్మెక్కిపోవును. భయములేదు. కష్ట మేదో యనుభవించుచున్నట్లుండును. కష్టమో సుఖమో యెచ్చట నున్నది. మన యూహాలో నున్నది. అనుభవ సమయమున బహుస్వల్పము. అందుచేత దానిబాధ యెక్కువలేదు.

పదిమంది చెప్పుకొనుటలో నున్న బాధ చెప్పికొనవచ్చును లేదు, లోకము నిందచేయుటయే లోకమునకు ఆరకుండ లేకపోవుటయే యీ లోకము యొక్క దుర్గతి ఇదియిది యని యెవ్వనికి తెలియదు. అందరును దెలిసినచో మాటాడరు. గోరంతలు కొండంతలు చేయుదురు. మనుజుని సాంఘికమైన యీ ప్రవర్తన వాని యాత్మపదార్థభంగకారి. మనుజుని గృహగతమైన ప్రవర్తనచేత మనుజుడు నీచపథగామి కాడు. సంఘ సన్నికర్షపొంది నీచపథగామి యగుచున్నాడు. అందుచేతనే రాజు సంఘ సంబంధమైన ప్రవర్తనములోని దోషములనే శిక్షించును. మహర్షులు మానవుని యాత్మను శిక్షించుచుండగా రాజు మానవుని దేహమును శిక్షించుచుండును. ఋషికిని రాజునకును గల భేదమిది. రాజును గౌరవింతురు జనములు.

ఈ రహస్యమంతయు వాసంతికి దెలిసినది. సభలో నున్నవారు సారధి లేచిపోవుట వలన నెట్లూహించుచున్నారో యామెకు దెలియును. సారధి నీవు రదా, కూర్చుండరాదా. కూర్చున్నచో వచ్చిన నష్టమేమో. తలవంపులు తగులబడిపోవుచున్నదా. తనపాట వారెవరు వినవలయునని మహాభిలాషతో బతిమాలి బామాలి సభకు దీసికొని వచ్చెనే. అతడు మెచ్చినచో దానెంతయో సంతోషించెడిదే. తనకు 'వలువరిగో', దంపు తెచ్చెను. ఇంక నతనితో మాటాడరాదు. అతని నాటక సంఘములో వేషము వేయరాదు. నిజముగా సంగీతవిద్వాంసుడు నాటకములలో వేషము వేయుట గౌరవహీనమైన పని. స్త్రీ విషయములో వేరె చెప్పనక్కరలేదు

వాసంతి సభయైనంతనే యెవ్వరితో జెప్పకుండ నింటికి నడచిపోయెను. తండ్రి వెనుకనే మిగిలినాడు. ఆమె వేరుబండి చేయించుకొని నడచినది. వల్లి యాలంకారములు తీసివేసినది తెల్లచీర కట్టినది. మంచముమీద బండుకొని కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండెను.

శిరీషకుమారు పుత్రికాజీవి. తాను తొందరగా నింటికి బోయెను. కూతుయొక్క స్థితి చూచెను. అతనికి కారణము తెలియలేదు. అతడొక విచిత్రమైన పురుషుడు. కొందఱు మిక్కిలి యూహాశాలులై యుండియు నేక విషయములగ్న మనస్కులైనచో, ఉదాత్తమునైన యూహలు వారికి రావు. అతనికి దన కూతురు మహావిద్వాంసురాలని గొప్ప గాయనిగా లోకమునందు ప్రఖ్యాతి సంపాదించవలెనన్న యూహయే కాని లోకమేమనుకొనునోయన్న యూహయే లేదు తనకూతురు పాడుచుండగా ప్రక్కన గూర్చుండి మహానందమనుభవించును. ఆమె పాట విచ్చితబ్బిబ్బు లగువాడు వానికంటె సృష్టిలో మరియొకడుండడు. అతని కామెయే జన్మచారితార్థ్యము.

ప్రక్క గూర్చుండి యతడు తూతు లాలించెను. నిన్న నరే మనిరికి సభలో వాండ్రు నీ పాటను మెచ్చుకొన్నవారే గాని కాదన్నవారు లేరే. అందరును తమ్ము గలిసికొని ప్రశంసించిరి. ఎవ్వరితో జెప్పకుండ నింటికి వచ్చితి వేల. శర్మగారు నీ కేదో సన్మానము చేయదలచుకొన్నాడు. మంగళము పాడితివి. వెంటనే లేచివచ్చితివి. ఇది మర్యాదయా" యని పది నిముసములు మాట్లాడి కారణము చెప్పుమని తండ్రి మాటిమాటికి బలవంతము చేసినమీదట వాసంతి యేడ్చుచు "సారథి సభలోనుండి యంత హఠాత్తుగా నెందుకు లేచి పోయి నాడు?" యని ప్రశ్నించెను. తండ్రి "ఆయన కేమి పని యున్నదో. ఆయన సామాన్యముగా సభలకు రాడు. మనము బలవంతము చేసితి మని వచ్చినాడు. సంగీతసభలో గూర్చుండి మొదటినుండి చివరిదాక గూర్చుండి వినుట యాయన కలవాటు లేదు. ఆయన వెడలి పోయినాడు. అందుచేత నీవు పాట నాపవలసిన యవసర మేమున్నది" యనెను. వాసంతి సభ రక్తికట్టబోవుచున్నది. అప్పు డాయన లేచిపోయెను. దాని మూలముగా సభ యంతయు బాడైపోయెను. నే నింక సంగీత కచేరీలే చేయను. నాకీ సంగీత మక్కఱలేదు" అనెను. శిరీష నీ విటువంటి మాట లంటివా నేను నీ గొంతుకోసి నా గొంతుకోసికొందును. భగవంతుడు నీకు మంచి గొంతుక యిచ్చినాడు. నేను నానాకష్టములుపడి నీకు సంగీతము చెప్పించితిని. నిన్నురవ దేశమునకు దీసికొనిపోదును. అక్కడ పెద్ద విద్వాంసులవద్ద నేర్పింతును. కళ ముఖ్యమా జీవితము ముఖ్యమా. ఒక మహావిద్య చేతిలోనుండి దానిని వృద్ధిచేసికొని లోకములో ప్రతిష్ఠ పొందుటకంటె పెండ్లి యాడి పిల్లలను గని కట్టె తినుట మంచి దని యనుకొనుచుంటివా? సారథి గొప్ప వటకు డన్నమాట నిజమే. ఆయనకును నీకును సంబంధ మేమిటి. ఆయన నాకు బాల్య స్నేహితుడే నీ కేమి పినతండ్రియా? యన్నగారా? ఆయనను నీ వంత గౌరవించుట నా కిష్టములేదు. ఆయన సభలోనుండి లేచిపోయినాడట. తన మనస్సు చెడిపోయినదట. తాను చివరకు లేచివచ్చినా ఇట్టి పనిచేసినచో నా కిష్టములేదు. నేను నీకు దండ్రినైనచో నీవు నాకు గూతురవైనచో నీ సంగీత కచేరీకు సారథికి నేమియు సంబంధములేదు. నీ వఘోరించుచున్నావని యొప్పు కొన్నాను. కాని సారథి పాటకచేరీకి దేనికి రావలయును, ఆయన కేమి సంగీతము తెలియును. ఆయన రావలయునని నీ వెందుకు బట్టుపట్టితివి. వెంటనే లేచి మొగము కడిగికొని మంచిచీర కట్టుకొని రమ్ము" అని తండ్రి లేచిపోయి చావడిలో గూర్చుండెను. వాసంతి వెంటనే లేచెను. ఆమెకు తండ్రి కంటె దైవము లేదు. అతడు గీసినగీటు దాటదు. ఒక్కొకపుడు తండ్రి నెదిరించి మాట్లాడును. ఎంతిమాట్లాడినను చివరికి దండ్రిమాటయే చేయును. తనమనసులో

నేదైన కోరిక పుట్టినచో దండ్రిచేత [illegible]నిపించి చేయి[illegible] స్వర్గము లో నింద్రుని సభలో వాసంతి పాడవలె[illegible]నని పిలుపు[illegible]చ్చెను. తండ్రి యంగీకరించనిచో బోదు. కాని యొక్కొక్కప్పు డామె కోరికలకు దండ్రియే యనుకూలించును. కొన్ని కోరికలు కేమి గాని యామె యెల్ల కోరికలకు దండ్రి యనుకూలించును. నిజమునకు దండ్రిమీద నామె కున్నంత యధికార మామెమీద దండ్రికి లేదు. కొన్ని విషయములలో నొక విషయముమీద దండ్రికి గోపము వచ్చెను. అప్పు డామె తండ్రి ననునయించును.

మరునాడు ప్రొద్దున సారధి శిరీషకుమారు నింటికి వచ్చెను. శిరీషు నవ్వుచు నెదురువచ్చి చాల దినాలకు వచ్చితివని తీసికొనిపోయి కుర్చీలో గూర్చుండ బెట్టెను. అంతలో నచటికి వాసంతి వచ్చెను. వాసంతి సారధినిజూచి మొగము ముడిచికొనెను. ఆమెనుజూచి సారధి నవ్వెను ఆమె మొగము పెడద్రిప్పుకొని వెడలిపోయెను శిరీషు గృహములో ప్రాతఃకాలముల వట్టి కాఫీ త్రాగరు. గట్టిగా ఫలహారములు చేయుదురు. వారి యింట వంటకత్తె గలదు. ఆయింట ముగ్గురే. వంటకత్తెయు శిరీషుడు వాసంతియు శిరీషుభార్య పదియేండ్ల క్రింద చనిపోయెను. అతడు మరల వివాహమాడలేదు. ఇంటిలోని వంటకత్తె వారి కేదో యూ కాసిపోకాసి చుట్టము. వంటకత్తెయైనను శిరీష వాసంతులమీద నామెకు జాల యధికారము గలదు. వాసంతిమీద దక్కువ యధికారము. శిరీషుమీద నెక్కువ యధికారము. వారి యింటిలో నే భోజనపదార్థము చేసినను నిబ్బడి ముబ్బడిగా చేయుదురు. ఎవరో యొకరు స్నేహితులు ప్రతిదినము ప్రాతఃకాలమున వారియింటికి ఫలహారమునకు వచ్చుచునేయుందురు. వారి యింటి కెదురుగా నాయూరి కరణ మున్నాడు. అతడు పదేండ్లనుండి ప్రతిదినము ప్రొద్దుటి పూట వారియింటిలోననే కాఫీ. అతడీనాడు గ్రామాంతరము వెళ్లినాడు. అతడును పట్టుబడి మనిసియే. అందుచేత సారధికి నష్టములేకపోయెను. రెండు పాయల యిడ్డెనలు దించి సారధి నాల్గు మూడు కప్పుల కాఫీ త్రాగెను. తండ్రి కేక వేయగా వాసంతి తమలపాకులు తెచ్చెను. పళ్ళె మచ్చట బెట్టి వాసంతి పోబోవుచుండెను.

సారధి—"నీవంటి సంగీతవిద్వాంసులకు మామీద గోపము వచ్చినచో మేము నిలువగలమా?"

వాసంతి— మే మేమి సంగీత విద్వాంసులము. పైగా మే మాడువాండ్రము. మే మేమి మహానటులమా. మా పేరు దిగ్దిగంతముల మారుమ్రోగుచున్నదా? మీరనగా గొప్పవారు గనుక సంగీతము పాడువారి కచేరిలో గూర్చుండి రసాభాసము చేయగలరు. మేము మీ నాటకములో నేమి చేయగలము. మీ నాటక

ములో మే మల్లరిచేసినచో నలుగురు మమ్మే నిందింతురు. మీరు మాసభలో నుండి లేచిపోయినచో రక్తికట్టుచున్న మా సభయే పాడైపోవును. అరటియాకు మీద ముల్లుపడినను అరటియాకునకే నష్టము ముల్లుమీద అరటియాకుపడినను అరటియాకునకే నష్టము.

సారథి-"వాసంతీ! నేను కటి కోతిముండకొడుకను. సభలో కూర్చుండుట నాచేతగాదు. నా మనోగ్రహమునకు సౌఖ్యము లేదు నే నాగమ్యకొఱకి. అంతసేపైనను నీ మాటయందలి గౌరవముచేత కూర్చున్నాను నేను కూర్చున్నా నని మాటేగాని సభలో నున్న దిక్కుమాలినవాండ్ర కన్నులన్నియు నామీదనే యున్నవి. అహల్యతో జారత్వము చేయని సహస్రాక్షుడ నయినాను.

వాసంతి-"అహల్యతో జేయనక్కరలేదు. వేశ్యలతో జాలమందితో" అని వాసంతి నాలుక కొరుకుకొనెను. శిరీషు కూతురంక దిరిగి కన్ను లెఱ్ఱజేసెను. దానితో వాసంతికి గోపము పోయెను.

వాసంతి-అదికాదు ఆర్థీ! సభ చక్కగా రక్తిగట్టుచున్నది. నీవు లేచి పోవుటతోడనే జనమందరు గుసగుసలు మొదలుపెట్టిరి.

సారథి-అందుకనియే నేను వెలిపోయితిని. శిరీషుగారూ! నాకున్నంత నీతి యీ లోకమునకు లేదు. నేను వట్టి భ్రష్టుడను. నాకు తెలియును. కాని నేను చాల నీతిమంతుడను, మీ కొక కథ చెప్పెదను వినుడు. ఒక రాజుగారు కాశికిపోవలెనని యనుకొనెనట. తిరిగి వచ్చువరకు ఆరునెలలు పట్టును. ఆయన భార్య కొంచెము కాముకి. ఆయనకు తెలియును తాను నగరములో లేనప్పుడామె శీలమును రక్షించుటకు గొప్ప శీలవంతుడైన యంతఃపురరక్షకుని నేర్పాటుచేసి పోవలెనని యనుకొన్నాడు. ఆరాజున కెవ్వరు నచ్చలేదు. ఇట్లుండగా మంత్రికొడుకు చిక్కిలిగాడు. అతడు మహావారకాంతాలోలుడు. ఆమంత్రి కొడు కొకనాడు వీధియొక్క వైపున నిద్దరు వారకాంతలు నడచుచుండగా వారి బుజాలమీద రెండు చేతులు వైచిపోవుచుండెనట. రాజుగారు మేడమీదనుంచి చూచుచున్నారు. ఆ మంత్రి కొడుకునకు వారకాంత లిద్దరు నాకు మడుపు లందిచ్చుచున్నారు అతడు నిచ్చిన యాకు మడుపులను గుడిచేతితోడనే స్వీకరించుచున్నారు. రాజు వానిని జూచి వానిని నీతిమంతునిగా గ్రహించినాడు. అతని అంతఃపుర రక్షకునిగా నేర్పరచి తాను కాశికి వెడలిపోయెను. మంత్రి తనకిది యేదో నెత్తిమీదకి వచ్చెననుకొనెను. మంత్రికొడు కందగాడు. వారకాంతాలోలుడనుట రాణికి గోర్కె యతిశయించెను. ఆమె యతనిని గోరెను. అతడు తాను నపుంసకుడనని చెప్పెనట. ఆమె విశ్వసించ లేదు. అతడు యోగి. తాను తృతీయాప్రకృతిగా రాణికి ఋజువు చేసెను. అరు

నెలలకు రాజు తిరిగి వచ్చెను. తరువాత కొన్నాళ్ళకు రాజును రాణియు నేకాంతముగ నుండగా మంత్రి తో నానాడు కొలువునకు రావని వార్తపెట్టెను. తన కుమారునకు కుమారుడు కలిగెనని నాకు బాలింతరాలయని హేతువుగా. ఈమాట విని రాణి పకాలున నవ్వె మంత్రిగారి కొడుకునకు కొడుకా యని హేళనము జేసెనట. రాజునకు ననుమానము కలిగెను. వెంటనే మంత్రికొడుకును కొలువులోనికి రమ్మని యాజ్ఞనంపెను. పీటమీద కూర్చున్న మంత్రికొడుకు లేచి రాజులవి వచ్చెను మంత్రికొడుకుతో నోరు తెరవకుమని చెప్పిపంపించెను. మంత్రి కొడుకును జూచినంతనే రాజు "నీ వేమంటివి" యనెను. మంత్రికొడుకు నేమియు లేదంటు నని చెప్పెను రాజతనిని వదలిపొమ్మనెను. రాణిని బరిత్యజించెను. ఇది కథ యనుకొందు. కాశీమజిలీలలో నుండవచ్చును. కథాతాత్పర్యమును జూతము. నీతిమంతునకు నీతిరహితునకు భేదమిది. జారుడు కావచ్చును. వార కాంతాలోలుడు కావచ్చును. వాని చారిత్ర్యము విమర్శకలదు. సంఘములో నీతిమంతుడుగా గన్పించవచ్చును. వానివగుపలు లేని చాటుమాటములు చేయవచ్చును. ఒకడు తన ధనమును విచ్చలవిడిగా ఖర్చు పెట్టవచ్చును. పరుల సొమ్ము గుడ్డిగవ్వ ముట్టుకొనడు. మరియొకడు మిక్కిలి జాగ్రత్త కలవాడు. వియ్యపుగింజ చిమలను దొల్లించుకొని పోనీయడు. వానికిని ఖజానా పెట్టి తాళము చెవి యిమ్ము. లోపలనంతయు కుంభకోణమే. లోకమునకును వానికిని నీతిలోనీ భేదమున్నది. నేను చెడిపోయిన వారిని లేవదీసికొని వత్తును. భ్రష్టురాలిని స్వీకరింతును. కుస్త్రీ వంక గన్నెత్తి చూడను. స్నేహితునివలె భోజనమునకు బోయి గృహిణి వడ్డించుచుండగా నామె వంక దేఱి పారజూచు వాడను గాను. ఈ సంఘము నన్ను దురాత్ముడని యనుచున్నది. మన దేశము గనుక సరిపోయినది కాని పాశ్చాత్య దేశములైనచో నన్ను తరిమి పట్టుకొని వేటాడి తలబెట్టెడివారు. ఆ దేశములలోని సామాన్య ప్రజ యంత మూఢులు కారు మన దేశీయులు. కోట్ల కొలది సంవత్సరముల నాగరికతగల దేశము గనుక నేను బ్రతికిపోయితిని. కాని యదార్థమిట్లున్నది నేనచట కూర్చున్నంత సేపు నాయెడల దబ్బను జెట్టులను బ్రాకెను. వారంతి నన్ను సభకు రమ్మని పిలువక మునుపు రెండు మూడు నెలల క్రింద నాతో సంగతి జెప్పినచో నేను సభకు బోయి కూర్చుండుట యాలవాటు జేసికొనెడివాడను. హఠాత్తుగా వచ్చి 'ఎల్లుండి నాపాటకచేరి యున్నది. నీవు రాకతప్పదు రాకపోయితివా నేనుపవాసము చేసెదను. ప్రాయోపవేశము చేసెదను. అగ్నిస్తంభన జేసెదను జలస్తంభన జేసెద"నని మొదలుపెట్టినది. రాకదత్తునా. రాకపోయినచో నొకచావు. వచ్చినచో నిట్టిచావు.

వాసంతి- నేను నీవన్నమాట లేమియు వినలేదు. రమ్మని పిలిచితినంతే. నీ వగా పెద్ద నటకుడవు గనుక రసభావము లొప్పింతువు.

సారధి- నేనే యేమి మొన్న మోహినీ వేషము వేసి నీవుకూడ రసభావము లొప్పించితివనియే యూరంతయు జెప్పుకొనుచున్నది.

శిరీషు- నిజమే నండి సారధిగారు! మా యమ్మాయి యూర్జున నెంతబాగుగా నభినయించినది, దీని కభినయము తెలియునని నాకు తెలియదు. నాయకులై మీరు శృంగారరసమెంత పోషించిరో నాయికయై యామె యంత పోషించెను- ఆ నాటకము చూచనివానిజన్మ మెందులకు. జన్మయెత్తియు నెత్తనట్లే-

సారధి పెదవి విరచి 'నా జన్మ మెందుకు' అనెను- వాసంతి యతనిని చేతితో నొక త్రోపుత్రోసి లోనికి వెడలిపోయెను. శిరీషు నవ్వెను- సారధి మొగములో దుఃఖము దైన్యము కోపము కించి దుల్లాసము కనిపించెను.

మానవులలో గొందఱు మనోజీవులు. వారు సహజముగా నుద్వేగ ప్రకృతులై యుందురు. లోకములోని సర్వకళలు తద్వ్యక్తికృతుల ప్రతిభావిశేషము చేతనే భాసించును. మనోజీవి కాక యుద్వేగ ప్రకృతి కానివాడు కళలలో ప్రవేశించినను వాని కళాసృష్టి సామాన్యముగా నుండును. సామాన్యములైన భావములనే వాడు రమ్యముగా జెప్పిన జెప్పవచ్చును. శిల్పియైనచో సామాన్య భంగిమలలో నొక మాధుర్యము నొక లాలిత్యము దానిలో నొక నైగనిగ్యము దేవచ్చును. గాయకుడైనచో క్రొత్త స్వరకల్పన చేయలేడు. భావము స్వర్గపదము నందునట్లు స్వరకల్పన చేయలేడు. శాస్త్రముచేత నేర్చికొనిన సామాన్యవిద్య మధురముగా బదిమందికి హాయిగొలుపునట్లు పాడగలడు. ఇట్టి సామాన్య నటకులే జనులయందఱి చేత ప్రశంసింపబడును. మానవుని ప్రకృతియు రెండు విధములుగా నుండును. ఒకని మనస్సు నిత్యము లోకాభిముఖముగా నింద్రియాభిముఖముగా నుండును మరియొకని మనస్సంతఃకరణముతో గూడుకొని యుండును. ఎవని మనస్సంతఃకరణముతో గూడియుండునో వాని నాట్యమును వాని శిల్పమును లోకోత్తర పదములందు విహరించుచుండును. వాని శిల్ప మర్మము సామాన్యుల కందదు. కాని యా విద్యయం దెదో తమ కందరానిది జనులు తమ మనస్సుచేతి గాక యంతఃకరణములచేతినే స్పృశించుచుందురు. కాని యంతఃకరణ విస్పష్టత లేనివారు దానియందు విష్టులై యుండెరు. వారి యాత్మ యీ మహాశిల్పిని శిల్పిగా జెప్పుచుండును. వారు సామాన్య కళాకారుని మెచ్చుకొనుచుందురు.

పాతూక్య విద్యావంశుని గౌరవింతురు. సన్మానింతురు. వాని పేనుకులమీఁద నెక్కింతురు. గండపెండెరములు వేయుదురు. అంతరాంతరములో నీ మహా శిల్పిని బూజించుచుండు.

అట్టి మహాశిల్పి మనోజీవి. వాఁడు శరీరముతో బ్రతుకుచున్నను మనసులోనే నివసించుచుండును. మనసునకు సూక్ష్మాతి సూక్ష్మమైన బాధాజనకమైన హేతువు కలిగినపుడు వాఁడు దినమునిమెల్ల దిగులుపడి పోవుచుండును. అతఁ డెందుకు దిగులుపడుచున్నాఁడో వానికే తెలియదు. ఒక్కొకపుడతఁడు విచారించుకొనుచుండును. ఎవరితోనైనో యొకతూలుమాటయో యసభ్యపుమాటయో యట్టిమాట తాననఁగూడదని యనుకొన్నమాటయో మాటాడును దానివలన వచ్చిన నష్ట మేమియు లేదు. అవతలివానికి దాని యర్థమే తెలియదు. వాఁడు దానికొఱ కేమియు ననుకొనఁడు ఐన నీ మనోజీవి కష్టపడుచు నేయుండును. ఇంకముందు నిట్టిమాట రానీయఁగూడదు. జాగ్రత్తగా నుండవలయునని నిశ్చయించుకొనును. ఈ మనోజీవికి దిగులుపడుటకు నదియుంతి పరమసూక్ష్మమైన విషయమెల్ల చాలునో వాఁడొక సమయమునందు మిక్కిలి యుత్సాహవంతుఁ డగుట కట్టి పరమాల్ప విషయ వేళమే చాలును. సారథి యా దినమంతియు పర మోత్సాహోపేతుఁడై యుండెను. అతని యా యుత్సాహమునకు గారణ మేమో తెలియదు. అతఁడు విచారింప నారంభించెను. వాసంతికి గోపము తీఱినదనియా కాదు. వాసంతి కోపము తానంతి లెక్కసేయఁడు. ఆమె యందు దనకు జాలి కలదు. ఈ నడుము కలిగిన నూతన పరిస్థితులచేత నా జాలి కొంచె మధికమైనది. వాసంతి తిమ్మ బుజముమీద వ్రాసినదనియా! ఆమె యట్లు చేయుట చిన్న ప్పటినుండి యలవాటే! ఈ నడుము గలిగిన నూత్న భావముల సంయోగముచేత నా వ్రాయుటలో నొక కిలికించితము కలిగినదా. సారథి దాని ననుభవింప నే లేదు. ఈ నూతన పరిస్థితులతని మనస్సునకు గించిత్తేశకారులుగా నుండెను కాని యుల్లాసహేతువులుగా లేవు సారథి కొక యూహ కలిగెను. తన మనస్సునకు బరిచితము కానిది, యంతఃకరణ నిష్ఠమైనది యొకానొక నిగూఢవాంఛ యా పరిస్థితులచేత సముద్బుద్ధమై తనకు దెలియకుండ నుల్లాస హేతువగు చున్నదా యేమి? సారథి యా భావమును దెలియ లేదు. అతఁడు మిక్కిలి యుల్లాసముగా దిన ముండనని తెలిసికొనెను.

శిల్పియైన వానికట్టి యుల్లాస సమయములు తన కళా సృష్టి కభిముఖము లగా నడచును. మూఁడు దినములక్రింద విడిచిపెట్టిన గంగా ప్రతాప నాటకమును సారథి మరల స్వీకరించెను. మరల దొలుతటి నాటకమును జదివెను. కరుణారస దృష్టితో జూచినచో దొలుతటి నాటకము మిక్కిలి నిరాకరణయోగ్యముగా

లేదు. తాను రౌద్రరసదృష్టితో జూచి నాటక మేమియు బాగుండలేదనుకొనెను, కవి కరుణారస మెంతవరకు బోషించెనని విచారించగా దానియందు కవి సిద్ధహస్తుడు కాడు. సిద్ధహస్తుడైన కవి వేయిమందిలో నొకడుండును. కాని కొద్దిలో నతడు బాగుగనే వ్రాసెను. తాను మార్చి వ్రాసిన నాటకపు గాగితములన్నియు చింపివేసెను మరల వ్రాయ నారంభించెను. ముద్రిత నాటకములోని బహు వాక్యములను మార్చివేసెను. ఒక్కొక్క మాట యున్నచో గడుపు తరుగుకొని పోవలయును మెత్తని పలుకుబడిచేత సుమనస్కులు సంతోషింతురు కాని గాఢప్రవృత్తులు కవులగు వారికి గావలసినవి మెత్తని మాటలు కావు లోకము నందు ప్రతిదిన్ని వేళల హృదయవిదారకములైన మాటలు మాటాడుదురు. వానిని గ్రహించికొని వచ్చి రసదృష్టిగల కవి తన కావ్యములందు తద్రసోదయ సమయమున ప్రయోగించవలయును. ఆ లోకమునందలి రసభావ సమన్వితములైన మాటలను కవి తన ప్రతిభచేత సుక్షిప్త నిత్యముచేత సంధానముచేసి తదనుకూలాలంకారకల్పనముచేసి లోకోత్తరములైన భావములతో వీనిని కలిపి ప్రయోగించినచో పాఠకుని హృదయమునందు రససిద్ధి కలుగును. సారధి కవి కాడు. నటకుడు. అతని మనస్సులో నెన్నియో యూహలు కలవు. అతనియందు వాగ్దేవి ప్రసన్నురాలు కాలేదు. వాగ్దేవి ప్రసన్నయైన కవి యనుకొనువాడు సారధి కాయూరియు లేడు. అవధాని ప్రసక్తియే లేదు. రంగనాథము మెత్తని మాటలతో గొన్ని మధుర మధుర సన్నివేశములందు బాగుగనే యున్నదనుటకు వ్రాయ నేర్చినవాడు. శృంగారరసము వ్రాయుట కష్టమైనచో కరుణారసము వ్రాయుట యంతకంటె కష్టమైనది. కడుపు తరుగుకొనిపోవుచున్నది. కడుపు రొమ్ములు వాయుచున్నది. గుండె కొలుకుచున్నది. మొదలైన మాటలు వ్రాసినంతమాత్రమున కరుణరసోత్పాదనము కాదు. సన్నివేశ చాతుర్యములేని మాట దానియంతట నది రమ్యము కాదు. సన్నివేశము పలువిధములు. ఒకటి కథాగతమై యుండును. రెండు సన్నివేశగతమై యుండును. మూడు సందర్భమునుబట్టి వచ్చును. పూర్వాపరములం దున్నమాటలనుబట్టి యుండును. ఇదియంతయు మహాసాహిత్యవేత్తయైన మహాకవికే సాధ్యము. సారధికి మరియొక విషయము తెలియును. కవి రచన మందముగా నున్నను దానియందు తాను గుణాధానము చేయగలవాడనని. శబ్దమునందు లేనిశక్తిని తాను తన శరీరావయవ విన్యాసము చేత ముఖరేఖలచేత సాత్వికాభినయముచేత ప్రకాశింప జేయగలనని. అందుచేత సారధి నాటకమును మరల తిరుగ వ్రాయుట కారంభించెను. ఈసారి వ్రాయుట యంత తేలికగా ననిపించలేదు. తాను రౌద్రరస మనుకొన్నప్పుడు ముద్రిత గ్రంథములోని పంక్తులు యథేచ్ఛముగా మార్చివేసెను. ఇప్పుడు కష్టమయ్యెను.

స్థానము నాటకములలవ సామాజికు లనుభవించు మాధుర్య గుణములోననే యున్నది. నాటక మొక మధుర భ్రాంతి. మధుర భ్రాంతిలో మధుర మైన సంగీతము లేకుండుట యెట్లు? కొందఱు నాటకమంతయు బ్రసంగము. అనగా నొకరితో నొకరు మాట్లాడికొనుట. మనము మాట్లాడుకొనుచు పద్యములు పాడుదుమా సంగీతము పాడుదుమా యని వాదింతురు. మనము మాట్లాడికొనుచు వేషములు వేయుదుమా మనము రంగులు పూసికొని మాటాడుదుమా! గ్రాంథికముగా మాట్లాడుదుమా! ఉపమోత్ప్రేక్షలతో మాటాడుదుమా! ఇవి యన్నియు సామాజికుల యందు రసభావ కల్పనము చేయుటకైనట్టే పద్యమును సంగీతమును గూడ నగును. ఈ సూక్ష్మ విచారణ చేయనివారు పద్యములను ఖండించుకొన వచ్చును సంగీతమును నిరాదరించ వచ్చును సారథి వారిలోనివాడు కాడు.

మరి యొకప్పుడైనచో సారథి యయ్యర్థరాత్రమున నే పోయి వారివారి పఠనీయ భాగములు వారివారి కిచ్చి వచ్చెడివాడు అతని మనస్సులోని యుల్లాస రేఖకు విరామము కలుగలేదు. మఱియు కిరీటితోడి యా రెన్నాళ్ళు కలిసియుండుట యతని కానంద హేతువే యయ్యెను. కిరీటి కుఱ్ఱవాడైనను దండకము వచ్చినట్లు వ్రాసెను అతడు మాటలకొఱకు తడుముకొన్నను కొన్ని కొన్ని చోట్ల రసవంతముగా వ్రాసెను. అతి డెక్కువ చదువుకొన్నవాడు కాదు అందు చేత ప్రతిదానికి బూర్వ గ్రంథములలోని మాటలు సమాసములు తీసికొని వచ్చి యెక్కించడు. తాను హృదయముతో ననుభవించి తనకెప్పుడు కప్పుడు నోటికి వచ్చిన మాటలు చెప్పెను. అందుచేత నాటకము చాలభాగము సారథికి నచ్చెను

రేపు ప్రొద్దున తొలుత వాసంతి యొక్క పఠనీయ భాగము తానే తీసికొనిపోయి యిచ్చును. ఆమెకు చదివి వినిపించును. ఈమాట యిట్లనవలయును ఈమాట యిట్లనవలయునని చెప్పును ఆమెకు నాల్గు పద్యము లున్నవి. ఆ పద్యములనే రాగముల మీద బాడునో యే రాగములమీద బాడినచో బాగుండునో యామె చేత బాడించి వినును. సారథికి నది యొక సరదా. అది యొక యానందము. అది యొక యుత్సాహము. అతనికి సంగీత శాస్త్రము రాదు. తెలియదు, రాగములు కొన్ని తెలియును. గాలిగా బాడుచుండగా, తెలియుటయే. ఆసంగతి వచ్చినది గనుక బేహాగు. ఈ సంగతి వచ్చినది గనుక బేగడ. ఇటువంటి గుర్తులు. అంతే.

కావి యౌవని హృదయములో బరమేశ్వరుడు మేల్కొనియుండునో యౌవ నిహృదయములో రసభావములు ప్రబుద్ధమై యుండునో యౌవని ప్రకృతిలో రమ్యవస్తు దర్శనము చేత మధురశబ్ద శ్రవణము చేత, గలవరము కలుగునో వాని

కిది యాయావిద్యల రహస్యములు తెలియకుండకయే ఆవిద్యలలోని యుచ్ఛ స్థితి దశాసమయముల యందు దదభిజ్ఞ కలుగుచుండును. హృషీకేశము వద్ద లేదా లక్ష్మణఝూలావద్ద నీవు పోయి నిలుచుండుము. గంగానది యెగువ కొండలలో నుండి మహావేగముగా ప్రవహించుచున్నది. అన్నియు కొండలు వనములు. శివ జటాజూటము నుండి పడబోసుకొనుచున్న దివ్యభాగీరథి అర్ధరాత్రము యాత్రికు లెవ్వగును లేక నీకేమనిపించును ఎట్లుండును గుండెపటికినాడు బావుగాయని పడవచ్చును కాని యా భావముయొక్క స్వరూపమేమి. నీ మనస్సున కం దని యొకానొక భావము నిన్ను తాకించుచున్నది ఆ భావము దియని నీవు చెప్పలేవు. నీవు తెలిసికొనలేవు. కాని యా భావము ననుభవించుచున్నావు. భావసహితుడు కాని నాదు భువపడి గోడించును భావసహితుడు దిగ్భ్రాంతుడగును, ఒక యానందతత్వమును దాననుభవించును. అది పరమేశ్వరభావము కావచ్చును. అను కొనినను తప్పలేదు. ఇదయిట్టిదని నిర్ణయింపరానిది తనయాత్మకు తెలిసినది యొక మహాభావము నతడు పొందును. పరిపాకము పొందిన జీవునికీ యనుభూతి కలుగు. అట్లే యొక మహావిద్యలోని సంప్రదాయములు శాస్త్రపు మెలకువలు తెలియక పోయినను దద్విద్యా మహావిశాసమావిర్భావము కలిగిన పురుషు భావసహితుడై యానందముని తెలిసికొనును. దానియందు రమించును. అట్లే సారథియు నుత్తమ సంగీతమును తెలిసికొనలేడు. అనుభవించగలడు. అతనికి నాసంతి యొక్క కంఠమాధుర్యము. నాని యొడారి జీవితములోని యొక పచ్చని పట్టు.

సారథివద్ద నొకగడియారమున్నది. అది యతని తాతగారిది అది మాంధాతనాటిది దానికి వారము పదియంగుళములకు తక్కువయుండదు జేబుగడియారము దానికి పంచికొలుసున్నది. ఆగొలుసు చేయించి డెబ్బదియేండ్లు కావచ్చును కంపెనివారు రాజ్యము చేయుచుండగా గొన్నగడియారము. దాని యాయుర్దాయము డెబ్బదియేండ్లకు తక్కువయుండదు. అది సారథి చేతికివచ్చి ముప్పదియైదేండ్లకు తక్కువ గాలేదు. దానినెప్పుడు మరమ్మతు చేయించలేదు. తూకదీసి నూనెపూత బెట్టించలేదు. అది కొన్ని నెలలు వరుసముగ ద్రిప్పబడెను గూడవలెను ఎప్పుడో సారథికి నెన్నిగంటలైనవో తెలియవలెను దండిలో గంటలు ముల్లె దానికి గంటలను బెట్టి యాడునట్లు త్రిప్పను ఒకనాడాడించినదవగా ప్రతిదినము గాని ద్రిప్పదుండును ఇట్లు కొన్ని నెలలది పనిచేయుచుండును. ఇది పనిచేయుచున్న నెలల. సారథి విప్పపుల్ల వలిగించి యెన్నిగంటలైనదో చూచెను. మూడుగంటలయ్యెను. తను నిన్న రాత్రి చేసిన భోజనము. ప్రొద్దున కాఫీ హోటలులోంది న్నాడు. నాల్గు నాళ్లనుండి తోటలో ప్రదక్షిణము పెట్టలేదు. నిదురపోవుటయూ తోటలో

ద్రిక్కోటము పెటటగా యున్న విచారణ వచ్చినది. తోటయే గెలిచినది. సూర్యోదయమగు వఱకు, తోటయంతయు దిరిగినాడు. తీగలు పట్టినాడు. కొన్ని కొమ్మలు కత్తిరించినాడు. సూర్యోదయమైనంతనే స్నానముచేసి కలాబులు జాజులు మందారములు కోసి యాకు దొన్నెలలో బెట్టుకొని వాసంతి యింటికి బోయెను పూలు వాసంతికిచ్చెను అతడచట కూర్చుండగనే వాసంతి పూలు దండలు గ్రుచ్చి తలలో ధరించెను. శిరీషకుమారుఁడు ఫలహారము తెచ్చెను. సారథి యిట్లనెను. "నేను మొన్న రాత్రి చేసిన భోజనము నిన్న ప్రొద్దున నాలుగిడ్డెనలు మాత్రమే తింటిని. నేను పట్టుమని పాతికయో ముప్పదియో తినినచో నా పసివాని గుండె చెదరి పోవునేమో యని తినలేదు" అనెను. వాసంతి. 'యే పసివాఁడని యడుగగా 'మీ రెఱుగరులే. మన యూరిలో గిరీటుఁ డను కవి యున్నాఁడు. మైత్రేయలేఖను చదువుచున్నాఁడు. అతని చేత నొక ప్రతాప నాటకమును వ్రాయించితిని. అతఁడు రెన్నాళ్ళు నా దగ్గఱనే యున్నాఁడు.' శిరీషు—"ఆ కవ్రవానిని నే నెఱుగుదును. నల్లగా గాకి కొక్కి వలె నుండును. నేఁడు చనిపోవునా రేపు చనిపోవునా యన్నట్లుండును. అతని యొడలిలో ప్రాణమే లేదు. జుట్టు ముడివేయును. జులపాలు కలవు. ముక్కుమీద గోప ముండును" అనెను. సారథియు "యతనిలో నొక మెఱుపున్నది, ఆ మెఱుపతని కనులలో గనిపించుచుండును నీవు చెప్పిన లక్షణము లన్నియు నున్నవి కాని వానిలోని ప్రధాన లక్షణమిది ఇది చెప్పనిచో నతని చెప్పినట్లు కాదనెను. వాసంతి "ఛీ! నీకును నాన్నగారికినిగల భేదమిది. నీ వాత్మను చూతువు. నాన్నగారు శరీరమును జూతును" అనెను. శిరీషునకు కోపము వచ్చెను. "నీవు నాకు గూతుర వైనందులకు ఒరులదగ్గఱనన్ను తెలివి తక్కువ వానిని చేయుము నీవును మీ సారథియు తెలివిగల వారు. నేను వట్టి దేబెను. సరిపోయినదా" యనెను. సారథి శిరీషుతో నిట్లనెను "ఏమి శిరీషా! శరీరమును జాగ్రతగా బరిశీలించుట మాత్రము తక్కువ విషయమా! నాకా సంగతి తెలియదు. ఇన్నాళ్ళు నేను కిరీటు నెఱుఁగుదును. నీవు చేసిన వర్ణన నేను చేయలేను. నాకు శరీరసౌభాగ్యమే తెలిసినచో విశాలాక్షితో సంబంధము పెట్టుకొందునా? అదియొక కోతి. నాకు తెలిసినది దాని యాత్మయే. అది చాల మంచిది. దానికి జాలి యెక్కువ. దాని బసలో నలుగురైదుగురు నెలలతరబడి నూటికే తినిపోవుచుందురు. జీతములు కట్టుటకు డబ్బు తీసికొని పోవుచుందురు. నేను దాని మంచితనమునే చూతును. దాని శరీరమును జూడను. దానిని జూచి నన్ను జూచి జనులు నేనొక క్రిమి యనుకొందురు. నేను క్రిమిని కాక పోలేదు. ఏమి

శరీరము గాఱ్ఱయినది. నేను బ్రదికినచో మఱియొక పదియేండ్లు బ్రదికెదను. కాదా మఱియొక పదేండ్లు. స్వర్గానికి నిచ్చెనలు కట్టుచున్నా" యనెను. వాసంతి "అధీ! నీవు స్వర్గానికి నిచ్చెనలు కట్టుటలేదు వైకుంఠమునకు మెట్లు కట్టుచున్నావు. ఇప్పుడు చెప్పుచున్నాను. నేను నిన్నెఱుగనిచో నా సంగీతము చట్టి బ్రోతగా నుండెడిది. నాకు భావమువగా నేమియో తెలియజెప్పినది నీవు రసానందమునను భవించుట నేర్పినది నీవు. తన్మయత్వము పొందుట నాకు నీ పరిచయమువలన కలిగినది. అధీ! నేను మోహినీ వేషము వేసితిని. రంగముమీద వచ్చి నీవు యెదురుగా నిలుచుంటివి నీ యభినయము పరుసవేది. నేనుగూడ బంగారమునై పోయితిని. ఆనాడు రంగముమీద నిలుచుంటినే కాని నా యొడలు నాకు దెలియదు. నేనాడు గొప్పగా నభినయించితినని పలుమంది గొప్పగా జెప్పిరి. నాకేమియు దెలియదు మహానుభావుడవైన నిన్ను జూచుచుంటిని గాబోలు. చూడగలయునట్లు నిలుమండగలయునట్లు చేయగలయున్నది. నీ యనంతమైన నటనా కౌశల్యముతో గూడిన యాత్మ నాలో బ్రవేశించి యట్లు చేయించినది కాబోలు. అధీ! నీవు నన్ను వదలిపెట్టిపోకుము నాకు భగవంతుడిచ్చిన విద్య సంగీతము. నీ యభినయము నాకు రాదు నేను తరించవలయునన గానీతోడి సంపర్కముచేత నీయాత్మలోనున్న పారవశ్యలక్షణము నాలో జొచ్చి యది నా సంగీతవిద్యయందు బ్రసరించవలయును. నా కది తారకము. నన్ను వదలి పెట్టిపోకుము" అనెను. అంత ముగ్గురును గన్నీళ్లతో నైదునిమేషములపాటు కూర్చుండిరి



శిరీష కుమారునకు, దనకూతురు పెండ్లిగూడ గూడదు. పెండ్లియాడినచో నామె సంగీతము మూలబడిపోవును. పెండ్లియైనంతనే పిల్లలు పుట్టుదురు. ఇక నా తాపత్రయముతోనే సరిపోవును. ఒకవేళ నావచ్చిన భర్త సంగీతము నందిష్టములేనివాడైనచో నామె నేర్చిన విద్యకూడ మఱచిపోవును. అట్లయినచో దేశమునకు నష్టము. సంసారములో బడినచో నాత్మవికాసము కలుగదు. కళల ద్వారా మానవులకు నాత్మవికాసము కలుగవలయును. అందఱును యోగులు కారు. యోగమార్గముకంటె కళామార్గము రమణీయము సుకుమారము. అందఱకును కళలలో నేర్పు కలుగదు. పరమేశ్వరానుగ్రహము కలిగినచోట్లనే కవిత్వమో సంగీతమో చిత్రలేఖనమో శిల్పమో చేతనగును. అట్టి శిల్పులు లోకయాత్ర నవలంబించినచో వారి విద్యావ్యాసంగము చెడిపోవును. కామాదులల్పమైనవి. కామాదులను గెలువవలయును. నిగ్రహించవలయును. ఒక యధిక ప్రయోజ

జనము కొఱకు నొక యల్పమైన కష్టము ననుభవించుటలో నష్టములేదు. అది లోక కల్యాణకారి. అట్టివారే లోకారాధ్యులగుదురు.

మఱియు శిరీష కుమారునకు కొన్ని యూహాలు కలవు. ఒక కళను బోషించుటకు నల్పములైన దోషములు చేసినను దప్పులేదు. సారథి మహానటుడు. అతడు వివాహముచేసి కొన్నచో నతని విద్య యింత ప్రకాశించెడిది కాదు. భార్యయు, పిల్లలు సంసారము నింటిలో నడిలేదిదేదని పోరాటము. ఆ రోజున నొక వేషము వేయవలయును. ఆ రాత్రి పిల్లవానికి జబ్బుచేసినది. నాటకములో వేషము వేయుటకు వీలులేదు. నాటకశాలలో జనమంతయు గ్రిక్కిరిసి యుండెను. కాదని వల్లి వేషము వేసినచో నతని మనస్సంతయు బిడ్డమీదనే యుండును. అభినయించనే లేడు. అందుచేత నటుడంతటివానికిఁ బెండ్లాము పిల్లలుండఁగూడదు. వాని జీవితము సంఘసుఖము కొఱకు సమర్పణ సేయవలయును. ఎవడు సంఘోపకారియో వానికి సంసారముండఁగూడదు. వాడు సన్యాసి కాని సన్యాసిగా నుండవలయును. ఈ సంగతియే గ్రీసుదేశపు వేదాంతియైన ప్లేటో చెప్పెను. శిరీషుడింగ్లీషు గ్రంథములను బాగుగా జదివెను. అట్టి శిల్పి యవినీతిగాఁ బ్రవర్తించినను దప్పులేదు సంఘము దాని నవినీతి యను కొనును గాని యథార్థమునకది యవినీతి కాదు. అందుకనియే శిరీషునకు సారథి స్నేహితుడు. మర్యాదస్థులు సారథితో స్నేహము చేయరు. శిరీషుడు సారథి స్నేహితుడు.

శిరీషు యొక్క శిల్పమును గూర్చిన యభిప్రాయములివి. ఈ సిద్ధాంతముల ప్రకారమతడు వాసంతిని బెంచెను. వాసంతి జీవితమంతయు నీ సిద్ధాంతముల ప్రకారము తీర్చి దిద్దవలయునని యతని యభిప్రాయము. ఈ విషయములు వాసంతితో నిత్యమును ముచ్చటించు చుండును. ఆమె యతని భావముల నంగీకరించినట్లే కనిపించును. ఆమె మనస్సు నెవడు చూచెను.

ఆ నాడు సారథితో వాసంతి యట్లుమాటాడినది. ఆ మాటలు శిరీషునకుఁ బరమ ప్రియములైనవి. సారథి గొప్ప శిల్పియని తనకుఁ దెలియును. అతని పరిచయముతోఁ దనకూతురు సంగీత విద్యలో నట్టి తాదాత్మ్యము పొందగల్గునేని యా తాదాత్మ్య సంధానమునకు సారథి సహాయ భూతుడగునేని శిరీషున కంతకంటెఁ గావలసినదేమున్నది అది పరమాభీష్టితము.

శిరీషు తనకూతు రెచ్చటికి వల్లినచో నచ్చటికి వెళ్లును. శిరీషు లేకుండ వాసంతి యెచ్చటకుఁబోదు. తండ్రి కూతుల్లిద్దఱు కలసి పోదురు. తాను సర్వకాల సర్వావస్థల యందు నతడు వాసంతికి రక్షగా నుండును. తనకు వాసంతి యెట్టిదో సారథికిని నట్టిదే. సారథి వాసంతిని బిడ్డగనేఁ జూచును. సారథి యొక్క నీతి శిరీషునకుఁ దెలియును. మఱియు శిరీషునకు వాసంతి యొక్క

శీలము కూడఁ దెలియును. వాసంతి యందు స్త్రీ పురుష భావము వికసించ కుండ దానికిఁ బ్రాధాన్యము లేకుండ శిరీషు వాసంతిని పెంచెను. ఆమెకు స్త్రీ పురుష సంబంధమైన కామవ్యవహారము తెలియదు. తెలియుటకును వీలు లేదు. అంత తెలియనిదైనచో సారధి రుక్మాంగద వేషమును ధరించి లోకోత్తరముగా నభినయించినాడని యెట్లు తెలిసికొనఁ గలుగును. శృంగారము భావగతమైన అది తెలియకుండ నెవరికినుండదు. అది తెలిసిన నష్టము లేదు. సారధిని దాను విశ్వసించును. సారధియును విశ్వాస్యుడు. వాసంతి యంతకంటె విశ్వాస్యురాలు. ఐనను శిరీషు సారధి దగ్గర వాసంతి యున్నప్పుడు కూడ దానుకూడ నంటిపెట్టికొనియే యుండును. శిరీషుకు వేరే పనిలేదు. అతనికి బాతిక యెకరముల మాగాణి కలదు. రైతు నొత్తిడికల గ్రామములో నున్నది. పాతికపుట్లు కనులు మూసికొని రైతులు వాకిటిలోఁ దోసిపోవుదురు. అతనికి రెండు మూడింట్లున్నవి. వానిమీద వంద రూకల బాడుగ వచ్చును. అతడొక పిల్లజమీందారు. ఇంటిలో వంటచేసెడి నామె వేరేకలదు. కూఁతును దెల్లవాఱకనే నాలుగింటికే లేపును. సూర్యోదయ మగునఱకు నభ్యాసము చేయించును ఫలహారము లైనతరువాత దాను సరదాగా బదిగంటలదాఁక నామెచేత బాడించుకొనును. రాత్రి భోజనమైన తరువాతఁ బది పదకొండు గంటలవరకు నామెచేతఁ బాడించును. అతని కా సంగీతము వినుటలో విసుగులేదు. తన నీడ తా నద్దములోఁ జూచుకొను స్వమోహితున కెంత విసుగులేదో దుహితృగానమును విను నాతనికంత విసుగులేదు. సారధి తోడిపరిచయమువలన వాసంతియొక్క యాత్మ క్రమముగా వికసించుచున్న దని శిరీషు నిశ్చయించెను. అట్లు కానిచో రుక్మాంగద నాటకవేళ వాసంతి తనకుఁ దెలియకుండ నంత లోకోత్తరమైన సాత్త్విక భావోదయమును బ్రదర్శించుట జరుగదు. ఆమె మనస్సులో వినూతనానుభూతి యొకడు మధురావర్తములు పొందుచుండెను. ఒక్కొక్క జీవికిఁ దాదృశమధురానుభూతివిశేష మొక్కొక్క వ్యక్తి సంపర్కముచేతఁ గలుగును. వాసంతికి సారధియొక్క సాహచర్యమునందే తద్విశేషానుభూతి కలుగుట దృశ్యమానమగుచున్నది. అతని యాత్మకు వాసంతి యాత్మకు నేదియో పోలికగలదు. అతని సృష్టికి వాసంతి యొక్క సృష్టికి సామాన్యభావము లేవో కలవు. ఈ సంగతి శిరీషునకుఁ బూర్వ మెప్పుడో తెలియును. వాసంతియొక్క యాత్మవికాసము సారధిద్వారానే జరుగవలయును. అందుకనియే చాలామంది స్నేహితులు సారధి నీ విషయములో మందలించినను సంగీతవిద్వాంసురాలు నాటకములలో వేషములు వేయుట మరియాద నష్టమనినను సారధి యవినీతిమంతుడని చెప్పినను శిరీషు లెక్కజేయక

లోక మవినీతి యనుకొనునది నీతి నీతి యనుకొనునది యవినీతి. పైకి ధర్మముల వలె గనుపించునవి విచారించినచో నధర్మములుగా భాసించును. పైక ధర్మములు లోన ధర్మములు కావచ్చునని తిక్కన్నగారు భారతములో వ్రాసిరి. నేను వాసంతి కటివాడనో నీవు పట్టివాడవే. ఈనాటినుంచి వాసంతియొక్క యాత్మగరక్షణము చేయువాడను నేను కాదు నీవు. ఆమెలో స్వర్గజ్యోతి వెలిగించగలిగినవాడవు నీవు. ఆమె యాత్మను, దీర్చి దిద్దగలిగిన వాడవు నీవు. నీకది తోటయైనను నీకది ఇల్లు కాదు. నీవువచ్చి నాయింటిలో నుండుము. భోజనాది సదుపాయములకు నీకిక్కడ కొఱత యేమియు లేదుకదా! ఈ వేళకాని వేళలో భోజనములు నీకిప్పుడు కావున్నను మఱి పదేండ్లు పోయిన తరువాతనైన నీ శరీరమునకు మహావ్యాధి సమకూర్చును. పిండ పుష్టి కలవాడవుకనుక నిన్నాళ్ళు సాగినది. మఱికొన్నాళ్ళు సాగవచ్చును. నీ శరీరమును నీవు కాపాడుకొనవలయును. నీవు రోగివైనచో లోకమునకు నష్టము. నీ నాట్యముం జూచి యానందించువారు ఆనందలోకములయందు నిగృహీతులగుదురు. నీవువచ్చి నాయింటిలో నుండుము. నీ కిష్టము కాదని నాకీ యూరిలో మూడిండ్లున్నవి. రెండు పెద్దవి. యొకటి చిన్నది. ఆ చిన్నయింటిమీద నా కెక్కువ యద్దెవచ్చుటలేదు. నీ వా ఇంటిలో నుండుము. అట్లున్నచో యథేచ్ఛముగా నీయింటికి రావచ్చును. పోవచ్చును. ఎవరో తక్కువజాతివారు నివసించుచున్న యాసందులోఁ జుట్టు పట్ల కాపురములులేని తోటలోనికి వాసంతి నీకోస మొంటరిగావచ్చుట బాగుగానుండదు. నా బదులు నీవు వాసంతిని జూచుచుందువేని నే నప్పుడప్పుడు నా పల్లెటూరునకుఁ బోయి రావచ్చును. ఇరువది యేండ్లనుండి నా రైతులు నా కెకరమునకుఁ బుట్టెడే ఇచ్చుచున్నారు. ఎకరమునకుఁ బదునారు పదునేడు బస్తాలు రాలుచున్నవట. నే నెక్కువిమ్మన్నచోఁ భూములకు మరమ్మతులేదు. పదునొండు బస్తాలకంటె నెక్కువ పండుటలేదని చెప్పుచున్నారు. నే నా యూరు పోయినప్పుడెల్ల వాసంతిని వెంటఁదీసికొని పోవలయును. పల్లెయందటఁ బదిదినము లుంటినా యామె సంగీతము చెడిపోవును. ఈ సంగీతము నాట్యమువంటిది కాదు. కవిత్వమువంటిది కాదు. దీనికి దినదినాభ్యాసము కావలయు. నీవు వాసంతిని దండ్రివలెఁ జూతువు. నీవు నాయింటిలో వచ్చియున్నచో నేను దిగులులేకుండ కొన్ని నాపనులు చూచుకొనవచ్చును."

అనగా సారథి ఇట్లనెను. "ఓయి శిరీషా! నీకు నాకుఁ జాల భేదమున్నది. నేను పెద్దనటకుడనే యనుకొందము. నా శిల్పము క్రియాదశ పర్యవసాయి. నాకంటె నీవెక్కువ శిల్పివి. నీ జీవితమంతయు నొకశిల్పము. నీవు శిల్పమున బ్రదుకుదువు. కళ నాచరణలోఁ బెట్టుదువు. కళను జీవింతువు. నేను శిల్పమును

ప్రదర్శింపజేసినవాఁడను. ఇది నీకు నాకు భేదము. పూర్వము మనదేశములలో నాటక-
ములు వేయుట యొకకులవృత్తి. ఈ ఇంగ్లీషువారు వచ్చినతరువాత కులవృత్తులు
నశించుటచేత నెవఁడుపడిన వాఁడు దానికేపనివచ్చిన వృత్తి చేసికొనవలయునది.
మరియు నేఁడు యొకట్లు ప్రబుకవలసి వచ్చెను. నే నందుచేత నటకుఁడనైనాను.
వివాహనేకాని నేను సంసారిని కాను. నేను సన్యాసిని. నాయందు ధర్మ
సాంకర్యమున్నది నాయాత్మకిష్టమైనది సన్యాసము. నామనస్సు కిష్టమయినది
సంసారము. నా దేహమున కిష్టమైనది బైరాగితనము కొన్ని జంతువులు పెంప
బడవు. వానిని దీసికొనివచ్చి నీవు పెంచదలచినచో నవి చనిపోవును.
అట్లే కొన్ని యడవి మొక్కలు నీవు తెచ్చి దొడ్డిలోఁ బాదు
చేసి నీళ్లు పోయుచుండినను అవి నాలుదినములలో మాడిపోవును. నేనటువంటి
వాఁడను. నేను నీయింటిలో నుండును. కంటయ్యోనది. భోజనమునకు లెమ్మని నా
సంతతి నన్ను బాధించును. అట్టిమాట నేనెన్నఁడు నెఱుఁగను. నేను లేవను. నేను
భోజనము చేసినఁగాని నా సంతతి భోజనము చేయదు. మేమిద్దఱమును దినినఁగాని
మీవంటకూవిడ తినదు. నేను గవ్వాళ్లు నియమితవేళలలో భోజనము చేసి
తినుకొనుము. నేను మంచముఁబోదును అలవాటుకని యుపోషణమును జేసి
నచో మూఁడు మాసములు తెగఁగాలినవట మీపాలనుమీఁదఁ బాతికపుల్లైరావిమ్ము.
ఇంకొక పదిపుట్లు వచ్చి యేమిచేయుదువు నీకిదిచాలును. ఆపాటము కావులు
వేసెలు. పైపంట వారికి దినవిమ్ము. నీతతండ్రులకు స్త్రీసంతానము లేదు.
ఒక్కఁడే పురుషసంతానము నీకొక్కరుకయే కూతురు. నీవు మెకుఁ బెండ్లిచేయవు.
నీతరువాత నీయాస్తి నా సంతతి యనుభవించును. నా సంతతి తరువాత నెవరనుభవిం
తురు. కనుక నా సంతతి పెండ్లిచేయుము అనవ్వెసిభర్త నీపాతికయొకరములు నలు
బదియెకరములు చేయును నా సంతతి నీకెటువంటిదో నాకు నటువంటిదే యను
కొనుము ఏనను నేను నిజముగాఁ దండ్రినగుదునా, నేను నీతో వనగూడదు
కాని యొకమాట చెప్పెదను వినుము. తండ్రికూతులమధ్య స్త్రీపురుషభావము
కలుగదు. అది సృష్టికి వ్యతిరేకమైనది. సృష్టికి వ్యతిరేకమైన ప్రకృతులు కొంద
ఱుండవచ్చును. వారి ప్రసక్తికాదు. ఎంతకూతును జూచినట్లు చూచినను పురుషుఁడు
స్త్రీని సంపూర్ణముగాఁ గూఁతురువలెఁ జూచుట యసంభవము. కూతురు నవ్వి
నచో, దండ్రికి బసిపిల్ల నవ్వినట్లేయుండును. ఆనవ్వులోఁ దండ్రికిఁ బసితనపు
భావముతోఁ గూడిన యందము కనిపించునేగాని వట్టియందము కనిపించదు.
పరునకానవ్వునందు సౌందర్యము కనిపించును. సౌందర్యమును వట్టి సౌందర్య
ముగా నుపాసించెడివాఁడెవ్వఁడు. ఇతర భావసమ్మిశ్రితము కాకుండ సౌందర్య
మునుకొనెడివాఁడెవ్వఁడు. నేను నీయింటిలో నుండుట పొసగదు. లంపులమూఁగస్త్రీ

"నాకు నాట్యముగాదు నేను పద్యములు పాటలు సంగీతముతో జదువ గలుగుదును. నే నభినయించ గలుగుదునని సారథి నన్ను దన సమాజములోనికి దీసికొనలేదు నాటకము జూచెదవు నాగా నేను పాడుదునని వచ్చితిగాని యాడుదునని గాదు. నాకంగములోని నాట్యము గావు ఇదనలవు రాలేదు. ఇప్పుడు రావు. నాకు గావని సారథికి దెలియును. నేను రంగముమీద నిలిచియుండగా ప్రక్క తెఱలోనుండి వాడు మాటలందిచ్చును నేనందును. నాటక సంఘములో దక్కినవారు పసినీరు భాగములప్పజెప్పనేరరు వారికి సారథి యన్నచో భయము సారథి వారిని దండించును కోపించును నాకు సారథి యన్నచో నేమియు భయములేదు నన్ను కొట్టడు నన్ను దిట్టినచో మరల దిట్టుదును." అంత శిరీషుడు "నీవంత భయములేని దానవు రంగముమీద కన్నీళ్లు పెట్టుకొంటి వేమి? కేయూరములు తాకితివి. అతఁడు తప్పని జెప్పెను. నీవు కన్నీళ్లు పెట్టుకొంటివని నీవె చెప్పితివి కదా!" యనెను వాసంతి "రంగముమీద నుండగా సారథి యన్నచో నాకు భయము. ఇతఁడు నాతప్పన్నచో నాకు భయములేదు. అతఁడభినయించుచుండగా నతనిని జూచినచో నాకేమి యుండదు భయము వాన్న గారు! మీరు మాత్రము జెప్పలేదా మీకు కూడ భయమని" శిరీషుడు "ఔనమ్మా! ఈతల సారథివలె గన్పించును రంగముమీద సారథి కాడు. అతఁడు నవ్వినను మనకేదో భాగము కల్గును గాని స్నేహితుడు నవ్వినట్లొకనూహ్యయతి కలుగదు. సారథి పెదవి ఓఱచి "మీరిద్దరు కట్టి పిచ్చివాండ్రు నేను రంగముమీదకూడ సారథి నే. మీయింటిలో నిద్దవలు తినెడి వాడను. నాకు సంగీతము తెలియక పోయినను వాసంతి వా నాటకములో వేషము వేసి రెండు పద్యములు పాడినచో జాలునని మీ వెంట దిరిగెడి వాడను. నన్ను జూచి మీరు భయపడుట మీ మంచి తనము" నెను వాసంతి నవ్వి యిట్లనెను:

"అక్కడె నున్నాడు దొంగ! అది మన మంచితనమట! మన తెలివి తక్కువ గాదు. మన తెలివి తక్కువ యనినచో దన నటకునియొక్క గొప్పతనము చెడిపోవును."

సారథి- "ఈ తెలివి యంతయు నభినయించు వేళ నేమగును. రంగముమీద గొయ్యబొమ్మవలె నిలుచుండుదువు. అటు తిరిగి నిలుచుండుము. తలవంచుకొనుము మొదలైనవి రంగముమీదనే నేను నీకు జెప్పుచుండ వలయును. తెప్పినను జేయువు.

వాసంతి- "రుక్మాంగదలో నీవు చెప్పితివా? నా యంతట నేను జేయలేదా? నేను చేసిన తప్పు కేయూరములు ముట్టుకొనుట యొక్కటియే గదా

చేసా వాడెంత బాగుగా నభినయించితినో నాన్న గారి నడుగుము. నాన్న గారే కాదు ఊరందఱు జెప్పుకొనుచున్నారు."

ఈ మాటలు వినినంతనే సారధి తల్లక్రిందులై పోయెను ఆమె యెంతటి యమాయకురాలు. తన యంతరాంతరములోన విస్పష్టముగా నెన్నో భాసించిన యొక భావరేఖ యెంత నిరాధారమైనది. అనాటి నాటకరంగముమీదగాని నాటకాంతమున వాసంతి తనతో జెప్పకుండ నడచిపోవుటకాని యే కారణము గలది? సారధి తానేదో నిష్కారణముగా దురూహ పొందిన వానివలె వెలవెల పోయెను. తన పరిచయముతో నామె యాత్మవికాసము యథార్థముగా నిర్వ్యాజముగా నామె వాంఛించుచున్నదనుట స్పష్టముగా గనిపించెను. ఇది యేమి వాసంతి. ఈమెను బరమేశ్వరుడెట్లు సృష్టి చేసెను. ఈమె మనస్సును శిరీషుడెట్లు తీర్చెను. తానొక మంటిముద్ద. వాసంతి యొక జ్యోతీరేఖ. ఆమెను లోకసామాన్యస్త్రీగా భావించుట తనకు వచ్చిన యొక పాపపుటూహ. ఆమె యీ స్వరూపమును గుర్తించలేక పోవుట తన యజ్ఞానము. ఓరీ సారధీ! నీవు రంగముమీద గొప్ప గానటించితివేమో తెలియదు. కొందఱన్నట్లా వేళకు నీలో నున్న యొక పూర్వజన్మ సంస్కారము ప్రతిభాసించునేమో తెలియదు. నీకు మాత్రము లోకజ్ఞత లేదు. నీ నాట్యముకూడ నూహామీద నిర్మించినదకాని ప్రాపంచికానుభవముమీద నిర్మించినదకాదు. పైగా నీవు వేయు వేషములన్నియు, పౌరాణికములు. దైనందిన వ్యవహార సంబంధములైన కథలు నాటకములుగా వ్రాసినచో వానితో నీవభినయించలేవు. ఈ దేశములో కవులెట్టివారో నటకుడవు నీవు నట్టివాడవే. వారు పూర్వకావ్యములలోని మాటలు కల్పనలు తీసికొని వానిని దమమాటలలో వ్రాసి తాము గొప్పకవుల మనుకొందురు. ఆ రాజుల కాలములలో నేది యెట్లుండెనో యెవ్వరికిని దెలియదు. నీవొక పద్ధతిగాఁ జేయుదువు అది యెట్లుండెనో తెలియని సామాజికులు నీవు చేసిన నాట్యమే గొప్పగా నున్నదనుకొందురు. ఒక విషయము యథార్థమనుకొనుటకు దానియొక్క యసలు యాథార్థ్యము తెలియవలయును గదా! నీవు రాజవేషము వేసి బాగుగా చేసితివి. అసలు రాజెట్లు ప్రవర్తించెడివాడో నీకును దెలియదు. సామాజికులకు దెలియదు. తెలియనిదానిని నీవు చేసితివి. తెలియనిదానిని వారు మెచ్చుకొనిరి. ఇది నీ నాట్యము. అవధాని యెంతగొప్పకవియో నీవంతి నటకుడవు. నీకవధాని యున్నచో నిరాదరణ యెందులకు" ఇట్లు మూడు నాల్గు నిముసములు నిశ్శబ్దముగాఁ జరిగినతరువాత సారధి వాసంతి వంక జూచెను. వాసంతి కన్నులలో

జెనో నివ్వలపాటు భాసించుచుండెను. శిరీషుడు తలవంచుకొని కూర్చుండెను. పార్థికిఁ దెలిసెను. అతఁడు నవ్వెను. నా సంతతి నవ్వు తెచ్చుకొనెను.

పార్థ యా సాయంకాలమునఁ దక్కినవారికందఱకుఁ బఠనీయభాగము లిచ్చివచ్చెను. నాల్గవనాటికిఁ జదువుకొని రావలయును ఈ నాల్గుదినములు పార్థికి విశ్రాంతి. అతనిజీవితములో సర్వము విశ్రాంతికాలమే యైనను నతఁడొక నాటకము వేయఁదలఁచికొని పాత్రలు పఠనీయభాగములు వ్రాసి వారికిచ్చి యానాటికిఁ జదివికొనిరండని యానతునున్న నాలుగు దినములే తనకేమియుఁ బనిలేని రోజులుగా భావించుచుండును. అనగా నా నాలు నైదుదినములలో నియమితకాలములయందు భోజనము చేయును. నిదురపోవును ఏదైనా నూరికే వెళును అప్పుడతనిమనస్సులో నేమియునుండదు. ఎవరితోడను మాటాడడు. పలుకరించినను దలయూపును. మాటాడుచున్నవాడు మాటాడుచుండగనే తాను నిదురపోవును భోజనమునకు లేచిపోవును. ఆగుమైళ్లదూరమునున్న సముద్రపుటొడ్డునకుఁబోయి తీరమునంట మైళ్లకొలఁది నడుచుచుండును. కొంటము పెనుదిమ్మగాఁ బోడియిసుకలో మిగిలిపోయిన బాలకుటీరముల నతఁడు చేతిలో నాడించును వానిదెక్కలలో వ్రేళ్లి చిగుళ్లు పెట్టి కత్తించుచుండును. అది పదినార్లొకసారి నొక్కును. సముద్రపుగాటను వెనుకకుఁదిసిన తిరువాత నిగనిగలాడుచున్నవి యాయిసుకలోఁ గొన్ని యెండ్రకాయ బొక్కలేర్పడును వానివద్దకూర్చుండి లోని యెండ్రకాయలను వలికిరమ్మనుటకుఁ గాడలతోఁ బొడుచును. అవి వలికివచ్చి తువతువ నడచిపోవును. వాని యొత్తిడితుకలకుండ నడచిపోలేకుండ వానిమీదఁ గాలువేసి మెల్లగా నొక్కును. మఱల వదలిపెట్టును. ఇసుకవంట నిల్లుపోగా కొంతదూరమున నొక మామిడితోపు కలదు. అతోపులో నన్నియు కన్న మామిడి. మొదళ్లుబలిసి మిక్కిలి లావుగానుండును చెటు గజమెత్తునవే వంగలువేసి మూడు నాల్గు కొమ్మలు దిక్కులకువ్యాపించి ప్రతిచెటు పానవట్టుండును. ఏళ్లు పెరిగిన జీవనపడిపాద యందమే యందము. కన్నమామిడి తోపల యందమే యందము అతఁడా కొమ్మలవెంటఁబోయి చివళలయందుఁ గూర్చుండును. మావచివుళ్లు నములి నగరుమ్మి వేయును. తనకొంతులో ప్రాప్యత యున్నది లేదు. మావచివుళు నమలినంత్రానఁ దాను కోకిలము కాఁడు. ఆ తోటలో నళ్లే యాలోచనలేకుండఁ గూర్చుండి కూర్చుండి చీకటిపడిన తిరువాతి వింటికి బయలుదేరివచ్చును ఈ యాఱుమైళ్లు పోవునప్పుడు జట్టు లేదు చెముళేదు. ఒక చిన్నయిల్లుకూడ లేదు చీకటిలో దారికనిపించదు పట్టణము నుండి కనిపించుచున్న దీపములుతప్ప నడచుటకు వేరే గుర్తులేదు అతడు రాత్రిగా వేలసార్లు నడచివచ్చెను. నూటిగానడచుట యెప్పుడును లేదు ఒక

సారి యూరికి బిచ్చమునకుఁబోవును. మఱియొకసారి యూరికి నైనాలు మెల్లి కొలవ
వోయెను అప్పుడు ప్రొద్దుపోయి యింటికిఁజేరును. ఆరీతిగా విశ్రాంతిదినములు
విశ్రాంతిదినములు కాకపోవును. ఆనాడు మఱియు దారితప్పెను దూరాన
నెనో వెలుతురుచూచి దానిని పట్టించి పోయెను కొంతసేపటికా వెలుతురు
మాయమయ్యెను మరియింకొక వెలుతురుచూచి పేలుముఖముగా బయలుదేరెను.
కొంతదూరమైన తిరువాత నదియుఁ గన్పింపలేదు. మిక్కిలి ప్రొద్దుపోయెను
కాబోలు. పురములోని దీపములు కనిపించుటలేదు. సారథి యెట్లుపోవల
యునో తెలియలేదు. తెల్లవాఱువఱకు నచటనే గూర్చుండును తెలవాఱిన
తిరువాతఁ బోవచ్చును. ఎచటికిఁ బోవుచున్నాడో తెలియకుండఁ
బోవుటయుఁ గదలకుండ నొకచోట గూర్చుండుటయు రెంటి ఫలిత మొక్క
టియే. మొదటిదానియందు శ్రమ యెక్కువ. ఒకచోటఁ గూర్చుండియున్న
మనస్సు నిలువదు ఒకచోట గూర్చున్నచోఁ బాముపుట్ట వచ్చునేమో నను
చున్నచో రాదా. ఒకచోట గూర్చుండుటకంటె నడచుటలో నొక ధైర్య
మున్నది. ఈ ధైర్యలక్షణమేమి. జగత్తుయొక్క స్వరూపము కదలిక. కదల
కుండనుండుట ప్రళయలక్షణము. మనుజునకుఁ గదలికలోఁ బ్రాణసహితత్వ
లక్షణము కనిపించుట సహజమే. అతడు లేచి నడువనారంభించెను ఏదోదీపము
కనిపించినచో దాని కెదురుగా నడచుట యెందులకు. అది కొంతసేపటికిఁ గని
పించకపోవుట యెందులకు. తానే వెలుతురునకు నభిముఖముగా లేకుండా నూరకే
నడువ నారంభించెను. పైగా వలుతు రేదైనాఁ గనిపించినచో దాని పైకి తిరిగియే
పోవుచుండెను. ఇది యాదిక్కున్న బుద్ధియేపోయెను. కూర్చున్నచోఁ బురుగు
పుట్ట వచ్చునేమో. ఊరకే నడచుచుండెను. కొంతసేపటి కతనికి సముద్రము
దగ్గరకుఁ బోవుచున్నట్లు తెలిసినది. అయోగురు గాలిలో గాలియొక్క ధ్వనియు
సముద్రపు ధ్వనియు కలిసిపోయి యెంతదూరాన నున్నను సముద్రపుహోరు
వినిపించు నా బంగరు బయలులో. సముద్రము దగ్గరకు వచ్చినవేగాని తెలియ
లేదు అతడర్ధరాత్రమునందు సముద్రమును జాలసార్లు చూచెను విశ్రాంతిదిన
దినములలో మన స్నానచోట నిలువక రాత్రి రెండుజాములకుఁ బయలుదేరి
సముద్రముదగ్గరకుఁబోయి తెల్లవాఱులచట గాలము గసిపిన రోజులు కలవు.
విశ్రాంతిదినములలో నిట్లు చేయుట యెన్నడు జరుగలేదు ఇది తన కింక జీవిత
ములో విశ్రాంతి లేదనుటకు సూచనయా. తనకు విశ్రాంతి లేకపోవుటయేమిటి.
తనకు విశ్రాంతి లేకపోవుట యనగా దాను బాలకమునుండుట మానివేయుట.
అది యెట్లు జరుగును అది యెన్నడును జరుగదని యతడనుకొనెను. సముద్రపు
టొడ్డునకుఁబోయి సముద్రము వంకఁ జూచుచు నిలుచుండెను. కంటకింద

దాని మొదలు కంటికందక పోవుటచేత భయహేతు వగుచున్నది. ఒకదాని యొక్క మొదలు చివరలు మనకు దెలియనిచో దానినిఁగూర్చి భయపడుచుందుము. భయమునకుఁ దెలియక పోవుట అజ్ఞానము. అజ్ఞానమునకు భయమింకొకపేరు. ఆ భయములో నెంత విశేష మున్నది. తన శరీరమున కేదోఁ గూడునని కలుగు నన్న భావముతోఁ గూడి యజ్ఞానము భయముగుచున్నది. ఇందాకటికంటె సముద్రపు కెరటములు చాల ముందునకు వచ్చినవి. పగటికంటె కెరటములు పెద్ద పెద్దవిగా నున్నవి. నక్షత్రముల వెలుతురులో నొడ్డున విరిగిన కెరటములు ముత్యాలు విరిగబోసినట్లున్నవి. సితచామరములు శిరస్సునందు బూనిన మైగూ గెజగలె కెరటములు దూకుచున్నవి పొడుగైన బూరాలంచు పంథములు నముక భాగాన దెలవిల్లు దూకినట్లు కెరటము లొడ్డున నఱుసులు నఱుసులుగా వ్యత్యస్తమగుచున్నవి. కంటికిఁ గనిపించు నదీమహాజలము చెవులకు వినిపించు నదీమహాఘోడన స్వనములు ఘోడని నిర్ఘోషించుచున్నది. అతడు కుడివైపునకుఁ జూచెను. చాలదూరమున మోపెలకు వెలుతురుమాపు స్తంభముయొక్క వెలుతురు కనిపించెను. అక్కడికది చాలదూరముగానున్నది. ఆ వెలుతురు స్తంభము నుండి నిలువిగా భూభాగముమీద గీతగీసినచో నాగీతకు రెండుమైళ్ళ దూరములోఁ బట్టణముండెను. తన కా వెలుతురు చాలదూరమున నున్నది. తా నాగుమారవెలి పెట్టి యోచనవైపునకు వాలుగైగు మెల్ల నడచివచ్చి నట్లున్నది. అచట సముద్రతీర మతనికిఁ బరిచితముగాఁ గనిపించలేదు అన్ని కయ్యలు వన్ని వానవాగులు. సముద్రములోఁ జేరు జలసంధులు. తాను సముద్రతీరమున నడచుటకుఁ జూచలేదు. ప్రతివాగు తనకడ్డము వచ్చుచుండెను దిగిపోవుటకు దనకు లోతు తెలియదు. సముద్రము పోటుమీదనున్నది. అకయ్యలలో దిగినచో దనకందక పోవచ్చును. సాధికిఁ దవమ్మృతి విషయము పూర్వమెన్నడు మనస్సునకు రాలేదు. ఆసమయమున వచ్చెను. తాను మరణించినచో నేమగును. తనకుఁ గీర్తిలేదు చేసినది. పాశ్చాత్యదేశములలో గొప్పనటకులను జాల గౌరవింతురట. గొప్పబిరుదము లిత్తురట తానింత నటకుడు. తన్నుఁ గిరీటియును సూత్రపతియు శిరీషుడు వాసంతియుఁ దప్ప మెచ్చుకొనెడు వారు లేరే మెచ్చుకొనకేమి. తన నాటక మున్నచోఁ జాలమంది వత్తురు. మర్యాదస్తు లెవ్వరు తన్ను గౌరవించరు. ఈ దేశములో విద్యకన్న శీలముగొప్పదిగాఁ గనిపించుచున్నది విద్యావిహీనుడయినను మంచివా డనిపించుకొన్న వానికి గౌరము కలదు. పలుకుబడి కలదు ఈ దేశమున ధనాధికారములకు గల పలుకుబడి విద్యకు లేదు. ధనాధికారములు విద్యగల చోట లభించవు, తానొక విద్యావంతుడా. చిన్నప్పటి నుండి యేదియో వేషములు

వేయుచున్నాడు కొండఱు మెచ్చుకొనుచున్నారు. పైగా నీవిద్యయాలనయు ఖాలనయు లేనిది. నాటకములలో వేషములు వేయుటతప్ప శైలూషులపాంక్తేయులు. ఆ విద్యకు గౌరవమెట్లు వచ్చును. పూర్వసంఘమునందు గౌరవము లేదు నేటి సంఘమునందు లేకపోవుటయేమి ఉన్నది ఈ కాలమున వృత్తి వలన వచ్చెడు గౌరవా గౌరవములు లేవు ఏ వృత్తి చేసినను నింగ్లీషు విద్యలో నధికుడైనచో నతనిని గౌరవింతురు. తాను నీతిలేని వాడని తాను బెద్ద చదువులు చదువలేదు గనుక నిరాదరించుచున్నారు. గాని తాను పెద్దచదువులు చదివి గొప్ప పదవిలో నుండినచోఁ దన యిప్పటి యవినీతి నందఱెఱుక్క న యవినీతియున్నను గౌరవింతురు. తానాకయ్యలోఁ దిప్పకుండ దిగును. అగునో యుండదో చూచును. తానీదఁగలడు. నష్టములేదు ఒకవేళ నేనైన జంతువులు తిన్నఁబట్టుకొన్నచో? సముద్రములోఁ బాములుండునట. వానికి విషముండదుగాని యవి కాళ్లకు మెలికలు వేసికొనునట. అపుడు కాళ్లు సేతులాడవు. మనిసి మునిగిపోవును. పల్లెవాండ్రు బొడ్డులలోఁ జాకుకత్తులు పెట్టుకొని పోదురట ఆ పాములు కాళ్లకు మెలివేసి నపుడు వారు వానిని, కత్తులతో గోయుదురు. తన దగ్గఱ కత్తిలేదు శివునియాజ్ఞ లేనిది చీమకుట్టదు. తనకిప్పుడు నలుబదియైదేండ్లు. ఈలోపుగా దాను చనిపోకుండుటకుఁ దన జాగ్రత్తయే కారణమా. కాని గుడ్డలు తడిసిపోవును తడిగుడ్డలతోఁ దెల్లవాఱులూ తిరుగవలయును. మఱియు జలివేయును, ఇంతయూహయుఁ జేసి యూహలేకుండ నొకకయ్యలో దిగెను. శివునియాజ్ఞ లేకుండ చీమకుట్టదుగదా! కయ్యలు సముద్రములోఁ జేరునపుడు నీటి మొగదలనిసుక దిబ్బవట్టును. ఆ దిబ్బకు ముందు సముద్రము. వెనుక గొయ్యియుండును. అతనికిఁ దెలియకుండ నతడా దిబ్బమీద నడచిపోయెను కెరటములు లేమిటచేత తుంపురులచేత గుడ్డలు తడిసెనే కాని నీరుమోకాలు దాటలేదు. లోతింతేనా. ఎంతయో. అందుకనియే దిగక లోతులు తెలియదన్నారు. సారథికి నవ్వువచ్చెను. దిగియు లోతులు తెలియవు. తన యదృష్టము కొలఁది మెట్టకయ్యలో దిగినాడు. ముందు నడిచి పోయి లోతుకయ్య కనిపించునేమో చూడవలయును.

చీకటిలో బాదములకు కెండ్రికలు తిరుగుచుండెను. అప్పుడప్పుడు సన్నగా నేవో కాళ్ళలో, గుచ్చుకొనుచున్నవి ప్రక్కగా నేదో జలజల ప్రాకిపోవుచున్నది. చిన్న చేపలు కాబోలు కాళ్ళవ్రేళ్లు కఱచుచున్నవి. అతనికి మఱియొక యూహవచ్చెను జీవితమంతయు నింతియేకదా. తెలియకుండ ప్రయాణము చేయుట. చిన్న చిన్న యిక్కట్టులు పడుచుండుట తెలియకుండ దిగి యదృష్టవశమున నది మెట్టకయ్యయైనచో గయ్యాను లెక్కపెట్టకుండుట. అది తనసామర్థ్యమనుకొనుట. సారథి వెనకకుఁ దిరిగెను. లోతైన కయ్యలుండునేమో. కయ్యల

లోని మెఱుకపల్లములు తాను చేసినవా. తాను పృథివీజలవాయు పదార్థముల కధికారియూ. పృథివిమీద జలమధికారి. ఆ రెంటిమీద వాయువధికారి తాను వట్టి పృథివి ఉమాపతికిరీవశిరీషనాసంతులు జలము లోకము వాయువు. ఈ వాయువులో మందమారుతములు కలవు. వడగాలులు కలవు. ఝంఝలు కలవు. దుర్వాయువులు కలవు జమీందారు ఝంఝ కావచ్చును. అవధాని దుర్వాయువు కావచ్చును. మరి యెవ్వడో ప్రళయవాయువు కావచ్చును.

చూచుచుండగనే సముద్రోపరిభాగము తెల్లబడుచుండెను ఆ తెలుపులో సముద్రపు గాఢము నలుపు కలియుచుండెను ప్రకృతిలోని కాంతులు విచిత్రములు. సముద్రముమీద మబ్బులనవసరము. కడలితరంగముల తుంపురులు లేచి మబ్బులుగా నుపరిభాగమును గ్రమ్మును. తొలిదెసమింట నవతరించిన తెల్లని కాంతులు మబ్బులు కట్టిన తెల్లతుంపురులలో ప్రతిఫలించి తెల్లమబ్బులయి యూ మబ్బుల వలనను గడలినలుపు తెలుపుగా మాఱును. యిందులో నేదియు యథార్థము కాదు. తూర్పునందలి తెలుపొక్కటియే యథార్థము. కడలితుంపురులు మబ్బులు కావు. ఆ తుంపురులకు దెల్లదనము లేదు. సముద్రము తెల్లబడలేదు. యిదియంతయు గనులు చేయు గారడీ. ఈ గారడీ సౌందర్యము దీని మనుష్యుడు భావించుచున్నాడు. ఈ సౌందర్యోపాసనవలన గళావెత్తి మోక్షము పొందుదుననుచున్నాడు. జ్ఞాపకములేని యుపాసన యాకలిలేని తిండి వంటిది. అది రోగహేతువునే కాని బలకారి కాదు. జ్ఞానములేని సౌందర్యోపాసన వాయీ యర్ధరాత్రియున సముద్రపు టొడ్డున తిరుగుట వంటిది. తెలియకుండ నింతసేపు తిరిగితిని. నేనిప్పటికి బోయితిని. అట్లే జ్ఞానములేని భక్తి వైరాగ్యములు నుపాసనములు పనికిరావు. ఇప్పటి సముద్రము శోభజూచి సుందరమనుకొను చుంటిని. ఈ సౌందర్యమును గార్యకారణతరగా విభాగించితిని. సౌందర్యమే లేదు ఇది. భ్రాంతియని తెలిసితిని. త్రిద్రవస్తువుల సహజ గుణమని తెలిసితిని. ఇంక సౌందర్యోపాసన యేమున్నది. సౌందర్యోపాసన యనగా వస్తుతత్త్వవిచారణ చేయకుండ బాగుగా నున్నదని సంతోషించుటగదా. ఆ సంతోషమునకు లోతులేదు. క్రింద గాలు తగులు చుండును. ఆ సంతోషములో నింద్రియములు తగులు చుండును ఆ సంతోష మింద్రియముల లోతు. ఉపాసనవలన గలిగెడు నానందములో నింద్రియము లంట రాదు. ఈ సౌందర్యోపాసన యింద్రియముల కంటకుండ లోతైన యానందము నిచ్చునా. ఉమాపతి యిచ్చునన్నాడు. అతడేదో చెప్పినాడు. నాకది కొంత తెలియలేదు. అతనినిబోయి కలసికొనవలయును. సారథి తిరిగి బయలుదేరినాడు. సముద్ర తీరమున వెనుకకు తిరిగి పోగా పోగా సూర్యోదయము కాగా

కాగా వేళకు దరివిరాగా రాగా సారథి కూడ దూరముగా గనిపించెను క్రమ క్రమముగా బాట కనిపించెను. సూర్యుడు తెలుపు తిరిగిన కొంత సేపటికో-నూరికి బోయెను ఉమాపతి యింటికిపోయెను. ఉమాపతి ప్రొద్దెక్క లేచువాడు. సారథి యింటికి చేరునప్పటికి ఉమాపతి నిదురించుచుండెను. ఉమాపతి చెప్పుట వలన నా యింటిలో బసిబిడ్డ బాలాదికి సారథియన్నచో నమిత గౌరవము. ఉమాపతి మూడవకూతు రెనిమిదేండ్లపిల్ల పోయి తండ్రిని లేపెను. అతనిని మరె వ్వరు నిదుర లేపరు. ఈమె కడగొట్టుపిల్ల. ఆమె నిదుర లేపినచో నతడు మేల్కొని యామెను దగ్గఱకు దీసికొని ముద్దు పెట్టుకొనును అతనిని దొందఱగా నిదుర లేపవలసివచ్చినచో దల్లి యామెను బంపించును. ఆపిల్లపేరు ఉమ. ఉమాపతి నిదుర లేచెను. తొందఱగా ముంగిలికి వచ్చెను. సారథిని జూచి నేను మొగము కడుగుకొనియెదను కొంచెము సేపు కూర్చుండుమనెను. సారథి తానుకూడ మొగము కడిగికొన లేదనెను సారథికనులు జ్యోతులైయుండెను అతనివుడలు తడిసియుండెను. గాలిచేరి కొంత తడి కొంత పొడి పెళ్లలు పెళ్లలుగాఁ బెళుసు పెళుసుగా నుండెను అతని యొడలంతయు దుమ్ముకొట్టుకొని యుండెను. ఉమాపతికి సారథియొక్క యాకారవిశేషము గుఱించి పట్టింపులేదు ఇరువురును గాల కృత్యములు దీర్చుకొనిరి. ఉమాపతి యెంతప్రొద్దెక్క లేచినను వేన్నీళ్ళగాని చన్నీళ్ళ స్నానము చేయడు. బలవంతము చేసి సారథి చేతగూడ వేన్నీళ్ళ స్నానము చేయించెను. సలసల మఱిగినీళ్ళు కొలదిగాఁ జన్నీళ్ళుకలిపి పొగలు వెడలుచున్న వేన్నీళ్ళ సారథి స్నానము చేసెను. అచట వేఱేచన్నీళ్ళులేవు చన్నీళ్ళకొఱకు నూతిదగ్గఱకుఁబోయి వేరే తేవలయును ఇంటిలో వాడువారికిఁ బనియిచ్చి పెట్టుటకు. ఒడలు కాలుచున్నను యోర్చి యోర్చి యానీళ్ళే సారథి స్నానము చేసెను. ఇంటిలోనికివచ్చినంతనే ఫలాహారములు కాఫీయు నిచ్చిరి. ఉమాపతియుఁ సారథియు చెరియొక పడకకుర్చీయందు బండుకొనిరి సారథి యెందుకొఱకు వచ్చెనని యుమాపతి యనుకొనెను కాని యెందుకువచ్చితివని యనలేదు. ఇందుకు వచ్చితినని సారథి చెప్పలేదు. సారథి యనుమునంటవాడు. కాని మాటాడు మింగిపోయెను. రాతిరి తిరిగిన తిరుగుడు. అంతవెచ్చనినీళ్ళ స్నానము చేయుట. వెంటనే కడుపునిండ పడుట సారథి కొడలు తెలియలేదు. ఐదు నిముసములలో నిదురపోయెను. అనిదురపోయినవాడు సాయంకాల మైదింటికి మేల్కొనెను. అతడు శయ్యాసుఖమెఱుగని జీవి. అట్లేనిదురపోయెను. ఇంటిలో నెవ్వరిని నతనిని నిదుర లేపవద్దని ఉమాపతి చెప్పెను. అతనిని వదలిపెట్టియే యుమాపతి భోజనముచేసెను. ఉమాపతి భార్య "యయ్యో! పరాయి పెద్దమనిషి

యింటిలోనుండగా నాయనను వదలి భోజనము చేయుటయా" యని తందపార్థనెను. ఉమాపతి యామెను మందలించెను "ఆతనికిప్పుడు కావలసినది నిద్ర. భోజనముకాదు అతడు నిద్రలేచినంతనే భోజనము పెట్టుము. అన్నము నాదరువులును జల్లారిపోకుండ జూడుము. గృహస్థధర్మమది కాని నిద్రపోవువాని లేపి యన్నము పెట్టుటకాదు." అనెను. ఉమాపతి నిద్రాప్రియుడు. అతనిభార్యనవ్వి "అందఱు మనవలెనే" యనెను.

సారధి సాయంకాలము నాల్గున్నరగంటలకు వెళ్లెను సారధితో నెవ్వరులేరు. ఇందాక చన్నీళ్ళతొకట కొంత బెరుకో యిప్పుడెవరికైన దెలుచుటకంతే జెలుసు. మాటాడకుండ లేచివెడలిపోయెను. తరువాత గొంతసేపటికి నుమవచ్చిచూచెను. సారధిగారు వెడలిపోయెను తలితో జెప్పెను. ఆమెసారధి యెప్పుడు వెళ్లునోయని ప్రొద్దుటికంట జల్లారిపోయెనని మూల్గుట నారంభించెను. ఉమాపతి కొంతసేపటి కింటికివచ్చెను. అతనిభార్య గంటున్నా పోవచ్చినది మీరాయనను బోయి పిలుచుకొని రండనెను. ఉమాపతి నవ్వి యిట్లనెను "ఆయన్నము రాత్రికి బిల్లలు తిందురు. ఆయన యెక్కడనుండునని పోయి పిలుచుకొనిరాను?"

భార్య—"ఆయన యింటికిబోరా?"

ఉమాపతి—"దిబ్బయు దిరుపల్లును"

భార్య—అతని కిల్లును సంసారమును లేవా?

ఉమాపతి—అతని యిల్లు నేను సంసారము నాటకశాల.

భార్య—నా కర్థముకాలేదు.

ఉమాపతి—ఇన్నాళ్ళకు జాల మంచిమాట యన్నావు. నేను నీకర్థమని నీవు నాకర్థమని యనుకొనుచున్నాను. నేను జాగ్రత్తపడుట కిప్పటికైనను విప్పి చెప్పితివి. ఇంక నాదారి నేను జూచుకొందును."

అతని భార్యకీ మాటలలో, జమత్కారములేదు. అతిపరిచయమువలన నవజ్ఞమాత్రముకలదు ఇంతలోనుమవచ్చెను. ఆపిల్ల సారధికోసము వీధియంతయు దిరిగెను. నాటకశాలవద్దకు బోయెను. వాసంతియింటికి బోయెను ఈస్థలములలో నొకదానికొకటి యెక్కువదూరములేవు సారధియొకచోట గనుపింపగా జేయిపట్టుకొని యింటికి దీసికొనివచ్చెను అతనికాకలిలేదు. అన్నముతినక తప్పలేదు. ఎన్నడులేనిది నతడారాత్రి డోకుకొనెను.

## ౬

సారథి గారు ప్రతాపసింహ నాటకమాడఁబోవుచున్నాడనియు నాటకము వ్రాసినవాఁడు కిరీటియనియు నూరిలో వార్త వ్యాపించెను. ఈ వార్త యెట్లు వ్యాపించినదో యెవరును జెప్పలేరు. సారథి నలుగురితో నీ సంగతి చెప్పెనని కిరీటి యనుకొనెను. అనుకొని సారథియొక్క యౌదార్యమును ప్రశంసించెను. కిరీటి యీ వార్త వ్యాపింప జేసెనని సారథి యనుకొనెను. అనుకొని కుఱ్ఱవాఁడు తన గొప్పకోసమిట్లు చెప్పుకొన్నాడనుకొనెను. వాసంతి యీ వార్త వ్యాపింప జేయుటకు వీలేలేదు. ఆమెపోయి నలుగురితో జెప్పదుకదా! ఆమె తండ్రి చెప్పియుండఁగూడదా యనుకొన్నచో నతనికా ప్రసక్తియే లేదు. మఱి వార్తలెట్లు వ్యాపించును. అది వార్త యొప్పుడుచున్నది. ఆ విషయమట్లు జరుగునని సంతోషించువారుందురు. సంతోషించని వారుందురు. సంతోషాసంతోషములు రెండును లేని వారుందురు. సంతోషించువారు తమ పరిచితులతోఁ దమ మనస్తృప్తి కొఱకుఁ జెప్పుదురు. ఎవరితో జెప్పునో వాఁడు సంతోషించెడు వాఁడు కాఁడు. వాని వద్దనుండి వార్త ప్రారంభించును. వార్తయనగా నా విషయమునందు సంతోషించనివారు పదిమంది చెప్పుకొనుట. ప్రతాపసింహ నాటకమును గూర్చి సంతోషించవలసిన విషయమే గదా. ఎవరు సంతోషించవలసిన విషయము. సారథి సంతోషించవచ్చును. కిరీటి సంతోషించవచ్చును. కొందఱు దుఃఖపడను వచ్చును. కిరీటికవి యేమిటి. మేమింతింతటి వారము గ్రామములో నుండగా సారథిపోయి కిరీటిచేత నీ నాటకమును వ్రాయించుట యేమియని కొందఱకుఁ గోపమురావచ్చును. ఆ కోపములో సారథియేమి మహానటుడా! అతని దేఁదన్నిన నటులున్నారనవచ్చును. సారథి నటుడే కాదనవచ్చును. అంత నటుడుగాని సారథి యెవనిచేతనో యేదో నాటకము వ్రాయించుకొన్నప్పుడు తనకేమి నష్టము. అది కాదు ప్రశ్న. సారథి యసమగ్రుడైన నటుడే. ఐనను నాటకము తనచేతనే వ్రాయించుకొనవలయును. అతడు తనచేత వ్రాయించుకొనినచో నతడు గొప్పనటుడు.

అవధాని యిట్లన్నాడు. "రుక్మాంగద నాటకము నేను వ్రాసితిని అప్పుడు నేనును సారథియు నొక్క యొప్పందము చేసికొంటిమి. అతడు వేసెడు నాటకములన్నియు నేను వ్రాయునట్లు, నేను వ్రాసినవన్నియు నతడు వేయునట్లు. ఈ నియమమునకు సారథి తప్పిపోయినాడు" అని. ఈ మాటలు వచ్చి సారథితో నెవరో చెప్పిరి సారథి నవ్వి యిట్లనెను. మేమేమి పారీకత్తులు వ్రాసికొంటిమా వచ్చి చూపించుమనెను. ఈ మాట విన్నవాడట్టి నియమము జరిగెనని విశ్వసిం

చెను. ఊరిలో సారథియు నొప్పుకొన్నాడని చెప్పెను. నిజానికట్టి ప్రసక్తియే జరుగలేదు పారీ కస్తుల మాట సారథి చమత్కారముగా నన్నాడు. ఆ చమత్కారము లోకమునకు నిజమైనది. అవధానికిం గోఱలు వచ్చినవి.

ఈ వార్త రంగనాథమునకుం దెలిసెను. తనను వచ్చి గీతిమాలిక వ్రాసి పెట్టుమన్న సారథి కిరీటిచేత వ్రాయించుకొనుట న్యాయమా. తాను కిరీటియంత వ్రాయలేడా. గీతిమాలిక వ్రాయుటకు దానును నాటకము వ్రాయుటకుం గిరీటియా. ఈ కిరీటి యొక కుఱ్ఱవాడు. వానివిం దానెఱుగును. వానికక్షరపు ముక్క రాదు. సారథి తానే గొప్పవాడనుకొనుచున్నాడు. అతను చేసిపెట్టినచో దమకందఱకుం గీర్తి. లేనిచో లేదని సారథి యుద్దేశము. తామందఱనుచున్నారు గనుక సారథి గొప్పవాడుడు. తాము కాదన్నచో నతనికి ప్రతిష్ఠయేమున్నది. ఈ సంగతి యవధాని గారికిం గోపమువచ్చెను. రావలసినదే, రాజాగారితో సారథి మీద నేదియో చెప్పెను. అంతదాక యెందులకు ఈ విషయమునం దానే పోయి యవధానితో మాట్లాడవలయును.

అవధానికి రంగనాథమునకుం బడదు. రంగనాథము తాతగారు పూర్వము కోటలో దివానుగిరీ చేసెను. ఆయన వలన జమీందారీకిం గొప్పలాభము జరిగెను ఏబదివేల జమీందారీ రెండున్నర లక్షల జమీందారీ యాయెను. రంగనాథమునకు గోటలో నుద్యోగము కావలసినదే. రంగనాథము కవియగుట వలన రాలేదు. ఇప్పటి జమీందారు తండ్రికి గవులన్నచోం బడెడిది కాదు. ఆ జమీందారుమీద నొకప్పుడొక ధిట్టాజు తిట్టుచు, పద్యము చెప్పెను. ఆ పద్య మిప్పటికిని నూరిలో రహస్యముగాం జదువుదురు. అందుచేత రంగనాథమునకుం గోటలో నుద్యోగము రాలేదు. అదియొక్కటో కోపముగాం బరిణమించినది. కారణమే మియు లేకుండ దవిడీమన్నా యైనది. వారు వీరు పోయి రంగనాథము మీద నేదియో చెప్పిరి. దానికి మొదలు లేదు తుదిలేదు. రాజుగారికి గోపము వచ్చెను. దవిడీమన్నా యన్నారు. అంత కవిత్వ మిష్టము లేనివారు కోటలో నవధాని నెట్లు చేర్చుకొన్నారు. ఎవరు చేర్చుకొన్నారు. అవధానియే చేరినాడు. తొలుత నేదియో వ్యవహారము మీద దొరగారవధానిని పిలిపించిరి. వచ్చుచునే యవధాని తట్టెడు పద్యములు వ్రాసికొని వచ్చి చదివెను. కవి యని వెడలగొట్టుటకు వీలులేక పోయినది. ఆ వ్యవహారము మూడునాలుగేండ్లు సాగలాగినది. తరువాత నతని కవిత్వము అలవాటైనది. అవధాని కావలసినపుడెల్ల దొరగారి వద్ద డబ్బులడిగి తీసికొనును. తా నాస్థాన కవినని చెప్పెను. ఒకనాడొకప్పుడు రాజాగారు తనకు గిరీటము పెట్టుచున్నా డని మరియొకనాడు గండపెండేరము వేయుచున్నాడని మరియొకప్పుడు కవి

సార్వభౌముడని పిగుడిత్తునన్నాడని గ్రామములో జెప్పుచుండును. రంగనాథుము నను నవధాని చూచ్చినచో మనస్సులోఁ బటరానంత కోపము అవధాని కనిపించి నప్పుడు వంగివంగి నమస్కారములు చేయును మీ తండ్రివంటివారు మేము బిడ్డలవంటి వారమనును. తన శిష్యులతో మాత్రము నవధాని కవి యేమిటిరా యని నిందించును. అతని శిష్యులందఱకు నవధాని కవి కాడన్న దృఢవిశ్వాసము. కవిత్వమనగా భావములు సుకుమారములుగా నుండవలయును శబ్దము సుకుమారముగా నుండవలయును అవధాని కనిపించినప్పుడు రంగనాథుము వినయమవలంబించును. కాని రంగనాథుని శిష్యులు ధూర్తవర్తనం బవలంబింతురు. యవధానిని చెటరు. ఆయన కనిపించినపుడు దెవడో దారినంటఁ బోవుచున్నట్లు నటింతురు వారనాయకులు కావున నవధానికి బట్టగు పైగా రంగనాథునకుఁ గోటలో, గవియైనచోఁ దాను కావలయునని మరియొక డగుట కధికారము లేదని దృఢవిశ్వాసము ఇది తన తాతగారు నిలబెట్టిన జమీ రాజాన కేసూత్రము కృతజ్ఞతయున్నను తన్నాస్థానకవి చేయవలయును ఈ యవధాని వట్టినీఁగసుకు. గ్రామములు కూర్చుట తప్ప వానికేమియుఁ దెలియదు. తన కవకాశము వచ్చినచో నవధానినిఁ గోటలో నుండి తఱిమివేయును. వాని పలుకుబడిమీద మన్ను పోయించును అవధాని డెబ్బదియేండ్లవాడు ఎప్పుడో వాడే చనిపోవును. ఏడాదియో రెండేండ్లో.

అవధానిని గురించి మనసులో నింత కోపము పెట్టుకొన్న రంగనాథుము సారధిని సాధించుటకు నవధానితో జతికట్టుటకు సంకోచింపడు. అందుచేత నవధాని దగ్గఱకు వెళ్లెను.

అవధాని-ఏమి రంగనాథుము గారు. ఇట్లు దయచేసినారు.

రంగనాథం-తమరు పెద్దలు. మేము పిన్నలము. మిమ్మెంత గౌరవించ నక్కఱలేదు.

అవధాని-అది యేమిటామాట. మీరును గొప్ప కవులే. మీరు చిన్నవారు. కీర్తిప్రతిష్ఠలు సంపాదించ వలసినవారు. మాదేమున్నదయ్యా ఐపోయినది. ఇంక మీదే.

రంగ-సారధిగారు రాణాప్రతాపసింహ నాటక మాడుదురటకదా! తమరు రుక్మాంగద నాటక మెంత బాగుగా వ్రాసితిరి. ఆ భావములు ఆ పద్య రచన తమరుతప్ప మఱి యెవ్వరును జేయలేరు. ఆ నాటకము చూచినంత సేపు నేను బ్రహ్మానంద పడితిని. తమవంటి కవులు మన దేశములో నున్నారు గను క నే పూర్వపు వన్నయ తిక్కనల ప్రతిష్ఠ నిలచినది. నా యుద్దేశములో, దను

తివి జగత్క్రవులను శేయఁగలముము. మహాకవులు కవిసార్వభౌములు విఖ్యాత బిరుదులు తమవంటివారి కల్పనము.

అవధాని-రంగనాధము గారు! తమరికి నాయందింత యభిప్రాయ మున్న దని నాకు దెలియదు. మిమ్ము నుగూర్చి నేను దొరపాటభిప్రాయం పడితిని. క్షమించుడు క్షమించుడు. ఆ రవీంద్రనాధటాగూరు మనకంటె గొప్పయేమి. ఈ దేశములో, దెలిసినవాడు లేడు, వచ్చు దేశము.

రంగ-అవునండీ. ఆ టాగూరయినను ఇంగ్లీషులో వ్రాసినాడు గనుక పై వాడు. తమరి రచన లింగ్లీషులోనికి, దర్జుమాయైనచో, పాశ్చాత్యులు మిమ్ము మెచ్చుకొన్నట్లు మరియొకరిని మెచ్చుకొనరు.

అవధాని-మన కావ్యములు ఇంగ్లీషులోనికి, దర్జుమా చేసి పెట్టెడివానిఁ జూడుడు. రాజాగారిచేత నెలకే బదిరూపాయ లిప్పింతును.

రంగ-నా శిష్యుడొకడున్నాడు. అతనికి మెకాలే కంఠస్థము. అతడీ పని చేయుటకు సమర్థుడు. అతని చేత జేయించెదను. మొన్న రుక్మాంగద నాటకము మాచితిమి కదా! రెండుమూన్నాళ్లలో రాణాప్రతాప నాటకము చూడగల్గుదుము. తమరీ నాటకము నెంతో బాగుగా వ్రాసియుందురు. దేశభక్తి పొంగి పొరలిపోవునట్లు మీరు వ్రాసియుందురని పట్టణమనుకొనుచున్నది. నాయానంద మును మీకు దెలిపి పోవుదమని వచ్చితిని.

ఈమాటలు వినినంతనే యవధానికి సారధిమీద బట్టరానంత కోపము వచ్చెను. అతనికి లోపలినుండి యావేశము పొంగవచ్చెను. అవధానికావేశము తఱచుగా వచ్చును. వచ్చినపు డతనియొడ లతనికిఁ దెలియదు. మాటలు తడ బడును. నోటివెంట చొంగకారును. ఒడలంతయుఁ గంపించిపోవును. ఇదియం తయు జరుగగా నవధాని యిట్లనెను. "వాడా వాడు కృతఘ్నుడు. నేనే నాట కము వ్రాయవలెయును. అతడే వేయవలయునని నాతో నన్నాడు. ఇట్లన్నా డని పదిమందిదగ్గర నొప్పుకొన్నాడు. సాక్ష్యమున్నది. సాక్ష్యమున్నది. ఈ పాటికి వానిమీద వ్యాజ్యము వేసియుందును. రాజాగారితోఁ జెప్పకుండఁ జేయుట న్యాయముకాదని యూరకొన్నాను. వానిని హైకోర్టుదాక త్రిప్పెదను. నే నెవరనుకొన్నాడు.

రంగ-అదియేమి టవధానిగారూ! ఈనాటకము మీరే వ్రాసినారని యను కొనుచున్నామే. మఱియెవరో వ్రాసినదైనచోఁ జూడవలసినది లేదు.

అవధాని-మాచెడి దేమిటి. అవ్రాసినవాడు బొడ్డూడనివాడు. వాని కేమి తెలియును. అచ్చటికిపోయి యెవ్వరును క్రింద నుమ్మివేయ నక్కఱలేదు. వా

దనడయ్యా వాడొక బొట్టె. ఈసారథికి, కవులలో నేమియు లేదు. తా నభినయించుటవలననే కవి వ్రాసిన పద్యములకుఁ బ్రశస్తి వచ్చుచున్నదని యభిప్రాయము కాబోలును.

రంగ-శిలవిధాల నా విషయము ఋజువు చేయుటకే యీనాటకము మొదలు పెట్టియుందును. అప్పుడు మీరును నేనును యీ యూరిలోఁ గవుల మే కాము.

అవ-కవు లక్కరలేదయ్యా. నటుడే కవి. అతడే వ్రాయఁగలడు. ఇంక మన మనవసరము. దొరగారిదగ్గర సారథి నాస్థానకవిగా బెట్టి నేను మానివేయ వచ్చును.

రంగ-ఎంతమాట! ఎంతమాట! నేనీ చెవులతో నిట్టిమాట వినవలసి వచ్చినది. పాపము శాంతించుగాక. నన్నయ్యతిక్కన్న శ్రీనాధుడు పెద్దన్న తెనాలి రామకృష్ణుడు వారి తరువాత మరెందరంతటి మహానుభావులు దేశములో బుట్టినారని మేమనుకొనుచుండఁగా నీ సారధి మీచేత నెంతమాట యనిపించినాడు. అతని కేదో పరాభవము జరిగినగాని యీ పాపము పరిహారము కాదు.

అవధాని-అదేమాట. అతని నీయూరిలో నిలువకుండఁ జేసెదను. యీ యింగ్లీషురాజ్యము వచ్చినతరువాత మన రాజులకురితీసెడి యధికారము పోయినది. లేనిచో వాని నురితీయించెడివాడను.

రంగ-మీరు తలచుకొన్నచో నేమిచేయలేరు. పెద్దన్నగా రొక్క పద్యము చెప్పి యెత్తివచ్చిన గజపతినిఁ దిరుగఁదోలెనట. దొరగారు మీచేతిలో నున్నారు. సారథి తన యంతస్తు తాను తెలిసికొనవలయును. సారథి యీయూరిలో మహానటుడు. మా తాతగారి యూరున్నది. మా తాత యనగా మాయమ్మ తండ్రి. ఆయూరిలో నొకాయన యొమ్మె పట్టభద్రుడు. ఆయన గొప్పనటుడు. పాశ్చాత్యదేశములలోఁగూడ నతని నాటకములను మెచ్చుకొన్నారు. అతని నొక్కసారి తీసికొనివచ్చి యీయూరిలో నాటకము వేయించినచో నీ సారధి పస తేలిపోవును.

అవ-అంతవాడున్నాడా. ఐనచోఁ దప్పకుండ మనయూరు పిలిపింతము. రాజాగారితో మాటాడుదము. సాయంతనముపోయి మాటాడుదము. మీరు తప్పక వత్తురా.

రంగ-దొరగారికి నేనన్నచోఁ గోపము.

అవ-ఛీ! ఛీ! మిమ్ము గురించి నాతో నెన్నిసార్లు ప్రశంసించిరి. మిమ్ము గురించి దొరగారికి దొడ్డ యభిప్రాయమున్నది. ఈయూరిలో మీరును మేమును నిద్దరమే గొప్ప కవులమని రాజాగారు చాలాసార్లు నాతో నన్నారు.

రంగ-నేను వారియనుజ్ఞ లేకుండ వారి దర్శనమునకు రాను.

అవ-వారి యనుజ్ఞ వచ్చినదే యనుకొనుము. నీవు సాయంతనము రమ్ము. కలిసిపోవుదము. పైగా నీ కనుజ్ఞ యెందుకయ్యా. ఈ జమీ మీతాతగారు నిలబెట్టినది. ఈ కొలువులో రాజుగారి కెంత యధికార మున్నదో నీ కంత యధికార మున్నది నీ కెందుకు. నీవు సాయంతనము రమ్ము. నిన్ను దొరగారి దగ్గరకుఁ దీసికొనివెళ్లెడిది నేను.

అంత రంగనాథము కన్నీళ్లు పెట్టుకొని 'యవధానిగారూ! మీరు తండ్రులు నేను బిడ్డను. నే నెప్పుడును మిమ్ము మనసులో బెదతండ్రిగారుగానే భావించుచుంటిని. నాకు రాజాగారు దమ్మిడీ యీయనక్కరలేదు. భగవంతుడు నా కన్నోదకములకు లోపము లేకుండ నిచ్చెను. ఇది మా తాతగారు వృద్ధిపొందించిన జమీ. ఈ కోటలో నాకుఁ బ్రవేశము లేకుండుట మా తాతగారి యాత్మ దుఃఖించుచున్న విషయము. సెలవు తీసికొందును." అని రంగి యవధాని పాదములు పట్టుకొనెను. అవధాని యెంత కృథామతియో యంత కృపామతి. అతడు రంగనాథమునందు బరమప్రసన్నుడయ్యెను. ఈ రంగనాథమునకుఁ దనయం దింతభక్తియా. ఇదివఱకు దనకుఁ దెలియలేదే. రాజాగారి కిదివరకే దర్శనము చేయించెడివాడను. అందులో నిపుడు రాజాగారికి దనతో నేఁటి పనివచ్చినది. తనతోఁ బనియున్నప్పుడు దొరగారు తాను చెప్పినపనులు ప్రేమాదరములతోఁ జేయును.

ఆ సాయంతనమున రంగనాథమును దీసికొని యవధాని దొరగారి దర్శనము జేసెను. ఫలానావారికిఁ దమరు దర్శన మిప్పించవలయునని యనుజ్ఞపొంది కాని రాజాగారివద్ద కెవ్వరిని దీసికొని పోరాదు. కాని యవధాని యట్లు చేయలేదు. దొరగారు కొంచెము పరాఙ్ముఖులయిరి. కాని వెంటనే యవధాని యిట్లనెను. "ఈయన మనవాడు. మన మిన్నాళ్లును బొరబడితిమి. ఈయనకుఁ దమ రన్నచో నున్న భక్తి నాకుగూడ లేదేమో మహాప్రభూ! ప్రొద్దున ఈయన మాటలు వినగా నాకే యాశ్చర్యము వేసినది. తమ దర్శనము కాకపోయినచోఁ దన జన్మయంతయు వృథా యనుకొనుచున్నాడు. తమరితో మనవి చేయకుండ నీయనను దీసికొనివచ్చినందులకు క్షమించవలయును. కాని భక్తులకు దర్శన మిచ్చుటకు భగవంతునకు వేళపాళ లుండునా" చివరిమాటకు దొరగారు మిక్కిలిసంతోషించెను. రాజులయొద్ద మాటాడుటకు మనుష్యుడు నేర్పియుండ

తలఁచును. అవధానికిఁ జేతనైన దదియొక్కటియే విద్య. దొర మనస్సులో ప్రసన్నుఁడై పైకి గాంభీర్య మవలంబించెను. అపు డవధాని కన్ను గిలుపఁగా రంగనాథ మిట్లనెను. "తమరితో నొక్కటి నేను మనవి చేయవలెనని వచ్చితిని. మా తాతగారు దివానములో మంత్రి. నా కిచ్చటికి వచ్చుటకు గొంత హక్కున్నది. ప్రభువులు నాటకకళాభిమానులు. నాకుఁ దెలిసిన విషయము ప్రభువులతో మనవి చేయకుండుట నాయందు దోషమగును. మా తాతగారి పట్టణములో నర్జునరావుగారని యొక గొప్ప నటకుడున్నాడు. ఆయన పేరు తమరు వినియే యుండవచ్చును. పత్రికలలోఁ జాలసార్లు పడినది. ఆయన యం. ఏ. పట్టభద్రుఁడైనాడు. ఈయూరిలో మంచి నాటకసంఘము లేదు. ఆయనవచ్చి మన యూరిలోనవే న్యాయవాదవృత్తి చేయుదునన్నాడు. దొరగారి యనుగ్రహ మున్నచో వచ్చి తమ గ్రామములో నుండవలయునని తన యుద్దేశ్యమని నాతోఁ జెప్పినాడు. తమరి యౌదార్యము. తమ నాటక కళాభిమానము కవితా కళాభిమానము నాయన యెక్కువగా వినినాడట. రాజాగారి దర్శనము చేయింతురాయని నన్నడిగినాడు. నా తాతగారిని బురస్కరించికొని ప్రభువులకు నాయెడ నుంతజాలి పొడసూపదాయని నేను వాగ్దానము చేసితిని. తమరి యనుజ్ఞయైనచో నేను వారికి జాబు వ్రాసెదను. ఈ సంగతి తమతో మనవి చేయుటకే వచ్చితిని. మహాకవులైన యవధానిగారితోఁ దనకు మనవి జేయుమంటిని. వారు నన్నె వచ్చి ప్రత్యక్షముగా మనవి చేయమన్నారు. సాహసించి వచ్చితిని. నే నవినయముగా ప్రవర్తించినచో క్షమించవలయునని ప్రార్థన" అపుడు దొరగా రవధానివంకఁ జూచి "మనయూరిలో సారథియున్నాడు గదయ్యా! గొప్ప నటకుడు. ఆయన యెందుకు" అనెను.

అవధాని-అయ్యా! ఆ యర్జునరావుగారు యమ్మే పరీక్ష యిచ్చినట. న్యాయవాదియట. మనకు రెండు లాభములు. ఆయన మన వ్యవహారములు చూచుచుండును. అక్షరపుముక్క రానివాడు సారథి కేమి నాట్యము తెలియును. ఈయూరు గనుక సరిపోయినది.

రంగ-"అర్జునరావుగారు భరతశాస్త్రమంతయు జదివినవారు. ఇంగ్లీషులో నాట్యము గురించి యెన్నివేల గ్రంథములు చదివారో నాకుఁ దెలియదు. ఆయనకును మఱొకరికిని పోలిక యేమిటి. పైగా నాయన తమ ఆశ్రయమును వాంఛించుచున్నాడు.

అవధాని-సారథి వచ్చి దొరగారి నాశ్రయించినదెపుడు. ఆశ్రయించలేదు. సరిగదా తమరినిగూర్చి సారథికి మంచి యభిప్రాయ మున్నదా?

దొరగారు-"మనలనుగురించి యెప్పుడైన వ్యతిరేకముగా మాట్లాడెనా?

అవధాని-"అతనికున్న గర్వమునకు మాట్లాడడని యెట్లు చెప్పవచ్చును. తమరి ప్రసక్తి వచ్చినపుడు నాల్గుదినముల క్రింద నేమన్నాడో రంగనాధముగారి నడుగుడు. అదియేమిటి చెప్పడు.

రంగ-"ప్రభువుల యెదుట నట్టిమాటలు చెప్పకూడదు. దొరగారియౌదార్యము సారధివంటి నిరక్షరకుక్షి కేమి తెలియును, ఈదివాణమేమిటో యిచ్చటి మరియాద లేమిటో యతనికిఁ దెలియగలదా? పైగా నేనుండగా నట్లనుట వారు మిక్కిలి కష్టము వేసెను, నేను బాగుగా మందలించితిని. సారధీ! నీవేమి మాటాడుచుంటివో నీకుఁ దెలియుటలేదు. ఎవరివద్ద మాటాడుచుంటివో అంతకుముందు దెలియలేదు. నేను దొరగారి సేవకుడను. నా కీనాడు తిండికి గుడ్డకు లోపము లేదనగా నా దివాణపు జలువ. దొరకీనాడు ప్రాణము వదలవలసి వచ్చినచో నేను సిద్ధము. ఆ రాజవంశము నృగనల భంగీరధుల వంటివారు అని చెప్పితిని. అంతటితో నతడు మెత్తబడి యూరకుండెను."

ఈ సందర్భములో సామాన్యులైనచో నేమన్నాడని విగ్గదీసెడివారు. ప్రభువు లట్లుచేయరు. ఏమనిన నేమి. అల్పపు మాటయైనను నధికపు మాటయైనను రెండును వారి కొక్కటే. అందుచేత నేమన్నాడని యడుగ నక్కఱలేదు. రాజుగారికి సారధిమీదఁ గోపము వచ్చెనని తెలిసికొనుట కేమియు వీలులేదు. కాని బీజము నాటితిమని మహాకవుల కిద్దఱికిని దెలియును. అపుడవధాని "తమరి యనుజ్ఞయైనచో రంగనాధ మర్జునరావుకు జాబు వ్రాయును. తమరు యనుజ్ఞ యిప్పించవలయు" ననెను. దొరగారు మాటాడకుండ నూరకుండిరి. అవధాని రంగనాధముతో నిట్లనెను "రాజాగారంగీకరించిరి. మీరర్జునరావుగారికి రండని జాబు వ్రాయు"డని. రంగనాధము "అర్జునరావు వేషము వేసినచో వేలకొలది డబ్బు కురియును. అతనికి నెలకు నాల్గువందలో మూడువందలో యిచ్చినచో వారమున కొక నాటకముగాఁ దేలికగా నెలకు రెండు మూడు వేలు లాభము వచ్చును. సాలునకు పాతిక వేలు లాభము. ప్రభువులెట్లును మహోదారులే. అడిగినవారికి లేదనుట తమ వంశములో లేదు. ఈ పాతిక వేలు దానధర్మములు చేయవచ్చును. మహాకవులైన యవధానిగారు నాటకములు వ్రాయును. వారికి గండపెండరము వేయవచ్చును. మణికిరీటము పెట్టవచ్చును. వారి నాస్థాన కవులుగా జేయవచ్చును. ఎంతమంది కవులనైనఁ బోషించవచ్చును."

అవధాని-"నే నిదివఱకే యిచ్చట నాస్థానకవిని."

రంగ-చిత్తము నేనన్నదది కాదు. దొరగారు తమరి నాస్థానకవిగా నెన్నుకొనుట దానికి పెద్దసభ చేయుట, ఆనాడు తమరొక కావ్యమును దొరగారి

శంకితము చేయుట, మేమందఱము ప్రశంసాపద్యములు చదువుట రాజవంశ ము దమరు పెద్దవాదులు శ్రీ కృష్ణరాయ వంశమును వర్ణించినట్లు వర్ణించుట. తమ రాస్థాన కవులని దొరగారు తమ కొక సనదు నిచ్చుట. ఇంత యుత్సవము జరుగవలెను. ముందు తమరిని కవిసార్వభౌములనుజేసి యీ పని జరుగవలయును. అప్పుడు గాని దొరగారి యాశ్రితులమైన మాకు, దమరు మహాకవులని సంతోష పడెడు మాకు గుండెలలో నున్న యుత్సాహము వెలికిరాదు.

అవధాని-"అవునయ్యా! మంచిమాట యన్నావు. పూర్వము శ్రీ కృష్ణ దేవరాయలు పెద్దన్నగారినే యాదరించిరి. నేడు దొరగారు నన్నే యాదరించు చున్నారు. రాయలవారి పేరువలెనే దొరగారి పేరుగూడ శాశ్వతముగా నుండ వలయును. దానికి నే నేతగుదును.

రంగ-"నిస్సందేహము కవిగాదమరే తగుదురు. పెద్దన్నగా రాంధ్ర కవి తాపితామహుడు. మీ రాంధ్రకవితా మహావిష్ణువు.

అవధాని-"అవును దొరగారు! మీరు నన్ను కవిసార్వభౌముని చేయ వలెను. ఆనాటికి మీకు నేను మనుచరిత్రము వంటి గ్రంథము వ్రాసి యంకిత మీయవలయును. తమ రెట్లును ప్రభువులే. నాయందు దయచూపవలయును. ఎన్నాళ్ళ నుండియో యీ కోరిక నాకునుం గలదు. తమకునుగలదు. ఇప్పుడు రంగనాథముగారు బయట బెట్టిరి. ఇది చక్కని వేళ. గురువు కర్కాటములో నున్నాడు.

రాజుగా రింతవఱకు నవ్వుచు గూర్చున్నవాడు నవ్వు మానివేసి లేచెను. వారిద్దఱును లేచిరి. రంగనాథము రేపే యర్జునరావుకు వ్రాసెద ననెను. అవధాని తప్పకుండ వ్రాయుమనెను. కవులిద్దఱు వెడలిపోయిరి. అప్పటికి బొద్దుగ్రుంకి చీకటిపడెను. రంగనాథము జమీందా రంతటివాడు. అతని మొగములోనను గో పాదులు కనిపించవు. ఎప్పుడును నవ్వుచునేయుండును. నిజమున కతని కెవ్వని మీదను గోపములేదు. ఎవ్వరిని మీద ననుగ్రహము లేదు. తాను మహాకవి. ఈసంగతి తన శిష్యులకు దప్ప మఱి యెవ్వరికిని దెలియదు. తా నాస్థానకవి కావలయును. తనకు గండపెండేరము వేయవలెను. తన కెవ్వరు వేయరు గనుక మఱి యెవ్వరికైన వేయించుటకు బ్రయత్నించవలయును. అది తన కేమి లాభమనగా, నా ప్రయత్నములో దప్పి జారి తనకే రా వచ్చును. అవధానికి మాత్రము రాకూడదు. రాకుండ దాను జేయగలడు. దానికి బీజ మీ పూటనే వేసెను. అర్జునరావు వచ్చిన తరువాత దాని నాటకమున్నది.

ఇది యంతయు రంగనాథము మనసులో ననుకొనెను. అతనిని గురించి చెప్పిన ప్పుడు చెప్పకతప్పదు.

రంగనాథము చీకటిలో వెళ్ళుచుండెను. అతడతడని గుర్తుపట్టి పలుమంది వారిలో నతనికి నమస్కారములు చేసిరి. కొంత దూరము పోగా సారథి కని పించెను. సారథి తలవంచుకొని పోవుచుండెను. రంగనాథ మతనిని బలుకరించి యిట్లనెను "ఆలోచించుచు బోవుచున్నట్లున్నారు. ప్రతాపసింహ వేషమును భావించుచున్నట్లున్నది. నాటకము కిరీటిచేత వ్రాయించితిరటకదా! అతడు చాల తెలివిగల కుఱ్ఱవాడు. అతనిలో, గవికిఁ గావలసిన యథార్థమైన యావేశ మున్నది. మంచివాని నెన్నుకొన్నారు" అని యొక వికృతిముగా నవ్వుచు 'అవధానిగారిచేత వ్రాయించితిరి కాదు బ్రదికిపోయితిమి. రుక్మాంగదయైనను భావములు నీరవి గనుక పద్యరచన యెట్లున్నను నాటకము చూడఁగల్గితిమి. ఈ నాటకములోఁ బద్యములు కూడానున్నవా"యనెను. సారథి "యొక్కటే పద్యము. అది మీరు వ్రాసిపెట్టెదనన్న గీతమాలిక. తమరి యింటికి రేపు వత్తు ననుకొన్నాను"

రంగ-"అరే నేను వ్రాయనక్కఱ లేదనుకొన్నానే. నాటక మింకె న్నాళ్లున్నది. మరల మీరు కనిపించలేదు. కిరీటి చేతనే వ్రాయింతురనుకొం టిని. అతడును బాగుగానే వ్రాయఁగలడు.

సారథి-"రంగనాథముగారూ! కోపపు మాటలు మాటాడకుడు. అతడు కుఱ్ఱవాడు. అతడు వ్రాయలేడు. ఊరికే యతని దగ్గఱబెట్టికొని నేనే వ్రాసితిని కాని యతడొక్కొక సన్నివేశములో గుండె వెలికి వచ్చినట్లు చెప్పును. అందు చేత నతనిని దీసికొని వచ్చితిని. మీకు గోపము రావచ్చును గాని మీరు మెత్తని మాటలతోఁ గొన్ని లోతైన యూహలు వ్రాయుదురు. ఈ యూహలు భావిం చుటకు రమ్యముగా నుండును. ఆ యూహ లొక కల్పిత లోకములోనివి. రస మట్టి యూహలలో నుండి పుట్టదు. లోకమునందుఁ గలిగెడు సుఖదుఃఖానుభూతి వెలికివచ్చునట్లు వ్రాసెడు వ్రాతవేఱు. ఊహాలోకములోని చమత్కారములైన భావములు వేఱు. అవధానిగారి కవియు నివియు రెండునుఁ దెలియదు. ఎవడైన కుఱ్ఱవానిలో నటువంటి వెలుగున్నప్పుడు మీ వంటి పెద్దలు వాని నాదరించవల యును గాని వానిమీదఁ గోపపడరాదు. నా మీదఁగోపపడుడు. పసివానిమీద నతనిమీదఁబెట్టుకొనకుడు.

రంగ-"ఎంతమాట యన్నారు సారథిగారూ! మీ మీద గోపము పెట్టు కొందుననుకొనుడు. మిమ్ము నేనేమి సేయఁగలను. నేనుగాదు ఆ మాటకు వచ్చి నచో మిమ్మెవ్వరేమి సేయగలరు. మీరు స్వతంత్రులు. పెండ్లము బిడ్డలు లేని

వారు మీకిది కావలయునని లేదు. సన్యాసివాని సేవ లేమి చేయుదురు" అని నవ్వెను. ఆ నవ్వులో సారధి యున్నచో, ప్రశంస తనమంచితనము యథార్థము చెప్పిన బోళాతనము తనకుఁ గోపములేనితనము సర్వమును ప్రకాశించెను. సారధియు నవ్వెను. మరల రంగనాథ మిట్లనెను. "నిజానికి నీవంటి నటకుఁడు సృష్టిలో నవతరించునా. మీదొక యవతారము. ఆ సంగతి నాకు బాగుగాఁ దెలియును. మీతో సమకాలికులమై పుట్టుటయే మాదొక యదృష్టము. మిమ్ము బొగడవలెనని కాదుగాని శ్రీకృష్ణుడు జన్మించినప్పుడు గోపికలు జన్మించిరి. మరి యొకప్పుడు పుట్టి యేమిలాభము. ఆయన వేణుగానమును వారు వినితరించిరి. మరియొకప్పుడు పుట్టినచో వారి బ్రదుకులేని పరమార్థము లేదు కదా! నిజముగా మీతో సమకాలముగా బుట్టిన మాయదృష్ట మట్టిది" అతడట్లను చుండగా సారధి కించిత్సంతోషము కొంచెము వెటకారములో గూడిన నవ్వుతో మాటాడకుండ వెడలిపోయెను.

రంగనాథము నడచుచుండెను. మఱియింకెవ్వడైన నన్నచో దాను మాటాడిన మాటలకుఁ మనసులో సంతోషించుకొని యుండును. కనీసము తాను మాటాడిన మాటలు పర్యాలోచనమైన జేసియుండును. చివఱకతని మొగములో నొక నవ్వురేకయైనను దోచియుండును. రంగనాథము నందని యేమియును లేదు. అతడింటికిఁబోయెను. అతని గృహమునందన్నియు, కృత్రిమాచారములే. కృత్రిమపు మాటలు. సహజముగా నేదియునుండదు. ఒక్క యూహాలోకములలోని యొక కల్పిత సమాజములోని మాటలవలె నడకలవలె నాయింటిలో నుండును. తండ్రి వచ్చెనని కొడుకు వచ్చి కాళ్లను పెనవేసికొనడు. తానొక యాటవస్తువుతోఁ గ్రీడించుచుఁ దండ్రికి నది చూపించినచో బాగున్నది నాయనా యని కాని యాలాగటే తండ్రీయని గాని యిట్టిలోకసహజములైన మాటలుండవు. "ఔనోయి! నా బిడ్డ జయంతుడు. పెద్దవాడైన తరువాత నలకూబరుడగును" ఇట్టి కృత్రిమ భావములే యుండును. భార్యవచ్చి భోజనమునకు లెమ్మనగా నిదుగో లేచుచున్నానని గాని నాకాకలిగా లేదని గాని యనదు "భోజనమా! ఏమి యన్నము తినకపోయినచోఁ బ్రదుకమా!" యని యొక్కప్పుడు హేళన. మఱి యొకప్పుడు "అన్నమేమిటే! అచ్చముగా కాఫీ త్రావి బ్రదుకరాదా అచ్చముగా కాఫీ త్రావి బ్రదికెడువారు స్వర్గలోకములకుఁబోవుదురు. దేవతలమృతము త్రావుదురు. ఈ వెధవ తిండియేమిటి. అచ్చముగాఁ బాలును పర్వతులును ద్రావి బ్రదుకవలయును. అపుడు దేహము గాజువలెనుండును. మన శరీరములో నుండి వెనుక నున్న వస్తువును జూడవచ్చును" భావనారమ్యములై యిట్టి కృత్రిమములైన ప్రసంగములతోనే యతని యింటిలోని జీవితము గడచుచుండును. అత

నికి భార్యయున్నచో ప్రేమలేదు. బిడ్డలున్నచోఁ బ్రేమలేదు. భార్యకంటె బిడ్డల మీఁదఁ గొంత ప్రేమకలదు అతని ప్రేమయంతయు నభినయము. అతనికి సృష్టి మొత్తముమీఁదఁ బ్రేమించెడి పదార్థ మొక్కటే యున్నది. అది తాను. అతనికిఁ గోపమున్నది లేదు. ఇంటిలోమాత్రమున్నది అతనికోప మంతయు భార్యమీద ఆమె యతనికి వణకి పోవుచుండును. పది మందిలో నతడు భార్యను గుఱించి మాటాడినప్పు డతడు భార్య దేవత యనుకొనవలయును పదిమంది స్నేహితులుండగా నతడు భార్యతో ప్రసంగించుట చూచి తీరవలయును. ఆమె సత్యభామ. ఇతడు కృష్ణుడు. భార్యతో నతడొంటరిగా నున్నప్పు డతడామెను సాదించెడి సాధింపులు పెట్టెడి రోష్టు భగవంతునికే దెలియును. ఆమె యతని బెద్దపులిని జూచి నట్లు చూచును. తిక్కన చెప్పినట్లతడు ధర్మరాజు. మెత్తని పులి. ఆ పులియే యితని కంటె నయము. అది గాండ్రించును.

రంగనాథమునకు మనసులో నేదియోయొక క్రొత్త యూహ కలిగెను. అతడు వెంటనే యెప్పుడును భోజనమును జేయడు. శిషు లెప్పుడు నింటిలో హాజరుగానే యుందురు. వారితో ప్రసంగించి ప్రసంగించి యే పదకొండు గంటలకో సౌకుమార్యమని పరులు భ్రాంతి పడదగిన యాపసోపాలు పడి లేచి స్నానముచేసి శిష్యులను బంపించును. అతనికెదో యూహకలిగినది వెంటనే లేచి శిష్యులతో నిప్పుడే వత్తునని చెప్పి బయటకుఁ బోయెను. ఆపోక శిరీష కుమారు నింటికి బోయెను. అప్పుడు వాసంతి పాడుచుండగా శిరీష కుమారుడు వినుచుండెను. రంగనాథమును మరియాదచేసి కూర్చుండఁబెట్టిరి.

శిరీషకుమారునకు రంగనాథమున కదియొకవిధమైన స్నేహము కలదు. ఇద్దఱు నించుమించుగా సమవయస్కులు. ఏకగ్రామవాసులు. ఇద్దరు నన్నోదకములకు లోపములేనివారు, ఇద్దరు నింగ్లీషు చదివినవారు. ఇద్దరును రవీంద్రనాథటాగూరు కవిత్వమునం దిష్టముకలవారు. ఇద్దరు నరవిందఘోషుని యనుయాయులు. ఇద్దరుఁ గళాభిమానులు. ఈకళాభిమానములోనే భేదము. శిరీషునకు సంగీతమునం దెక్కువ యిష్టము. రంగనాథమునకు సాహిత్యమునం దెక్కువ యిష్టము. శిరీషు దుహితృగత సంగీతవిద్యాతన్మయుడు. రంగనాథము స్వగత కవితా విద్యాతన్మయుడు. శిరీషు నొద్దలేని యొక గొప్పగుణము రంగనాథము నొద్దయున్నది. రంగనాథమునకుఁ బేదవారన్నచో ననిష్టము. వారనాగరకు లని తాత్పర్యము. వారికి మర్యాద తెలియదని బంధువైనవాడు పరిచయము కల వాడు తనకు మిత్రుడైనవాని తమ్ముడో బావమఱదియో యేదియోయైనవాడు- ఇట్టి వారాస్తిపరులు కానిచే విద్యావంతులు కానిచే వారు "ఏమండీ కులా

పాడినచో రక్తికట్టును. పాడుమని తండ్రి హెచ్చరించును. ఆమె నిరాకరించును.

రంగనాథము శిరీషునింటికి వచ్చెను. వాసంతి పాట యాపి కొంతసేపు మైత్రిపూర్వక ప్రసంగము జరిపెను. రుక్మాంగదలోని యొకటిపాట పాడినచో వినవలయునని యున్నదని యడిగెను. ఆమె పాడెను. తరువాత మరల ప్రసంగములోనికి దిగిరి. శిరీషు రంగనాథము నింత ప్రొద్దుపోయి యేదైన పనిమీఁద వచ్చితిరా యని యడిగెను. కొందఱిమైత్రి సంవత్సరముల తరబడి సాగును. వారి మైత్రి "యేమండీ" లోననే నిలుచును. శిరీషునకుఁ గవులన్నచో గౌరవము. రంగనాథము తానాయావరణదాటి యివతలకు రాడు. అతడు వచ్చును. యితరులను రానీయడు. తాను శిరీషు నేమండీ యనును. ఏమయ్యా యనును. ఏమోయి యనును. "నీవు" అనును. శిరీషు మాత్రము "నేమండీ" యనిన హద్దు దాటరాదు.

రంగ-"ఏమియులేదు. ఒకసారి యమ్మాయిపాట వినిపోవలెనని వచ్చితిని. నేఁడొక యాశ్చర్యము జరిగినది. నేను దొరగారి దర్శనము చేసితిని. 'ఆఁ' యని శిరీషవాసంతులు నివ్వెరపోయిరి. ఎట్లు జరిగినదో చెప్పుమని బలవంత పెట్టిరి. నిజానికి బలవంత పెట్ట నక్కఱలేదు. వా రడిగిన బతిమాలిన ప్రాధేయ పడినఁ దాను చెప్పినట్లు రంగనాథము నటించెను.

రంగ-"ఎన్నాళ్లు దొరగారు కృతజ్ఞతలేకుండ నుందును. ఆయన కలలో మా తాతగారు చాలసార్లు కనిపించిరట. దొరా! మీ జమీందారీ యింతది చేసినది నేను. నా మనుమనికి నీకోటలో దేవిడీమన్నా యగుట నాకు ద్రోహము చేయుట. మీ నాయనగారికి ద్రోహము చేయుట. మీ తాతగారి నవమానించుట యని పదేండ్లుగాఁ జెప్పుచు వచ్చెనట. ఇన్నాళ్లును దొరగారు లెక్క పెట్టలేదు. దొరగారి తండ్రిగారే పదిరోజులక్రింద స్వప్నములో గనిపించి యవేమాటలు చెప్పిరట. ఇది మనకు రహస్యముగాఁ దెలిసిన వార్త. పెద్ద కాసాయున్నాడే నమ్మాళ్వారు, వాడు నాతోఁ జెప్పినాడు.

శిరీషు-దొరగారు మీతో సరిగా మాటాడిరా. ఏమి జరిగినదో చెప్పుడు. చెప్పుడు.

రంగ-నేను వెళ్లితిని. దొరగారికి నా తాతగారు వచ్చినట్లే యున్నది. నేను వెళ్లినంతనే లేచి నిలుచున్నారు. నేను దోసిలిపట్టి "ప్రభువులు. నన్నంత మన్నన చేయరా"దంటిని. అప్పుడు దొరగారిట్లనిరి. "మేము మీకు దేవిడీమన్నా చేయుట మీరు క్షమింపవలయును. మా జమీందారీ మీ తాతగారు నిలిపి

నది. తమరిమీఁద మా కేదో కొంచెము కోపము కలిగి యట్లు చేసితిమి. మీరింక మా దేవిడీలోనికి యథేచ్ఛముగా వచ్చుచుండవచ్చును. పోవుచుండవచ్చును" తరువాత నే వచ్చుట కొక్క యరగంటసేపు కూర్చున్నాను. ఇంతలో బంగారు పళ్లెములోఁ దుమలపాకులు వక్కలు లవంగాలు యేలకులు జాపత్రి దలువ మిరియాలు పచ్చకర్పూరము కస్తూరి కుంకుమపువ్వు పదిబత్తాయిపండ్లు డజను చక్కెరకేళీలు గంధము వత్తరు అన్నియు వచ్చినవి.

శిరీషు-మీ మ్రొదగిన సమ్మానము జరిగినది. ఇన్నాళ్ళకైనను దొరగారి మనస్సు తిరిగినది. ఇంక నవధానిగారు కోటలో నాస్థానకవి కాదు. మీరే యగుదురు. దొరగారు మీరింక నేదిచెప్పిన నది చేయుదురు.

రంగ-ఆ. అట్లే జరుగునట్లున్నది. దొరగారి రెండవ కుమారునకు రెండుమూడు నెలలో నక్షరాభ్యాసము చేయుదురట. దానికొక పాటకచ్చేరీ పెట్టింతురట. ఎవరి కచ్చేరీ పెట్టించినచో బాగుగానుండునని దొరగా రడిగినారు.

శిరీషు-అమ్మాయి పేరు చెప్పకపోయితిరా.

రంగ-శిరీషూ! నీవు వట్టి పిచ్చివాడవు. నేను మఱి యెవ్వరిపేరు చెప్పుదును. దొరగారే యమ్మాయిచేతఁ బాడించవలె ననుకొన్నారు. రుక్మాంగద నాటకము చూచినపుడు వాసంతి పాట విన్నారుకదా! ఆయన మోహము పొందినాడు. నేను మీ కుమార్తె యని చెప్పితిని. దొరగారు మిక్కిలి సంతోషించినారు. ఆ యమ్మాయి కింకను విద్య చెప్పించవలయును. వీణ ధనమంతయూ మెను జేయవలయును. మన దేవిడీలో మనయూరిలో మన జమీందారిలో నటువంటి గాయకురాలున్నచో మన దివాణమున కెంత ప్రతిష్ఠ" యన్నారు.

శిరీషు-నిజముగా నట్లన్నారా.

రంగ-అంతియేనా. దొరగారు వాసంతిని గురించి మాట్లాడినప్పుడు నీవున్నచో శిరీషూ! నీయానంద మెట్లుండెడిదో చెప్పలేను. ఇంటికి వచ్చినంత నే నా కాకలి వేసినది. తరువాతవచ్చి భోజనము చేయవచ్చులే. ముందు శిరీషుతో నీమాట చెప్పి రావలయునని బయలుదేరి వచ్చితిని.

శిరీషు-రంగనాథముగారూ! వాసంతి నాబిడ్డయేమిటి. మీబిడ్డకూడాను. ఆమెమీద నాకెంతయధికార మున్నదో మీకంత యధికారమున్నది. మీరును పారధియును వాసంతికి నే నెట్టివాడనో యటివారు. వాసంతిని మీయిద్దరికప్పగించి నేను చనిపోయినను నాకు దిగులులేదు. వాసంతి సంగీతములో మీరాబాయి యంతది కావలయు నని నా యభిప్రాయము. ఆమె యట్లగుటకు నా

యాత్మ బలిదానమైన జేసెదను. నేటినుండి వాసంతి మీ కూతురు. నా కూతురు కాదు. మీ రామెనుఁ పండితురాలను జేయుడు.

రంగ-శిరీషు గారు! మీరు నాతో విన్నిమాటలు చెప్పవలయునా. మనము తొందఱపడఁగూడదు, నేడు బీజము నాటితివి. దీనిని కృతమును జేసెదను. అమ్మాయికిఁ గోటలో బెద్ద సమ్మానము జేయించెదను

శిరీషు-సమ్మానము లక్కఱలేదు. కోటలో నమ్మాయి పాడినది. అది మనకు జాలును. మీ రాస్థాన కవులు. అమ్మాయి యాస్థాన సంగీత విద్వాంసు రాలు. ఇంతియే నాకుఁ గావలసినది. వారు మనకు డబ్బియనక్కరలేదు. పాతి కెకరాల పొలము మీకున్నది, నాకున్నది.

రంగనాథము వెడలిపోవుటకు లేచెను. శిరీషు వాని నచటనే భోజనము చేయుమని బలవంతపెట్టెను. రంగనాథము కాదని వెడలిపోయెను. అతడు వెళ్లిన తరువాతఁ దండ్రికూతు లిద్దఱుఁ గూర్చుండిరి. శిరీషు మొగములో మహానందము తాండవించుచుండెను. వాసంతి తండ్రిని జూచి నవ్వెను. వాసంతియొక్క మనోభిప్రాయము శిరీషునకుఁ దెలియును. ఆమె దేనిని లెక్కసేయదు ఆమెకు ధనమక్కఱలేదు. కీర్తి యక్కఱలేదు పాటకచ్చేరీలు కూడ దండ్రి బలవంతము మీదఁ జేయును. ఆమె యుద్దేశ్యములో సంగీతము స్వాత్మానందము కొఱకు. ఆ యానందమామె కింతవఱకుఁ గుదురలేదు. ఆమెకు మరి యొకకోరిక గలదు. సారథివలె నభినయించవలయునని.

శిరీషు-నాకుఁ దెలియును నీవు వెక్కిరించుచున్నావని. నీ వింత పాటకు రాలవైనసాఫల్యమేమి. కీర్తి గడించవలయును. ఆ దేవిడీ యాస్థాన విద్వాంసురాల నగా నది యొక ప్రతిష్ఠ. అవధాని గారిని జూడుము నిజముగా నా స్థానకవి కాకపోయినను నాస్థాన కవియని యెంతమంది గౌరవించుచున్నారో. ఆయన కంటె రంగనాథము గారు గొప్పకవియని చదువుకొన్న వారికందఱికిఁ దెలియును. అందుకు నవధాని వట్టి నీరస కవియని తెలియును. ఐనను దెలిసిన వారును దెలియనివారు కూడ నవధాని గారినే యాస్థానకవియని గౌరవింతురు. అన్ని సభ లకు నాయననే బిలిపింతురు. పెద్ద పెద్ద సభలకధ్యక్షుడుగా నియమింతురు ఆయనవద్దనిద్దఱు ముగ్గురు గ్రంథముల నంకితము దీసుకొన్నారు. చాల డబ్బిచ్చి నారు. జిల్లాకలెక్టరుగారు సభల కధ్యక్షత వహించినారు. నీ వాస్థాన విద్వాంసు రాలవన్నచో మన కెంత ప్రతిష్ఠవచ్చును.?

వాసంతి-రంగనాథము చెప్పిన మాటలన్నియు మీరు నమ్మినారన్నమాట.

శిరీషు-ఆయన యంతటి మహాకవి యబద్ధములు చెప్పునా వాసంతీ! నీ మీద నాకుఁ గోపమువచ్చుచున్నది. నీ వెవరిని గూర్చి యెట్లు మాటాడవల

యనో తెలియదు. రంగనాథముగారి గూర్చి నీ కేమి తెలియును. పిల్లకాకి కేమి తెలియునురా యుండేలు దెబ్బ అన్నారు. ఆయన రవీంద్రనాథటాగూ రంతటి కవి. ఆయన పద్యము ఇంగ్లీషులోనికిఁ దర్జుమాయైనచో నాయన గొప్పతనమప్పుడు తెలియును. ఇంగ్లీషు పత్రికలు మోగిపోవా. మనకు స్వరాజ్యము రావలయును. అప్పు డాయన గొప్పతనము బైటకు రావలయును. ఇప్పుడే నీతోఁ జెప్పుచున్నాను. నీవు రంగనాథముగారిని గుఱించి యిట్లు మాటాడితివా. నేను సహింపలేను. ఆయన యెంత జ్ఞాని.

వాసంతి తండ్రి యిట్లుమాటాడినపుడెల్ల తండ్రిని మఱింత గేలిసేయును. అది యామె కలవాటు. ఆ గేలిసేయుటలేనిచోఁ గూతు నందలి యానందము శిరీషునకు సగము లేనట్లే. కాని యావాడు వాసంతి మాటాడలేదు. మాటాడకపోవుటకు కారణము శిరీషు కూతును దెచ్చుకొట్టెను. వాసంతి యిట్లనెను. “నాన్నగారూ! మీరన్నమాట నేను కాదనవలయును. మీకు దానికి గోపము రావలయును. నేను మిమ్మింకను దెచ్చగొట్టవలయును మీకు నా మీదఁ గోపము రావలయును. ఒకపూట నాతో మాటాడఁ గూడదు. అప్పుడు మరల వచ్చి యమ్మా యని పిలువవలెను. ఇది మీకు సరదా. నేనీపూట మీకు గోపము దెప్పింపఁదలచుకొనలేదు కాని యథార్థము చెప్పుచున్నాను. రంగనాథము మంచివాడు కాదు. అతడు స్వార్థపరుడు. అసమర్థుడు సోమరి. పాతికేకరాల పొలముమీద వాల్గుపుట్లు తెచ్చి పట్టణములో నాటక మాడుచున్నాడు. అతడే పని చేసినను స్వలాభము కొఱకే చేయును. మీ దగ్గఱ డబ్బెన్నిసార్లు అప్పు తీసుకొని వెళ్ళినాడు. మనల బాకీ చెల్లించినాడా? లేదు. మీదగ్గఱ డబ్బుతీసి కొంటేనన్న కృతజ్ఞతయైనను న్నదా? తాను మహాకవి. తన కందఱు డబ్బియవలయును. ఇప్పుట విధి. ఇది యతని యుద్దేశము. దొరగారికి స్వప్నములో నతని తాత గనిపించినాడన్న మాట దొంగమాట. వందయేండ్ల క్రిందట జచ్చిన తాత దొరగారికిఁ గనిపించెనా! ఈ తాత యెట్లుండునో దొరగారికి దెలియనే తెలియదు. ఒకవేళ గనిపించినచో దొరగారు గుర్తుపట్టలేరు. మీ రెవరని యడుగును. దాను మీ తాతగారి దివానును మహాకవియైన రంగనాథముగారి తాతనని చెప్పినాడను కొందము. ఆ దొరగా రెట్టివాడు. ఆయనకు దేవుడు లేడు. దయ్యములేదు. నా స్త్రీకుకు పైగా వర్ణాశ్రమములయందు విశ్వాసము లేనివాడు. ఈ వర్ణాశ్రమ ధర్మములే దేశమును పాడుచేసినవని విశ్వసించెడివాడు. ఇది తప్పకుండ రంగనాథము కల్పించిన కథ నాన్నగారూ! మీరు వట్టిబోళా మనుషులు. రంగనాథము తన కేదో ప్రయోజనము లేకుండ ఎదియు జేయడు. నాచేత దన పాటలు పాడించుకొనవలెనని యీ యెత్తు వేయుచున్నాడు. ఒకవేళ దొరగారి దర్శనమైనదే మనుకొందము. ఈయనకుఁ దాం

బూలము పండ్లు నిచ్చిన మాట మాత్రమబద్ధమై యుండును. అబద్ధమో నిజమో యిప్పుడే తేల్చికొని వత్తము పదండి. వారి యింటికిఁ బోదము. దగ్గఱనే గదా నే నే యడిగెదము. వాడు వేడిచేసినది ప్రొద్దుపోయినది దుకాణములు మూసి వేసిరి రంగనాథముగారు కోటలోనుంచి తెచ్చిరట గదా! రెండు బత్తాయి పళ్ళిప్పిం చుడని యడిగెదము. అట్లు జరిగినచో నామె విషయమంతయు జెప్పును గదా!” యనెను. శిరీషు బోలెడంత కోపము తెచ్చికొని మాటాడకుండఁబోయి పండు కొనెను. ఆ రాత్రియంతయు గాలి బిగించెను.

## ౭

రాణా ప్రతాపసింహ ప్రదర్శనము రాత్రికి జరుగును. రాత్రికి నాటక మాడఁదురనగా సాయంకాలమున సారథి యెవ్వరితోడను మాటాడఁడు. ఆ ప్రొద్దుటిపూట భోజనము నిస్సందేహముగాఁ జేయును. సాయంకాల మైదు గంటలకు వఱకుఁ జక్కగా విశ్రాంతి తీసికొనును. ఆ సమయములో నతనితో మాటాడుట కెవ్వరును రారు. పనులన్నియు సరిగా జరిగినవా లేవా యని చూచుటకు నెవనినో యొకనిని నియమించును. ఈ సంగతి నాటకములో వేసము వేయువారందఱికిఁ దెలియును. వాసంతికి, దెలియును. కాని వాసంతి నాల్గుగంటల వేళనతని వద్దకుబోయెను. తానొక్కర్తుకయే వెళ్ళెను. తండ్రితోఁ జెప్పలేదు. అతడు కొంతసేపటికి వాసంతి కొఱకుఁ జూచి యామె కన్పించక యిల్లు జరుగుట యెన్నడును లేనిదగుటచేతఁ గళవళింపడెను. వంటకత్తియ “యీడువచ్చినపిల్ల నలుగురితో మెలగ నేర్చినపిల, యామెకోసమంత పసి పిల్ల కొఱకు వలె నాదుర్దాపడనక్కఱ లేద”ని చెప్పెను. శిరీషునకు నామె యెచ్చటికి వెళ్ళినదో యన్న భయమునకంటె తనకుఁ జెప్పకుండ వెళ్ళినదన్న కోపమే యెక్కువగా నుండెను. ఆమె యంత స్వాతంత్ర్యము నవలంబించు ట యతనికిఁ గోపముగా నుండెను. ఒకవేళ నామెకేదైన నాపదరావచ్చును. హృదయముతోడి ప్రేమకొక మనసుతోడి ప్రేమకుఁ దొలుత కోపమువచ్చును. హృదయముతోడి ప్రేమకు మొదట భయము కలుగును. ఆమె మహాగాయకు రాలు గావలయుననియు వివాహము చేసికొన రాదనియు జీవితమంతయుఁ గళ కోసము వినియోగ పఱచ వలయుననియు నట్టివారు బ్రహ్మచర్యవ్రతము తీవ్రముగా నవలంబించవలయుననియు వూహాగల్గిన శిరీషునకు నామె తనతో జెప్పకుండ నెక్కడికో పోవుట యామె యౌవన ప్రాదుర్భావ లక్షణమని మనసులోని సంశయము. ఈ భావము శిరీషు డెప్పుడును బయట పెట్టలేదు. దానిని మనసులో వదలి పెట్టి యెప్పుడు నుండలేదు. ఇప్పటి కోపమున కది

ప్రధానకారణము. వంటకత్తె పిల్ల యెచ్చటికిఁ బోయినదో చూచిరమ్మనెను. కాని యతడు కోపములో వాకిలియవఁగము. ఆమెకు మైనారిటీ దాటినది. తన యిష్టము వచ్చిన చోటికిఁ బోవునని యూరకుండెను. కాని మనస్సులో నాటుట పడుచుండెను. రంగనాథము నింటికిఁ బోయినదేమో చూచివత్తమను కొనెను. రంగనాథమును గూర్చి శిరీషునకు మంచి యభిప్రాయము లేదు. అతనికి వయస్సువచ్చిన కుమార్తె యున్నది. అతడామెకు వివాహము చేయలేదు. చేయకపోవుట శిరీషునకుఁ దప్పు. మఱి తన కూతునకుఁ గూడ వివాహము కా లేదు గదా. తన కూతురు సంగతి వేఱు. ఆమె గాయకురాలు. ఆమె జీవితము కళారాధనకు సంకితము చేయఁబడినది. శిరీషుభావనలో గాన సరస్వతీ దేవాలయము వద్ద నామె యొక పూజారి. ఆమె వివాహము చేసికొనకూడదు. చేసికొనుట సరస్వతీద్రోహము. దేశద్రోహము. వివాహములో నేమున్నది. పిల్లలను గనుటయు నారోగ్యము చెడిపోవుటయు జంతు ధర్మము నవలంబించుటయు.

రంగనాథము మీద శిరీషునకు మఱియొక దురభిప్రాయము. రంగనాథమేళ్లుమీఱిన వాడైనను దలకు రంగు వేయును. ఆడపిల్లలతో గలిసి నవ్వుటయుఁ దిరుగుటయుఁ జేయును. అందుచేతఁ దన కూతుఁ దని యింటికి పోవుట తనకిష్టము లేదు. కాని యింత యనిష్టములో నొక యిష్టమున్నది. అతడు దొరగారికోటలో వాసంతిచేత సంగీతసభ చేయించును. ఆయిష్టమింతటి వ్యతిరేక భావమును గొంత మార్పు చేసినది.

ఇంతకును మనసులోఁ దానుదా ద్రవ్వుకొనుటయే గాని శిరీషు వాసంతి యెచటికి బోయినదో వెదుకవలెనని యనుకోలేదు. ఇతడు వెదకికొని వెళ్ళినచో నామె యొకచోటఁ గనిపించును. అచట నామె నేమియు ననలేడు. అచట మరియాదగానే మాటాడును. ఇంటికి వచ్చినతరువాత నామె నోరిపిడి పెట్టును. అందుచేత వెళ్లనక్కఱలేదు. ఇంటికి రానిమ్ము.

వాసంతి సారధి యింటికి బోయెను. సారధి యప్పటికింకను నిద్దుర లేవ లేదు. ఆమె యతని ప్రక్కనే కూర్చుండెను. అతనికి మనుష్య స్పర్శతగిలి యతఁడు మేల్కొనెను. ఇంచుమించుగాఁ దనయొడిలోఁ గూర్చుండిన వాసంతి కనిపించెను. వాసంతి యట్లు కూర్చుండుటలోఁ గ్రొత్తయేమియు లేదు. తండ్రితో నామె కలిసి యున్నపుడు కూడనట్లు కూర్చుండుట కలదు. చిన్నప్పుడతని భుజాలమీద నెక్కి త్రొక్కడిది. తనవద్దనంత చనవామెకుఁ గలదు. అతడు లేచి పోయి నూతిదగ్గఱ గాలుసేతులు కడిగికొని మరల వచ్చి యామెకు దూరముగాఁ గూర్చుండెను. ఆమె నవ్వుచుండెను.

"ఎందుకు వచ్చితివి?"

"రాకూడదా?"

"రాకూడదు"

"ఐనచో వెళ్లుచున్నాను."

"మొదలు రాఁగూడదు. వచ్చినతరువాత వెళ్లగూడదు"

"రాగూడకపోవుట నీ యధికారము. వెళ్లుట నా యధికారము"

"నాయధికారము నీ వతిక్రమించితివి గనుక నీ యధికారము నీకు లేదు"

"ఐనచో వెళ్లను. ఇచ్చటనే యుండెదను"

"ఎందుకు వచ్చితివి"

"నేను చెప్పను"

"నా కాఁకలి యగుచున్నది. నేను పోయి యేమైనను దినిరావలయును"

"పొమ్ము"

"కాదు. వామా! దేనికి వచ్చితివి"

"రాత్రికి నేను 'వేషము వేయవలయునుగదా! నే నెట్లభినయించవలయును. నేను మోహినీవేషము వేసినపుడు నాకుఁ దెలియదు. నే నభినయించితి నని యంద ఱనుకొన్నారు. అది యెట్లు జరిగినది. దాని రహస్య మేమి? నేను నేడుగూడ నట్లు చేయుటకు వీలున్నదా"

"నీ వీనాడు మధ్యాహ్నము ఫలహారము చేసితివా?"

"చేయలేదు"

"ఐనచోఁ జేయకుము, రాత్రికి భోజనము చేయవద్దు. కడుపు నకనక లాడుచుండును. నీవీనాడు వేయవలసినవేషము ప్రతాపసింహుని భార్యవేషము. వారు కష్టములలో నున్నారు. తిండితిప్పలు లేవు. మొగములో దైన్యము స్వతస్సిద్ధముగా గనిపించవలయును. ఆకలి యగుచున్న దనుకొనుము. మొగము సహజముగా వాడియుండును. అదే కొంత దైన్యము. సరిపోవును"

"నే నన్నము తినకుండ నిలువలేను."

"ఐనచో మరీ నయము. ప్రయత్నములేకుండనే తూలిపోదువు. నిలుచుండలేవు. కూర్చుండలేవు. మొగము వాడియుండును. అచ్చముగా నీ వభినయించినట్లే యుండును"

"నా మొగముమీద దైన్య మెందుకుఁ గనిపించును. మా రంగులు వేయువాడు రెండు కోటా లిచ్చును. నేను వలదన్నచో వినడు. మొగమున వాని యంతి నవి యేర్పడు రేఖలు కనిపించకుండ వాడింతరంగు మెత్తును. నీరంగును

గీయుంతట నీవు వేసికొందువు. మొగమునకుఁ బూయ తెప్పించుకొందువు. కాని ముఖరేఖలు కనిపించకుండ మెత్తుకొవు. నీవు వాడుకొను రంగులు వేఱు. నావి వేఱు నీవు పూసికొను రంగు నా కిమ్ము. నే నీవేళ నా రంగుమాత్రమే పూసికొందును. పైగా నాకు వేసము వేయుటకు వా డెందుకు. నేను చీర కట్టుకొనలేనా. పైఠాణి తొడుగుకొనలేనా. నా రంగు నేనే వేసికొందును. నా వేసము నేనే కట్టుకొందును. మొగమునకుఁ జేతులకుఁ బూసికొనుటకు నీ రంగు నా కిమ్ము. అట్లయినచో నేను వేసము వేసికొందును. లేనిచో రాను"

"నీ యిష్టము వచ్చినట్లు చేయుము. అంతయు సిద్ధమైన తరువాత నాటకము నట్టేటిలో దింపకుము. నీ కడుపునఁ బుట్టెదను.

"అసలు నే నభినయించుట యెట్లో చెప్పలేదు. అభినయము యొక్క రహస్యము దెలిసిన గాని నేను వేషము వేయను"

"మున్ను నెట్టభినయించితివి"

"ఆమె నాకుఁ దెలియదు"

"అట్లే తెలియకుండ నేనుగూడ నభినయింతునేమో"

"ఐనచో నీవు నాచేత వేసము వేయించికొన్నట్లే"

సారథి చాలసేపాలోచించుచుఁ గూర్చుండెను. చివఱ కిట్లనెను.

"ఈ నాటకము కానిమ్ము. తరువాత నేను చెప్పెదను. అది నేను నీకుఁ జెప్పదగిన మాట కాదు. చెప్పవలసిన యవసరము నా జీవితములో రాకుండ నుండవలయునని గోరుచున్నాను" అని యవ్వి సామాన్యముగా నతఁ డామె మాటలాడునపు డవలంబించు నుత్సాహ మిశ్రితమైన ముద్దుతోఁగూడిన యొక పరియాచికము పద్ధతి నవలంబించి మరల ననెను. "వాసూ! నేను కూడ నీవు చక్కగా నభినయించితి వనుకొనుము. అప్పుడా రహస్యము చెప్పనక్కరలేదు. నటనములోని రహస్యము నీకుఁ దెలిసిపోయిన దన్నమాట. ఎట్లు తెలిసిన నేమి. తెలియుటకదా. ప్రధానము కనుక నీ వీపూట భోజనము చేయవద్దు

"సరే వెళ్లుచున్నాను. భోజనము చేయను".

ఇంక నెంత యడిగినను సారథి చెప్పడని వాసంతికిఁ దెలియును. అది యేదో రహస్యమైయుండునని వాసంతి యనుకొనెను. అది తనకుఁ జెప్పకూడదా. చెప్పవలసిన పరిస్థితి సంభవించకుండ నతడు కోరునట. తనకా రహస్యము చూచాయగానయినా తెలిసినచో అతడు తనతోఁ జెప్పెడి సన్నివేశ మేర్పరచును. తా నారాత్రి భోజనము చేయకుండ నుండఁగలదా. ఫలహారము వేళ దాటిపోయినది. ఫలహారము చేయకుండఁ దానుండఁగలదా. ఆమె

కపుడు తన కాకలి వేయుచున్నదా యన్న ప్రశ్న కలిగెను. ఆకలి వేయుచున్నట్లు లేదే. రెండుపూటలు ఫలహారము. రెండుపూటలు భోజనము. ఆ వేళ క[illegible] చేయుట యలవాటైనది కాని తన కాకలి యెప్పుడు వేసినది. ఆవేళకుఁ దినుటయే జరుగుచున్నది. ఆకలి యెట్లుండునో తెలిసికొనుటకు సారధి మంచియుపదేశ మిచ్చినాడు. ఆమె యింటికిఁ బోయినది. తండ్రి మొగము ముడుచుకొని కూర్చుండెను. వంటకత్తె ఫలహారమును దెచ్చిపెట్టెను. ఆమె తాను తినని వట్టి కాఫీ త్రాగెను. శిరీషిల్లనెను. ఆమె కేమి మహారాణి. రంగనాథము గారి యింటిలో ఫలహారము పెట్టియుందురు. వారికేమి జమీందారులు. మనము వట్టి యిడ్డెనలు, పెసరట్లే తిందుము."

వాసంతి-"నాన్నగారూ! నేను రంగనాథము గారింటికినీ వెళ్ళలేదు. ఫలహారమును జేయలేదు.

అతడు-"నీ వెచ్చటికి వెళ్ళితివో నాకెందుకు. ఫలహారము చేసితివో లేదో నాకెందుకు. నేను నీకుఁ దండ్రినా. నీవు పెద్ద విద్వాంసురాలవు. నేను వట్టి చవటను. ఎందునకుఁ బనికి రానివాడను. నీకుఁ దండ్రిగా నుండుటకుఁ దగను. నీవు స్వతంత్రురాల వైపోయినావు. రంగనాథమున్నాడు గదా, కోటలో నీసభ జరుగును. నీవు రాణివై పోయెదవు. ఆస్థాన విద్వాంసురాల వయ్యెదవు. అపుడు నీకు మాలెక్క యేమిటి. నీయంత దానివి నీవు. మే మెవరమో"

వాసంతి కన్నీళ్ళు పెటుకొని పోయి తనగదిలోఁ బండుకొని యేడ్వ నారంభించెను. లోపలఁ దలుపుగడియ వేసికొనెను. ఆమె ప్రొద్దుకుంకువఱకు సారధివద్దనె యుండెను. ఇంటికి వచ్చువేళకు నేడు గంటలయ్యెను. తండ్రి కూతుల యీ వాగ్వాదము గంటసేపు జరిగెను. ఇంక భోజనము చేసి తాము నాటక భవనమునకుఁ బోవు వేళయైనది. తమకొఱకు బండి వచ్చెను. బండి వచ్చెను. అప్పటికిఁ దొమ్మిది గంటలయ్యెను. వాసంతి తలుపు తెఱవలేదు. వంటకత్తె పలుసార్లు పిలిచినది. చివఱకు శిరీషువెళ్ళి కొంతసేపు కోపపడెను. మఱి కొంతసేపు బతిమాలెను. ఆమె తలుపు తీయలేదు. కాలమూరక గడచిపోవుచుండెను. నాటకశాలనుండి పదిపిలుపులు వచ్చెను. అపుడు శిరీషు తలుపు దగ్గఱకు బోయి యిట్లనెను. "నీవు భోజనము చేయ నక్కఱలేదు. ప్రాయోపవేశము చేయుదువు గాని, ఆ సారధి నాటకము పాడైపోవును. ఆ వేసము వేసిన తరువాత మరల వచ్చి గదిలోఁ బండుకొని తలుపు తాళము వేసికొనుము. మరల సారధి దగ్గఱ నేను తలయెత్తికొనునట్లు చేయుము. నీవు వెంటనే తలుపు తీయక పోయినచో నేనింటిలో నుండి వెళ్ళిపోవుచున్నాను. నీవు బ్రతికియుండగా

నేను తిరిగిరాను. నేను నీకు, దం[illegible] వెంటనే తలుపు తీ[illegible]ను. వాసంతి తలుపు తీసెను. వంటయామిడ [illegible] 'చేయి' వచ్చెను. శిరీషు "పోగీతే నాటకమునుండి వచ్చిన [illegible] దనవచ్చు ననెను. ఆమెకు నాటకము మొదలి పగములో వేషము లేదు ఆమె పోయి తన వేష ధారణపు గదిలోఁ గూర్చుండి యేడ్చుచుండెను. ఆమె వేషము వచ్చుటకు పదుము నొక్క రంగమే యున్నదనగా సారధి యామె వద్దకు బోయెను. ఆమె కూర్చుండి యుండెను గాని వేషము వేసికొనుట మొదలు పెట్టలేదు. అచట నొక చిన్న దీపమున్నది. వాసంతి యే స్థితిలో నున్నదో యాతనికిఁ దెలియదు. అతఁడామెనుఁ దొందఱ పెట్టి తన రంగుసీసా తెచ్చి యామెకిచ్చి "యెలాగో యొకయల్లాగు తొందఱగా వేసికో. ఈ రంగమైపోయినంతనే నీవు రావలయు"నని చెప్పివెళ్ళెను. ఆమెతల చీకిరిబాకిరిగా నుండెను. ఆ రంగు మొగానికి బూసికొనట్లు పూసికొనెను. ఎట్లున్న నేమిలే యన్నట్టు మొగానఁ బెద్దకుంకుమబొట్టద్దములోఁ జూచి పెట్టుకొనెను. దుస్తులుంచు పెట్టెలో నుండి దీసి యొక తెల్లచీర కట్టుకొనెను. ఇదివఱ కామె యొక ముఖమల్ రవిక తొడిగికొని యుండెను. దానినూడఁ దీయలేదు. తండ్రిమీదఁ గోపము కొలది జేతికున్న యాజుఱతల గాజు లింటివద్దనే తీసివేసెను. ఆమె రంగములోఁ బ్రవేశించు వేళయైనది. ఒక కుఱ్ఱవాడు రాణాప్రతాపసింహునకుఁ గొడుకు. వానిని ముందు పెట్టుకొని వాసంతి రంగభూమి కవతరించెను. ఆమె యవతరించుచుండగనే యెదురుగా నా తలివైపు నుండి సారథియు రాణాప్రతాపసింహుని వేషముతో రంగస్థలమున కవతరించెను. అతడును సామాజికులును వాసంతి నొక్క మాఱు చూచిరి. వాసంతి కనులెత్తి సారథిని జూచెను. ఆ కనులు చింతనిప్పుల వలె నుండెను. ఆమె కంటె దుఃఖమూర్తి మఱి యింకెవ్వరన్నటుండెను. ఆమె తాకి వచో ద్ధరై పోవునట్లుండెను. తనతండ్రి యిల్లు మాటాడెనని సారథితోఁ జెప్పవలెనన్నట్లామె ముందుకు నడచెను. వెనుకనుండి యామె నోట నవలసిన మాట యొకఁడందించుచుండెను. "మహారాజా! ప్రొద్దుటి నుండియు భోజనము లేదు. పిల్లవాఁడేడ్చి యేడ్చి నీరసించెను. తినుటకేమైనను దెచ్చితిరా" ఈ మాట లామె యనవలెయును. తనస్థితి పిల్లవాని మీద, బెట్టినట్లుండెను. ఆమె యీ మాటలు నోటితో ననెను. తన కప్పుడున్న దైన్యములో బిల్లవానిని దగ్గఱకుఁ దీసికొని యెత్తికొనుట యామెకు తన దీనస్థితికి దన యోపిక లేని తనమునకు సహజముగా నాలంబన మయ్యెను. ఆమె యెట్లు నిలిచినదో యామెకు దెలియదు. ఆ పిల్లవాని నెట్లు దగ్గఱకు దీసికొన్నదో యామెకు దెలియదు. తన నిరాభరణ సుందరమైన మూర్తి తాను శ్రద్ధ లేకుండఁ గట్టిన చీర తొలగించని ముఖ

ముల్ రయిక యీ పరిస్థితి కామెకెంత దోహదము చేసినదో యామెకుఁ దెలియదు. ఆమె మహారాణి కనుక మిగిలిన పటురయిక తొడిగికొనవచ్చును. ఇప్పటిస్థితి యీ తెల్లచీర, అశ్రద్ధగా, బెట్టికొన్న పెద్ద కుంకుమబొట్టు పాతివ్రత్యమును దీపింపఁ జేసెను. గాజులు లేని చేతులు తన యిప్పటి బీదతనమును వెల్లడించుచుండెను. మొగమున దనకుఁ జేతకాకుండఁ బూసికొనిన రంగు అనవులలోఁ దిరిగి కొట్టుకొనిన గుమ్మగలెనుండెను. ఆ యౌవని కనులలో దైన్యము ప్రస్ఫుటింపఁ బడుచుండెను. ఓపిక లేక కంఠస్వరము మందముగా నుండెను. సహజమైన కంఠ మాధుర్యము పెడఁబాయ లేదు. పిల్లవానిని దగ్గఱకుఁ దీసికొనుట యామెయొక్క యజ్ఞాతమైన యొక రమణీయమైన చిహ్నమయ్యెను. సామాజికులందఱు ప్రశంసా హస్తాస్ఫాలనములు చేసిరి. సారథి వాసంతిని జూచుచునే నివ్వెరపోయెను. ఆమె యింతలో నింత యభినయశాలిని యెట్లయ్యెనో యాతనికిఁ దెలియలేదు. ఆమె యున్నచో నతని మనసులోఁ ఎన గుండెలోఁ దాను పట్టలేనంత ప్రేమయు జాలియు నుదయించెను. అతఁడొక యారలిప్తగా, ప్రతాపసింహుఁడుగా లేఁడు. సామాజికుఁడుగా నయ్యెను. వెంటనే సామాజికుల వంకఁ జూచెను. చేనును మానలేనే యామెను ప్రశంసించుచున్నా నన్నట్లున్నదా చూపు. అతని చూపు తొలివరుస మీఁదఁబడెను. నాటకము నగమైనను సారథి యింతవఱకు సామాజికుల వంక జూచి లేదు. తొలివరుసలో నందఱును కూర్చుండిరి. జమీందారు, అవధాని, రంగనాథము. మఱి కొందఱు పెద్దలు. ఉమాపతి తొలివరుసలోఁ గూర్చుండెను. మలివరుసలోఁ గిరీటి యుండెను. కిరీటికిఁ దాను ప్రవేశపు చీటి పంపించుట మఱచిపోయెను. అతఁడు పేద కుఱ్ఱవాఁడు. గరిములో కూర్చుండెను. రెండు రూకలు పెట్టి టిక్కెటు కొన్నికొన్నాఁడు. తనకీ నాటకమునందలి యభినయము చేతి వప్పు జేసి తెచ్చినవాఁడు కవిలోలు. రేపతనికా డబ్బు రాఁగలయును. అవధాని మొగము గాంభీర్యమును గోపమును వెళ్ళగ్రక్కుచుండెను. రంగనాథ మెప్పటివలెనే నవ్వుచుండెను. దొరగారి మొగమున నూహింపరాని యొక భావమేదియో గనిపించుచుండెను. ఆయన దృష్టి వాసంతిమీదనే నిలిచియుండెను సారథి చూపు నాల్గువైపులఁ జరిగెను. అతఁడు సామాజికుల వంక జూచుచుండెను. తనలోఁ దాను జూచుకొనుచుండెనో రాణాప్రతాపుని కుటుంబకష్టములను భావించి వానిని దిగ్రుదాఁచుచుండెనో సామాజికుల కేమియుఁ దెలియదు. అతఁడు తన కుటుంబకష్టమును జూచి దిగ్భ్రాంతుఁడై పిచ్చిపిచ్చిగా నలువైపుల జూచుచున్నట్లు సామాజికులకు భాసించెను. అతఁడేదో భావించుచున్నాఁడు. దాని నభినయముగా ప్రదర్శించుచున్నాఁడని తెలిసినదా సామాజికులలో నొక్కఁడే.

సారథి సంగీతమును నిందింప నారంభించెను. "అబ్బబ్బ! కర్ణకఠోరము. అతను పద్యము లెందుకుఁ జదువవలయును. వచనమే చదువరాదా. అయిన నవియేమి పద్యములు. ఎవడో కుర్రకుంక వ్రాసినపద్యములా. అవి సభాసదులను రంజింపఁ జేయునా" యనెను. ఆ మాటలు రంగనాథము వినుచునేయుండెను. తాను వ్రాసితినని చెప్పుట కదనకాదు. అందుచేత నూరకనవ్వుచుఁ గూర్చుండెను.

కొంతసేపటికి సద్దుమణఁగెను. మరల నాటకము సాగెను. నాటకము చివరివరకు నిశ్శబ్దముగానే యుండెను. మఱల రక్తికటలేదు. నాటకములోఁ దరువాతి విసుగుకూడలేదు. రాణా ప్రతాపుఁడు సంధికొఱకు నక్బరునకు జాబువ్రాయుటయు నాజాబు రాజా మానసింగ్ చేతిలోఁ బడుటయు నతఁడు విచారించుటయుఁ జివర కక్బరు సంధి చేసికొనుటయు మొదలైన వృత్తాంతము. నాటక మైపోయినది.

అవధాని తా నుపన్యసింతునని లేచెను. అతని నిద్దఱు మనుష్యులు పట్టుకొని రంగభూమి కెక్కించిరి. అతఁ డుపన్యసించుటకు లేవఁగా నాయూరిలో శ్రద్ధగా వినువారెవరును లేరు. ఎవరిదారిని వారు మాటాడుకొనుచుండగా తాను గొంతెత్తి యఱచుట యాతని యలవాటు. మొదటి రెండు మూడు వరుసల లోనివారు మాత్రమే పెద్దమనిషి తరహాకొఱకు మాటాడకుండ గూర్చుండిరి. అతఁ డుపన్యసింప నారంభించెను. "ఆర్యమహాశయులారా! నాటకము బాగుగా నున్నది. పద్యములుగాని వచనములుగాని బాగుగాలేవు. ఎవడో చదువుకొని వాడు వ్రాసిన నాటకము-సభలోనుండి "నీవ్రాతకన్న బాగుగా నేయున్నదని" యఱపు. కాని సారథి యభినయము చాల ప్రశస్తముగా నున్నది. కాని యతనికి సంగీతము రాదు- నీగొంతుకవలె గార్దభస్వరము కాదని సభలో నొక యఱపు.

ఈ మాట వినినంతనే యవధాని కొడలు కంపరమెత్తెను "ఎవఁడా యన్నది. ఎవఁడా యన్నది." యని యవధాని కదలిపోయెను. "నేనెంతవాఁడను. నేనెంతవాఁడను. నన్నంత మాటయందువా ఎవఁడునీవు ఎవఁడునీవు. పుండాకోరా! నేను రాజాగారి యాస్థానకవిని. శతాధిక గ్రంథకర్తను. మహాసభలలో ప్రఖ్యాతి వడసిన నన్నయ్య తిక్కనలు నా ముందు పనికిరారు" అని కొంతసేపు విజృంభించెను. ఎవరో యొక పెద్దమనిషివలె నున్న యాతఁడు సభలో నుండి లేచి నిలుచుండి "యవధానిగారూ! మిమ్మన్నచో మీ కంత కోపము వచ్చెను గదా! సారథిగారి నాటకము నల్లరి చేయుడని మీరు దొరగారి [illegible] తీసికొని వచ్చితిరి" యని యడిగెను. సభయంతయు నిశ్శబ్దమయ్యెను. అప్పుడవధాని యిట్లనెను. "ఔరా! నేను. నేనల్లరి చేయించుటకు మనుజులను దీసికొని వత్తునా, నా కేమి మర్యాదలేదా. నేను మరియాద తెలియనా. సారథి

యున్నచో నాకెంత ప్రేమ. అతడు నాకు శిష్యుని వంటివాడు. రుక్మాంగద నాటకము నేనతనికి వ్రాసి పెటలేదా. ఈయభూతకల్పన యెవరు చేసిరి. వారిని దేవుడు శిక్షించును. ముమ్మాటికిని శిక్షించును. శిక్షించితీరును" అని అవధాని కన్నీరు పెటుకొని "నేనిటువంటి పని చేయుదునా దొరగారూ! విన్నారా! ఈ యూరిలో నాకు శత్రువులున్నారు వారికి నేనన్నచో విరోధము. ఇదివారు కల్పించిన కల్పన మహాజనులారా! నేనిదిగో ప్రమాణము చేయుచున్నాను. ప్రమాణము చేయుచున్నాను నేనట్టి తుచ్ఛపు పనిచేయను. చేయను చేయను త్రికరణశుద్ధిగా నమ్ముడు. నమ్ముడు నమ్ముడు. సారధికి సంగీతము రాకపోయినను నష్టములేదు. అతడు మహానటుడు" అవధానియొక్క యీ శోకణిపోవుచుండెను, దానికి మొదలు చివరలుండవని యందఱకుఁ దెలియును. పెద్దమనుష్యులున్న సభలో వయసు మీఱిన వాడని బహు గ్రంథములు వ్రాసిన వాడని దొరగారి యాశ్రయము కలవాడని యతని వెఱ్ఱిమాటల నాదరించి యూరకుందురు. నాటకశాలలో నెవరూరకుందురు "దిగుదిగు" అని కేకలు వేసిరి. అల్లరి ఎక్కువయ్యెను. ఆయన దిగక తప్పకవచ్చెను. చేతులమీద దింపిరి కుర్చీలోఁ గూర్చుండబెట్టిరి. కూర్చుండి యతడు తనకు సారధిపై గల ప్రేమను ఉపన్యసింప నారంభించెను. సభలోఁ జాలమంది యెవరి దారిని వారు లేచి పోవుచుండిరి. చివరకుఁ గోతిలో గూర్చున్నవారు కూడ పోక తప్పకవచ్చెను. కొందఱు కోపముతోఁ గొందఱు నవ్వులతోఁ గొందఱు దుఃఖముతో నిష్క్రమించిరి.

శిరీషు తాను సామాన్యముగాఁదన కూతురు వేసము వేసికొను గదిలో నామెతోఁబాటు గూర్చుండి యామె రంగము మీఁదికి వచ్చువేళకు, బోయి సభలోఁ గూర్చుండును. ఈనాఁడాద్యంతము సభలోనె గూర్చుండెను. అతడు కూడఁదనకూతురియొక్క యభినయ విశేషమున కానందించెను. వాసంతి యట్లభినయించునని యతనికిఁ గూడఁ దెలియదు. వేషధారణ మంతి యుచితముగా నుండునని యనుకొనలేదు. కాని యందఱును పొందినంత దిగ్భ్రాంతి యతడు పొందలేదు. ఆమె కన్నులెఱ్ఱబడుటయు నామె తూలిపోవుటయు నామె కోపిక లేకుండుటయు వీనికిఁ గారణము తనికిఁ దెలియును. ఐనను దీనికి మించిన యెద్దో యభినయమామె చేసెను. అట్ల చేయుటకు సారధియామెకెదో హితోపదేశము చేసి యుండవలెయును. ఆమె సాయంకాలమున సారధియొద్దకు వెళ్ళినదేమో! అతనభినయ రహస్యమును జెప్పియుండును. అతనికి వాసంతి మీద కోపము పోయెను. తనకూతురొక్క గాయకురాలే కాదు. అభినయవేత్త్రి కూడను. అతనికొ విషయము మహానందదాయిగా నుండెను సామాజికులందఱు

విడిచిపోయిన తరువాత నతడు కూతురు గదిలోనికిఁ బోయెను. ఆమెయు దండ్రితో బయలుదేరెను. ఇద్దఱును గుఱ్ఱపు బండిమీద నింటికిఁ బోయిరి. అప్పుడామె నన్నము తినుమనిరి. ఆమె తినెను. పోయి తానొక్కరుతయుఁదన గదిలోఁ బండుకొనెను. ప్రతిదినము చావడిలోననే వంటకత్తెయు, దండ్రి కూతులిద్దఱును. ముగ్గురును మూడుచోట్ల మంచములు వేసి పండుకొందురు.

తెల్లవారెను. ప్రొద్దెక్కెను, ఏడున్నరదాటెను. అప్పుడు గాని శిరీషు వకు మేలుకొన రాలేదు. వాసంతి గది తలుపు తెఱువ లేదు. ఆ నాఁడు ఫలహారములు లేవు. నట్టె కాఫీ త్రాగి భోజనమునకు గూడఁ జాల ప్రొద్దుపోయెను. తండ్రి కూతులు మాటాడుటలేదు. ఆమె వచ్చి నాన్నగారూ యని పలుకరింపలేదు. అతఁడు బోయి మాటాడుటలేదు. ఆమె భోజనము చేసి పోయి మరల తన గదిలోఁ బండుకొనెను. మధ్యాహ్నపు ఘంటావేళకు రంగనాథము వచ్చెను. అతని నట చావడిలో విడిపించెను. వాసంతి వెలుపలికి వచ్చెను. అతఁడు గడచిన రాత్రి వాసంతి యొక్క యభినయ విశేషమును ప్రశంసింప నారంభించెను. "వాసంతి పెద్ద యభినయకర్తి యయ్యెను. ఈ రెండు నాటకములలో నామె యెంతో గొప్పగా నభినయించెను. ఈ విద్యయొల్లు నేర్చెను ఊరంతయుఁ బలుల బడి పొగడుచున్నారు, ఇది చిత్రముగా నున్నది. అభినయము స్వతస్సిద్ధముగా రావలెయును. ఈమె కెటు వచ్చినది. దొరగారామె యభినయమును జూచి దిగ్భ్రాంతులై పోయినారు. రాత్రి నాటకములో నామె కొక్కటే పద్యమున్నది. ఆ పద్యము చక్రవాక రాగముమీదఁ బాడెను. అనఁగా వాసంతి "కాదండీ! అది మాయామాళవగౌళ" యనెను. రంగనాథ మిట్లనెను ఔను నాకు దెలియును. వేదితువఁబోయి యిది యన్నాను. దొరగారు నీ సంగీతము నెంత మెచ్చుకొన్నారు. వేట ప్రాస్తున గోటలోని- పల్లి వచ్చితివి. నీచేతఁ బాట కచేరి పెట్టించి తీరవలయునని చెప్పినారు. రాత్రి మేమంతయు నాటకమునకు వచ్చితివి. మా చెలియలు గమలయుఁ గూడ వచ్చిరి. నీవు వారితోఁ గలిసి యుండవు. కాని వాసంతీ! వారికి నీ యన్నచో నెంతయో ప్రేమ. పెద్దరాణిగారు నిన్ను మాటలాడనన్నదట. నీవు కోటలోనికి వచ్చినచో నీచేతఁ బాడించుకొని వినవలయునట. నీవీ సారి నాటకమాడినపుడు రాణిగారు కూడ వచ్చి చూతురట. రంగనాథము వారి యింటిలో నొక గంటగంటన్నఱ సేపుండెను. ఆ కాలములో దండ్రికూతులిద్దఱికి మాటలు గలిసెను. లోకములోనిది యొక చమత్కారము. బంధువులలో మరియు నాప్తులలోఁ గోపములు వచ్చి మాటాడుట మానివేసినచో స్నేహితులో బంధువులో వచ్చి యింటిలోఁ గొంతసేపుండినచో వారితోఁ గలసి మాటాడు వేళ వీరు తమ కోపాలను మఱచిపోయెదరు

వ్యాఖ్యానమే చేయుదురు. కనుక సర్వథా శీలరక్షణ చేసికొనవలయును. వాసంతి. ఈ సర్వజనులకుఁ గామాదులున్నవి. ఆ కామాదులు ధర్మమార్గమునఁ బరిరక్షింపఁ బడినపుడు శీలవంతు లపమార్గముఁ బోరు. ధర్మమార్గ పరిరక్షలేనపుడు బుద్ధి యధర్మసాగరమున నడచుటకు వీలున్నది.

శిరీషు-నీవింత తెలిసినదానవు గనుక నే చెప్పుచున్నాను. ఋషులు మహా ధర్మకార్యవ్యగ్రులు. కామాదులను నశింపజేయుదురు.

వాసంతి-ఋషులు కామాదులకు లొంగినవారు చాల కలరు.

శిరీషు-వారి సంగతి కాదు. విశ్వామిత్రుఁడు లొంగెను. వశిష్ఠుఁడు లొంగెనా నీవు వశిష్ఠునివలె నుండవలెనని నాయూహ.

వాసంతి-"నాయనగారూ! నే నేమైన నన్నచో మీకుఁ గోపము వచ్చును. స్త్రీలు విషయమునుగూడ విస్పష్టముగా మాటాడఁగూడదు. నేను మీతో నిట్టి విషయములు నూటికి కోటికెప్పుడో మాటాడుదును. నేను చిన్నదానవే. మీరు నన్ను లోక మెరుఁగకుండఁ బెంచినమాట నిజమే. కాని లోకమును జూచుచున్నాను, తెలిసికొనుచున్నాను. మీకు నలుబదియేండ్లు దాటినవి. నే ననఁ గూడదు కాని మన యాయుర్దాయముల గురించి మనకుఁ దెలియదు. నేనే ముందుపోయినచో నష్టములేదు మా అమ్మకొఱకు దుఃఖించినట్టే నాకొఱకుఁ గూడ కొంత దుఃఖింతురు మాయమ్మ చనిపోయిన తరువాత నామె కొఱకు మరల వివాహము చేసికొననని తీవ్ర వ్రత మవలంబించినట్టే నా కొఱకుఁగూడ మరొక వ్రత మవలంబింపవచ్చును. ముందు మీరే పోవుదు రనుకొనుడు. అప్పుడు నే నేమి కావలయును. మీరు మగవారున్నారు కనుక కాలుఁగింజలు కసూలగుచున్నవి. రైతులు మీకిచ్చినట్లు నాకిత్తురా. నేనుపోయి కసూలు చేసికొని రాఁగలనా. ఈ సంగతియు నాటకాభినయము గింజలు కసూలు చేసికొనుట మీకు నొకసారి పొసఁగునా? నే నొక్కర్తనింటిలో నుందును. మగదిక్కు లేనియిల్లు సరిగానుండునా? మగవాఁడున్నప్పుడు లోకము భయపడినట్లు స్త్రీ యొంటరిగా నున్నప్పుడు భయపడునా? నాయనగారూ! మానవజన్మ యున్నంత నే సగము శరీరము. సగము ఆత్మ. ఋషుల విషయములో దేహముకంటె నాత్మ బలవత్తరమేమో కాని మానవుల విషయములో నాత్మకంటె దేహము బలవత్తరము. నే నింత రోటు నేర్చితినని యాశ్చర్యపడవచ్చును. నాకు దెలియకుండ నేను మీరు చెప్పినంత గొప్పగా రాత్రి [illegible] యిదియు నట్టే నేర్చితిని. గాంధితోడి పరిచయము నాకు దినదినము జ్ఞానాభివృద్ధి కలిగించుచున్నది. అతఁ డొక మహాపురుషుఁడు. లోకముయొక్క దృష్టిలో శీలములేనివాఁడు. అతఁడు కానివాఁడు నాదృష్టిలో వరకుటుంబినిముయొక్క రహస్యం

మంతయు మూటకట్టినవాడు. అతనిమాట యతని ప్రవర్తన యతని జ్ఞానము నాకు విచ్చట నచ్చెరువు గొలుపును. అతనిని జూచుచుఁ గూర్చున్నచో జాలును. లౌకిక జ్ఞానము సంపూర్ణముగా గలుగును. ఈలోకముయొక్క వ్యర్థత్వము తెలియును."

తరువాత దండ్రి కూతురిద్దఱు కొంతసేపు మాటాడలేదు. వాసంతి ప్రారంభించి మాటాడినపుడు శిరీషు మాఱు పలుకడు. దాని వాఁడి రెన్నాళ్ళైన తరువాత మఱియొక రీతిగా వచ్చును. రెన్నాళ్ళయిన తరువాత వచ్చెను. ఆ నాడు వాసంతి లాంతరు తొందఱగా ముందఱకు లాగెను. కిరోసిను నూనె తొణికి వత్తిమేర చెదరి వత్తి గుప్పుగుప్పుమని దీపమారిపోయెను. శిరీషిట్లనెను. నీ దగ్గఱ నా తొందఱ యున్నది. ఆ తొందఱయే పనికిరాదు. అదియే చివఱకు నిన్నుపాడు చేయును. నీవద్ద నా దోసము లేకుండ జేయుటకు నేను చేసెడు ప్రయత్నము లన్నియు వ్యర్థములగు చున్నవి. నీవు చాల జాగ్రత్త కలదానివని నీయభిప్రాయము. చాలా యాలోచన పరురాలవని నీ యభిప్రాయము. లోకమును జూచి సర్వము గ్రహింపగలవు. లోకము పైకి చాల మంచివారుగానే కనిపింతురు. ఒకడొక గొప్పకవి. మఱియొకడు గొప్ప నటకుడు. ఇంకొకడు గొప్ప శిల్పి. మఱి యొకడు గొప్ప యధికారి. ఈ గొప్పదనములు వారి విద్యావిషయములు. వారు ధన సంపాదన జేయుటను గూర్చినవి. అంతియేగాని వారి యాత్మోన్నత్యము కాదు. వారియింద్రియ విగ్రహము కాదు. వారు కాంతా కనకములందు వైరాగ్యము కలిగిన వారు కారు. ఈ సంగతి తెలిసికొనవలయును. తొందఱ పనికిరాదు. కొంచెము తొందఱపడినచో దానివలన నెంతయో నష్టము. ఇప్పుడీ లాంతరు చూడుము. వత్తిలో నెక్కిన నూనె యంతయు నోడ్వవలయును. మండించు కొప్పెలో వేరె గుడ్డపెట్టి తుడువవలయును. మొదట లాంతరు నిండుగా నూనె పోయరాదు. ఇవి యన్నియుఁ జిన్న విషములే. వీనిలో శ్రద్ధ చూపించిన వారికే జీవితములోని మహా విషయములందు శ్రద్ధ యేర్పడును. పెద్దవాండ్లు చెప్పినట్లు నడచుకొనవలయును. నీవన్నట్లు నేను తొందఱగాఁ జనిపోవుదుననుకొనుము. అట్లైనచో నీకివి యన్నియు నెవరు చెప్పెదరు. కనుక నేను బ్రదికి యుండగనే నేర్చికొనవలయును. సారథి నాకన్న బెద్దవాడు. నేను చనిపోయి యతడే బ్రదికి యుండవచ్చును. గాని న్యాయముగా ముందతడే చనిపోవలయును గదా! ఆవిడ వంటచేయుచున్నది. దీపము నీవే వెలిగించి కొని రావలయును. ఆ చీకటిలో వాసంతి మొగము ముడుచుకొన్నదని శిరీషునకుఁ దెలియును. ఆమె లాంతరు చేతబుచ్చికొని వెడలిన పద్ధతిలోనే యామె చీర చెఱుగు విసరుకొనెడు పద్ధతిలోనే శిరీషుని కామె

కు కోపము వచ్చెనని తెలిసెను. వచ్చునని తెలియును. రావలయుననియే యతని యూహ. కోపము వచ్చినను దనమాటలోని నిశితత్వము హృదయమునకుఁ ఘట్టునుగదా. అతఁడు వాంఛించునది యది.

ఇక వారాత్రికి వారు మాటాడలేదు. ఈ మాత్రమునకు మరునాడు మాటాడకుండుట జరుగదు. మఱల దినములు గడుచుచుండెను. వాసంతికి సారథివద్దకుఁ బోయి మాటాడవలయునని యున్నది. తండ్రితో జెప్పకుండఁ బోవుట యీసారి యిష్టములేదు. తానొక్కర్తుకయే పోవలయును. తండ్రితో జెప్పినచో నతఁడు కూడ వచ్చును. తండ్రి వచ్చిననేమి. అతనితో దాను స్వేచ్ఛగా మాటాడుటకు వీలుగాదు. తండ్రి యున్నప్పటికంటె లేనప్పుడే మరింత యెక్కువ స్వేచ్ఛగా మాటాడెను. అదికాదు, తండ్రి యున్నచోఁ దన స్వేచ్ఛకేదో భంగమైనట్లుండెను. తన మనస్సు తెఱపిగా నుండదు. అతనిని గొన్ని రహస్యములడుగవలయును. తండ్రి ప్రక్కనుండగా నతఁడు వానికి సమాధానము చెప్పినను దనకు వినినట్లుండదు. ఈసారి మరల నతనితో జెప్పకుండ నేగినచోఁ బెద్ద రభస యగును. అందుచేత నామె తండ్రితో నిట్లనెను. "నాన్నగారూ! మీకు సారథిమీద నిష్టము లేదు." శిరీషు "సారథి మహానటుడని నాకుఁ దెలియును. అతడన్నచో నాకు మిక్కిలి గౌరవము" వాసంతి-"నేనొక్కర్తను సారథి దగ్గఱకు వెళ్లివచ్చుట కూడ మీ కభ్యంతరమా" " శిరీషు-"నాకేమియు నభ్యంతరము లేదు. నీవు మొన్న సారథి దగ్గఱకే వెళ్లినచో నాకేమియుఁ గోపములేదు. వాసంతి-"ఐనచో నేను మఱల సారథి దగ్గఱ కొంటరిగాఁ బోవలయును." శిరీషు-"ఎందుకు?" వాసంతి-"అతనిని గొన్ని విషయము లడుగవలయును." శిరీషు-"ప్రక్కనే నున్నచో నడుగరానివా?" వాసంతి-"ఐనచో నేను వెళ్లను లెండి." శిరీషు "కాదమ్మా ఏ విషయములని." వాసంతి-"అభినయమును గూర్చి లోకమును గూర్చి ఆత్మను గూర్చి మీరుండగా నడుగవచ్చును. మీరు ప్రక్కనున్నప్పుడు నాకు నేనుగా నుండను. మీరు నాకుఁ దండ్రులు. మీ దగ్గఱ నాకుఁ జనవున్నది. ఎంత చనవున్నదో యంత భయమున్నది. మీరు ప్రక్క నున్నప్పుడు నా మనస్సు విషయములను సరిగా గ్రహించలేదు. అందుకనియే నేను సంగీతమభ్యాసము చేయుట మీరు పండుకొనిన తరువాతఁ జేయుదును. మీరు వచ్చి ప్రక్కన గూర్చున్నంతనే నాలో నున్న యొక స్వేచ్ఛాప్రవాహము మందముగా ప్రవహించును. ఈ సంగతి యిన్నాళ్లును మీతో జెప్పలేదు. నా మనస్సు నాదారిన పోదు. మీ రేమనుకొనుచున్నారో యన్న భయమే నిత్యముగా నుండును. నా జ్ఞానాభివృద్ధి కావలయునన్నచో గొంత నాకు స్వాతంత్ర్యము కావలయును. మానవుడు తనలోఁ దానెంత

యూహించుకొనుట కావలయునో యేకాంతముగా నొక స్నేహితునితో మన సువిప్పి మాటాడుట యంతవలయును. లేనిచో మనస్సునకు రాదగినంత వికాసము రాదు. జ్ఞానయోగులు వేఱు. కర్మయోగులు వేఱు జ్ఞానయోగులు తమ లోఁదాము ద్రవ్వుకొనెడివారు. కర్మయోగులు లోకముతో గలిసి త్రవ్వెడివారు. సంగీతమును నాట్యమును కర్మయోగుల పనులు." శిరీష-"దానికి నీవింత చిఱువుట యెందుకు. నేను నిన్ను సారధి వద్దకు వెళ్ళవద్దన్నానా? ఒక్కతెవు వడచిమాత్రము పోవద్దు. వెళ్లిరా."

తండ్రి యనుమతికి వాసంతి కీ రహస్యము తెలియును. ఆమె యడిగిన యే కోరికను దండ్రి కాదనడు. సాధువుగా నడుగవలయును. అతనితో జెప్పి యేపనినైనను జేయవచ్చును కాని కొన్నింటిని కాదనును. ఇప్పుడు కాదన లేదు. దానికిఁ గారణము వాసంతి. తాను వలదన్నను వెళ్లుదునని భయము. శిరీష మతిశోంచెను సీ పాగి మధ్యాహ్నము ఫలహారము చేసిమాత్రము వెళ్లుమనెను. అనగా నతని యధికానుగ్రహము.

వాసంతి సారధి యింటికిఁబోయెను. సారధి యొక్కడే యున్నాడు. తోటలోఁ ద్రవ్వుచున్నాడు. వాసంతిని రమ్మని యచటి రాతి యరుగుమీద గూర్చుండుమనెను. తాను త్రవ్వుచుండెను. ఏమి పనిమీద వచ్చితివనియడిగెను.

వాసంతి-"మొన్న నాటకముమీద నెంతడబ్బు వచ్చినది?"

సారధి."వేషమున కింతయని నీకుఁగూడ నిమ్మందువా?"

వాసంతి."ఈయకుండ నెవరైన నూరకే వేయుదురా?"

సారధి-"ఎంత యిమ్మందువు."

వాసంతి-"నీవు కథానాయకుడవు. నేను కథానాయికను. నీవెంత తీసికొందువో నా కంత యిమ్ము."

సారధి-"ఐనచో నీ వింటికి దిరిగిపోవచ్చును. నా కేమియు మిగులలేదు."

వాసంతి-"నీవు గొప్ప నటకుడవని యందఱును మెచ్చుకొనిరిగదా."

సారధి-"నిన్నును మెచ్చుకొనిరి"

వాసంతి-"వారు నాట్యము తెలియదు. నిన్ను మెచ్చుకొన్నట్లు నన్నెందుకు మెచ్చుకొందురు"

సారధి-మొన్న నాకంటె నిన్నే యెక్కువ మెచ్చుకొనిరి. ఆ కాపరు మా నాన్న నడిగి పదిరూపాయలు తెచ్చిపెట్టుము."

వాసంతి-"మా నాన్నగారు ఇంటికి వచ్చినచో నన్నము పెట్టెడివారే కాని డబ్బిచ్చెడివారుకారు. మాయింటి కెదురుగా నున్నయాయనవలె నీవుకూడ

ప్రతిదినము ఫలహారము వేళకు రమ్ము. నీ యిష్టము వచ్చినన్ని యిడ్డెనలో పెస రట్లో గారెలో తినవచ్చును."

సారధి-"రోజును రాకపోకలకు బండి ఖర్చిచ్చునా? అదియు నేనే పెట్టుకొనవలయునా?"

వాసంతి-"నిజముగా నా యభినయము బాగున్నదన్నారా?"

సారధి-"చల్లకువచ్చి ముంత దాచికొనుట యెందులకు. అది యడిగిపోవుటకు వచ్చితివన్నమాట."

వాసంతి-"మంచిగా మాటాడుదుమని వచ్చితిని. అయినచో వెళ్ళిపోదును లే."

సారధి-"నేను ప్రొద్దుట స్నానమైపోయినది. స్నానముచేసి వచ్చెదను కూర్చుండుము. అది సరే కాని మొన్న నీ వొంటరిగ వచ్చితివి. నేడు కురల నీ వొంటరిగ వచ్చితివి. మీనాయన యూరకుండునా?"

వాసంతి-ఊరకుండినచో మొన్నటంత గొప్పగా నెట్లు నటింతును?

సారధి-"మొన్న గొప్పగా నటించితి నన్నమాట."

వాసంతి "మానాన్నగారన్నారు. ఆయనతోఁ జాలమందియన్నారట."

సారధి-"ఔను! నేనే యాశ్చర్యపోయితిని. తరువాత గ్రహించితిని. మీ నాన్న నిన్నెదిరో కోపపడియుండును. నీ వేడ్చుచుంటివని. అవన్నిల యేలుపు నా వేషములు కావు. ఆనాడు నీవు కన్నెత్తినచో నభినయము. పెదవి కదల్చినచో నభినయము. కాలు కదల్చినచో నభినయము. నిజముగా నా కాశ్చర్యము వేసెను. నీ వెట్లు చేయగలిగితివి."

వాసంతి-"ఆ సంగతియే విన్నడిగి పోవుటకు వచ్చితిని."

సారధి- "వాసంతీ! నీవు నాకు బిడ్డవంటిదానవు. కావా! కాదా!"

వాసంతి- "అందుకనియే కదా! మా నాయనగారిచటికి నొంటరిగా పంపినారు."

సారధి- "నా కొక్కటియే యూహ తోచుచున్నది. నీవు మీ నాన్న చాటునఁ బెరిగినావు. నీకుఁ బదునారేడులు వచ్చినవి. నీయీడు పిల్లలు సువ్వాలు ముంచి దీపాలార్పుచున్నారు. నీకేమియుఁ దెలియదు. విభాండకుడు ఋష్యశృంగుని పెంచినట్లు మీనాన్న నిన్నుఁ బెంచుచున్నాడు. నీకుఁ దెలియని యాశయేదో నీ యాత్మలో నీకుఁ గలిగినది. ఆ కోరిక నీయందు నీకుఁ దెలియకుండ వికసించుచున్నది. అందుచేత నీవు విషయములు నాని యంతట నవిగోచరించు చున్నవి. బహిర్విషయముల తోడి సన్నికర్ష నాయూహ లద్దీ

ప్తములగును. ఆ సమయములో దేనియందు జీవుడు ప్రవేశించినను నా పనిని దేదీప్యమానముగా నిర్వహించును. నీలో నట్టి కోర్కెయేదియో వికాసమున కభిముఖముగా నున్నది. అది నీయీ యభినయమునకుఁ గారణ మనుకొను చున్నాను

వాసంతి- "నిజముగాఁ జెప్పుచున్నాను, నాకుఁ దెలిసినంతవఱకు నా కట్టి కోరిక యేమియు లేదు. నాన్న గారికి నేను పెద్ద గాయకురాలు కావలయునని. నాకుఁ బెద్ద నటకురాలను గావలయునని. మూడవ భావ మేమియును లేదు."

సారధి- "ఆ కోరికయే నిన్నట్లు చేయుచున్నదేమో" వాసంతి నవ్వ యారంభించెను. సారథి యేల నవ్వితివని యడిగెను. వాసంతి యిట్లనెను. "లోన నేదో కోర్కె యుండి యా కోరిక యొక్క తీవ్రత్వము చేత వెలికి వచ్చిన యభినయము దాని చేతనదే వెలికి వచ్చెనా?" సారధినిలుచుండి నివ్వెఱ పోయెను. వాసంతి "నివ్వెఱపోదు వేల" యనెను. సారధి యిట్లనెను. "వాసంతీ! నీకు మీ నాన్న చాల చదువు చెప్పినాడు. ఔను మీ నాన్న యింగ్లీషులోఁ బెద్ద పెద్ద గ్రంథములు చదివినాడు. వేదాంతము గూడఁ జదివి నాఁడా!"

వాసంతి- "చదివినాఁడు. మా యింటినిండఁ బుస్తకములే. అరవిందయోగి వ్రాసిన పుస్తకములు. రామకృష్ణపరమహంస, వివేకానందుడు, బిసెంటమ్మ మొదలైనవారి సర్వ గ్రంథములు చదివి వానిలోని విషయములన్నియు నాకుఁ జెప్పుచుండును."

సారధి- "ఔను. నీ వందుకభినయించలేవు. నిస్సందేహముగా నభిన యింతువు "

వాసంతి - "అభినయించుటకు వేదాంతము రావలయునన్న మాట. నీకేమంత వేదాంతము వచ్చును?"

సారధి- "నాకుఁ దెలిసినదే వేదాంతము. నేనేమియుఁ జదువు కొన లేదు. కాని వాసూ! ఈ ప్రపంచకము వట్టి మిథ్యయని నాకుఁ దెలియును. నేను విశాలాక్షియందు, మఱి బహుస్త్రీలయందుఁ గాముకుడవని యనుకొం దురు. నేను నీతి మాలిన వాడ ననుకొందురు. నీవు నవ్వెద వేమో! నేనొక యోగిని. నాకీ నాట్యమొక వ్యామోహము. నేను దీని ద్వారా మోక్షము సంపాదింతును. ఈశరీరముతోఁ జేయు పనులు నన్నంటవు. నీవు పసిపిల్లవని నీతో సరాగములాడుదును. మఱి యందఱితోడను నెన్ని విధములు గానో

ప్రవర్తింతును. అవి అన్నియు నాకుఁ బట్టవు. ఈ రహస్యము నీతోఁ జెపన్
చున్నాను.”

వాసంతి-“నేను పసిపిల్లను కాను. నీవు నాతో సరాగము లాడకుము.”

సారధి-నీకెంత వయసు వచ్చినను మీ నాన్న ముందెట్లు పసిపిల్లవో నా ముందు నట్లే.

వాసంతి-“మొదట నేనిచటికి వచ్చినది నీతో నిట్టి యనవసరపు మాటలు మాటాడుటకు గాదు. నీవు నటకుడవైనచో నావలెఁ గాలేదుగదా! ఆలోచించి యైతివి. ఊహచేసి యైతివి. ఒక మహా విషయమును భావించి యైతివి. అందులోని రహస్యము నీకు దెలియును. నాకది చెప్పుము. దాని నడుగుటకే నేనిప్పుడు వచ్చితిని.”

సారధి-‘చెప్పెదను వినుము. నేను పూర్వము కాళిదాసు మహాకవి వ్రాసిన యభిజ్ఞాన శాకుంతల మాడుదుమనుకొంటిని నేనేదైన నాటకము వేయక ముందు దానిని గురించి బాగుగాఁ జదివెదను. తెలియకపోయినచో, బండితులవద్ద కేగి తెలిసికొందును. ఆ పెద్ద శాస్త్రులుగారు నాలుగేళ్ళ క్రిందఁ జనిపోయినవారే. ఆయన వద్దకుఁ బోయి సంస్కృత నాటకము తెలుగులోఁ జెప్పించుకొంటిని. ఆయనకు నామీద నెందుకో చాల ప్రేమ. అందులో నున్న విశేషము లన్నియు నీకు జెప్పినాడు. నెలనాళ్లు వారి యింటికిఁ బోయి చదివితిని. అందులో నొక శ్లోకమున్నది. దాని తాత్పర్యము నాకు జక్కగా దెలియును. “కట్టెలు కదిపినచో నిప్పు మండును. తాకిడి తగిలినచో బాము పడగ యెత్తును; మనుజుడు క్షోభపడి తన మహిమ దాను పొందును.” అని. జీవితములో నేను పడ్డ క్షోభకు మితియున్నదా? అందుచేత నేనునటకుడ నైతి నేమో! వాసంతి! వేషధారణము రంగసాధనము వాచికము మొదలైన వన్నియుఁ బ్రయత్నము చేత నూహచేత.లభించునవి. అభినయము మాత్రము ఆత్మ సంస్కారమున్నచో జీవుడు పొందెడి క్షోభచేత వెలికి వచ్చునది.

వాసంతి-“నే నాక్షోభ పడలేదు. ఈ రెండు నాటకములలో నెట్లభినయించితివి?”

సారధి-“క్షోభ యనగా నెట్లుండును? కూడుగుడ్డలు లేకపోవుట, బండి విరిగి క్రిందబడుట, కాలికో చేతికో దెబ్బతగులుట - ఇవి క్షోభ కాదు. ఇది శరీరము పడు కష్టము. క్షోభ యనగా నెట్టిదో యా మహాకవియే చెప్పినాడు. దుష్యంతుడు శకుంతలా స్మృతివలన దుఃఖపడుచున్నాడు. మనసు క్షోభ పడుచున్నది. దుఃఖము వలన బడెడి క్షోభ మహా కార్యనిర్వహణమునకు సరిపోదు.

అందుచేత నూతలి మహారాజు నర్మసఖుని సౌధోపరిభాగమునకు తీసికొనిపోయి పిశాచము వలె బాధించినాడు. రాజునకు మాఢవ్యుడు ప్రాణసఖుడు. అతడు నిస్సహాయకుడు. ఈయన మీద నాధారపడి యున్నవాడు. తాను మహాధానుష్కుడై తన బిడ్డవంటివాడు దుఃఖపడుచుండఁగాఁ బడెడు బాధ క్షోభ వంటిది. దాని కంటె నెక్కువ క్షోభ లేదు. తనకు జబ్బు వచ్చినచో మీనాన్న దుఃఖపడును. నీకు జబ్బు వచ్చినచో క్షోభపడును. అట్టి క్షోభపడవలయును. నాకు బిడ్డలు లేరు. నాకు క్షోభలేదు. కాని వాసంతి! నే నితరత్ర క్షోభపడితిని. నాకొకప్పుడొక మంచి కుర్రవాడు కుదిరెను. వాడు మేలిమి బంగారము. నీకుఁ గోపము రాకున్నచో నీగొంతులోని మాధుర్యము వాని గొంతుముందు బనికిరాదు. వాడేడాది నావద్దనుండెను. వానిచేత నొకసారి యాడవేషము వేయించితిని. మఱునాడు వాని కొర్చి దిష్టికొట్టినది. ఇదుగో యిచ్చటనే పెద్ద తంపటవేసి సవాసేరు మిరపకాయలు కొనివచ్చి తీసిపోసితిని. వాడు పదునేను దినములు సుస్తీగా నున్నాడు. పదునేను దినములు మంచములో నున్నాడు. తరువాత జనిపోయినాడు. వాని దేయూరో నాకు దెలియదు. నేనే బుజాన వేసికొని తీసికొనిపోయి పాతిపెటి వచ్చితిని.” యని సారథి యేడువ నారంభించెను. ఆ యేడుపులోననే సారథి ‘నీవప్పటికిఁ బుట్టనేలే’దనెను. “అంతకుఁబూర్వము నన్ను గొప్ప నటకునిగాఁ జెప్పికొనెడివారు కాదు. తరువాతఁ గొంత కొంత చెప్పికొనుచున్నారు అట్టి క్షోభచేత మనస్సు బరిపాకదశనందును. అట్లు పరిపాకము పొందిన మనస్సు నీయిష్టమువచ్చిన భావములో సులభముగాఁ బ్రవేశించఁగలదు. నీ మనస్సాభావమునందు బ్రవేశించిన తరువాత నీవు చేసెడిదేదియులేదు. సర్వాభినయము దానియంతట నదియే చేసికొనిపోవుచుండును. ఇది నాకుఁ దెలిసిన రహస్యము. కనీసము నే నొక నటుడనైనచో దానిలోని రహస్యము.”

సారథి యాపట్టున లేచిపోయి స్నానముచేసి తిరిగివచ్చెను. పది పదేను నిముసములు జరిగెను. వాసంతి యిట్లనెను. “నే నట్టి క్షోభ యేమియుఁబడలేదు. నే నెట్లు చేయగలిగితిని ”

సారథి-క్షోభ యనగా నట్లే పడనక్కరలేదు. ఒక్కొక్కపుడు మనసునకు దెలియకుండ జీవుడు క్షోభపడుచుండును. కడచిన నాలుగైదేండ్లుగా నిన్ను జూచినపుడెల్ల నీవు క్షోభపడుచుంటివనియే నే ననుకొనుచుంటిని. నీ కా సంగతి తెలియదు. నీకు వయసువచ్చినది. నీకు స్వేచ్ఛలేదు. నీ శరీరము నీదికాదు. నీ మనసు నీదికాదు. దానికి స్వాతంత్ర్యములేదు. సంగీతవిద్య కృతకమైనది. అన్ని విద్యలు కృతకములే. అవి జీవునకు సహజగుణములు కావు. మనశ్శక్తిచేతఁ బుద్ధిశక్తిచేతఁ బ్రకాశింపచేయబడునవి. కొందరు వానిద్వారా జీవుని వికసింప

అవధానికి డెబ్బదియేండ్లయినను భోజనముపుష్టి యేమియుఁ దగ్గలేదు. రంగనాథము భోజనముపుష్టి లేనివాడు. భోజనపుష్టి కలవారిని జూచినచో రంగనాథమునకు మిక్కిలి సరదాగా నుండును. చేసిన ఫలహారము పిల్లలకైన మిగులకుండ నవధాని యారగించెను. ఇంటిలో స్త్రీలు మాత్రము మొగాలు ముడుచుకొనిరి. తరువాత నవధాని తాంబూలము సేవించెను. రంగనాథము పోకిళ్ళమూరి. అతని యింటిలోని తాంబూల మనగా రాజతాంబూలము. పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, చలువ మిరియాలు, కస్తూరి, జాజికాయ, జాపత్రి, ఏలకులు, లవంగములు సర్వము నుండును. అతని తాత దివానుగిరి చేసినప్పటి జవాహరి కొంపలోనుండెను. మిత్రులు భోజనము చేసినపుడు తాంబూలవేళఁ దానిప్రదర్శనము జరుగును. ఆ వెండి పళ్లెములో నన్ని వస్తువులకు వేర్వేఱుస్థానములుండును. నడుమనొకయత్తరుసీసా యుండును. దాని యాకృతి శ్రీకృష్ణుని రాసక్రీడ. నడుమనున్న కృష్ణుని చేతిలో నత్తరుసీసా యుండును. చుట్టున నున్న గోపికాకృష్ణుల చేతులలో జిన్నచిన్న బరణులు వానిలోని వివిధపదార్థములు నుండును. నడుమభాగములో వక్కలు. ఈ వస్తువు ప్రదర్శింపబడి తాతగారి కథ లోక పాతిక యొప్పజెప్పబడెను ఆ పాందానునకే యొక కథ గలదు. ఒకసారి జమీందారుగారును వారి తాతగారును తంజాపుర మరిగిరి. అచ్చట నొకనాడు సాయంవాహ్యాళి పోగా వెండి పనివారున్న కొట్టులో నిది కనిపించెను. దొరగారు దానిని గొని తన దివానుగారికి బహుమతి నిచ్చిరి. అప్పటినుండి వారి యింటిలో నుండెను. ఇది కథగా రంగనాథ మందఱితోఁ జెప్పును. అంతయు నైన తరువాత నవధాని లేచిపోనెంచెను. అతడెందుకు వచ్చెనో రంగనాథమునకుఁ దెలియలేదు. రంగనాథము దగ్గఱ నొక్కొకపుడు రాజదర్జా యుండును. ఆ వందయేండ్ల క్రితము తన తాతగారు చేసిన దివానుగిరి పోకిళ్లు తాను పోవుచుండును. అవధానిని మీ రెందుకు వచ్చిరని యడుగలేదు. అవధాని చెప్పలేదు. ఆయనది పూర్వ రాజవాసన. ఈయనది ప్రస్తుత రాజవాసన.

కాని దీనికి ఫలితము మఱునాడే జరిగెను. రంగనాథ మవధాని యింటికి బోయెను. అర్జునరావు విషయ మేమి చేసితివని యవధాని యడిగెను. నేనాయనకు జాబు వ్రాసితిని. సమాధాన మింతవఱకు రాలేదని రంగనాథము బదులు చెప్పెను. మన మెవరినైనఁ బంపించినచో బాగుండునేమో యని యవధాని యడిగెను. రంగనాథ మట్లే యని తిరిగి వచ్చెను. రంగనాథమున కొక తమ్ముడున్నాడు. వాడు రంగనాథమునకుఁ దమ్ముడు. వాడు చేసెడి పని యేమియును లేదు. కొంత మేదకుడు. ముప్పొద్దులు తినును. గ్రామము వెంట తిరుగును.

కవిత్వము సంగీతము నృత్యము నాట్యము శిల్పము వీనిని గుఱించి మాట్లాడుచుండును. అతనికి నన్నగాగు దేవుడు. అన్నమాట్లాడుచుండగా నప్పుడప్పుడు వినిన మాటలు పదిమందితోఁ బలుకుచుండును. నీ కేమి తెలియును, నోరు మూయుమనగా వెంటనే నోరుమూయును. రంగనాథుడు తన తమ్ముని నర్సునరావుకొఱకుఁ బంపించెను. పూర్వము వ్రాసిన సంగతులే యుత్తరములో వ్రాసి పంపించెను రానుపోను రైలుఛార్జి యైదురూపాయలైనది. ఆడబ్బు రంగనాథుని దగ్గఱలేదు. ఎవరివద్దనైన నీ డబ్బు తీసుకొనవలయును. అవధాని నడుగుట న్యాయము కాదు. శిరీష కుమారు డీయడు. ఆ యూరిలోఁ గొందఱు చిన్న చిన్న యుద్యోగస్థులు కలరు. కొందఱు కోటలో గుమాస్తాలు, మరి కొందరు రాచరికపు గచేరీలలో గుమాస్తాలు. వారందఱకును రంగనాథుడు మహాకవి యని యభిప్రాయము. రెండ్లు మూళ్లు వారివద్ద నప్పుడప్పుడు తీయుచునే యుండును. వారు మనసులో బాధపడినను నతనిని గాదనలేరు. నాలు గడిగినచో రెండైన నిచ్చి పంపింతురు. ఈ యైదు రూకలు ముగ్గురిదగ్గఱఁ బోగు చేసెను. తమ్ముని పంపించెను. రంగనాథుని తల్లియున్నది. ఆమె తన రెండవ కొడుకు మేడకుడని, యేపని చేయలేడని వానినెచ్చటకుఁ బంపించుటకు నంగీకరించదు. తల్లికిఁ దెలియకుండ వానిని బంపింపవలయును. వాడు రాత్రికిఁ దిరిగిరావలయును. వాడు తిరిగిరానిచో నా రాత్రికిఁ దల్లి భోజనముచేయదు. ఇంటిలో నేడ్చుచుఁ గూర్చుండును. తమ్మునిబదులు తాను వెళ్ళెదనన్నచోఁ దనకైదురూకలు చాలవు. ఒక యిరువదిరూకలైన నుండవలయును. నిజానికిరువదియును జాలవు. ఏలననగా రంగనాథుడు బయలుదేరును. అతనితో నిద్దరుముగ్గురు స్నేహితులు బయలుదేరవలయును. వీరందఱకుఁ దానే ఖర్చుపెట్టును. తీర నాయూరు చేరునప్పటికి యిరువదిరూకలు వ్యయమయిపోవును. అతనికక్కడ నెవరో స్నేహితుడుండును. స్నేహితులు కారు. ఇతడు గొప్పకవియనుకొనెడు వారు. వారియింటిలో మకాము వేయును. రంగనాథుడు మిగులసోమరి. తొమ్మిదింటికి లేచును. కాలకృత్యములకు వేళకుఁ బదియగును. అప్పుడుదికినబట్టలు కట్టి తలదువ్వి యోసులుపోయి యూరివెంట నెఱిగియున్న వారిని చూచి వచ్చుటకు బయలుదేరును. ఆగృహస్థకూడ నితనివెంట బయలుదేరును. అందఱును గాఫీహోటలులోఁ బ్రవేశింతురు. నాలుగో మూడో యగును. ఆగృహస్థిచ్చుకో వలసినదే. రంగనాథుడు నడువలేనని యాపసోపాలుపడును. బండికట్టింతురు. అది గృహస్థుమీద బడును. ఇంటికి దిరిగివచ్చుసరికిఁ బండ్రెండు గంటలు దాటును. అప్పుడు రంగనాథుడు మరల స్నానము చేయవలయును. అతనిస్నాన మనగా నతడుకట్టుకొనిన దోవతితోఁ జేయును. ఇంకొక ధోవతి గృహస్థుడీయ

వలయును. తానుతిరిగి వెళ్లినపుడు రంగనాథము వారిధోవతి వారికిచ్చి తన ధోవతి తానుదీసికొనిపోడు. తనధోవతి తక్కువ వెలది. గృహస్థు ధోవతి ఎక్కువ వెలది యన్న విచారణ రంగనాథమునకు లేదు. అతఁడు ఒడలుతోము కొనుటకు మంచి సువాసనసబ్బు కావలయును. సామాన్యములు పనికిరావు. ఒడలు తుడిచికొనుటకుఁ దెల్లగా నుదికిన బెద్దతువాలు కావలయును. ఆ తువాలుతోనే మధ్యాహ్నము నిదురపోవును. అతని యొడలి చెమటయంతయు దానికిఁబట్టించును. ప్రొద్దుగ్రుంకిన తరువాత మరల గ్రామములోనికిఁ బయలుదేరు నపుడు మరల నింతహంగామాయు జరుగవలయును. ఏరోజున కారోజు నాల్గు ధోవతులు నాల్గుతువ్వాళ్లును గావలయును. ఒకవేళ లేనిచో నతనికి మిక్కిలి బాధ లేదు. ఒక్కొకపుడు కట్టినధోవతియే పదిరోజులు కట్టును. కాని పరాయి యూళ్లు వెళ్ళినపుడు వానిపోకిళ్ళు గృహస్థులకుఁ బ్రాణాంతకములు. అతఁడడిగిన దదైన లేదన్నచో మొగము చిట్లించుకొనును. వెక్కిరించినట్లు నవ్వును. అతని వెక్కిరించుటలోఁ జిలుబాకు లుండును. దానిని సామాన్యుఁడు తట్టుకొనలేడు. అతఁడు మహాకవి. అతనికి ననుకూలముగాఁ జేయవలయును. చేయకపోయినచోఁ దమదే దప్పు, అన్నభావము గృహస్థునకుఁ గలుగునట్లు ప్రవర్తించును. లోకములోఁ గొందఱు కవులను గౌరవింతురు. అందఱుకవులను గౌరవించరు. రంగనాథమువంటి కవులను గౌరవింతురు. అతఁడు మంత్రిగారి మనుమఁడు. గొప్పవాఁడు. అతఁడు గొప్పవాఁడన్న భావము రంగనాథము తనవేషకచేతఁ దన ప్రవర్తనముచేతఁ దాను మాట్లాడునపుడు పోవునొద్దికలచేత సామాన్య జనుల యందుఁ గలిగించును. అతనితోఁగలిసి తిరుగుటయే యొకగొప్పయని కొంద ఱనుకొందురు. చివఱకుఁ దిరిగివచ్చునపు డా గృహస్థుదగ్గఱఁ దిరిగి పంపింతునన్న పాతికయో పరకయో తీసికొనును. తిరిగి పంపించుట పూర్వము వందలసార్లు జరుగలేదు. భవిష్యత్తులో వందలసార్లు జరుగదు.

ఇన్ని యిబ్బందులున్నవనియే రంగనాథము తాను బయలుదేరలేదు. తమ్ముని బంపించెను. తమ్ముఁడు రాత్రికిఁ దిరిగి రావలయును. రాత్రి పదిగంటలయ్యెను. చివరి రైలుబండి వచ్చినదని కొందఱు రాలేదని కొందఱు రంగనాథముతల్లి వాకిటిలోఁ జీకటిలోఁ గూర్చుండియేడ్చుచు వాకిటిలోని కెవరువచ్చినను 'నాయనా! మా యబ్బాయివచ్చెనా. కనిపించినాఁడా' యనుచుండెను. రంగనాథము తల్లిని గొట్టఁడు తప్ప తక్కిన మర్యాదయంతయుఁ జేయును. ముండ యన్నది విశేష్యము. దానికతఁడు సమకూర్చు విశేషణములువంద. విసుగుకొనును. ఇంటిలోనికిఁ బొమ్మనును. తాను సఱసఱ లోపలికి నడచిపోవును. వానిని నీవే పాడుచేయు చుంటివనును. వాఁడు దవటదద్దమ్మ నీ మూలముగా నైవా

డనును. ఆమె "నేనేమి చేసితిని, నీవె వానికిఁ జదువు చెప్పించలేదు. వాఁడెదో బొమ్మలు వేయును. గొప్పవాఁడగునంటివి. వాఁ డంగడికిపోయి నిప్పపెట్టె తేలేఁ వాఁడూరికిఁ బోయిరాగలఁడో" యని తిరిగిచదివెను. ఏమైననేమి. అతఁడు తిరిగి రాలేదు. రాతిరి రెండుగంటలగుసరికి రెండుగంటలైనది. తల్లిమాత్రము వాకిటి లోననే కూర్చుండెను. రంగనాథము వాకిటిలో మంచము వేసికొని తల్లి కెదురుగాఁ బరుండెను. మరునాఁడు పదిగంటలకుఁ దమ్ముఁడు, నర్జునరావును దిగిరి. తల్లి రెండవకొడుకునుజూచి యింతసేపేడ్చి వాని నింటిలోనికి దీసికొనిపోయెను. అర్జునరావుకు మరియాదలుసాగ నారంభించెను. ఆ యింటిలోని మరియాద ఒదోకవిధము. అతిథి నెవ్వరు మరియాదచేయరు. చేసినట్లుండును. రంగనాథము ఒక యొయ్యారముగాఁ బలుకరించును మాటాడును. ఇల్లంతయుఁ గవిత్వముతో నిండినట్లుండును. రంగనాథము కూతుండ్రు రంగురంగుల వేషములతో నింటలో దిరుగుచుందురు. వారిని జూచినవారి కాతిథ్యము సమృద్ధిగా జరుగుచున్నట్లనిపించుచుండును. ఇంటిలోనున్న యందఱును దలాయొక ప్రకృతి. పూర్వకాలపు మనిసి తల్లి. పరమాధునికలు కూతుండ్రు. మాటలన్నియు గృతకములు. మనుజలోకములో నున్నట్లుండదు. ఒకవిధమైన దేవతాలోకములో నున్నట్లుండును. అట్టి గృహము, నట్టి పరిస్థితులును సామాన్యుఁడెవడును బెరచోట జూచియుండఁడు. వాని తల తిరిగిపోవును. వానికా యింటిలో మరియాద జరుగుచున్నదో, జరుగుటలేదో తెలియదు. నిజానికి మరియాద యేమియు జరుగదు. నిరాదరించవలయునన్న యూహ యేమియు నుండదుగాని పరులను మర్యాదచేయుట యింటిలో నెఱుగరు. అర్జునరావు భోజనము చేసెను. తత్పూర్వము కమలయు లలితయు ఫిడేలు వాయించి అర్జునరావునకు వినిపించిరి. అవి ఫిడేళ్లు కావు. ఉండేళ్లు. రంగనాథము తమ్ముఁడు వ్రాసిన బొమ్మలను నర్జునరావునకుఁ జూపించిరి. ఆ బొమ్మలు క్రొత్త పంపిణీలలో వ్రాయఁబడినవి. అది సాంకేతిక విద్యయట. గీతలుండవు. రూపము కనిపించదు. దానినిబట్టి భావము వచ్చునట. ఆ రోజులలోఁ క్రొత్తగా గురుదేవుడైన రవీంద్రనాథటాగూరు లండనులో నేర్చుకొని వచ్చెనట. ఆ పంపిణీమీద నా బొమ్మ లుండును. ఇతని బొమ్మలు వాని కెంతవఱకు వను కరణములో తెలియదుగాని . యింటి కతిథియై వచ్చినవాడు వానిని కాదనుట న్యాయము కాదుగదా! అందులో నది దేవతావస్త్రములవంటి విషయము. కాదన్నచో నన్నవాఁడనాగరకుఁడు. అనభిజ్ఞుఁడు. ఆధునిక శిల్పమార్గము తెలియనివాడు. మరియు నంతటి మహానటుఁడగు నర్జునరావున కవి తెలియవందుమా. అతని కన్నియును దెలియును. అతఁడు చాల మెచ్చుకొనెను. తరు

వాత భోజనము చేసిరి. రంగనాథము భార్య చక్కగా వంటచేయును. లేని కూరలు పొసగించును. ఆమెకు నా యింటికి సంబంధము లేనట్లుండును. ఆమె స్వర్గసీమ కొక దాసియో యన్నట్లుండును. ఆమెకు నోట నాలుక లేదు. రంగనాథము రావణుడు, నామె మండోదరి. రంగనాథము హిరణ్యకశిపుడు, ఆమె లీలావతి యన్నట్లుండును. ఆమె విషయములోననే రంగనాథము రావణుడును హిరణ్యకశిపుడును. లోకమునకు రంగనాథ మెంత సుకుమారుడో యెంత సంస్కృతి కలవాడో పరుల నొవ్వకుండ నెంత ప్రవర్తించునో! సుకుమార శారద యతని రూపము. అతడు వెన్న. అతని నవ్వు తేనియ.

అర్జునరావు భోజనము చేసి కొంచెము సేపు విశ్రమించెను. ఆ యింటిలో విశ్రమించుటకు వీలు లేదు. ఎప్పుడు నేదో రణగొణధ్వని జరుగుచునే యుండును. అది యంతయు నాగరికతా దేవి నవ్వుల క్రింద జమకట్టుకొనవలయును. కమలయు లలితయుఁ జిలుకలవలె నింటిలోఁ దిరుగుచుందురు. వారిని జూచుచుండుటయే విశ్రాంతి తీసికొనుట.

సాయంతనమున నిద్దఱును బయలుదేరిరి. అవధాని యింటికిఁ బోయిరి. కొంతసేపు మాట్లాడిన తరువాత దొరగారి దర్శనము మఱునాటి మధ్యాహ్నము కాని లభించదని చెప్పిరి. అర్జునరావు తనకుఁ బనియున్నదనియు దానుండఁజాలననియు జెప్పెను. ఆ యొక్క పూటలో నర్జునరావు లలితా కమలలకు మేనమామయయ్యెను. మేనకోడండ్రు జులుము చేయగా నర్జునరావు తన పని మానుకొనక తప్పక వచ్చెను. అందఱును గలిసి యూరిలోని క్లబ్బునకుఁ బోయిరి. అదియొక చిన్న క్లబ్బు. అచటఁ జీట్ల పేకకున్నంత గౌరవము మరి దేనికిని లేదు. అచట కవనముగాని సంగీతముకాని నాట్యముగాని వీనిని గుఱించి తెలిసినవారెవ్వరును లేరు. ఇవి యున్నచో నందఱకు నిరాదరణ. కాని గొప్పవాడెవడైన వచ్చినచో వారందఱకు నా విద్యలు తెలిసినట్లే నటింతురు. అందఱు నర్జునరావు చుట్టు మూగిరి. అతడభినయమును గూర్చి యొక చిన్న యుపన్యాసము చేసెను. తన యింగ్లాండు పోయినప్పటి యనుభవములను, రంగభూమిమీద తన యనుభవములను సభికులను నవ్వించునట్లు చెప్పెను. వారందఱతనిని దమయూరిలో నొక నాటకము వేయుమని యడిగిరి. తాము వేయిరూకలు ప్రోగుచేయుదుమని చెప్పిరి. రాత్రి పదియైనది.

ఇంటికి వచ్చిరి. భోజనములైన తరువాత వీధి వాకిటిలో ఆఱుబయట నర్జునరావును రంగనాథమును మంచములమీదఁ బండుకొనిరి. రెండు గంటలవఱకు నేదో మాట్లాడుచునే యుండిరి. అతడెంత సేపటికి నితరములను గుఱించి చెప్పెను. ఇతడితర కవులను గుఱించి చెప్పెను. మఱునాడు రాజదర్శనమైనది. అంతయును

నవధానియు రంగనాథ మేమాటాడిరి. కొలది దినములలో దొరగారు నాటకశాల కట్టింతురు. ఈలోపుగా నొక్కసారి దొరగారర్జునరావుగారి వేషమును చూడ వలయును. అది జరుగుటకు క్లబ్బుపెద్దలే నిర్ణయించిరి. నాటకశాల కట్టించినంతనే యర్జునరావుగారు వచ్చి యాయూరిలో మకాము వేయుదురు. ఆయనకు నెలకైదువందలు జీతము. ఆయన న్యాయవాదివృత్తి యాయూర చేసికొనుచుండవచ్చును. ఆయూరిలోఁ గూడ రెండు న్యాయస్థానములున్నవి. అర్జునరా వంగీకరించెను. ఆరాత్రికి నర్జునరావు వెడలిపోయెను. అర్జునరావును బంపించి యవధానిరంగనాథము లిద్దరు నవధానియింటికివచ్చిరి. దొరగారి సముఖములో నన్నిమాటలు వీరిద్దరేయనిరిగాని దొరగారినోటివెంట నొక్కమాటయైనను రాలేదు. ఇంతకూ దొరగారంగీకరించినట్లేనాయని రంగనాథమడిగెను. అవధాని యిట్లనెను. "ఇందులో దొరగారి దేమున్నదయ్యా! అంతయుఁజేసెడి వాఁడను నేను. దొరగారు నామాటలు దాటిపోలేరు. మాయూరిలో నొక గొప్ప జ్యోతిష్కుఁడున్నాఁడు. ఆయనను పిలిపించి దొరగారితో జెప్పించెదను. దొరగారి కిది గొప్ప కీర్తికాలము. ధనమువచ్చెడి సమయము. నాకు జాతకము తెలియును. నేనిది వఱకే దొరగారికి జెప్పితిని. ఇది జరిగితీరవలసినదే. లేనిచో సారథటయ్యా నటకుఁడు. సారథియా, పొట్టపొడిచిన నక్షరముక్క లేనివాఁడు. వానికెంతనిక్కు. నన్నుగాదని నిన్నుగాదని మఱియొకనిచేత నాటకము వ్రాయించికొనునా. ఈ యూరిలో నుండదలఁచుకొనినవాఁడైనచో నిట్లు చేయునా? నే నెవఁడనుకొన్నాఁడు. ఆపాక పీకికొనిపోవలయును. ఇదిగో నటుఁడనగా నర్జునరావువలె నుండవలయును. ఆకనుబొమలు, ఆవిశాలములైన నేత్రములు ఆజానుబాహువైన యా మనిషి. ఎఱ్ఱనివిగ్రహము. సాక్షాత్తు శివునివలెనున్నాఁడుగదయ్యా. సారధి యేమిటి కోతి. పగలు జూచినచో రాత్రి కలలోనికివచ్చును. భరతాచార్యులేమన్నాఁడు. నటున కుండవలసిన లక్షణములెవ్వి. ప్రతి కొండముచ్చును వేషము వేయుటయేనా" రంగనాథము ముసిముసినవ్వులు నవ్వునేగాని సమాధానమేమియుఁ జెప్పఁడు.

తరువాత రంగనాథము పదిపదేను దినములు గ్రామములోఁ దిరిగి యర్జునరావుచేత నాటకము వేయించు ప్రయత్నముమీఁద నుండెను. ఒకపని సాధించుటకు రంగనాథము చేయు ప్రయత్నములే వేఱు. అతఁడు ముక్కుకు సూటిగా నేపనియుఁ జేయఁడు. ఏమాటయు సూటిగా ననఁడు. అందఱివద్దకుఁ బోవును. తొలుత వారిని ప్రశంసించును. అర్జునరావు ప్రసక్తి తెచ్చును. అతని యాకార విశేషమునుగూర్చి ప్రశంసించును. అతఁడానాఁడు క్లబ్బులోఁ జెప్పిన యనుభవములలోఁ గొన్ని తన సొంతమాటలతో జెప్పును. రంగనాథము మంచి మాటకారి. యతని

మాటలే యప్పటికోసిన చిగురాకులు. అతనికొక శబ్దజాలము స్వాధీనమై యున్నది. అవియన్నియు మిక్కిలి మెత్తగానుండును. వాయిలుచీర గట్టుకొనిన యెఱ్ఱని బక్కపలుచని పదునాలుగేండ్ల పిల యెట్లుండునో యతనిమాట లట్లుండును. నీవతనితోఁ గొంతసేపు మాటాడివచ్చిన తరువాత గ్రింద నిసుకపొరలుకల మోకాటలోతు పంటకాలువలో నీదులాడి వచ్చినట్లుండును. నదీప్రవాహములో నీదుటయు, దాని గాంభీర్యము తలమునకలైన కాలువలో దిగుటయు, ఱొమ్ముబంటి ప్రవాహమున నీదుటయు మొదలయిన యనుభవములకు వెలియైన ప్రకృతులు మోకాటిబంటి యిసుక పెఱ్ఱాకలో బండుకొని సుఖస్నానము చేసితి మనుకొనువారికి, ననుకొనునట్టి ప్రకృతిగలవారికి రంగనాథముతో మాటాడుట స్వర్గసీమలో విహరించినట్లుండును. అతడెంతయు మాటాడి చివరకు "మన యూరిలో నతని నాటకము బెట్టించబోవుచున్నారు. మనముందఱము సాహాయ్య పడవలయును. మనయూరు మొదటినుండి దొరల మన్ననలో విద్యాగంధము గల యూరు. పూర్వమెంతమంది పండితులుండెడివారు. ఎంతమంది గాయకులుండెడి వారు. పదిరూపాయల టిక్కెట్లు కొందరైన నమ్మవలయును. నేనే బదిరూపాయ లిచ్చుచున్నాను." అన్నమాటలు ప్రాస్తావికముగా జెప్పినట్లు జెప్పిపోవును. అతడెంతమంది యిండ్లకు వెళ్లెనుగాని శిరీషకుమారు నింటికిఁ బోలేదు. శిరీషు తాను తనకూతురు నింత ప్రయత్నము గ్రామములో జరుగుచుండగా నతని కీసంగతియే తెలియదు. వాసంతి కసలు తెలియదు.

ఒకనాడు రంగనాథ ముమాపతిని గలసికొనెను. రంగనాథమునకు నుమాపతికిఁ జెలిమిలేదు. పరిచయమును మిక్కిలిగా లేదు ఒక యూరివారు కనుక బాగుగా నొకరి నొక రెఱుగుదురు. ఎప్పుడైనను బలుకరించికొందురు. వా రిద్దఱివి రెండు భిన్న ప్రకృతులు. ఉమాపతి యూహలో రంగనాథము కవి కాడు. మెత్తని మాటల ప్రోవు. ఒయ్యారములు తెలిసినవాడు. ఒక విలాస పురుషుడు. జీవితమును వ్యర్థము జేసికొనుచున్నాడు. కొంత జిత్తుల మారి. ఉమాపతి యన్నచో రంగనాథమునకు నేమియు నభిప్రాయము లేదు. అతడు ధనవంతుడు కాడు. అధికారి కాడు. అతడు చదువుకొన్నాడని కొందఱు చెప్పుదురు. అతడు కవి కాడు. గనుక రంగనాథమునకుఁ జదువుకొన్న వారిలో లెక్క కాడు. కాని యుమాపతి యన్నచో గ్రామములోఁ గొందఱకు గౌరవము కలదు. అదియు కవిలక్షణమైన గౌరవము. ఒక సంగీత సభ జరుగుచున్నప్పుడు నాటక మాడుచు నున్నప్పుడు కవితాసభ జరుగుచున్నప్పుడు సభలో గూర్చున్నవారందఱు నుమాపతిని సమాహ్వానము చేసి ముందుఁ గూర్చుండఁ బెట్టుదురు. తత్తత్ప్రదర్శనములు చేయువా రుమాపతి యభిప్రాయమును

మన్నింతురు. తక్కినప్పు డుమాపతికి గౌరవము లేదు. ఊరిలో నతని నెవ్వరు గౌరవించరు. అతనితో నెక్కువగా నెవ్వరును మాటాడరు. సభలో మాత్ర మతని కగ్రస్థాన మున్నది ఆనాడు రంగనాథ ముమాపతిని పలుకరించెను తన సహజ ధోరణిలో నవ్వెను. ఉమాపతి నిలుచుండెను. ఉమాపతి ముక్తసరిగా మాటాడును.

రంగ- "మీ రర్జునరావు పేరు విన్నారా?"

ఉమాపతి- "అయ్యో! చాల గొప్ప నటకుడట గదా! నే నెప్పుడు చూడలేదు"

రంగ- "మన సారధిగారికంటె గొప్ప నటకుడు కాదు లెండి"

ఉమా-అది యేమి మాట లెండి. ముఖే ముఖే సరస్వతీ.

రంగ- "కొందఱు సారధికంటె గొప్పవా డందురు. నేను దాని నంగీకరించను."

ఉమా- "ఇంతకు నాయన మన యూరు వచ్చి వేషము వేయునా?"

రంగ- "అతని కీయూరిలో సన్మానము జేయదలచుచున్నారు"

ఉమా- "బాగుగా నున్నది సత్కార్యముకదా"

రంగ- "నాటకమునకుఁ బ్రవేశ రుసుము లేదు విద్యాంసులకు మాత్రమే ప్రవేశము. ఒక వేయిరూపాయలైనను బహుమతి చేసినచో బాగుగా నుండు ననుకొనుచున్నారు. చాలభాగము వసూలయినది."

ఉమా- "అయ్యో! అంతకంటెఁ గావలసిన దేమున్నది?"

రంగ- "మీరు తప్పకుండ రావలయును"

ఉమా- "పంచభక్ష్య పరమాన్నములతో నన్నము పెట్టెదమన్నచో నెవడు రాడు."

రంగ- "మీరు వచ్చి చేసిన విందు ముచ్చటగా నున్నదనవలయునుగదా!"

ఉమా- "నేనే రావలయునా. మంచివిందు మెచ్చుకొనువారు చాలమంది కలరు. నేనుగూడ వత్తును. మంచిసమయము వదిలుదునా"

ఇద్దరు నవ్వుచు విడిపోయిరి అప్పటి కర్జునరావుయొక్క నాటక ప్రదర్శనపు ఏర్పాటులన్నియు నిరుచుమించుగా బూర్తియైనవి. ఈనడుమ రంగనాథ ముమాపతిని నాలుగైదుసారు కలిసికొనెను కాని యతనితో మాటాడ లేదు ఈవార్త సారధికిఁ దెలియవలయును. కాని రంగనాథ మిందులకుఁ బొర పాటుపడెను. సారధియు నుమాపతియు నెప్పుడును గలసికొనరు. నూరేండ్ల కొకసారి కలసికొన్నను గలసికొన్నట్లే. ఉమాపతి ప్రకృతి వేఱు సారధికంటె

మహానటుఁడు. సృష్టిలోఁ బుట్టుట చాలఁగష్టమని యతనికిఁ దెలియును. ఆ సారథినిబోయి తెలిసికొనఁడు. ఇద్దరికిన్ని మిక్కిలి స్నేహమున్నది. ఆ స్నేహము వెలుపలి కారణములచేత ద్రోహమే పొందదు. అది ద్రోహము పొందవలసిన యవసరము లేదు. ఎవ్వరు దుస్థితిలోన నేయుంచరు. దానికిఁ జెరుగు తఱుగులు లేవు. అది యట్టి స్నేహము. విద్యాసంబంధమైన స్నేహము. అతఁడు మహానటకుఁడని యితనికిఁ దెలియును. ఇతఁడు మహాభావుకుఁడని యతనికిఁ దెలియును. వారిద్దఱి నొకనితో మరియొకనికి పనిలేదు. యాదృచ్ఛికముగాఁగలిసినచో నుమాపతి ప్రస్తావన చేసినచోఁ జేయవచ్చును చేసినచో సిద్ధరు నవ్వుకొందురు. ఆ నవ్వులో నర్థము నాట్యకళాఁహాస్య మండలకుఁ దెలియునా యని. నోటితో నెవ్వరు రెండవవానిని నిందించరు. ఇరువదియేండ్ల నెుత్తిమీద వారిద్దఱైదారుసార్లు కలసికొనియుందురు. ఒక నాటకమైనతరువాత రెండేండ్లకుఁ గలిసికొన్నను సరే. యానాటకమునుగూర్చి మాటాడుదురు. మాటల వెరశి పది. ఇది వారి స్నేహము సారథి యుమాపతి యింటికి రెండుసార్లు వెళ్లెను. ఉమాపతి సారథి తోటలోని కొక్కసారికూడఁ బోలేదు.

ఈ సంగతి రంగనాథునకుఁ దెలియును. తెలియదు. ఈనాటకము విషయము సారథికిఁ దెలియవలయును. ఏమైననుసరే పోయి శిరీషకుమారునితో జెప్పవలయును. అతనితో జెప్పవలయుననగా నర్జునరావు నాటకప్రదర్శనము మరియు నిశ్చయము కావలయును. తరువాతఁ బదిదినములకు నిశ్చయమయ్యెను. అర్జునరావు వచ్చుటకు సంగీకరించెను. ఒకదినము నిర్ణయింపబడెను. ఆ వెనుకటి దినమున రంగనాథుఁడు శిరీషు నింటికిఁ బోయెను. శిరీషు గౌరవముచేసెను. కూతుచేతఁ గొంతసేపు పాడించెను. రంగనాథుఁడు లేచిపోవుచు మరల దిరిగివచ్చి రే పర్జునరావు నాటకమునకు మీరువత్తురా యని యడిగెను. శిరీషునకు నిజముగా దెలిసెడిదికాదుకాని కొన్నాళ్లక్రింద నెవరోవచ్చి చందానడిగిరి. అందుచేతఁ దెలియును. తదాది గృహములోఁ గూతునకుఁ దనకు భేదాభిప్రాయము. ఆమె సారథికంటె గొప్పనటుఁ డుండడనును. ఇతఁడింగ్లండు వెళ్లివచ్చెను, బహుప్రశంసల నందెను. మనమెటు చెప్పగలుగుదుమని తండ్రియనును. ఇట్లు జరుగుచున్నది. ఇప్పుడు రంగనాథ మీ ప్రశ్న వేసెను. వెంటనే వాసంతి మేము రామనెను. "శిరీషు ఛా! దానికేమి తెలియును. ఎందుకురాము వత్తు"మనెను. రంగనాథుఁడు నవ్వెను. అతనిమాటల కర్థమున్నను లేకపోయినను నతనినవ్వుల కర్థముండును. ఆనవ్వున కర్థమిది "దీనితో మీసారథి యెందుకును బనికిరాఁడు." శిరీషున కాయర్థము తెలియలేదు. వాసంతికిఁ దెలియును. ఆమె ఒడలు మండి పోయెను. ఆమె యచటినుండి లోనికిఁ బోయెను.

రంగనాథమున కది యిష్టములేదు. అతడు సారథి కపకారము చేయ వలయును. వాసంతితోఁ దనకున్న మంచితనము తెలుపుకొనరాదు. అందుచేత పోబోవువాఁడు మరల వెనుదిరిగివచ్చి కూర్చుండెను. వాసంతివచ్చి కూర్చుండెను. వాసంతియింక చూచుచుండ నాటలతో శిరీషుతో నిట్లనెను. "ఈ యర్జునరావుది వట్టిబూటకము. సారథివలె నెంతైన యభినయ మెవ్వరును చేయలేరు. అతడేదో పైమెఱుపులు మెఱపించు ననుకొందును కాని సారథి విద్యావంతుడు కాడు. అతడు విద్యావంతుడు. లోక మతనియందే మొగ్గుచూపును". ఇట్లు మాట్లాడగా వాసంతి ముఖలక్షణములను బట్టి యామె ప్రసన్నురాలైనదని యతడు గ్రహించి వాసంతితో నిట్లనెను. "అమ్మా! నాటకమునకు నీవుకూడ రావలయును లలితయు, కమలయు నీవుగూడ వత్తువు. నీతోఁ గలసి నాటకము చూడవచ్చు ననుకొనుచున్నారు. అర్జునరావు చక్కగాఁ బాడునట. కొన్ని రాగములు వారికిఁ దెలియవు. నీవు తప్పకుండరమ్మ"ని చెప్పి వెళ్లిపోయెను. మరియు వెనుకకువచ్చి సారథి గారినిగూడఁ బిలుచుకొనిరండని వెళ్ళెను.

ఆ రాత్రి తండ్రి కూతుల మధ్య పెద్ద చర్చ. సారథికంటె గొప్ప నటుఁడుండడని వాసంతియు, నెందుకుండగూడదని తండ్రియు. ఎంతమందియో మహానుభావు లుందురు. మన మెఱిగినదే మనము గొప్ప యనుకొందుము. అది మనుష్యస్వభావము. ఈలోకము మూర్ఖమగుటకుఁ బ్రథమకారణమే యది. పైగా నీ కభినయమునుగూర్చి యేమి తెలియును. ఆయన యూరపుఖండమువెళ్లి పొగడ్తలు పొంది వచ్చినాడట. విద్యావంతు లందరు నాయనఁ బ్రశంసించుచున్నారు. వారి కంటె నీ కెక్కువ తెలియునా. ఐనను సారథియందు నీ కెందు కంత యభిమానము. సారథి నాకంటె గొప్పవాడా నీకు. నీవతనిని నాకంటె నెక్కువ ప్రేమించుచున్నావు నీ కిది తగదు. నీ వొంటరిగా సారథి యింటికిఁబోవుటకు నే నొప్పుకొనను. అతడు కొంచెము వయసుమీరినవాడే కావచ్చును. నీ వతని యింటి కొంటరిగాఁబోరాదు. అత డనినచో నభిమానముగా మాటాడరాదు. అది నా కిష్టము లేదు." అని శిరీషు మొగము ముటకరించికొనెను. వాసంతికిఁగూడ గోపమువచ్చెను. "నాన్నగారూ! మీ రనెడు మాటలలో నర్థములేదు సారథికి నాకు నేమి సంబంధము. ఆయన గొప్ప నటుడు. ఆయన గొప్పనటుడన్న విషయము నాకుఁ జెప్పినది, తెలియజేసినది మీరే. అత డున్నచో నాకు గౌరవము కలుగజేసినది మీరే. నే నొంటరిగా నతనియింటికి రెండుసార్లు పోయివచ్చితినని మీకుఁ గోపము. అది మీ కిష్టములేదు మీ కిష్టము లేని పని నేను చేయగూడదు. కొంద ఱింకొకరు చూచుచుండగా భోజనము చేయలేరు. ఒక్కొక్క జీవి కొక్కొక్క యేకాంత విషయ ముండును. నేను నిజముగా నేదియైనను

నేర్పుకోవలయునన్నచో బోధకుడు నేను నిదరమే యుండవలయును. ఇంకెవరో వినుచుండగా విషయము తెలిసికొనుట నాకుఁ గష్టమైన పని. అందుచేత నేను సారధివద్దకు ఒంటరిగాఁ బోతిని. ఒంటరిగా వెళ్ళితినేమో యభినయపరమరహస్యము నాకుఁ దెలిసినదేమో. మీ రున్నచో నత డది నాకుఁ జెప్పెడివాడు కాడు" అనెను. శిరీష- "నేను వినుటకుఁ దగనా" వాసంతి-"అది కాదు. మీరు భక్తితో శ్రద్ధతో వినరు. పైగా గురువు శ్రద్ధతో నడిగినవానికిఁ జెప్పును. ఆ రహస్యము గురువునకుఁ దెలియును. ఎలప్పుడు నతనికిఁ బ్రత్యక్షములో నుండదు. విద్యార్థి దానిఁ దెలిసికోవలయు నన్న భక్తి శ్రద్ధలతో నడిగినపుడు గురువున కొకయావేశము వచ్చును. ఆ యావేశములో నామహావిషయము నతడు తన జ్ఞానభాండారమునుండి త్రవ్వి వెలికిఁ దీసి చెప్పును. అట్టి సమయమునందు శిష్యుడు కానివా డుండుట వాని యదృష్ట విశేషము. వాడు గ్రహించఁగలడు కాని శిష్యుడు గ్రహించినంత గాఢముగా గ్రహించడు. వాని కది వినిపించిన విషయము వినఁ దలచుకొన్న విషయము. మఱియు నా శిష్యుడు కాని యితరుడు పరాభిప్రాయ దూషితబుద్ధియైనచో వానికా మహావిషయమందు నిరాదరణమే కలుగును. మొదట నతని కాగురువునందు గురుభావమే లేదాయెను. విజ్ఞానవంతులు కాని గురువులు వివేకవంతులు శ్రద్ధాళువులు కాని శిష్యులతో నీ లోకము సామాన్యమగుచున్నది. అందఱు నేదో నేర్పుచున్నారు. అందఱు నెదో చెప్పుచున్నారు. సారధికిఁ దెలిసిన విషయము మఱొకనికిఁ దెలియదు. తెలియుట సాధ్యము కాదు. తాను మహానటు డగుటకుఁ గారణము తాను జీవితములోఁ బొందిన క్షోభ యని చెప్పెను. అట్టి జీవుడు పొందిన క్షోభ వాని మనస్సును మరి పాకముచేసి యట్టి పెట్టునట. ఆ పరిపాకము పొందిన మనస్సు వాంఛితమైన పరిస్థితియందు సులభముగాఁ బ్రవేశించునట. ఇది నాట్యములోని పరమరహస్యమని చెప్పెను. తక్కిన వన్నియు నేర్పికొనునవియట. ఆ క్షోభ పొందుటకు జీవుని లక్షణము వేఱుగా నుండవలయును. అందఱు మనుష్యులా క్షోభను బొందలేరు. మిమ్ముగుఱించి యాయన యొకమాటయన్నాడు. అమ్మపోయినది. మీరు క్షోభ పొందలేదా యని యడిగితిని. మీలో నున్న జీవుడు తానట్టి క్షోభ పొందుటకు సమర్థుడు కాదని చెప్పెను. అట్టి క్షోభ పొందిన జీవునకుఁ దన కూతు యొక్క సంగీత విద్యయే పరమావధిగా నుండదని చెప్పెను. అతఁ డొకే యొక లౌకికవిషయమునందు మోహితుడై యుండెడుట."

శిరీషకుఁ గొంచెము కోపము వచ్చెను. కోపము వచ్చుట సహజమే. ప్రతి జీవుడును దనకుఁ దెలియకుండఁ దాను సంపూర్ణుడ ననుకొనుచుండును. అది జీవుని లక్షణము. తనకుఁ దెలియని విషయములు లోకములోఁ గనిపించి

నపుడు పరులతోఁ దన కా విషయము తెలియదని చెప్పును. తన యజ్ఞానమును దెలియజేయును. సన్నివేశము జరిగినపుడు తన కది తెలియదని దుఃఖించును. సామాన్యములైన యితరసమయములందు తాను సంపూర్ణుడుగానే ప్రవర్తించును. అందుచేతఁ దాను తెలియనివాడనని ఎవరో యన్నారని తనకుఁ దెలిసినపుడు వానికిఁ గోపమువచ్చును. శిరీషునకుఁ గోపమువచ్చెను. అతనికిఁ గోపమువచ్చి నపుడు వివరెట్లు తిరుగునో తెలియదు. నేను దెలియనివాడను. సారధి తెలిసిన వాడు. నీ వతనివద్దనే పోయియుండుము. ఆ పాకలోనుండి వానికి వండిపెట్టు చుండుము. వాడు నీకుఁ దత్త్వ ముపదేశించును. నీవు మోక్షమును జూఱ గొందువు గాని. అతఁ డొక పోతులూరి వీరబ్రహ్మము. నీవు శిష్యురాలవు. ప్రతి పల్లెటూరుపోయి నాటకములాడుడు. అతని కక్షరముముక్క రాదు. అతఁ డరవింద యోగి గ్రంథములు చదివెనా? వివేకానందు డెవరో యతనికిఁ దెలియునా? అతడు పండితుడా? అతడు చెప్పెడి వాడు. నీవు వినెడి దానవునా? ఘుణాక్షర న్యాయముగా నతడు నటకుడైనాడు. అది పెద్ద గొప్పకాదు.

వాసంతి యా తండ్రి కూతురు. చివరికేమైనను మాటకు మాట చెల్లించి తీఱును. ఇది లోకములో నూటికిఁ దొంబది తొమ్మిది పాళ్లు మానవ స్వభావము. మఱియు బ్రతియింటిలోనను జరిగెడిదే. వారిని వీరు ప్రేమించుచుందురు. దగ్గఱి బంధువులు అన్నదమ్ములు అక్కసెలెండ్రు తల్లి కూతులు భార్యాభర్తలు వీరిలోఁ బెద్దవారికి 'మేము పెద్దవారము రెండవవారు తగ్గి మాటాడవలయు'నని యుండును. వారు తగ్గి మాటాడరు. వారికిఁ గోపమువచ్చిన కొలది వారు హెచ్చి మాటాడుదురు. వీరు నొచ్చిపోదురు. వాసంతి యిటనెను. "నాన్నగారూ మీరనెడి మాటలకర్థము లేదు.. నేను సారధి యింటికిఁబోవుట యేమి? అతఁడెవరు, నేనెవరు? నే నతనికి వంటచేసి పెట్టవలయునా? నాకు వంట చేతగాదు గదా. అతడు చదువుకోని మాట నిజమే. ఆ సంగతి యతడే చెప్పెను. చదువు కొన్నంత మాత్రమున రహస్యములు తెలియవు. పరమ రహస్యములు తెలియు టకు నొక జీవునకుఁ బూర్వజన్మకర్మ విశేషముండవలయును. అది సారధికిఁ గలదు. ఆ కలిగినవాడు వేయిమంది చదువుకొన్న వారికంటె నయము. విద్యలో నున్న చిన్న చిన్న మెలకువలు వానికి దెలియక పోవచ్చును. కాని యా విద్యలోని పరమార్థము వానికిఁ బ్రత్యక్షమగును. సామాన్య లోకము వేఱు, అతడు వేఱు. ఈవిద్యలన్నియు నభ్యాసమువలన, నాలోచన వలన నా పరమార్థ ము గోచరింప జేయుటకే యేర్పడినవి. ఒక మహాపురుషునకే పరమార్థమే మొదట దెలియును. తెలిసిన తరువాత నా విద్యలోని తక్కిన విషయములన్నియుఁ దేనికేది ప్రయోజనమో, యేది యెందుకేర్పడినదో సులభముగా గోచరించును.

విద్య చదివినవాడు విద్యనేర్చుకొనినవాడు పరమార్థము నే గ్రహించలేక పోవును. వాడెంత సేపటికి నా విద్యా మార్గములోని యల్పాల్ప విషయముల యొక్క యల్ప సౌందర్యములందు మునిగిపోయి యచ్చటనే కూర్చుండును. వాడు కంద జన్మలకు నవధి స్థానము చేరలేడు. నాకెద్దో కొంత సంగీతమును మీరు చెప్పించితిరి. నాకీ సంగీత విద్యలో మూలవస్తువేదియో తెలియలేదు. రాగము ప్రస్తారము చేయుదును. పల్లవిపాడుదును. స్వరము వేయుదును. అన్నియు నాకాచార్యులుగారు చెప్పినవే. నేను క్రొత్త సంగతి వేయలేను. స్వరమును నా స్వయంబుద్ధితోఁ బెంచలేను. ఈ లెక్కలమీద సభలోఁ గొందఱు కూర్చుండి తలలాడింతురు. వారిని జూచినచో నా కొడలు మంట. ఎంత సేపటికి నా బుద్ధి దీని తరువాత నీ స్వరము వేయవలయును. దీని తరువాత నిది వచ్చును– ఇదియే యూహకాని యీ స్వరము పెంచుటలో, నా రాగము ప్రస్తరించుటలో నన్ను నేను మఱచిపోయి నేనన్న ప్రతిదియు సంగతియగుట నా కల్పనయంతయు స్వరము పెంచుటగా బరిణమించి నేను తన్మయత పొందినదిలేదు. నా కట్టి స్థితి పరమేశ్వరుడీయలేదు. నీవు నేర్పించిన విద్య దానికిఁ జాలదు. నాకు నీ వేర్పాటుచేసిన గురువు లటువంటివారు కారు. నాట్యములో సారధి నే నెన్నుకొన్న గురువు. ఆ విద్యలోని పరమార్థము తెలిసిన గురువు. అందుకనియే నాకు దెలియకుండ రుక్మాంగద రాణాప్రతాపసింహ నాటకములలో నే నట్లభినయింపఁ గల్గితిని. నే నభినయించుచుంటినని తెలిసినచో నది యభినయమే కాదు. అట్టి పరమమైనస్థితి యీ యర్జునరావు పొందినాడని నాకు విశ్వాసములేదు. ఐనను రేపు చూతుముకదా” శిరీషు మరల మాటాడలేదు.
వాసంతి యెత్తిన యెత్తుగడ వానికిఁ గోపము గలిగించుచున్నదయ్యెనను జివరిచివర కామె మాటలు వాని కోపమును శాంతింపఁజేసెను. అతనికిఁ గోపముతోఁబాటు వాసంతి మాటలలోని పరమ యాథార్థ్యము నొకయావేశము నొక తీవ్రత యతనిని గ్రహించెను. అతడు దిగ్భ్రాంతిపొందెను. కొన్ని నెలలక్రిందివఱకు వాసంతిలో నీరేఖలేదు. ప్రసంగములలోఁ గొద్దికొద్దిగాఁ బొడసూపెను. అది నేటికి గొప్ప పరిణామము పొందినటుండెను. వాసంతియొక్క యీ స్వాతంత్ర్యమునకు శిరీషు మనసులో నేదో యొక యనిష్టము నామెలో వెలుగుచున్న యీ జ్యోతికి నొక యానందము ఆమె మనసులోని భావము లింత స్పష్టముగా జెప్పుటకొక యాశ్చర్యము. ముప్పేటగొన్న యీభావములతోడి శిరీషుడు ప్రసన్నుడు కాలేదు. కోపించలేదు. మెచ్చుకొనలేదు. మెచ్చుకొననట్లును లేదు.

మఱునాడు ప్రొద్దున వాసంతి సారధి యింటికి బోదుననెను. తండ్రిగారేమున్నది, వెళ్లినచో వెళ్లుమనెను. మఱియు నేను వచ్చినచో గురూపదేశము

నీకు వచ్చెదనెను. వాసంతి "యుపదేశము వినుటకుఁ గోపోవుటలేదు. సారథి యెటువంటివాడో నాన్న గారూ! మీరుకూడఁజూతురుగాని రం"డనెను. ఆమె యెట్లును వెళ్లను. ఆమె ఒక్క తెపోవుటకు ఇతని ఇష్టములేదు. అందుచేత బయలుదేరెను. సారథి తోట త్రవ్వుచుండెను. ఇద్దరునుపోయి బావి యరుగు మీద గూర్చుండిరి. ఏమి పనిమీద వచ్చితిరని యడిగెను. అడిగి తాను తోటలో దూరముగా ఏదో మొక్కకుఁ బరిచర్యచేయుటకుఁబోయెను. వాసంతి యిట్లనెను. "నాన్న గారూ! నేను వచ్చుట యతనికిష్టమైనచో వచ్చితివని సంతోషించును. ఏమిపనిమీద వచ్చితివని యడుగడు. నే నిచటికివచ్చుట యతనికి ఇష్టములేదు. కాని మీ యిద్దఱికి స్నేహము. చిన్నప్పటినుండి నన్నెఱిగి ఉండుటచేత నాయందుఁ గొంత ముద్దు. తల్లిలేని పిల్లవని జాలి. ఈ కారణముల వలన నన్ను రావద్దనడు" అనెను. మరల సారథి యచ్చటకు వచ్చెను.

వాసంతి-"నేడూరిలో గొప్ప నాటకము. నీకు దెలియదు కాబోలు. అర్జున రావు గారని గొప్ప నటకుడు. ఖండాంతరములఁ బ్రఖ్యాతి పొందినవాడు. ఆయన మనయూరిలో నీనాడు నాటకము వేయుచున్నాడు."

సారథి-"నాకుఁ దెలియదే."

వాసంతి-"నీవు గిరిగీసి గిరిలోగూర్చుండుదువు. నీకెట్లు తెలియును?"

సారథి-"గిరి వెలుపలివారు చాలమంది వత్తురు. ఇప్పుడు మీరు రాలేదా? వారెవ్వరును జెప్పలేదు. మీరే చెప్పితిరి."

వాసంతి-"మేము గిరిలోనివారమే యన్నమాట. ఊరంతయు మ్రోగి పోవుచున్నది."

సారథి-"తప్పెటలు తాళా లేమియు లేవే"?

వాసంతి-"అవి యేమియు లేవు. టిక్కెట్లులేవు. ఊరిలో వేయి రూపాయిలు పోగుచేసిరి. ఆయనకు సమ్మానము చేయుదురట. పెద్ద మనుష్యులకు, జదువుకొన్న వారికి మాత్రమే ప్రవేశము."

సారథి-"ఐనచో నేను రాగూడదన్నమాట."

వాసంతి-"నాన్న గారు పదిరూపాయ లిచ్చినారు. మనము ముగ్గురము కలిసిపోవచ్చును."

సారథి-"ఆయన తండ్రి, నీవు కూతురవు. నే నెవరను.?"

వాసంతి-"నీవును మా కుటుంబములోనివాడవే. కాదని యెవరనగలరు."

సారథి-"ఎవరిదాకనో యెందుకు? మీనాన్న యనకుండ నుండిరగదా!"

శిరీషు-అది యేమిటి సారధీ! నే నెందుకందును? మనము ముగ్గురము కలిసిపోదము."

సారధి-"వారందఱు పెద్ద విద్యావంతులు. మనకేమి తెలియును? ఏదో చిన్నతనమున రంగముమీద గంతులు వేయుటయే కాని నాకేమియు దెలియదు. పైగా బదిమందిలోనికి నేను రాదగినవాడనుగాను. విప్రవినోదులున్నారు. కొల్లభాగవతులున్నారు. గడకట్టి యాడెడు దొమ్మరివాండ్రున్నారు. గారడీసేయు వారున్నారు. వారికి సభార్హత యున్నదా? ఒక సర్కసు, మేజిక్కు చేయు వాడు మొదలయినవారు నేటికాలమున సభార్హులు. విద్య యొక్క టియే. వీరి నాగరకతలు వేఱు. నాకు సభార్హత లేదు. నేను రాను. నేను వచ్చినచో నే నానందించలేను. నే నభినయించినచో ఇతరు లానందింపవచ్చును. ఆనందించక పోవచ్చును. ఇతరుల విద్యచూచి నే నానందించలేను.

వాసంతి-"ఎందుచేత? దుష్ప్రాతితనమా?"

సారధి-"దుష్ప్రాతితనమే. నేనింత నటుడనుగదా! నాకన్న గొప్పవా రెట్లుందురు? ఉన్నచో నోర్చుట కష్టముగదా. నేను వట్టి దుష్టుడను."

అని సారధినవ్వెను.

వాసంతి-"అధీ! నీవట్లనవద్దు. తప్పకుండ రావలయును. నీవు రానిచో నేనువచ్చి తీసికొనిపోయెదను. ఎట్లు రావో చూతును."

సారధి-"నీవొక తెవు నాకు బట్టితివి. నేనొక బైరాగిముండకొడకను. నన్ను సంసారిని చేయవలయునని నీ భావము. నేను మోటువాడను. నన్ను నాగరకుని జేయవలయునని నీ యూహ. నేను వీధిలోని మన్నును. నేను జవ్వాజిని గాను, పునుగును గాను, గంబురా కాను."

వాసంతి-"నీవు పుస్తకాలలో మాటలు మాటాడినచో నాకర్థముకాదు."

సారధి వాసంతి వివేకమునకు సంతోషించెను. గాఢ నిశ్చయముతో మాటాడినమాట నామె యల్పమైన చమత్కారముతో దాని ఫలితమును వ్యర్థము చేసెను.

వాసంతి-"సరేకాని, నీ వితరుల యభినయమేల మెచ్చికొనలేవు?"

సారధి-"చెప్పితివికదా నా యవివేకము, నా యహంకారము, నా యీర్ష్య."

వాసంతి-"అధీ! అదికాదు, నిజము చెప్పుము."

సారధి-"వా రల్పములైన దోషములు చేయుదురు. నా కవి కంటగింపుగా నుండును. పైగా వారొక నాటక మాడుదురు. ఆ నాటకమును గురించి నే

నూహింపలేను. దానిని గురించి నాకు దెలియదు. హఠాత్తుగా నా నాటకము యొక్క రసభావములందు ప్రవేశించు చురుకుదనము నా బుద్ధికి లేదు. వారా రసభావముల నాలోచించి చేయరు. ఏదో ప్రజలవలన మెచ్చించుకొనుటకు, చప్పట్లు కొట్టించి కొనుటకు కృత్రిమములైన కొన్ని మార్గము లవలంబింతురు. ఏ కొంచెము రసమున్నను నది వీని చేత విశ్లథమైపోవును. పైగా నేను బాగుండలే దందువనుకొమ్ము, ఈర్ష్యయందురు. తానే గొప్పవాడు కాబోలు, ఇంక నెవ్వరు లేరు అని యాసడింతురు. వాసూ! నన్ను నా దారి నెందుకు బ్రదుక నీయవు?

వాసంతి—"నేను బ్రదుకనీయను గాని. మేము సాయంత్రము వత్తుము. ముగ్గురము కలసిపోదము. నీకిది తప్పదు. నామీదనొట్టు".

సారథి—"ఇంక రాకతప్పదు. కాని నేను చందా నిచ్చినవాడను కాను. నన్ను కాదనరు కాని మొగాలు మొగాలు చూచికొందురు."

వాసంతి—"అప్పుడు మన మిద్దఱమును మొగాలు మొగాలు చూచికొందము.

సారథి—"నిన్న మొన్నటిదానవు. నీవింత మాటకారివైన తరువాత నేను బ్రదుకను".

వారు గవిడి దాటపోయిన తరువాత సారథి పిలిచి "యేమి నాటక"మని యడిగెను. వాసంతికిని దెలియదు. కాని నీకు నేను చెప్పననెను. తండ్రితో రంగనాథముగారి యింటికిబోయి నాటక మేదియో కనుగొందుమనెను. ఊరిలో తప్పెటలు లేవు. గోడలమీదం గాగితము లంటించలేదు కాని కొంత దూరము పోయిన తరువాత చేతితో వ్రాసిన గోడ కాగిత మొకటి కనిపించినది. "నాటకము విజయనగర సామ్రాజ్యపతనము." అర్జునరావు పఠాను వేషము వేయును. లోకాద్భుతము చూచి తీరవలయును".

వాసంతి కట్టి నాటక మున్నదనియే తెలియదు. విజయనగర రాజ్యపతనములోం బఠాను లెవ్వరు? తండ్రిని కథ చెప్పుమని యడిగెను. ఆయనకును సరిగాం దెలియదు. తల్లికోట యుద్ధములోం దెలుగు సైన్య మోడిపోయెను. అంతకంటె శిరీషునకుం దెలియదు. రంగనాథము నింటికిం బోయిరి. రంగనాథమింటిలో లేడు. లలితా కమలలు వచ్చిరి. వారింటికి వెళ్లినప్పుడెల్ల వాసంతిని సంగీతము పాడుమని బలవంతము చేయుదురు. వాసంతి యెప్పుడును బాడదు. వారినే పిడేలు మీద వాయించుమనును. వారు వాయింతురు. అట్లు కొంతసేపు జరిగిన తరువాత రంగనాథము వచ్చెను. వారు చావడిలో నుండిరి. శిరీషు గదిలోనికిం బోయి రంగ

నాథము తమ్ముని చిత్రములు చూచుచుండెను. అతనికి గ్రామములో నొక స్త్రీ ప్రభాత యని పేరు. రంగనాథము వచ్చి వాసంతిని జూచెను. వాసంతి యొక్కతయే వచ్చినదనుకొనెను. అట్లెప్పుడును జరుగదు. కాని రంగనాథమునకుఁ దన పాచిక పారుటకు మొదలు పెట్టినదని యూహ కలిగెను. కోటలోని పాటకచేరి పథకమున కిది మొదలనుకొనెను. ఇంతలో శిరీషు వచ్చెను. రంగనాథము మనస్సులోఁ గలిగిన యాశాంకురము తునిగిపోయెను.

శిరీషు-"నేటి నాటకమ్ముకి పేరేమిటండి?"

రంగనాథము-"విజయనగర రాజ్యపతనము."

వాసంతి-"అందులోఁ బఠానెవరు?"

రంగ-"అర్జునరావుగారే."

వాసంతి-"పఠానే నాయకపాత్రమా?"

రంగ-"అతడే ప్రధానుడు."

వాసంతి-"తెలుగు నాటకములలోఁ బఠాను నాయకుడేమిటి. నాకు కథ యేమీ తెలియదు, దయచేసి చెప్పరాదుగా.?

రంగ-పఠాను మహావీరుడు. ఆరోజులలో విజయనగర సైన్యములో దురకలుకూడ నుండెడివారు. ఇతడాఫ్ఘనుస్థానమునుండి వచ్చెను. రామరాయలవద్ద కొలువుచేరెను. రామరాయలొక తురుష్కస్త్రీని పెండ్లాడెను. అతడామెకుఁ బుట్టినవాడు. అందుచేత రామరాయలకు వానిమీద మిక్కిలి ప్రేమ.

వాసంతి-"అతడు" ఆఫ్ఘనుస్థానమునుండి వచ్చెనుగదా. ఈయనకు కొడుకెట్లయ్యెను.?

రంగ-"చిన్నప్పుడే తల్లి యాఫ్ఘనుస్థానమునకు పోయెను."

వాసంతి-ఈయన పెండ్లియాడెనుకదా. భర్తను వదలిపెట్టి వెళ్ళెనా?

శిరీషు-అసలు కథను జెప్పనిత్తువా.

వాసంతి-ఆమె పఠాను స్త్రీయగా, తురుష్కస్త్రీయా మన దేశములోఁ బఠానులు తక్కువ. అట్టిస్త్రీని గోషాలోనిదానిని రామరాయలెట్లు పెండ్లాడెను. ఏతురుష్కస్త్రీనో పెండ్లియాడియుండును. అది యొక్కతెయో పేదదియై యుండియుండును. అది పఠాను కాదు, గిఠాను గాదు. ఇది ఏదో కృత్రిమకథ.

రంగ."ఇందులోఁ గథ కాదు ప్రధానము. అతని యభినయము."

వాసంతి-అభినయము గాలిలో నుండునా! కథ నాశ్రయింపదా?

శిరీషు- "వాసంతి! నీకు రోజు రోజుకు తెలివి యెక్కువగుచున్నది. రంగనాథముగారూ! పసిది దానితో నేమి. కథ జెప్పుడు. కథ తెలియకుండ నాత్రికి వచ్చి యేమి చేయుదుము? కనుక జెప్పుడు."

వాసంతికి గధ వినుటలో నిష్టము పోయెను. ఒక యసహ్యము వేసెను. రాణా ప్రతాపసింహకధ యున్నది. ఆమెకు నచ్చినది. ప్రతాపుడు హైందవ ధర్మము కొఱకు పోరాడెను. కష్టములు పడెను. రుక్మాంగదనాటకము బాగుగా నున్నది. శృంగారరసమున్నది. తిరువాత వైరాగ్యమున్నది. ఏకాదశీ మాహాత్మ్యమది. పాండవ నాటకములున్నవి. అన్ని నాటకములు బాగుగనే యున్నవి. ఈ పళానేమిటి. రామరాయలు గొప్ప తెలుగురాజు. అతడు తురుష్క స్త్రీని పెండ్లి యాడుట యేమిటి. మన పూర్వ రాజులందు దోషము చూపించుటకూ. అతడు శ్రీకృష్ణదేవ రాయలకు నల్లుడని తన తండ్రి చెప్పెను. కృష్ణదేవరాయలకంటె గొప్పవాడని చెప్పెను. మూడు తురుష్క రాజ్యములు కలసి యతని నోడించె నని చెప్పెను. ఇందులో బఠానెవ్వరు. తిండికి లేక యుద్యోగముకొఱకు వచ్చిన వాడెవడో విజయనగర రాజ్యమును నాశనము చేయగలడా. వెర్రికథ. ఆమె యుట్లూహించి లేచి నిలుచుండి "కథ తెలిసిపోయినదండీ! రాత్రి నాటకమునకు వత్తుముకదా" యనెను. శిరీషు లేచెను. రంగనాథను నివ్వెఱ పోయెను. నివ్వెఱ పాటు సంబాళించుకొని తనకేమియు బట్టనట్లు నవ్వి "నాటకమునకు తప్పకుండ రావలయు"నని యనెను. వాసంతి-"మే మిద్దఱమే రావలయునా, మఱి యెవ్వరి నైన దీసికొని రావచ్చునా? రంగ- "మీ వంట కత్తెను గూడ దీసికొని రావచ్చును. స్త్రీలకు ప్రత్యేక స్థలమున్నది." వాసంతి- "వంటకత్తె కాదు వంట కాడే." రంగ- "ఎవరతడు.?" వాసంతి- "అతడు పెఱయిండ్లలో వంట చేయడు. తన యింటిలో దానే వంట చేసికొని తినును."

శిరీషు- "సారధి తన యింటిలోనను వంట చేసికొనడు. పూటకూట యింటిలో దినును. అతడు వంటకాడు కాదు ఇంక పద పోదము."

వాసంతి- "ఆ వంటకాదు. వంట యనగా పాకము. నేను చెప్పునది రస పాకము."

రంగ- "వాసంతి పెద్ద పెద్ద మాటలు నేర్చినది."

వాసంతి- "మీరు మహా కవులు. మీతోడి పరిచయము. సారధి రావచ్చునా?"

రంగ- "అతడు చందా నేమియు నీయలేడు."

వాసంతి- "అతనినిబోయి యెవ్వరడిగిరి. చందా యెంత యీయవల యును. పదిరూపాయలు చాలునా. నాన్నగారూ! ఈయండి. ఐనను రంగ నాథము గారికిచ్చుట యెందులకు. ఆయన వాడుకొనును. సారధి చందా యిచ్చి నట్లు కాదు."

రంగ- "నిన్న మీ రిచ్చిన చందా వాడుకొన్నట్లే దీనిని వాడుకొందును."

ఇది రంగనాథము యొక్క స్వభావము. తన దోష మెవరైన నుద్ఘాటించినచో దానిని నవ్వులక్రిందికిఁ ద్రిప్పివేయును. మనసులోఁ గోపము పెట్టుకొనును. అతఁడు శక్తి ప్రత్యుక్తులయందు ప్రతిభుఁడు. మౌనమే యతనికి విభూషణము. అతనివిధ క్తుల క్రియాసమర్థత్వము మహాజ్ఞాని లక్షణముగా భాసించుచుండును. సమాధానము చెప్పలేక యూరకుండెనాయంగురు.

ఆ రాత్రి నాటకమయ్యెను. అర్జునరావుగారికి వేయినూటపదార్లిచ్చిరి. దొరగారువచ్చిరి. అవధానిగారు లేచి ప్రశంసించెను. సారథి పేరుచెప్పకుండ నతనికంటె నితఁడు గొప్పవాఁడనెను. మనయూరిలోనున్న వందలకంటె గొప్పవాఁడనెను. అటువంటి నాట్యము తానిదివఱకు జూడలేదనెను దొరగారేకపత్నీవ్రతుఁడనెను. అవధాని యొప్పడుపన్యాసమిచ్చినను దొరగారి యేకపత్నీవ్రతము వదలిపెట్టఁడు. దొరగారు కళారాధకుఁడు. కళాపోషకుఁడనెను. "ఈ యూరిలో దొరగారు పెద్దనాటక భవనము కట్టించబోవుచున్నారు. అర్జునరావుగారీ యూరిలోన నేయుందురు. దొరగారొక నాటక సమాజము నేర్పాటు చేయుదురు. దొరగారీ మహాకార్యమును జేయబూనుకొనిరి. దొరగారికీర్తి భూనభోంతరాళముల మాఱుమ్రోగిపోగలదు. ఈ సంస్థానము దేశమునకు మేలుబంతి యగును. వారి యాస్థానములో మేము మహాకవులమున్నాము. నేనును రంగనాథమును. మా రంగనాథము చాలగొప్పవాఁడు. మిక్కిలి గొప్పవాఁడు. అతఁడీ యూరిలోనుండుట యీ యూరియొక్క యదృష్టము. అతఁడెంత సుకుమారకవి! చేమకూరి వెంకన్న యీ కాలమున మరల సముద్భవించినాఁడు. అర్జునరావుగారిని మన గ్రామమునకు దీసికొనివచ్చుట రంగనాథముయొక్క ప్రయత్నమే. రంగనాథము ఘటకుఁడు. అతని తాత దివాన్‌జీ. ఇతని తాతగారివలన నీ జమీందారీ యెంత వృద్ధిపొందినదో మరల రంగనాథమువలన నంతవృద్ధి పొందబోవుచున్నది." ఈరీతిగా నుపన్యసించెను. ఇట్లు చెప్పుటవలన దొరగారి ముందు కాళ్ళకు బందము వేయుట యనియు, రంగనాథమును తనదెస ప్రసన్నుని జేసికొనుటయు నని యవధాని యనుకొనెను. కాని యీ మాటలవలన విపరీతఫలము లుదయించెను. సారథికి వాసంతికి రంగనాథముయొక్క కపటత్వము తెలిసెను. సారథికి బట్టింపులేదు. కాని వాసంతికి గోపమువచ్చెను. నాటకమైపోయెను. ఎవరిదారిని వారుపోయిరి.

మఱునాటి సాయంకాలమున సారథియు వాసంతియు శిరీషుఁడును సారథి తోటలోఁ గూర్చుండిరి.

వాసంతి : అధీ! తెలిసినదా.

సారధి : వాసూ! "అధీ యనగానే"

వాసంతి: "అది నీ పేరులో గొంత "

సారధి : ఆధివ్యాధులుండును. వ్యాధియనగా శరీరముయొక్క యనారోగ్యము. ఆధి యనగా మనస్సుయొక్క యనారోగ్యము.

వాసంతి: "సరిపోయినది. నీవు నామనస్సునకుఁ బట్టిన వ్యాధివే కదా. ఆ సంగతి యటుంచుము. నాకుఁ దెలిసినది. ఇదియంతయు నవధానియే రంగనాధమును నీమీదఁబట్టిన కచ్చ. రాత్రి యవధాని చేసిన యుపన్యాసమంతయు నీవు సరిగా విన్నచో నీకుఁ దెలిసియే యుండును. ఎవరెవరో కుర్రకాయలు వ్రాసిన నాటకములనుఁ గొండలు వేయుచున్నారట. ఆ కొండలు కుర్రకాయలు కిరీటి. మనసులో నసలేను పది. అందుచేత నవధానియే రంగనాధమును గోటలోని కెక్కించెను. ఇద్దరునుగలిసి యీ యర్జునరావును దెచ్చిరి. నాకతని యభినయ మేమియు బాగుగా లేదు. నీకెటులున్నది.

సారధి— "నాకు బాగుగనే యున్నది".

వాసంతి—"ఇందుకనియే నిన్ను జూచినచో నాకొడలు మండిపోవు చుండును. నీకెప్పుడును పరాచికమే. నీవు నటించుచున్నప్పుడు తప్ప మరెప్పుడు నీవు దేనినైనను ప్రధానవిషయముగా భావించితివి. ఎవరైనను నీ నెత్తి మీదికిఁ దెచ్చుచున్నను నీవు పట్టించుకోవేమి?"

సారధి—"వానీ. మనకెందుకు? నేనేమి కొమ్ములు వేయవలసినవాడనా? వేళ్లుపాతుకోవలసిన వాడనా? నా కాకలియైనచో విశాలాక్షియున్నది. నేనొక నాటకము వేసినచో నాకొక పదిరూపాయలు మిగులును. నాకు వైఖర్యానకు సరిపోవును. సరదాగా నెవరితోనైన మాటాడవలయునన్నచో నీవును మీ నాన్నయు నచ్చుచునే యుందురుగదా? నాకుఁ దెలియనిదేదైనఁ దెలిసికొనవలయునన్నచో సుమాపతి యున్నాడు. నాకిడ్డెనలు తినవలయు ననిపించును. పెసరట్లు తినవలయు ననిపించును. నాకు బీడీలు కావలయును. డబ్బుకుగనుంటె నాకిచ్చెడి వారీ యూరిలో గలరు. ఇంక నాకేమియు నక్కరలేదు. మరియు నాకేమియుఁ దోచదనుకొమ్ము. సముద్రమున్నది. నడుమ నాలుమైళ్ళ ఇసుక పట్టి యున్నది. నాకు జ్వరమువచ్చిన దనుకొమ్ము. సముద్రతీరమువెంట కొన్ని మైళ్ళు నడచిపోదును. దేహము దల్లఁబడును. జ్వరముపోవును. శైత్యము చేసినది జలుబుచేసినది. అన్నమరగలేదు. తెల్లవారులు నాతోట నేనే త్రిప్పుకొను చుందును. అన్నమరుగును. శైత్యము పోవును. దేహమునకు నెట్టయెక్కును. ఈ యూరిలో సముద్రమున్నంత వఱకు, పైన మబ్బులు పట్టినంతవఱకు నా

తోట యున్నంతవఱకు నాకేమియు భయములేదు. నే నున్నచో గోపముకల వారిని వారి కిష్టమువచ్చినట్లు చేసుకొననిమ్ము."

వాసంతి—"మబ్బుల నెవ్వరేమియు చేయలేరు. సముద్రము నేమి చేయలేరు. అధీ! నీకు జ్వరమువచ్చినచో నాకు భయములేదు. నీకు జలుబుచేసినచో నాకు భయము. ఈ తోట నీకుదక్కనిత్తురా. ఈతోటలో నిన్నుండనిత్తురా".

ఆయూరికి సముద్రపు వైపునఁ బెద్ద తోటయున్నది. దానికిఁ దోటయని పేరు. అందులోఁ జెట్లేలేవు. ఒక నలుబది యేబది యోకరముల పెద్ద స్థలము. సముద్రతీరము కనుక నంతయు నిసుకపఱ్ఱ. అందందు దొరువులు తీయబడి యుండెను. పూర్వమెప్పుడో వాని క్రిందఁ గూరలు పండించియుండవచ్చును. నేఁడా దొరువులలో నీరులేదు. ఆ తోటనడుమ శిథిలమై పోవుచున్న యొక యిల్లుకలదు. దానిని గుడియందురు. ఆ తోట యెవరిదో తెలియదు. దాని కదుపు లేదు. దానికే యేమిటి, యీ ప్రాంతముల నిట్టి స్థలములు చాల కలవు. వేనికి నదుపులేదు. ఆ యూరికి జిల్లాకోర్టును గళాశాలయు మఱియు నిట్టి సంస్థలు వచ్చినచో నా యూరు మహాపట్టణమైనచో నివి యన్నియు నివేశన స్థలములు కావచ్చును. ఇప్పుడా నలుబది యెకరముల తోటయు నేబది రూకలకిచ్చినను కొనెడివారు లేరు.

ఇంతకు నా తోట చాల భాగము గడ్డికూడ మొలవని యిసుకపఱ్ఱ. ఆ యూరిలో శరీర వ్యాయామము చేయు కొందఱు యువకు లచ్చట తెల్లవాఱు జామున వచ్చి దండెములు బస్కీలు తీయుదురు. సాయంకాలముల నా తోటలోఁ బరుగెత్తుదురు. ప్రొద్దుగ్రుంకు వేళఁ గొందఱు పెద్దలు వచ్చి యా తోటలోఁ గూర్చుండి ప్రసంగించుచుందురు. అచటి లాభమేమనగా నదటు చినుకులు వచ్చినచో నా గుడిలోని పడిపోని భాగమునఁ దలఁదాచికోవచ్చును. ఆ గుడిని గుఱించి కథగలదు. ఈ తోట పూర్వమొక బ్రాహ్మణునిది. ఇప్పుడు నతని దేమో తెలియదు. ఆ బ్రాహ్మణుడు పేదవాడు. అసుందరుడు. మెట్టకనులు. ఎత్తు పన్నులు. ఈచుక పోయిన రొమ్ము. ఈనక్రపుల్ల. జుంజురు వెండ్రుకలు. ఇల్లుండెడి వాడని చెప్పుదురు. అతడు చని పోయి వందయేండ్లు కావచ్చును. కాని యీ కథ వచ్చినప్పుడెల్ల నీ వర్ణన చేయుచునే యుందురు. అతనికి మేనమామ కూతునిచ్చి పెండ్లిచేసిరి. ఆ పిల్ల యచ్చర. తిలోత్తమ, ఊర్వశి, ఘృతాచి, మేనక. ఆమె కన్నులు తామర రేకులు. ఆమె మొగము చందురుడు. ఆమె నడుము సన్నగా నుండెడిది. ఆమె యొడలు మేలిమి బంగారము. అంత యందకత్తె. ఆమెను

ఊదిమి దీపము పెట్టవచ్చును. ఈ వర్ణనలో నే భాగము నా కథ చెప్పెడి యాయూరి వారు వదలి పెట్టిరు. వెఱ్ఱివాని భార్య వాడకెల్ల వదినెకదా. కాని యామె పతివ్రత. ఆమె పరపురుష సంగమము సేయదు. మగడట్టి కురూపికదా, వాని నీమె యెట్లు ప్రేమించినది, అతనితో నెట్లు సంసారము చేసినది యని పొరుగూరివాడడిగినచో నాయూరిలోని మేధావియిట్లు చెప్పును: "అసలుపతివ్రత యనగా నేమి? కామము తక్కువకల స్త్రీ. లోకములో స్త్రీలు కాని పురుషులు కాని కామ విషయమున మూడువిధములుగా నుందురు. అధిక కాములు, సంసారయోగ్య కాములు, అల్ప కాములు. అధిక కాములు జారత్వము చేయుదురు. సంసారయోగ్య కాములు పెండ్లిచేసికొని యా భార్యతోడను, నా భర్తతోడను నుందురు. స్వల్ప కాములకు భార్యయే యక్కరలేదు. భర్తయు నక్కరలేదు. భార్యాభర్తలలో నొకరు స్వల్పకాములు, నొక రధిక కాములు నయినచో నప్పుడు స్త్రీయో పురుషుడో విడివడి జారత్వము చేయును. ఆమె స్వల్పకామ యనియు, నీపాతివ్రత్యమనునది యెవరియందు సౌందర్యజ్ఞాన ముండదో వారియందుండుననియు చెప్పుదురు. సౌందర్యజ్ఞానము లేనివారు స్త్రీయైనచోఁ బరపురుషుని యందలి సౌందర్యము, పురుషుడైనచో బరస్త్రీయందలి సౌందర్యము నెరుగలేరు, సౌందర్యమెఱుగని వారికి సుందరవస్త్వభిలాష యుండదు. సౌందర్యజ్ఞానముండి, కామప్రవృత్తి యధికముగానున్నపుడు జారత్వము జరుగుననియు నాయూరివారు చెప్పుదురు. అది జమీందారీ గ్రామము. కనుక నాయూరిలో సౌందర్యజ్ఞాన మెక్కువ. చాలమంది కామప్రవృత్తి లేకయున్నను గొనితెచ్చుకొందురు. ఆంగ్లేయులు మనదేశమున బరిపాలనకు రాకముందు స్త్రీ విషయిక నీతియందుఁ జాలభేదముండెడిది. "యథా రాజా తథా ప్రజా." రాజులు బహుభార్యులు. బహుభార్యుడగుట పురుష లక్షణము. ఆయూరిలోఁ బూర్వ మొకదివా నుండెడివాడట. ఆయనకు డెబ్బదియేండ్లు. ఆయన కొక యుంపుడుకత్తె యుండెడిది. ఆయన రాత్రిపూట తొమ్మిది గంటలకు భోజనముచేసి తాంబూలము సేవించుచు నా యుంపుడుకత్తె యింటికి నడచిపోయెడివాడు. ఈయన వచ్చినంతనే యామె తివాచీ పఱచి పెద్ద దీపము వెలిగించి యాయనను గూర్చుండబెట్టి తాను కొంతసేపు వీణ వాయించెడిదట. ఒక గంటసేపాయన వీణ విని మరల నాయన యింటికి బోయెడివాడు. అనగా నది యొక పురుషలక్షణము. ఆయూరిలోని పెద్దలకుఁ, బిన్నలకు నాతోట కథ తెలియును. అపూర్వపు జమీందారు డీపేద వికారి బ్రాహ్మణుని భార్యను వాంఛించెను. ఆమె యంగీకరించలేదు. ఆమెను పట్టి బలవంతముగాఁ గోటకు దెప్పించెను. తరువాత నేమి జరిగినదో తెలియదు. ఆమె శవము మాత్రము కోటలోనుండి వెలికివచ్చినది. ఆ బ్రాహ్మణుడు భార్య

శవమును దీసికొనిపోయి యాతోటలోఁ దగులబెట్టి దానిపైన సమాధి కట్టించెను. అచట నీయిల్లు వేయించెను. రాత్రిపూట వచ్చి యిచ్చట దీపారాధన చేయుచుండెనట. అతడు మరల వివాహమాడలేదు. ఆడుటకుఁ బిల్ల నెవ్వ రిత్తురు? మరియొక మేనమామకూతురు లేదు. మరియుఁ గొంద ఱిట్లందురు. "అతడందములేనివా డగుటచేత బురుషుఁడు కాఁడా? అతని పురుషత్వ మామె యెఱుఁగును. అందుచేత నామె పరపురుషులను వాంఛింపలేదు స్త్రీ సౌందర్యాదులకంటెఁ బురుషునియందలి పురుషత్వము నెక్కువ వాంఛించును. భర్తృవిషయమున తృప్తిపొందిన స్త్రీకిఁ బరపురుష వాంఛయుండ"దని. అట్టివారె పతివ్రతలగుదురని. ఆమె పేరు మంగమ్మయట. దానికిప్పటికిని మంగమ్మతోట యని పేరు. ఏకాంతముగా మాటాడదలఁచినవారు సామాన్యముగా సాయంవాహ్యాళి కచ్చటికి వత్తురు. ఆ స్థలమాహాత్మ్య మెట్టిదో యచ్చటికి వచ్చినవారు వారిలో నెవరికో యొకరికీ కథ తెలియకపోవుటయో, తెలిసి మరల వినవలయుననియో తెక్కువవారి నడుగుటయు, నీ కథ తప్పకుండఁ జెప్పఁబడుటయు జరుగుచునే యుండును. ఈ కథా ప్రస్తావన జరిగిన తరువాత సహజముగా వారు స్త్రీపురుష కామ సంబంధములయిన చర్చలే చేయుదురు. వారి వారి యనుభవములను చెప్పికొందురు లోకమునందలి విపరీత కామప్రవృత్తి కథాకథనములు చేయుదురు. మఱియు నచ్చటఁ గూర్చున్నవారికీ కథలతోఁబాటు పాముల కథలు, దెయ్యాల కథలు కూడ వచ్చును. మొత్తముమీద నేప్రసక్తివచ్చినను స్త్రీపురుష సంబంధముగానే వచ్చును.

రంగనాథము తన భక్తులతో నచటికిఁ దఱచుగా వచ్చుచుండును. వచ్చిన ప్రతిసారియు మంగమ్మకథ చెప్పకుండ వారు వల్లరు అది నాటకము జరిగిన తరువాతి నాల్గవరోజు. ఈ నాల్గు దినము లర్జునరావు యూరిలోననే యుండెను. ఉభయవేళలఁ బోయి రాజదర్శనము చేసి వచ్చుచుండును. రంగనాథము కూతుండ్రు వానికి మందహాసములతో సీతాకోక చిలుకలవంటి వేషములతో హాస్యములతో సపర్య చేయుచుండిరి అతని కచటు వదలిపో బుద్ధిపుటలేదు. రాత్రిపూట వెన్నెలలో మంచము వేసికొని రంగనాథము, నతడును తత్త్వశాస్త్రము కవిత్వము సంగీతము నాట్యము శిల్పము మొదలయిన మహావిషయము లెన్నియో మాటాడుచుండిరి. పలువిషయములు వారు పరస్పరము తెలిసికొనుచున్నట్లుండెను. పైగా నప్పుడు న్యాయస్థానములకు సెలవుదినములు. అదియుగాక యూరి వెంట నడుచుచుండగా నందఱు వినయముతో నమస్కరించుటయుఁ, దన యభినయమును మెచ్చుకొనుటయుగా నుండెను. ఎంత స్నేహమైనను బరాయి యింటిలో నెక్కువ రోజులుండుట కష్టము. అర్జునరావున కా కష్టము లేకుండ

నుండుటకు నొక చిన్న పరిస్థితి సంభవించెను. అర్జునరావునకు వేయిన్నూట పదార్ల సన్మానము జరిగినదికదా! అమ్మఱునాడు రంగనాథము దానిలో వేయిరూపాయిలు తన కిమ్మనియుఁ, బది దినములలో సర్దెదననియు నడిగెను. అతని దయవలన నీ గ్రామము వచ్చి యీ డబ్బు సన్మానము పొందినవాడు నతని కెట్లు కాదనును? మనసులో నిష్టము లేకున్నను మనసులోని యనిష్టమును పైకిఁ బ్రకటించిన మైత్రియు, సౌదార్యమును సంపూర్ణముగాఁ గప్పిపుచ్చుగా వెంటనే ఇచ్చెను. తాను వేయిరూపాయలు బదులిచ్చుటచేత నర్జునరావునకు వారి ఇంటిలోనుండి యూరకే భోజనము చేయుచుంటనన్న కష్టము కలుగలేదు. ఒకవిధముగ వారుకూడ దనకు ఋణపడియున్నట్లే భావింపఁజొచ్చెను. లేకపోయిన వేయిరూపాయ లెవరిత్తురేమి? నెలకు రూపాయ వడ్డీకట్టుకొన్నను నెలకుఁ బదిరూకలు. పదిరోజులకు నాల్గు రూకలగును. నాల్గుదినములు వారి యింటిలో భోజనము చేసినను వారికి నష్టములేదు. మరియు నర్జునరావున కొక యూహాయుండెను. రంగనాథము పదిదినములలో రొక్కము తిరిగి యిత్తుననెను. ఈపదిదినము లిచ్చుటనేయుండి రొక్కము తీసుకొనియే పోవచ్చునని. అంతకంటె హృదయమును పట్టికొని చమత్కరించుచుఁ జేంగలియొకటి బాధించుచున్నది. అది విచిత్రమైన యాశ. దానికిఁ బ్రతిని మేషము తెగతెంపులు. ప్రతినిమేషము పునరాశాంకూరములు. ఈ నిముషములో నాయాశాంకూరము అనుపొల్లము విప్పినట్లుండును. మఱియొక నిముషములో వాడువాలిపోవును. వాహ్యాళికిఁ బోకముందో, కోటకు బయలుదేరకముందో యొక చిఱునవ్వు, ఒక కనుగిలుపు, నొక పైటవిసురు మధురముగాఁ గనిపించి మఱల నింటికి దిరుగ వచ్చెడివఱకు హృదయము సుధాప్రవాదముగా నుండును. తిరిగి వచ్చినతరువాత నాపేల వృద్ధిపొంది తనకు వృక్షముగా, పుష్పితముగా, దదనంతర కాల ఫలదాయిగా మనసులోఁ బ్రకాశించుచుండును. ఇంటికిఁ దిరిగి వచ్చువేళకు నీలోపున గృహములో నే పరిస్థితి జరిగెనో యాకనుగిలుపు లేదు. ఆమందహాసపూర్వక స్వాగతము లేదు. మన్మథుడు జ్వరమువచ్చి ముసుగుపెట్టుకొని పండుకొన్నట్లుండును. కాని మఱల సాయంవాహ్యాళివేళకుఁ గొంత ప్రసంగము, మఱల మధుర మందహాసము, మఱలఁ జమత్కారపుమాటలు. చీకటి పోయి వెలుతురు వచ్చును. వాకిటిలోఁ దనమందముమీదఁ దానుబరుండువఱకు శతసహస్ర మనోజాత నిశిత శిలీముఖ మధుర వీణారావములే వినిపించుచుండును. రంగనాథమును, దానును వాకిటిలో, స్త్రీలందఱు దొడ్డిలో నిద్రింతురు. అర్జునరావున కిట్లు జరుగుచుండెను. సాయంకాలముల నెదటికి వాహ్యాళి పోయినను గ్రామములోని పెద్దలెవరో యొకరు కనిపింతురు. వారు తమతోఁ

బాటు కూర్చొందురు. కూర్చున్నంతసేపు నతని యభినయ ప్రశంస చేయుదురు. మనస్సునకుఁ బైభాగము క్రిందిభాగము. పైభాగమీ ప్రత్యక్ష ప్రశంసావిష్టమగుచుండగా క్రింది భాగము కుసుమశర భావనామసృణమగుచుండును. ఈ మనస్సున కింకొక రూపమున్నది. అది యందఱితో మాటాడుచుండును. మిక్కిలి పెద్దమనిషి లక్షణ మవలంబించుచుండును. తాను గొప్పవాడు. ఆ గొప్పదనము మాటలలో, కన్నులలో శరీరావయవచలనములలో బ్రదర్శింపించుచుండును.

మంగమ్మ తోటలో నట్టి యిసుక తిన్నెమీద రంగనాథము, నర్జునరావు, రంగనాథము యొక్క యిద్దరు శిష్యులు గూర్చుండిరి. ఆ శిష్యులలో నొకని పేరు భద్రాద్రి శాస్త్రి. పుణ్య క్షేత్రముల పేళ్లు కొందరు పెట్టుకొందురు. ఒకడు భద్రాద్రి, ఒకడు శ్రీశైలము, ఒకడు రామేశ్వరము ఒకడు సింహాచలము. ఈ పుణ్యక్షేత్ర నామధారులు స్వతః పుణ్యులు. ఈ భద్రాద్రి శాస్త్రి నట్టి శాస్త్రి యనియే యందురు. ఈ శాస్త్రి సంస్కృతము పంచ కావ్యములు, రెండు మూడు నాటకములు, ప్రతాప రుద్రీయము, కౌముదిలో గొంత చదివిన వాడు. ఇతడీ గ్రామములోని పండితులలో నొకడు. అతనికి గ్రాపింగు కలదు. సిగరెట్లు సమృద్ధిగా పీల్చును. అతనిని జూచినవాని కతడు సంస్కృతము చదివెనని తెలియదు. అతని కుద్యోగములేదు. అప్పటికి దేశములో నింకను విద్వానులు, నుభయభాషా ప్రవీణులు లేరు. కళాశాలలలోను, బాఠశాలలలోను ప్రసిద్ధులైన మహా పండితులనే సంస్కృతాంధ్ర బోధకులుగా నుంచుకొనెడి వారు. సంస్కృతాంధ్రములు రెంటితో బియే పరీక్షయిచ్చి యమ్మేలనిపించుకొనెడు ద్విజిహ్వులానాడు లేరు. అందుచేత శాస్త్రి కుద్యోగములేదు. అతడు మహా పండితుడు కాడు. అందుచేత బాఠశాలలో నతనిని బండితునిగా నియమింపలేదు. ఈ శాస్త్రి రంగనాథమునకుఁ బ్రియ శిష్యుడు. మఱి రంగనాథమున కేమి సంస్కృతము వచ్చును? అతడు మహాకవి, ప్రతిభావంతుడు. అందుచేత శాస్త్రి రంగనాథము ననుసరించును. రంగనాథము యొక్క కవితలో నెవరైన దప్పులు పట్టినచో శాస్త్రి వాదించును. తప్పుల నన్నిటి నొప్పుల జేయును. అన్వయములేనిచోట నన్వయములు కల్పించును. సంప్రదాయేతరమైనది ప్రతిభాద్యోతక మనును. ఈ రీతిగా శాస్త్రి రంగనాథమునకు బెట్టనికోట యైనను రంగనాథము శాస్త్రి కిచ్చెడు నెక్కువ గౌరవములేదు. శాస్త్రినిగూడ నేమియు దెలియనివాని క్రిందనే లెక్క గట్టును.

వారందరును గూర్చుండిరి. శాస్త్రి యర్జునరావు గారిని బ్రశంసించుచుండెను. అతని నాట్యములను మేలుములు వివరించి చెప్పుచుండెను. అలంకార శాస్త్రమును గుప్పిపోయుచుండెను.

ఆ సమయములోఁ గిరీటి యా దారివెంటఁ బోవుచుండెను. రంగనాథము కిరీటిని బిలిచెను. ఆ పిలుపులోననే బోలెడంత చమత్కారమున్నది. రంగనాథమువద్ద నొక లక్షణమున్నది. పరులనుబిలచి కూర్చుండఁబెట్టి తన చుట్టుపట్ల నున్నవారిచేత నెక్కిరింపించుచుండును. తానేమియు మాటాడడు. సిగరెట్టు కాల్చుచు నవ్వుచుండును. ఎవరో యొకరన్నమాటను బ్రశంసించుటకుఁగనులు పెద్దవి చేయుచుండును. అతడు సిగరెట్టును జుటకాల్చినట్లు కాల్చును. అనగా మాటిమాటికిని దూరముగాపోయి యంబూకృతిచేయును కొంచెము సహ్యమైనను వర్ణనచేయక తప్పదు. నోటిలోని లాల గుడవెట్టి మూతి పైకెత్తి యప్పుడపుడు మాటాడుచుండును. అతడట్లు లంబూకృతి చేయుటకు దూరమునకుఁ బోవుటయనగా శిష్యుల ననుగ్రహించెనన్నమాట. రంగనాథము తిరిగివచ్చి యేదోయొక రత్నమువంటి విషయము శిష్యులకుఁ జెప్పును. నిముసమో రెండు నిముసములో కవిత్వమును గుఱించి మాట్లాడును. ఆ శిష్యు లెప్పటికప్పుడా నాడే కవితారహస్యము తెలిసికొంటి మనుకొందురు. ఈ సంగతి తక్కిన శిష్యులు మనసులో భావింతురు. శాస్త్రి పైకిఁజెప్పును. నిజానికి రంగనాథమువద్ద గవితా సిద్ధాంతములు వందలు వేలు నున్నవి. దారివెంటఁబోవు గిరీటిని రంగనాథము పిలిచెననగా వాని నేడిపించుటకుఁ బిలిచెను. అతడు పసివాడు. చదివికొనినవాడు కాదు. గణయతిప్రాసలు కొలదిగాఁ దెలిసికొని పద్యములు వ్రాయును. కాని పరమేశ్వరానుగ్రహము వానియందు బీజాంకురముగానున్నది. కిరీటివచ్చి రంగనాథమునకు, సర్జునరావునకు నమస్కారము చేసి కూర్చుండుమనగాఁ గూర్చుండెను. అట్లు వినయముతోఁ గూర్చున్నవాని నేడ్పించుటకు రంగనాథము తానే మొదలుపెట్టినచో బాగుగానుండదు. శాస్త్రి యందుకొనెను. "రాణాప్రతాపసింహనాటకము నీవే వ్రాసితివటకదా!" కిరీటికి దానే యది వ్రాసితినని యుండెను. అతడు భయపడెను. అందుచేత నిజము చెప్పెను. "నేను వ్రాయుటయేమి, సారథిగారే వ్రాసికొనిరి. ఆయన భావములకు నేను కొన్ని గణములు కుదిర్చితిని. ఆయన యొక భావమును జెప్పనే విట్లన్నచో బాగుగా నుండునేమో యనగా నప్పుడపు డాయన యొప్పుకొనుట జరిగెను. నేనువ్రాసిన దేమియులేదు." అతడేదో యహంకృతి ప్రకటించునని వానినిఁ జిదుకగొట్టవలెనని యొత్తినయెత్తు గడ నేల వ్రాలిపోయెను. కాని రంగనాథముయొక్క మేళము పరులనెవ్వరినో నెక్కిరించకుండ నూరకుండలేదు. అందుచేత రెండవ శిష్యు డిట్లనెను. "ఆ! నీవు చెప్పెదవా? నీవే వ్రాసియుందువు. నీ వెంత కవివికాకపోయినచో సారథి నిన్ను బిలిచియుండును." కిరీటికిఁ గోపము వచ్చినది. కాని యెదురుగా గొప్పవాండ్రున్నా

రు. కిరీటి వెంటనే లేచి సెలవు తీసికొందుననెను. కాదని బలవంతముచేసి కూర్చుండబెట్టిరి. వానికిఁ గన్నీళ్ళ పర్యంతము చేసి గాని వదలిపెట్టకుండుట వారి కలవాటు. ఇంతలోఁ గిరీటి కొక యదృష్టము పట్టెను. సారథియు నుమాపతియు గలిసి వాహ్యాళి వచ్చిరి వారా తోటప్రక్కగా వచ్చుచుండిరి. కిరీటి వారిని చూచెను. అతనికి ప్రాణములు లేచివచ్చెను. లేచి వారిని పిలిచెను. వారు కిరీటినిజూచి యిద్దఱును వచ్చుచుండిరి. ఇంతలో నర్జునరావును, రంగనాథమును గనుపించిరి. రంగనాథము లేచి సారథి, నుమాపతిని సమాహ్వానించెను. అర్జునరావు లేచి నిలుచుండలేదు. అర్జునరావునకు వారెవ్వరో తెలియదు. వారును వచ్చి కూర్చుండిరి. కిరీటి త్రాచుపిల్లవంటివాడు. అతనికి వీరిమీఁద గోపముగా నుండెను. అతనికి సారథియొక్కయు, నుమాపతియొక్కయు గడుసుదనములు తెలియును. అతఁ డిట్లనెను. "అయ్యా! రాణా ప్రతాపనాటకము నేను వ్రాసితి నని వీ రనుకొనుచున్నారు. మీరే వ్రాసితిరని చెప్పితిని" రంగనాథము సారథి కర్జునరావును తెలియజేసెను. సారథి "నేను మొన్న నాటకమును జూచితిని." యనెను. లోకోత్తరముగా నున్నదని గాని, యద్భుతముగా నున్నదని గాని ప్రశంసించలేదు. అర్జునరావునకుఁ గోపము వచ్చెను. కొందఱు గొప్పవార మనుకొను వారికి దాము క్రొత్తగా నెఱుకపడుటతోడనే పరులు వినయవంతులై ప్రవర్తించక పోయినచోఁ గోపము వచ్చును. వారిలో నర్జునరావుగా రొకరు. రంగనాథముకూడ నాజాతివాడే. కాని రంగనాథ మంత తొందరగా మొగము ముడుచుకొనడు. అర్జునరావున కావిద్య తెలియదు. ఉమాపతి యిట్లనెను. "సరే! వారిని వీ రెఱుఁగుదురు. వీ రెవరో వారికిఁ జెప్పలేదు." రంగనాథము-"వీరిపేరు సారథిగారు వీరికొక నాటక సమాజ మున్నది. మా యూరిలో వీరు పాతికేండ్ల నుండి నాటకము లాడుచున్నారు. కృష్ణుడు హిరణ్యకశిపుడు రుక్మాంగదుడు రాణా ప్రతాపసింహుడు మొదలైన వేషములు వేయుదురు." సారథికిఁ గొంచెము కష్టము వేసెను. కాని యతనికిఁ గష్టము వేయుటయన్నది లిప్తమాత్రము. వెంటనే దానిని పట్టించుకొనడు. ఉమాపతికి నవ్వువచ్చెను. రంగనాథ మెందుకు నవ్వుచున్నారనగా "మీరు పెద్ద కవులు" అనెను. రంగనాథమునకుఁ గుచ్చుకొనెను. కాని రంగనాథమునవ్వును అర్జునరావుసారథితో మాటాడడు. ఉమాపతితో మాటాడడు, తక్కినవారితోఁ బ్రసంగము సాగుచుండెను. రంగనాథమిట్లనెను: "అర్జునరావుగారూ! మీరు సారథిగారి వేషము చూచి తీరవలయును. మీరింక నాల్గ యిదు దినము లుందురుగదా! వారిచేత నొక నాటకము వేయింతము. ఏమండీ! సారథిగారూ! రేపో యెల్లుండియో రుక్మాంగద వేయండి. అర్జునరావుగారు చూతురు. అది మీ కెంత పని. వలిగిన నాటకమే నాయెను. వేషధారు లందరు

విముసములో వత్తురు. అర్జునరావుగారంత గొప్పవారు మన యూరికి వచ్చినపుడు వారిని మనము గౌరవము చేయుట న్యాయముకదా!" పారధి యిట్లనెను. "నా బదులు శిరీషకుమారు చందాయిత్తునన్నాడే, ఈయలేదా? నాదగ్గఱ కెవ్వరును రాలేదు. అంత గొప్పవారు వచ్చినపుడు మనము సమ్మానము చేయుట న్యాయమే. అందుచేతనే శిరీషు నిమ్మన్నాను."

దీనితో వ్యవహారము బెడిసినది. తానంత తేలికగా నాటకమాడెడివాడైనచో నర్జునరావు పదిరూపాయలు చందాపుచ్చికొదగ్గవాడైనాడు. రంగనాథునకుఁ దెలిసెను. ఏమిచేయును? అందుచేతఁ దానే యర్జునరావుయొక్క నాట్యమును బ్రశంసించుట కారంభించెను. "నిజముగా నర్జునరావుగారియొక్క నటకుని ప్రతిభయంతయు నా నాటక మెన్నుకొనుటలోననే యున్నది. అది ప్రాతయుసిరికపచ్చడి నాటకము కాదు. క్రొత్తనాటకము. ఒక యనీతివలన నొక మహాసామ్రాజ్య మెట్లు నాశనమైనదో నిరూపించు కథ. ఇంత యేడ్పుట కొంతప్రేమ దేశభక్తి మొదలైన చౌకబారు విషయము కాదు. ఒక యనీతి యెంత మహాఘోర ఫలితమును బుట్టించునో నిరూపించు కథ. అందులో నర్జునరావుగారు మహాగాయకులు. ఆయన పద్యము చదువుచుండగా గిన్నరులాలకించవలయును. ఆ సామ్రాజ్యవిచ్ఛిత్తి యెట్లు జరిగినది? ఒక సామాన్యమానవునివలన జరిగినది. అందుచేత నర్జునరావుగారు నానుబోటైతినుచు సామాజికులలో నుండియే రంగభూమి కవతరించెను. అట్టి యనీతి యచట నున్నచో సామాన్య మానవుడు కూడ దానిని మూలచ్ఛేదము చేయఁ గలడని యర్థము. అర్జునరావుగారి నాట్యమంతయు వారి విశాలమైన నేత్రములయందే యున్నది. చివఱకు రామరాయలు తన తండ్రియని తెలిసినపుడు అర్జునరావుగారు చేసిన పశ్చాత్తాపాభినయము, కాని తన ముసల్మానురాజ్యము సముద్ధరించితినన్న యానందము నెంత చక్కగా నభినయించెను." అనెను. ఉమాపతి "ఆ భావములన్నియు మాటలలో వ్రాయబడియే యున్నవి" అని నెమ్మదిగా ననెను. ఉమాపతి మనిసి యెఱ్ఱనివాడు. ఆజానుబాహువు. బలిష్ఠుడుగాఁ గనిపించును. అతి డెప్పుడును తలవంచికొనియే మాటాడును. మాటాడునపుడు తలయు మెడయు నాడించును. మాటాడిన తరువాత పెదవులు రెండు దగ్గఱకు లాగును. అతనికిఁ గత్తిరించిన పెద్దజుట్టుకలదు. తలయాడించినప్పుడా జుట్టు నృత్యము జేయును. రంగనాథ మిట్లనెను. "ఔను, వ్రాసియే యున్నది. ఎవడైనను వ్రాసిన దానినే యభినయించును. వ్రాయని దాని నేమి యభినయించు" ననెను. ఒక నిమేషార్ధ మెవ్వరును మాటాడలేదు. ఉమాపతి మఱల నిట్లనెను: "వ్రాయని దానిని గూడ నభినయించవచ్చును". ఆ మాట నెవరును బట్టించుకొనలేదు.

రంగనాథము- "అర్జునరావుగారి ప్రతిభ పాశ్చాత్య దేశములలోఁ గూడ మెచ్చు కొనిరి. దొరగారు నాటకశాల కట్టించబోవుచున్నారు. అర్జునరావుగారు ప్రధాన పాత్రగా నాటక సమాజము నేర్పాటు చేయబోవుచున్నారు" ఉమా పతి-"ఆఁ ఆఁ, మొన్న విన్నాము. ఈ సంగతి యవధానిగారు చెప్పినట్టున్నారే" రంగనాథము-"ఆ మతిలేని యాయన నోటికి వచ్చినదెల్ల మాట్లాడును. పెద్ద వాడై పోయినాడు. అందుకని యందఱు నూరకుందుము. నేనేమో యర్జున రావుగారి నిచ్చటికిఁ దెచ్చితినట. ఏమోయి శాస్త్రీ! ఇందులో మన ప్రసక్తి యేమున్నది?" శాస్త్రి - "ఔనండీ? అంతయు నవధానిగారే చేసిరి. మన దాక యెందుకు, అర్జునరావుగారికిఁ దెలియదా, వారే చెప్పవచ్చును".

ఈ నాల్గు దినములలో శాస్త్రికి, నర్జునరావుకుఁ జనవయ్యెను. శాస్త్రి యర్జునరావునకుఁ బరిచర్య చేయుచుండెను. అర్జునరావు 'ఏమోయి నీవు' యనుట మాన్పించి క్రిందనే జరగినది. అర్జునరావు మాటాడలేదు. రంగనాథము శాస్త్రివంకఁ జూచుచు నిట్లనెను. "దొరగారు సారథిగారి నాటకము చూచెను. ఆయనకు బాగుగా లేదట. గొప్పనటుడెవడైన నున్నచోఁ బిలిపించుమని యవ ధానిగారితోఁ జెప్పిరట. ఆయన నన్నడిగెను. నేనర్జునరావుగారి పేరు చెప్పి తిని. వారు పిలిపించుమనిరి. నేనర్జునరావుగారికి లేఖ వ్రాసితిని." ఉమాపతి- "మఱి మీ దేమియు లేదందురేమి?"

రంగ- "ఇందులో నా తప్పేమి?"

ఇటు జరుగుచుండగా వాసంతి, శిరీషుడును సముద్ర తీరమునకు వాహ్యాళి పోయి కొద్దిగాఁ జీకటి పడుచున్నదని బాగుగాఁ జీకటి పడకముందే యింటికిఁ బోవలయునని బయలుదేరి తోట ప్రక్కగాఁ బోవుచుండిరి. రంగనా థము మాట నవ్వడి వాసంతికి వినిపించి "నాన్నగారూ, రంగనాథము గారి వలె నున్నది. పోయి చూచి వత్తిమా" యనెను. ఇద్దఱును గలసి లోనికి వచ్చిరి. అందఱు నొకరి నొకరు జూచికొనిరి. రంగనాథము వారిని గూడఁ గూర్చుండుడనెను. అందఱును గూర్చుండిరి. శిరీషు డర్జునరావునకు నమస్క రించి యిట్లనెను. "ఆహాహా! ఏమి నటకులండీ మీరు. మా సారథి గొప్పనటకు డనుకొనుడు. మీ నాట్యము వేఱు. మా సారథి హృదయములోని పరమ రహస్యములను వెలికిఁ దీయును. మీరు మనోభావములను జక్కగా దిద్ది తీర్చ గలరు. మా సారథికి ముఖసౌష్ఠవము లేదు; మీకున్నది. అతనికి సంగీతము రాదు; మీకు వచ్చును. మా సారథి నటకులలో వశిష్ఠమహర్షియైనచో మీరు విశ్వా మిత్రుని వంటివారు. మీ నాట్యములోని విశేషముల వంటివి నేనెన్నడు చూడ

లేదు. మీరు రంగభూమి మీదనే యంబూకృతి చేసిరి. అది యెంత సహజముగా నున్నది? మన యింటిలోఁ జేసికొనుననే. నాట్యమనగా నింత సహజముగా నుండవలయును. ఎక్కడివో దూర విషయములు అంతఃపుర విషయములు రాజగృహ విషయములు మన కనుభవములో లేనివి మనకక్కఱలేనివి చిత్రించుటయా? దైనందినముగా మనము చూచుచున్నవి మన హృదయమునకు దగ్గఱి విషయములు కవి చెప్పవలయును. నటుడు చేయవలయును. అప్పు డది కవిత్వమగును. ఇది నాట్యమగును" రంగనాథము మొగము వికసించెను. అర్జునరావునకు సారధికిని శిరీషునకు స్నేహమని తెలిసెను. స్నేహితుడే యీ మాటలనుట చేత సారధి యొక్క యహంకారము తగ్గెను. అంతలో శిరీషు దూరముండక సారధి బుజముమీదఁ జేయిదఱచి "యేమండీ సారధిగారూ! నిజమా అబద్ధమా" యనెను. సారధి నవ్వుచు "మీ రెప్పుడైన అబద్ధము చెప్పుదురా" యనెను. ఉమాపతి యిట్లనెను. "శిరీషు కుమారుగారు చాల చదివినవాడు. ధనవంతుడు. సంగీత విద్యలో రహస్యములు తెలిసినవాడు. అందుకనియే కూతునకు సంగీతము చెప్పించినాడు అరవిందుడు వివేకానందుడు మొదలైన వారి గ్రంథములు చదివినవాడు. మంచి తెలివి గలవాడు." అనెను. శిరీషు "ఉమాపతిగారు నాకు స్నేహితుడు. అందుచేత నన్నట్లు మెచ్చుకొనెను" అనెను.

వాసంతి తండ్రి మాటలకుఁ గొఱకొఱలాడుచుండెను. ఆమెకు నుమాపతి వెక్కిరించినాడని తెలియును. తండ్రి యీ వెక్కిరింపు తెలిసికొనలేకపోయినాడని తెలియును తండ్రిమాటలు తెలిసినవి కావు. తెలియనివి కావు. సారధి యభినయము మీదఁ దనకింత యభిమానము కలుగుటకుఁ దన తండ్రి కారణము. అంత తెలిసిన తండ్రి యిట్లు మాటాడుట యేమి? సారధి ముందర్జునరావు నటకుడా? నాట్యమనగా పై మెఱుపులా? వెలగల దుస్తులు క్రొత్తవి ధరించి కనులకింపు గొల్పుటయా? ఆమె సారధివంకఁ జూచెను. చీకటిలో సారధి మొగము విస్పష్టముగా గనిపించుటలేదు గాని నవ్వుచున్నట్లు తెలిసెను. ఔ, నతనికివి యేమియుఁ బట్టవు. ఎదుటివాని యజ్ఞానమున కతడు నవ్వును. కాని వాసంతికిఁ గోపము తగ్గలేదు. తన కోపము నెట్లు తీర్చుకొనవలయునో యామెకుఁ దెలియలేదు. ఆమె నాటకమును జూచెను. నాటక ప్రదర్శన మంతయు భావరహితమైన స్త్రీ తలంటిపోసికొని తలలోఁ బూవులు పెట్టికొని మంచి చీర కట్టుకొని నగలు ధరించి నడచినట్లుండెను. అంతకు మించి యేమియు లేదు. ప్రసంగములో నెషములు లేవు. తెరయెత్తి తెరదించుటలో నాలస్యము లేదు. నాటక మంతయుఁ గవాతు చేసినట్లుండెను. తన కెందుకో నచ్చలేదు. సారధిమీద నభిమానము చే నట్లుండెనా? సహజముగా తన బుద్ధి

కది రుచించలేదు. ఏది యెట్లున్నను నానాటి రాత్రియే తానును, తనతండ్రియు చాలసేపు నాటకమును గుఱించి చర్చచేసిరి. తనకు బాగుగా నుండ లేదని తాను తండ్రితోఁ జెప్పెను. ఆ కథను విమర్శించి, సామాజికులలోనుండి పతాను రంగ భూమి కవతరించుట తాను దోషమని చెప్పెను. ఆమె దోష మనుకొనెను. ఎందుకు దోషమో తనకుఁ దెలియలేదు. తన కా నాటక ప్రదర్శనమునం దంత యనాదర ముండగా దన తండ్రి యథార్థమైన యభినయ మెఱింగినవాఁడై యిట్లర్జునరావును మెచ్చికొనుటయు, నందులో సారథిని తక్కువ పఱచి మాటా డుటయు నామె కేమియు నిష్టములేదు. సారథి నవ్వుచుండెను. గాని లోపల నతనికి మాత్రము కష్టముగా నుండదా? ఆమె పరిస్థితులన్నియు విచారించెను. కిరీటి పిన్నవాడు. తక్కిన వారందఱు నర్జునరావు పక్షముగానే కనంబడిరి. సారథి మాటాడడు. మిగిలిన దొక్క యుమాపతి. ఆయన యెప్పుడును దను యింటికి రాడు. తాము వారి యింటికిఁ బోరు. ఆమె యుమాపతి నెఱుఁగును. ఉమాపతి సారథి యొక్క నాట్యమును మిక్కిలి మెచ్చుకొనునని యామె వినెను. ఆమె సంబాళించుకొని యిటులనెను. "ఉమాపతిగారూ! రొట్టె తినుచు సామాజికులలో నుండి రంగభూమి కవతరించుట తప్పని నే ననుకొంటిని. మా నాయనగా రట్లు చేయవచ్చు ననిరి. నా మనస్సున కెందుకో తప్పగా నున్నది. వారు గొప్పవారు. నేను వారి యెదుట నిట్లడుగరాదు. ఐనను నాకు సంశయము కలదు. ఎవరినడుగ వలయునో తెలియలేదు. మీ రందఱు పెద్దలున్నారు గదా యని యడిగితిని. అది దోషము కాదని మీ రన్నచో నేనూరకొందును. నాకు దోషమని యెందుకుఁ దోచినదో. మీరు కారణము జెప్పినచో సంతోషించెదను. ఈ యడుగుట తప్పేమో నాకుఁ దెలియదు. అది తప్పుగానిచో నర్జున రావుగారే చెప్పవచ్చును" అని ప్రశ్న వేసెను. శిరీష్ కుమారు కూతురు వంక కోపముగాఁ జూచెను. చీకటిలో నతని కోపము కనిపించ లేదు. తక్కిన వారెవ్వరును మాట్లాడలేదు. వీరు రాకముందు తత్ప్ర వేశము మంచిభావరమ్యముగా నున్నదని, యుచితముగా నున్నదని చెప్పిన రంగ నాథము మాటాడలేదు. ఉమాపతియు మాటాడలేదు. ఒకనిముసము గడచెను. సారథిని గుఱించి తన తండ్రి చేసిన ప్రసంగముయొక్క నిశితత్వ మంతరించెను. అందఱికి నది పచ్చివెలగకాయవలె నున్నదని వాసంతికిఁ దెలిసెను. ఆమె ప్రవృత్తిలో నొక పట్టుదల యున్నది. అది తెగుదాక తెంపును. ఆమె మరల నుమాపతి నడిగెను. "ఏమండీ, మీరు సారథిగారి కంటె మహానటుఁడుండడని చెప్పుదురు కదా. నాట్యవిద్యలో మీకుఁ దెలిసినంత మరి యెవరికిఁ దెలియదట కదా! ఇద్దఱు ముగ్గు రూరిలో చెప్పగా నేను విన్నాను. దయచేసి చెప్పవలసినది.

నా మనస్సునకది తప్పిందు కన్పించినదో. ఇందర్జునరావుగారి మీద నాకేమియు నగౌరవము లేదు. నేను తెలిసికొనవలయునని యడుగుచున్నాను." అని మరలఁ బ్రశ్నించెను ఉమాపతి మఱియొకప్పుడైన సమాధానము చెప్పెడివాడు కాదు. అర్జునరావు యొక్క ప్రవర్తన యతనికి బాగుగా లేదు. సారధి నతడంత తేలికగాఁ జూచుట యతనికి గొంచెము కష్టము కలిగించెను. సారధి యభినయ మతడు చూడలేదు సరి, యే పుట్టలో నే పామున్నదో, సారధి గొప్ప నటకుడేమో యని యనుకొనవచ్చును గదా. అతడు గొప్ప నటకుడు గాదు. సామాన్యముగా మర్యాదగ మాటాడవలయును గదా. తానేమో స్వర్గలోకము నుండి దిగివచ్చి నట్లు వాని కంతి యహంకార మేమి? ఈ భావమతని మనసులో నుండెను. అందుచేత నుమాపతి "తప్పైనమాట తప్పే. కాని వారు గొప్పవారు. వారు చేసిరి. మన మనఁగూడ"దనెను ఇక నేమున్నది, కొంపకు నిప్పు ముట్టించినట్లయ్యెను. రంగనాథము శాస్త్రిని గిల్లెను. శాస్త్రి కుమాపతి యన్నచో భయము. ఉమాపతితో నతఁ డిదివఱకే రెండు మూడుసార్లు వాగ్వాదము సలెఁజేసెను. కుఱ్ఱవాఁడవు నీకుఁ దెలియదని యుమాపతి చెప్పెను అందుచేత శాస్త్రి యిట్లనెను. "ఎందుచేత తప్పో చెప్పవలయును గాని యూరకే తప్పన్నంత మాత్రమున సరిపోవునా? హేతువు చెప్పవలయును."

ఉమా-"అర్జునరావుగా రంగీకరించినచోఁ జెప్పెదను."

అర్జున-"ఇందులో నా యంగీకార మెందులకు?"

ఉమా-మీకుఁ గోపము రాకుండనున్నచోఁ జెప్పెదను.

అర్జున-నేను నాటక మాడితిని. పలుమంది పలు విధములఁ జెప్పుకొందురు.

ఉమా-అనగా నర్జునరావుగారిచట లేరనుకొని మనము మాటాడుచున్నా మన్నమాట. నాటకములో నటకులు వేఱు, సామాజికులు వేఱు. నటకులు వేషాద్యభినయము చేత సామాజికుల యందు రసము పుట్టించవలయును. నాటక మనగా సామాజికులందొక భ్రాంతికలిగించుట. ఒకరు భ్రాంతి కలిగించువారు, మఱియొకరు భ్రాంతి పొందువారు. వీరిద్దఱును గలిసినచో భ్రాంతికి స్థానము లేదు. నటకులు భ్రాంతిని గలిగించి రసపోషణ చేయవలయును. నాటక మాడుచున్నపుడు సామాజికులలో నొకడు రంగమున కవతరించినచో రసభంగమగును. నాటకమాడుచుండగా వేషము వేయని యా సంఘములోని వాఁడొకడు తాను రంగముమీదికిఁ బొరపాటున వచ్చినచో సభలో నల్లరి చేయుదురు. అనగా నా భ్రాంతి భావన చెడిపోయినదన్నమాట. ఇదియు నట్టిదే. అంతకంటెఁ దప్పు ఆవేషములేని వాడు వచ్చుట. పొరపాటు. ఇది బుద్ధి పూర్వకముగాఁ జేసిన దోషము."

రంగనాథము శాస్త్రిని బొడిచెను. శాస్త్రికి సమాధాన మేమియుఁ దోఁచలేదు. తోఁచలేదు సరికదా యుమాపతి చెప్పిన మాటయే నిజమనుకొనెను. అంత రెండునిముసము లెవ్వరు మాటాడకుండఁ గూర్చుండిరి. వాసంతి కోరిక తీరినది. సారథి యిట్లనెను. "ఉమాపతిగారూ! మీరు శాస్త్రదృష్టితోఁ జూచితిరి. జనసామాన్యమునకు నా ప్రవేశము చిత్తరంజకముగా నున్నదా లేదా యని ప్రశ్న. మీరు రసము రసమని చెప్పునది యెక్కడో యెవరికో! నిజముగా వారు చెప్పినట్లు తత్ప్రవేశము రసభంగహేతువయినచో నప్పుడు సభలోఁ బ్రశంసాహస్తాస్ఫాలనము జరిగెనుగాని. హాస్యస్ఫోరకముగా నవి లేవు. నేటి నాటకములకును, పూర్వనాటకములకును భేదమున్నది. పూర్వనాటకములు రసదృష్టితో వ్రాయబడియుండవచ్చును. ఆడబడియు నుండవచ్చును. నేటి నాటకములు భావప్రధానములైనవి. నీతియుఁ దాత్కాలికావేశమును ప్రధానమైన నాటకములివి. వీనిని మీ పూర్వసిద్ధాంతములతో విమర్శించరాదు."

ఉమా–"నిజమే. నిజమే. ఊరకే పసిపిల్ల యడిగనని చెప్పితిని. ఆమె కది దోషమనిపించినది. ఎందుకు దోషమనిపించినదో చెప్పితిని. అంతియేకాని యీనాటి నాటకముల స్వరూపము నాకుఁ దెలియక కాదు. ఈ యొక్క విషయముచేత నయినచో నర్జునరావుగారి గొప్పదనమునకు భంగమునులేదు. సారథీ! మీరందఱు ప్రాతవాండ్రు. మీకు రసభావములు కావలయును. ఇప్పటి నాటకములలో రసభావము లక్కఱలేదు. నటునియొక్క నేర్పు ముఖ్యము. ఆ నేర్పు అర్జునరావుగారివద్ద సమృద్ధిగా నుండెను" అనెను.

కన్ను పొడిచి మందు వేసినట్లున్నది. మరియెవ్వరును మాట్లాడలేదు. వాసంతి లేచి"నాన్నగారూ! పోద"మనెను. తండ్రి కూతు లిద్దఱు లేచిపోయిరి. సారథియు నుమాపతియు సెలవుతీసికొందుమని వెడలిరి. కిరీటి యెప్పుడు వెళ్లెనో యెవరికిని దెలియదు. వారు నల్గురును మిగిలిరి. రంగనాథమున కర్జునరావుతో నేమని మాటాడవలయునో తెలియలేదు. కొంతసేపటికి వారును లేచిపోజొచ్చిరి. దారిలో నర్జునరా విట్లనెను. "ఈ యుమాపతి యన్నయాయ యెవఁడు?"

రంగ–"ఆయన నట్టి వ్యర్థుడు. అతనికిఁ బనియుఁ బాటయు లేదు. తమ్ముడేదో సంపాదించుచున్నాడు. కూర్చుండి తినును. భార్యయు, నిద్దఱు పిల్లలును. సంసార మెట్లు గడచునా యన్న విచారము లేదు. ఈయూరిలో నతఁడొక పెద్ద విమర్శకుడు. భావుకుడు. సారథి నీయూరిలో గొప్పనటుడుగాఁ జెప్పుకొందురు. దానికిఁ గారణ మీతడే."

అర్జున–"బాగుగా దెలిసినవాడా?" రంగనాథము బదులు చెప్పకముందే శాస్త్రి చెప్పెను. ఆయన బాగుగాఁ జదువుకొన్నవాడండి. చాల మంచివాడు.

మరియాదకలవాడు. అతని కెవరి జోక్యము నక్కఱలేదు. సునిశితమైన యూహాశాలి. నేడతను చెప్పినమాటలు విన్నారు కదా. దానికిఁ బ్రతిసమాధానము లేదు. సమాధానము చెప్పినచో సారథిగారు చెప్పినట్లు చెప్పవలయును. అది సమాధానము కాదు. సారథిగారు చాల సాధువైన మనిసి. మీరు మనసు నొచ్చుకొందురని యట్లు చెప్పెను. మనము మొదటినుండియు వారి నగౌరవముగానే చూచితిమి. సారథి నిజముగా గొప్ప నటకుడు. అతనిని మన మించుమించుగా లెక్క చేయలేదు.

రంగ-"మనదేమున్నదోయి. శిరీషకుమారుడే సారథిని తక్కువ చేసినాడు."

శాస్త్రి "మీరు సారథిగారి నర్జునరావుగారి కెఱుకఁజేయుచు నొక్క మాట యతడు గొప్ప నటకుడని చెప్పితిరా. ఇద్దరు గొప్ప నటకు లుండరాదా. అతడు గొప్ప నటకుడైనచో నర్జునరావుగారు కాకపోవలయునా"

రంగ-"అతడు గొప్పనటకుడని నాకభిప్రాయము లేదు."

శాస్త్రి విసుగుబడి నవ్వి, "పృథివి నధిపులు నూతనప్రియులు కారె"యన్నారు. మా గురువుగారికి నేడర్జునరావుగారే నటకులు. పూర్వము సారథిని వారు మెచ్చుకొనిరి. అర్జునరావుగారూ! కొన్నాళ్ళక్రిందట నీ యూరిలో రుక్మాంగద నాటక మాడిరి. సారథిగారు రుక్మాంగదుడు. వాసంతి మోహిని. ఆ నాటకము చూచితీరవలయును. వారి యిద్దరి యభినయము ప్రజలందరను దిగ్భ్రాంతులను జేసెను. మా గురువుగారే నోరు తెఱచి నివ్వెఱపోయిరి."

అర్జున "అదా కారణము? అతడు నాయకుడు. ఈమె నాయిక."

రంగ-"దానిని గురించి చాల కథయున్నది."

అందఱును నవ్విరి. ఆ నవ్వుటలో నశీతి తిలోకములు త్రవ్విరి దానితో వారి మనస్సులు శాంతిపడెను. మనుష్య స్వభావము చిత్రమైనది. కిరీటితో వెకచెకాలాడుటకు రంగనాథము పిలిచెను. ఇంతలో సుమాపతి సారథులు వచ్చిరి. వెకచెకాలు పోయి ప్రత్యక్షముగా సారథిని లొచ్చుపఱచుటకుఁ దాను ప్రయత్నము చేసెను. అరునరావును మెప్పించుటకుఁ జేసెను. అదిసాగినది. దానితోఁ దామే ప్రతిభాశాలురై శత్రువులను గెలిచినట్టింటికి వచ్చువారే. కాని దైవాద్వా వాసంతీ శిరీషులు వచ్చిరి. శిరీషుకు తానా మాటలు మాటాడక పోయినను బాసుగా నుండెడిది. అవి మాటాడుట వాసంతికిఁ గోపకారణమయ్యెను. చివఱకుఁ దమకచ్చట పరాభవము జరిగినది. మనుష్యుడు ప్రత్యల్ప సన్నివేశము నందుఁ దాను లొచ్చైనచో అది యొక పరాభవముగా భావించుటయు, హెచ్చయినచో జయించినట్లను

కొనుటయు జరుగును. అప్రతీకార్యములైన యీ పరాభవములయందుఁ దన ప్రతిపక్షుల యందు దోసము నేదో నిరూపించుకొని తృప్తి పడుచుండును. ఆస్వల్ప పరాభవమును మఱచిపోవును. వాసంతీ సారథులకు సంబంధమున్నదని వారు నలువురు కలసి చేసికొనిన నింద యర్జునరావునకుఁ దృప్తి కలిగించెను. ఈ నిందతోఁ దగినంత తృప్తి కలుగలేదు. కలిగిన స్వల్ప పరాభవము మాత్రమే తుడిచి వేయఁబడినది. తామధికులుగా నందేమి భాసించినది. తామధికులుగా భాసించినగాని తృప్తి సంపూర్ణముగాఁ గలుగదు. వారు ప్రత్యక్షములో లేరు. ఉన్నచో వారికి సమాధానము వచ్చును. అప్పుడు చెప్పలేదు కదా. ఇప్పుడున్నచోఁ జెప్పవచ్చును గదా. ఇప్పుడు వారు లేరు. ఇప్పుడీ సమాధానమున్నది. అట్టు సామాజికుల మధ్యనుండి రంగావతరణము చేయుటయందలి గుణమేమో రంగనాథమే చెప్పెను. అది మరలఁ జెప్పికొనిరి. చెప్పికొని దానితోఁ బాటు కొన్ని మాటలు పలికిరి. "మూర్ఖులు, వారికేమి తెలియును? చెప్పినను దెలియదు" ఇందాకనది చెప్పకపోవుట కిది కారణము. వారజ్ఞులని యంత విస్పష్టముగాఁ దెలిసినచోఁ దాము స్వల్పాతిస్వల్పమైన యేదో పరాభవ రేఖాభావమును పొందుట యెందులకు? కాని వారి యంతరాంతరమున నేదో వారిదే యొప్పు, తమది తప్పని భాసించుచున్నది. ఐనను వారే యజ్ఞులని నలుగురును గలసి చెప్పికొనుటలోఁ దృప్తి మాత్రము కలుగుచున్నది.

కిరీటియు సారథియు నుమాపతియుఁ గలసిపోవుచుండిరి. వారు వచ్చెడి వఱకుఁ గిరీటి దారిలో నాగెను. కిరీటి "వారు నన్నేడిపించుటకు పిలిచినారు. ఇంతలో మీరు భగవంతులవలె వచ్చినా"రనెను. సారథి "నీవు తెలివి తక్కువ వాడవు. మమ్ము పిలువకుండ నుండవలసినది. ఒక్కొ ముక్కులు తినినఁగాని రాటు తేలరు. అటువంటి చిన్న చిన్న పరాభవములను బొందవలయును. అప్పుడు మనస్సు పదును తేలును" అనెను.

ఉమాపతి—"ఇతడు మఱియును పసికాయ. నాయుద్దేశములో నిట్టి పిలవాడు వందలు వేలు పరాభవములను పొందును. ఈ యీడులో నితడింత తెలివిగల వాడు. ఇతని తెలివి వేయిమందిలో నొకనికైన నుండదు. తక్కిన యందఱిచేతఁ బరాభవము పొందవలసినదే. దెబ్బలు తిని తిని తల బొప్పికట్టిన తరువాత నప్పుడు గాని యతనికి నిలుకడ యేర్పడదు ఇతని ప్రకృతి యటువంటిది" యనెను. ఆ మాటలోని యాథార్థ్యము సారథికి మాత్రమే తెలిసినది. నిశితమైన ప్రకృతికలవారు, ప్రతి స్వల్ప విషయమును మనసునకుఁ బట్టించుకొని బాధ పడువారు జీవితాంతమున మహామేధావులగుదురు కాని, వారి జీవితములో నదృష్ట ముండదు. ఈ రహస్యము సారథి స్వానుభవము వలన నెఱుగును.

అతడు మిక్కిలి విరాగియగును. వారు మఱియొక వందగజములు పోయిన తరువాత వాసంతీ శిరీషులను కలసికొనిరి. తండ్రి కూతుండ్రు వాదించుకొనుచుండిరి. వీరిని జూచి వాదన మానివేసిరి. ఉమాపతి వాసంతితో నిట్లనెను. "అమ్మాయీ! నిన్న దినము నూఱకయే. చూచుట కాని నీతో మాటాడలేదు. మంచి పని చేసితి"వనెను. ఈ మాట శిరీషునకుఁ గొంచెము కోపకారణమయ్యెను. అతడిట్లనెను: "పెద్దలపట్ల గౌరవపఱచుట మీరు పిల్లలకు నేర్పగూడదండీ" యని. అపు డుమాపతి "మీరును సారధియు మిత్రులు. వారి యెదుట మీరు సారధిని తక్కువ పఱచితిరి. మీ మాటలలో సారధియందలి స్నేహము తక్కువలేదు. నాకుఁ దెలియును సారధి కిటువంటివి పట్టవు కనుక నాయనకుఁ గోపము రాలేదు. మఱియొకడైనచో నిస్సందేహముగాఁ గోపము వచ్చియుండును. మీరు క్షమించినచో మీరు చేసిన పొరపాటును వాసంతి సర్దినది. సారధి యంత నటకుడా యర్జునరావు? అతడు సారధియంత నటకుడగుట కెన్ని జన్మము లెత్తవలయును? ఈ యూరిలోఁ బదివేలమంది జనమున్నచో నతని నాట్యవైభవము ముగ్గురు నలుగురి కంటె నెక్కువ మందికిఁ దెలియదు. తక్కిన వారందఱకుఁ బైమెఱుపులుగా నర్జునరావుగారి వంటివారే నటకులు. ఇంత నటకునకు సారధికి నిన్నియేండ్లనుండి యీ గ్రామములో నున్నవానికి నొక్క సన్మానము జరుగలేదు. అర్జునరావునకు మొన్న నంత పెద్ద సన్మానము జరిపిరి. పెరటి కూర మందునకు రాదు. మీకు సారధి గొప్పఁదనము తెలియును. మీరే చెప్పితిరి కదా అతఁ డాత్మపదార్థమును వెలికిదీసి ప్రదర్శించునని. అది నాట్యము యొక్క పరమార్థము. ఈ పరమార్థము తెలిసిన మీరే యర్జునరావు యొక్క పై మెఱుపులకు మోహపడితిరే, యింక పరమార్థము తెలియని వారు మోహపడుట చెప్పవలయునా" యనెను. శిరీషు డంటనే "నిజమేనండీ నేను పొరపాటు చేసితిని. మనము సారధికి సన్మానము జేయవలె" ననెను. ఉమాపతి యతని యమాయకతకు నవ్వి యిట్లనెను. "ఊరిలో దమ్మిడీయయ్యారు. నేను బుక్కాఫకీరును. ఏదైనఁ జేసినచో మీరే చేయవలయును. మనము చేసినచో నూరిలో నందఱు మాత్రము వత్తురు."

సారధి వంటనే "నాకు సన్మానము వలదు. నాకు సన్న్యాసము కావలయును. రండి రండి" యని వాసంతి బుజముపైఁ జేయివైచి ముందునకు నడచి పోయెను. సారధి తన బుజముపైఁ జేయివేయుట వాసంతి కలవాటే. ఆమె యతని నానుకొని నడచుచుండెను. ఆమె యిట్లనెను: "తధీ! నీకుఁ గోపము రాలేదా, కోపము రాదా. మేము రాకముందు వారు నిన్నేమనిరి? నీతో నేను స్నేహము కట్టను" అనెను. ఆ నిముసములో సారధికిఁ దెలిసెను- మోహినీ

వేషము వేసినపుడు వాసంతినిగూర్చి తా నూహించిన యూహలు నిరాధారములని. కాని యా యూహ వదలిపెట్టలేదు. అది పట్టి మొదలికదలిక. దాని కింకను విశ్వాసము రాలేదు. దానికి విశ్వాసము రాకుండుగాక! తనయం దది జరుగకుండుగాక! వాసంతి తన్ను బసిపిల్లవలె నత్తుకొనుచున్నది కాని మఱియొకభావము లేదు. మఱియు నీగగ్గోలుమనస్సు వేళ నాభావము తొలగియుండె నేమో! ఆమె మనస్సునకందిన భావముకాదు. ఆ భావ మంతరాంతరములో నెచ్చట నున్నదో తెలియదు. వెనుకనున్న ముగ్గురును వచ్చి కలిసికొనిరి. పార్థి కెందుకు దోచెనో యుమాపతి నొకప్రశ్న యడిగెను. "ఏమయ్యా ఉమాపతిగారూ! వెనుకనొకసారి నేను తెల్లవాఱలు సముద్రముదగ్గఱఁ దిరిగి తిరిగి మీ యింటికి వచ్చితిని. నా కిడ్డెనలు కాఫీ యిచ్చితిరి. జ్ఞాపకమున్నదా?" ఉమాపతి జ్ఞాపకమున్నదనెను.

పారధి—"అప్పుడు నిన్నొకటి యడుగుటకు వచ్చితిని. దానినప్పుడడుగ లేదు. ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చినది. అడుగమందువా" యనెను. ఉమాపతి "తెలిసినచోఁ జెప్పెద,నడుగు"మనెను. సారధి యిట్లు మొదలుపెట్టెను: "సామాన్యముగా సౌందర్యోపాసన యందురు. సౌందర్య మనగా నొకదానియందలి భ్రాంతి. అది వాని యిష్టానిష్టములఁ బట్టి యుండును. ఒకవస్తువు సుందరమని దానిని విభాగించినచోఁ గొన్ని కారణములచేత నీ సౌందర్యము కార్యమగుచున్నది. ఆ సౌందర్య మనుకొన్నది తద్వస్తు లక్షణమై మనబుద్ధిచేత వికారమును బొందుట. ఇంక సౌందర్యోపాసన యేమున్నది. సౌందర్యోపాసన యనగా వస్తుతత్త్వ విచారణచేయకుండ బాగుగానున్నదని సంతోషించుటయా. ఆ సంతోషమునకు లోతులేదు. క్రిందఁ గాలు తగులుచుండును. ఆ సంతోషములో నింద్రియములు తగులుచుండును. ఆ సంతోష మింద్రియములను దగులరాదు. ఈ సౌందర్యోపాసన యింద్రియముల కంటకుండ లోతైన యానందము నిచ్చునా. నీ విచ్చునని ఎప్పుడో చెప్పినట్లు జ్ఞాపకము. నేను మఱచిపోయితిని. ఆ నాడు నిన్నడుగుటకు వచ్చితిని. వచ్చి మఱల మఱచిపోయితిని" యనెను.

ఉమాపతి—"ఇపుడే చాల ప్రొద్దుపోయెను. మఱల నెప్పుడైనఁ జెప్పెద" ననెను.

వాసంతి "ఫరవాలేదు. ఇంటికిఁబోయి భోజనములు చేసి పండుకొనుటయే కదా. అప్పుడు మేముండముకదా" యనెను. శిరీషు "ఇచ్చటఁ జక్కగా నిసుక యున్నది. కూర్చుంద" మని కూర్చుండెను. వాసంతి కూర్చుండెను. కిరీటి కూర్చుండెను. ఉమాపతి యరనిముసమూగి కూర్చుండెను. పారధి నిలచియే యుండెను. శిరీషతనిని గూర్చుండుము మనెను. సారధి కూర్చుండలేదు. ఉమాపతి

యిట్లనెను. ఆయన కూర్చున్నచో జెప్పెడిది మనస్సునకుఁ బట్టదు. ఆగమ్యగోచరముగ దిరుగుచు నే యాలోచించుచుండును. అందులోని రహస్యమిదియని చెవినుకొందును. మనస్సున్నది. బుద్ధియున్నది. అంతఃకరణమున్నది. వెనుక శుద్ధసత్త్వమున్నది. ప్రస్తుత మీనాల్గుపొరలు తీసికొందము. ఈ నాల్గొక దానికంటె నొకటి లోతైనవి, యధికమైనవి. మన మన్నివస్తువులను మనస్సుతో స్పృశింతుము. అది సత్తో యసత్తో యంతఃకరణము నిర్ణయించును. ఆ నిర్ణయము శుద్ధసత్త్వము యొక్క సామీప్యముచేత జరుగును. పశుసమానమైన ప్రకృతి కలవానికి బుద్ధియందదు; విద్యావంతులైనవారికి బుద్ధి యందును. సాత్త్విక ప్రకృతికలవారి కంతఃకరణ నిరూపణము జరుగును. అభ్యాసముచేత మనస్సెంత స్వాధీనములో నుండునో యుత్తరోత్తరముగా పైరెండును నధికాధికముగ స్వాధీనములో నుండును. ఎవడు నిత్యాభ్యాసముచేత నాయంతఃకరణమును స్పృశించునో దానియందు రమించును. ఇంద్రియములు మనస్సు నంటుకొని యుండును. బుద్ధికిచ్చుటకు బెద్దపనిలేదు. ఆ యంతఃకరణ ప్రవేశము చేసెడివానికి మనస్సు మాత్రమే యుండును. ఇంద్రియప్రసక్తి యుండదు. నిజానికి మనోబుద్ధ్యంతఃకరణములు మూడు నొక్కటియే. అంతఃకరణమునందు జాగ్రత్ స్థితియందున్నవాడు మనోబుద్ధులతోఁ గూడియే యుండునుగాని యివి రెండు నంతఃకరణమునందు లీనమై మనస్సులేనట్లే యుండును. మనసులేనిచో నింద్రియములు లేవు. ఏ యుపాసన చేసినను నావరణ విశిష్టమైన యీ మనస్సును దాటిపోయినచో నుపాసనా ఫలోన్ముఖమైనట్లే. సౌందర్యము భ్రాంతియే యగును. భ్రాంతియందుపాసన యెట్లని ప్రశ్న లేదు. ఉపాసనయనగా భ్రాంతివిషయము నాశ్రయించి భ్రాంత్యతీతమైన స్థితినిఁ బొందుటయే. ఒక దేవత నుపాసింతుము. ఆ దేవత వివర్తరూపము. ఆమె మూలవస్తువు కాదు. ఆమెయందు మూలవస్తువును ధ్యానము చేయుదుము. అదియే యుపాసన. తొలుత నా దేవతా కర చరణాద్యవయవ విన్యాసమును ధ్యానముచేసి యామెమూర్తిని సాక్షాత్కరించుకొనుట ప్రయత్నముచేత సిద్ధించును. ఇదియు మిక్కిలి కష్టమైన పనియే. కాని యీ మహావిషయమున స్వల్పమైనది. అట్లు సాక్షాత్కృతి పొందిన దేవతామూర్తిని దిరస్కరించుటయు గష్టమే. కాని తిరస్కరించుట బ్రహ్మవిషయము. అట్లుండినను నష్టములేదు. అది కించిదూనస్థితి. ఛాందోగ్యములో శంకర భగవత్పాదులు దీనిని జర్చించిరి. ఈ యుపాసనాసిద్ధి కలవాడు ప్రళయాంతము తద్దేవతా భావభావనావిశిష్టుడై యుండును. ప్రళయాంతమున బ్రహ్మము తప్ప నేమియు లేదు. ఈ యుపాసనామూర్తి యను స్వల్పాతిస్వల్పమైన భ్రాంతిగూడ ఛేదించినచో

వెంటనే బ్రహ్మమునందు లీనుడగును. ఈ భ్రాంతిని భేదించుటను గురించి రామకృష్ణపరమహంస యొకచోటఁ జెప్పెను. పరమహంస యొకప్పు డొక దిగంబరునివద్ద నద్వైత వేదాంత సిద్ధాంతములను నేర్చుకొనుచుండెను. దిగంబరుడు మనస్సును సర్వవిషయములనుండి యుపసంహృతము చేసి యాత్మయందుఁ దన్ను తాను చూపించుకొమ్మని చెప్పెనట. కాని శ్రీరామకృష్ణుని మనస్సు తదుపసంహృతికి యొగ్గలేదు. ఆయన దేవీభక్తుడు. ఆయన కనులు మూసికొనినంతనే కపాలత్రిశూలధారిణీ నిశుంభసంహారిణీ కృత్తమహిష దితిప్రజోన్మత మస్తచరణ సాక్షాత్కరించెడిది. ఎంత పెనగులాడినను తల్లిరూపము తొలగుటలేదని రామకృష్ణుడు చెప్పెను. అపుడు దిగంబరునకుఁ గోపము వచ్చెనట. ఒక చిల్ల పెంకు దీసికొని శ్రీ రామకృష్ణుని భ్రూమధ్యమందుఁ బెట్టి బాధకలుగునట్లు నొక్కి మనసు నిపుడు లగ్నము చేయుమని యనెను. అప్పుడును దేవీరూపము కనుపించెను. కాని రామకృష్ణు డా దేవీరూపమును తొలగింపఁగలిగెను. తొలగించెను. దాని పేరు నిర్వికల్ప సమాధి. తలి కనిపించిన సమయము సవికల్ప సమాధి. సౌందర్యభావము దానియంతట నది యుండదు గదా. ఏదియో యొక యుపాధి నాశ్రయించియుండును. ఆయుపాధి నీచవస్తువైనచో సమాధియైనను ఫలితము లేనిది. దేవతావిషయమైనచో నది సవికల్ప సమాధి యగును. దంతముతోఁ జేసిన నాల్గు యేనుగుల కొమ్ములమీద నింద్రనీలమణితో భూగోళము సముద్ధరింపబడినట్లు మహాశిల్పి యొకడు చేసినాడు. అది సుందరవస్తువు. దాని నెవ డుపాసించును? సౌందర్యోపాసన చేయుచుంటినని దానియందు భ్రాంతిపొందరాదు. అట్టి వస్తువును ధ్యానించినచోఁ దాదృగితరవస్తువుల సౌందర్యజ్ఞానము కలుగుట కుపకరించునుగాని యధిక ప్రయోజనము లేదు. దేవి సౌందర్యలహరి. దేవీతరమైన యే యుపాసనయు సౌందర్యోపాసన కానేఱవు. ఉపాసన యనగానె తైలధారావదవిచ్ఛిన్న సంతతిగా నొకదానిని భావించుట. విజాతీయ ప్రత్యయానంతరిత సజాతీయప్రత్యయసంతతి అనగా దానిని గురించి మనము భావించునపుడు తదితరమైన యూహ చేతనే కొంచెమైనను రాగూడదన్నమాట. దేవీసౌందర్యోపాసన చేయుచుందువు. ఆ దేవి కల్పితమూర్తి. వివర్తమూర్తి. బ్రహ్మము దృష్ట్యా యాదేవి రూపము భ్రాంతి. భ్రాంతియని తెలిసికొనినంతనే దేవీమూర్తి లేదు. తెలిసికొనుట యనగానే యింతకుముందు చెప్పినట్లు రామకృష్ణ పరమహంసవలె దానిని వివేకమను ఖడ్గముతో భేదము చేయుట. నీవు భేదించలేవు. నీకు నష్టము లేదు. సవికల్పక సమాధి నిర్వికల్ప సమాధికంటెఁ గొంచెము తక్కువ కదా. దేవ్యుపాసన నీకు సిద్ధించినపుడు నీకింద్రియస్పర్శ లేదు. ఆమెను జూచు కన్ను నామెను ధ్యానించు మనస్సు నింద్రియములు కావు. ఇంద్రియ

పరమార్థభూతమైన జ్ఞానమే యది. ఆ నేత్రములు, నా భావన చర్మేంద్రియ సంబంధులు కావు. మూలభూతమైన యేజ్ఞానము కలదో, యేయట్టి జ్ఞానముచేత నింద్రియములు ప్రకాశించుచున్నవో యాజ్ఞానమే యది. దానియం దింద్రియత్వములేదు."

అంత నెవరును మాటాడలేదు. మాటాడకుండనే లేచిరి. మాటాడకుండనే నడువ మొదలుపెట్టిరి. ఒకరినొకరు వదలిపెట్టి తమతమ యిండ్లకు బోవలసిన ప్రదేశములందు మాత్రము సెలవు సెలవన్నమాటలతో వెడలిపోయిరి. వాసంతి యుమాపతివద్ద సెలవు తీసికొనినపు డతని పాదములకు వంగి నమస్కరించెను. తరువాత సారథివద్ద సెలవు తీసికొనవలయును. ఆమె యతని కుడిచేయి తన చేతితో లాగెను. అతడు నివ్వెఱపోయి చూచెను. అది యొక వీధి లాంతరు యొద్ద. ఆ నివ్వెఱపోవుట యుమాపతికిఁ దెలియును. శిరీషు తాను వేఱుగా నర్థము చేసికొనెను. ఉమాపతికిఁ దెలిసిన యర్థ మేమనగా సారథి యింతవఱకుఁ దనలో దానులేడు. వాసంతి కరస్పర్శ తగిలినంతనే యతనికి మెలకువ వచ్చెను.

సారథి నవ్వెను. వాసంతి యిటనెను "అధ్! నీమూలముగా నేడు మంచి విషయములు విన్నాను. నాకు బుద్ధియేలేదు. అంతఃకరణ మెక్కడనుండి వచ్చును?"

సారథి యిట్లనెను: "అంతఃకరణ మందఱికి నుండును. అది మేల్కొని యుండదు. దానిని మేలుకొల్పి జాగ్రత్తపఱచినచో మనము సత్పురుషుల మగుదుము."

ఉమా—"ఏమి సారథీ!" యని యాశ్చర్యపోయెను.

సారథి—"నేను శాకుంతలమును పాఠము జదివితిని. ఆశాస్త్రిలుగారు నాకీ సంగతి చెప్పిరి. ఆ తేంప్లోయినది."

ఉమాపతి "ఓయి! నీకు నర్జునరావునకును సామ్యము" అనెను. శిరీషు డిగ్భ్రాంతుడయ్యెను. వాసంతియు శిరీషుడును గృహాభిముఖులై నడువజొచ్చిరి. శిరీషున కివన్నియుఁ దెలిసిన విషయములే. తెలియకపోయినను వానికి గల మనోబలముచేత నతనికి దెలిసినట్లేయుండును. అందుచేత వానిని గుఱించి విన్నప్పుడు సంతోషించుటయేగాని వెంటనే వదలిపెట్టును. వాసంతి సారథి దాని కొని నడచెను, తన్నానుకొని యేల నడువదు? అతని కిది ప్రశ్న.

## ౧౦

దొరగారివద్ద సెలవు తీసికొనుటకు నర్జునరావు కోటలోనికి వెళ్లెను. తోడ రంగనాథము లలితాకమలలు కూడ వెళ్లిరి. అవధానిని తీసికొని వెళ్లిరి. రంగనాథము తన చిన్నతనములోఁ జాల సార్లు కోటలోనికి వెళ్ళెను. తరువాత

వెళ్లలేదు. అతని కూఁతుండ్రు కోటయొక్క మేడ యెఱుఁగరు. ఇదే మొదటిసారి. "పరవాలేదు, కోటమాత్రము కాని, మీ నాన్నగారికి గోటలోనికిఁ బ్రవేశ మేర్పడెనుగాన మీరు గూడ వచ్చినచో మీలోని సౌహార్దము దొరగారికి కెక్కువగా భాసించును రం"డని ప్రోత్సాహము చేసెను. రంగనాథమున కామాటలలో సామంజస్యము కనిపించెను. అంతియే కాదు. తన కూఁతుండ్రను కోటలోని కెప్పుడు తీసికొని వెళ్ళవలయునా యని యతఁడు ప్రతీక్షించుచుండెను. అట్లు తీసికొని వెళ్లుట యితగులతోఁ గూడి యైనచో వంగులోని మొగమాటము యొక్క పాళ్లు తగిపోవును. వారియంతట వా రేగినచోఁ గొంత యెబ్బెట్టుగా నుండును. పరాయి పెద్దమనిషి యర్జునరావుగా రుండెను. వారితోఁబాటు కలసి వచ్చిన టుండును. అందఱును గోటలోనికిఁ బోయిరి. దొరగారు మేడమీఁద నుండిరి. వారి యనుమతికోసము కబురంపిరి. వారి యనుమతి వచ్చిన తరువాత నలుగురును లోని కేగిరి. రాజుగారు కూర్చున్న కుర్చీ కాక మూఁడుకుర్చీలే యుండెను. అవధాని కూర్చుండెను. అర్జునరావు మిగిలిన రెండు కుర్చీలమీఁద లలితాకమలలను గూర్చుండు మనెను. వారు కూర్చుండిరి రంగనాథమే యొక నౌకరును బిలిచి మఱి రెండు కుర్చీలు తెప్పించెను. రంగనాథము కోటలోని పరిచయము నవలంబించెను. దొరగా రిది గ్రహించుచునేయుండెను. కాని యాయన యేమియు మాటాడలేదు. అది యాయన కనిష్టముగా గూడ కనిపించలేదు. కూఁతుండ్రతో వచ్చిన రంగనాథము తనయం దధికగౌరవము కలవాఁడన్నమాట. లలితాకమల లిద్దఱు కూర్చుండి దొరగారి వంక నే చూచుచుండిరి. దొర వారివంక నే చూచుచుండుట లేదు. చూడవలయునని యున్నది కాని వారి వంకఁ దాను జూచుట తన రాచఠీవికి భంగమని యతఁ డనుకొనుచుండెను. అనుకొనుటకొ,దది యొకయలవాటు. జమీందారును, రంగనాథము నొకయీడువారు. దొర ప్రొద్దుటఁ బుట్టెను; రంగనాథము సాయంతనమునఁ బుట్టెను. ఒకటే యేడాదిలో నొకటే మాసములో నొకటేరోజున. ఇద్దఱును నలుబదియైదేండ్లు. రంగనాథము నలుబదియైదేండ్లవానివలెఁ గనిపించును; దొరగారు కనుపించరు. ఆయన ముప్పదియైదేండ్ల వానివలె కనిపించును. ఆయన యెత్తైన మనిసి. ఆజానుబాహువు కాడు కాని పొట్టివాడును గాదు. తుమ్మెదలవంటి మీసములు చెక్కిళ్లమీఁదికి మెలితిరిగియుండును. చెవులక్రిందివఱకును బుస్తీలు కలవు. అది క్షౌరింపు కాదు. జుట్టుముడి లేదు. తలజుట్టు పెంపక ముండెను. వెనుక గిరజాలు లేవు. ఆయన లోపల నొకబనియను తొడిగి పైనఁ దెల్లని సన్నని కుడితినీ తొడిగెను. మెడలో నొక బంగారపు గొలుసున్నది. కుడిచేతి నాల్గువ్రేళ్ల కుంగరములు కలవు. మనిసి పులివలె గనిపించును. కన్నులు విశాలములైనవి.

కుర్చీలు వచ్చినతరువాత సందఱును గూర్చుండిరి. అవధాని యిట్లు చెప్పెను. "అర్జునరావుగారు తమవద్ద సెలవుతీసికొని వెళ్లుటకు వచ్చిరి. మఱలఁ దమ రెప్పుడు దయచేయుచున్నచో నప్పుడు దయచేయుదురు. మనము నాటకశాల నిర్మింపవలయును."

రంగనాథము- "మనయూరిలో నాటకశాల యున్నదికదా"

అవధాని-"అది సారధియొక్క సమాజము వారిదనుకొందును."

రంగ-"కాదు. దాని కథ నాకుఁ దెలియును. అది దొరలదే. అఱువది యేండ్ల క్రింద నెవరో యక్కడ నాటకశాల నేర్పాటు చేయుదుమని పెద్ద దొరగారి నడిగిరి. ఆస్థలమంతయు దొరలదే వారనుజ్ఞయిచ్చిరి. వర్తకపు టొత్తిడి లేని ప్రదేశముకనుక నది యట్లున్నది. ఇన్నాళ్లుగా దానికి శిస్తెవరు కట్టుచున్నారో తెలియదు. ఆ సమాజమువా రుపయోగించుకొనుచున్నారు.

అర్జునరావు-"శిస్తు సమాజమువారే కటుచున్నచో నఱువది యేండ్లనుండి వారి హక్కుభుక్తములలో నున్నదన్నమాట. లాప్రకారము దొరగారి కది చెందదు. ఈనడుమఁ గొన్నాళ్ళయినను దొరగారి తరఫున శిస్తుకట్టినవా రున్నచో వ్యవహారమైనను జేయవచ్చును."

రంగ-"మనయూరిలో రామేశ్వరమని యున్నాడు. అతని కీవిషయము లన్నియు బాగుగాఁ దెలియును. ఆ సందర్భములో భయము లేదు. ఆనాటకశాలా భవనము మనదే. దానిమీఁద నాలుగైదువేలు పెట్టినచోఁ జాల క్రొత్తగా సిద్ధముచేయవచ్చును."

అవధాని - "ఆమాత్రమే వ్యయమైనచో దొరగారు నిముసములోఁ జేయుదురు. పాతికముప్పదివేలకు సిద్ధముగానున్న మనకు నా పని నాలుగైదు వేలలో జరిగెడిదైనచో నంతకన్న కావలసిన దేమున్నది?"

రంగ-"ఆనాటకశాల యున్నచోటే కాదు; ఇప్పుడు సారధి యున్న తోట యున్నదే, యావరుస యాబాటమొదలాబాటవఱకు నాసందుపొడుగున నున్న స్థలములన్నియు దొరగారివే. వానికి శిస్తెవ్వరును గట్టుటలేదు. పురపాలకసంఘమువారు వాని నన్నాక్రమితభూముల క్రింద వదలిపెట్టిరి. ఆ ప్రాతనాటకశాలస్థలము బాగుగాలేదనుకొన్నచో నిచ్చటఁ బెద్దనాటకశాల కట్టించవచ్చును. ప్రాఁతనాటకశాలాభవనము నాటకము లాడుచున్నారు గనుక నాటకశాల. కాని నాటకములాడుటకు యోగ్యము కాదు. అది యొక పెద్దబంగళా. దానిని బాగు చేసినచో నర్జునరావుగారికి నివాసగృహ మేర్పడును"

అవ.-"మొదట దీనిలో నాటకములు వేయుచుందము. నాల్గయిదేండ్లలో నాటకములమీద లాభము వచ్చిన తరువాత నచ్చట వేయుదము."

ఈ ప్రసంగములో నెవరి మెలకువ వారిది. దొరగారిని దీనిలోనికి దింపవలయునని యవధాని. దొరగారు హెచ్చెక్కువ ఖర్చుపెట్టువాఁడు కాదని యవధానికిఁ దెలియును. మొదటనే యెక్కువ వ్యయము చూపించినచో దొరగారు బెదరిపోదురు. నెమ్మదిగా దింపవలయును. రంగనాథముద్దేశ్యమేమనగాఁ, దన మనసులోని యూహాలన్నియు నొక్కసారి ఫలవంతము కావలయునని. ఫలవంతము కాకపోయినచో బీజావాపమైన జరుగునుగదా.

అర్జున-"ప్రస్తుత మా భవనములో నాటకము లాడవచ్చును."

రంగ.-"ఆనాటకశాలమీఁద ముగ్గురు ప్రస్తుత మధికారము చేయుచున్నారు. అది సారథియొక్క నాటకసంఘమునకు సంబంధించిన భవనమువలెనే వ్యవహారము సాగుచున్నది. అందులో మఱియొకరు నాటకమాడవలయునన్నచో నాముగ్గురి యనుమతిని దీసికొనవలయును. మొన్న మేము తీసికొనలేదు. వారును మర్యాద పాటించి యూరకుండిరి. ఆ వ్యవహారము నేను జూచెదను. ఆముగ్గురు నాకు స్నేహితులే."

అవధాని-"మఱల నరుసరావుగారి నెప్పుడు రమ్మందము?"

రంగ.-"మనమే మఱియొక నాటక మేర్పాటుచేసి వారిని బిలిపింతము. అదే యొకారొక వచ్చివేయుట."

ఈ ప్రసంగమంతయు నంటనంటనే జరుగలేదు. నడుమనడుమ నాగి యాగి యొక్కరొక్కరే మాటాడుదురు. ప్రతివారును తగ్గుగొంతులో మాటాడుదురు. ఒక గంట సేపైనది. నాల్గుగంటలకు వచ్చిరి. ఒక యరగంటలో వెళ్లిపోవుద మనుకొన్నారు. ఇక్కడనే గంటయైనది. ఐదారుగంటలకు. అర్జునరావు వచ్చి పది దినములైనది. కోర్టుసెలవు లైపోయినవి. అర్జునరావు గడియారము వంక జూచి, వెళ్లుదమని రంగనాథునకు సైగచేసెను. వారందఱును లేచి నిలుచుండిరి. దొరగారును లేచిరి. సెలవు తీసికొందుమని దొరగారికి నమస్కారము చేసిరి. దొరగారును నమస్కారము చేసిరి. మేము సెలవుతీసికొందుమని చెప్పినపుడు దొరగారుకూడ లేచి నిలుచుండుటయు, వారు తిరిగి నమస్కారము చేయుటయు గొప్ప విషయములు. అట్లందఱకును జరుగదు. తిరిగి వెళ్లునపుడు దారిలో 'నిది శుభసూచక'మని రంగనాథ మర్జునరావుతోఁ జెప్పెను. అవధాని కోటలోనే దిగబడివాడు. వీరు నలుగురును వచ్చివేసిరి.

లలితా కమలలలోఁ గమల చిన్నది. లలితకుఁ బదునెనిమిదేండ్లు. కమలకు బదునేనేండ్లు. కమల యెప్పుడును బసిపిల్లవలెనే మాటాడును. "నాన్నగారూ!

మమ్ము దొరసానిగారి దగ్గఱకుఁ బంపింతు మంటిరిగదా. ఆలోపల బంగారపు నెమలి యున్నదఁట. దాని తోఁకలో రత్నాలు గ్రుచ్చఁబడియున్నవఁట. దానినిఁ జూడవలెను".

రంగ-"మఱి యింకొకసారి పోవుదము. అర్జునరావుగారిని బంపించవల యును గదా."

ఇంటికిఁ బోయి రైలుస్టేషనుకు బయలుదేఱిరి. రంగనాధము కూఁతుండ్ర యొక్క యీ పెంపక మందఱకుఁ దెలియును. వారు కనిపించినంతనే జన మంతయుఁ గను లప్పగించి చూతురు. వారు రైలు నిలుచు స్థలమునందు నిలిచిన చో నది యొక తిరుణాల ఆ తిరుణాల జరిగెను. అర్జునరావు వదలలేక వదల లేక వెడలిపోయెను. వెడలిపోవుచు రంగనాధముతోఁ జెప్పెను- "అది తొందఱగాఁ జేయవలయు"నని.

అర్జునరావునకుఁ దన యూరిలో న్యాయవాదవృత్తిలోఁ గిట్టింపులేదు. నాటకములకుఁ బోయి కిరాయి తెచ్చికొనును. అది ప్రధాన జీవనము. రెండు నెలల కొక నాటకము పడినచో గొప్ప. నాటకమునకు రెండువందలు తప్ప నెక్కువరాదు. ఇక్కడికి వచ్చినచో నెలకు నాల్గువందలు వచ్చును. మరియు నిచట లలితా కమల లున్నారు. వారితోఁ గలిసియుండఁగా నది యొక మాధుర్య లోకమున విహరించుచున్నట్లుండెను. కాని తామచట దేవిడీలో గంటసేపు కూర్చున్నారు. దొరగా రొక్కమాట మాటాడలేదు. ఆయన దీనికి మొగ్గునా యని సందేహముగా నున్నది. ఆ సందేహమునకుఁ గూడ తావులేదు. రంగనాధ మిట్లు చెప్పినాడు: "మీది జమీందారీ గ్రామము కాదు కనుక. మీకుఁ దెలి యదు. దొరలంతే. వారు మాటాడరు. వారి కిష్టము లేనిచో దొరగారంత సేపు కూర్చుంపరు. కూర్చుండుటయే వారి యిష్టమన్నమాట." అది నిజమే.

రైలు బయలుదేఱుచుండెను. రైలు వెంటనే లలిత వెళ్లుచున్నది. అర్జున రావు లలితను సమాశ్వాసించెను-"నేను మఱల నెలనాళ్ళలో వత్తునుకదా"యని. ఇందులో గూఢార్థమేమియు లేదు. అతని మనసులోని కోరికయే ఫలవంతము కావిది ఫలితమైనదని నారోపించికొని యనిన మాట.

ఇంత మధురమైన సమావేశములో, నింత మధురమైన వీడ్కోలులో వెనుక నొక హృదయబాధ కలిగించు సన్నివేశ మున్నది. అర్జునరావు దగ్గఱ దీసికొన్న వేయిరూకలు రంగనాధ మీయలేదు. రెండు పెద్దప్పులు తీర్చుకొను టకు రంగనాధము తీసికొనెను. ఆ అప్పులు తీర్చలేదు. ఈ పదిదినములలో నేడు వందలకు మించి వ్యయపెట్టెను. గుడ్డల దుకాణమునకుఁ బోయి లలితా

కమలలు చెటి రెండువందల రూకల చీరలను, జాకెట్లను గొనిరి. రంగురంగుల చీరలు, వన్నెవన్నెల చీరలు, అంచులు కొట్టవచ్చు చీరలు! రంగనాథము కూఁతుండ్రద యిద్దఱి చేతులకు జతజత గాజులు చేయించెను. పదునేను రూకలు పెట్టి భార్య కొక చీర కొనెను. కొడుకునకు నేఁబదిరూకలు పెట్టి యొక త్రొక్కుడుగుఱ్ఱము, నొక మూఁడు చక్రముల త్రొక్కుడుబండిని గొనెను. బొమ్మలువేయుటకు రంగులు కావలయుననగాఁ దమ్మునకుఁ బదిరూకలిచ్చెను. తల్లి కొక ధోవతి కొనెను. రోజును బత్తాయిలు కొనుచుండిరి. రోజునకు మూఁడునాలుగు డజనులు. పగలుభోజనమైనంతనే యైదాఱు గ్లాసుల రసము తీసి ప్రతివారును త్రాగుచుండిరి. తమలపాకులు, వక్కలు, కస్తూరి, పచ్చకప్పురము, కుంకుమపువ్వు - ఒక యేఁబది రూకలు పెట్టి వీనినన్నింటిని రంగనాథము సమృద్ధిగాఁ గొనెను. రెండుమూఁడు నెలలవఱకు మఱిఁ గొననక్కఱ లేదు. ఛాయాచిత్రము పెట్టుకొను వెండిఫ్రేమొకటి, దంతపుఫ్రేమొకటి కొనెను. లలితాకమలల ఛాయాచిత్రములు వానిలోఁ బెట్టి యర్జునరావునకు బహుమతి చేసెను. అతఁడు బ్రహ్మానందపడెను. అర్జునరావు వెళ్లెడి రోజున రంగనాథము శెట్టిని పిలిపించి యభ్యంగనము చేయించెను. ఈ పదిదినములును శెట్టి వచ్చి వీరిద్దఱకు ఒడలు పట్టుచుండెను. అతనికి రోజునకు రూపాయి. ఆనాఁటిప్రొద్దున నర్జునరావునకు రంగనాథము మంచి వెలగల జరీబట్టలు కొని పెట్టెను. ఇంతటి మరియాదలో, నింతటి సౌజన్యములో, నింతటి మాధుర్యములో నర్జునరావు డబ్బడుగలేక పోయెను. మఱియు రైలుదగ్గఱ రంగనాథ మర్జునరావును బెడగా బిలిచి "యన్నగారూ! రైతు రెండువేల రూపాయలు తీసికొని రావలయును. వాడు మొన్ననే వత్తుననెను. ఇంకను రాలేదు. వచ్చినంతనే పంపింతు"నని చెప్పెను. వ్యవహారము భరోసామీద జరుగుచున్నది. అరునరావు నిండుగా నిట్లనెను: "నాకిప్పుడేమియుఁ దొందఱలేదు. నేను వాడు కొనుటకు బేంకులో నాలుగువే లున్నవి. నీకు వెసులుబాటు చిక్కినప్పుడే యీయవచ్చు"నని.

వెసులుబాటు చిక్కినప్పు డని యర్జునరావు దర్జా కనెను. వెసులుబాటు చిక్కుట యనఁగా నాలుగేండ్లైనఁ గావచ్చునని రంగనాథ మనుకొనెను. అర్జునరావు వెడలిపోయినంతనే రంగనాథము క్రియావ్యవసాయి యయ్యెను. రంగనాథమున కిప్పుడు నలుబదియై దేండ్లని యిదివఱకే చెప్పబడినది. అతని శరీరములోని రక్తము రాజసేవాపరిచితి కలది. ఇన్నియేండ్లును వానికి బుద్ధివచ్చినతరువాత రాజసేవ యెఱుఁగఁడు. బుద్ధి తెలిసిన తరువాత పాతికయేండ్లు తనకు రాజసేవ లేదని కుమిలిపోవుచుండెను. ఆ జమీందా రన్నను, వారి వంశమన్నను

నతనికిఁ బట్టరానంత యభిమానము. ఆ జమీందారు తనవంకఁ జూడకపోయి నను, దనతో మాటాడక పోయినను, తనకు డీవిడీమన్నా చేసినను నాజమీం దారునందే పరమభక్తి. అతని ప్రాణము నొక మహాశ పట్టుకొన్నది. తన తాతగా రక్కడ దివాను చేసెను. తాను మరల నచట దివాను కావలయును. అతని తెలివి తేటలు, వాని నేర్పు, వాని సర్వము నిన్నాళ్లు పొనుకుపడి యుండెను. తాను కోటలోనికి వచ్చుటకు దొరగా రంగీకరించిరి. తొలినాడు కోట ప్రవే శము చేసెను. తదాది నతని బుద్ధి రాజకీయములయందు జిలజిలుపలవలుగా వ్యాపించుచుండెను. ఇన్నాళ్లు నిర్వ్యాపారమై, నిష్ప్రతిభమై, నిరూహమైన, వాని మనస్సు నేఁడు కోడెత్రాఁచువలెఁ బడగవిప్పి యాడుచుండెను. అవధాని యాస్థానకవి యేమి? తాను కావలయును. తానాస్థానకవి యేమి? మంత్రియే కావలయును. రంగనాథము బి. యే. పరీక్ష నిచ్చెను. తాను మంత్రియగుటకు సర్వథా పనికి వచ్చును. అతఁ డింగ్లీషుసారస్వతము నవలోడించెను. తాను మంత్రి కావలయును. మంత్రియగుటకు నర్జునరా వొకఁడు వీలుగాఁ గుదిరెను. దొర లోభియని యతనికిఁ దెలియును. అతఁడు పాతికముప్పది వేలు పెట్టి నాటక శాల కట్టించుట యెప్పటికిని జరుగదు. అర్జునరావునకుఁ దాను వేయిరూకా లప్పుతీర్చుట యెన్నటికిని జరుగదు. ఈ జరుగని రెండుపనులును జరిగినట్లు చేయవలయును. అర్జునరావును తీసికొనివచ్చి నెలకు నాల్గువంద లతనికి ముట్టు చున్నచో నాముట్టుట తనప్రయోజకతవలన నైనచో నర్జునరావు వేయిరూపాయ లడుగలేఁడు. నాటకములు సాగుచుండి లాభములు వచ్చినచో తాను దొరగారికిఁ ప్రియుఁడగును. నాటకసమాజ మంతయుఁ దన చేతిమీఁదుగా నడచుచుండును. లాభములు వచ్చుచుండును. రాజదర్శనమునకుఁ గొదువలేదు. తాను కోటకు రోజునకు నాలుగైదుసార్లు రాకపోకలు జరుపుచుండ వేవలయునుగాని కోట మీఁద నింకొక కోట కట్టించును. అతని శరీరనాళములలోని రాజసేవాధీనమైన రక్తమునకు శక్తి వచ్చెను. ఒక్కొక్కని జీవితములో వాని పూర్వజన్మ సంస్కారానుగుణమైన పరిస్థితి జరిగినఁగాని వాని ప్రతిభ బయటకు రాదు. ఇది రంగనాథము యొక్క ప్రతిభ బయటకు వచ్చువేళ. కూఁతుల నింటికిఁ బంపించి తను మహమ్మదుఖాసిము నింటికిఁ బోయెను. ఆ ముసల్మానునకుఁ దెలుఁగు బాగుగా వచ్చును. ఎఱుఁగనివాఁ డతనిని ముసలిమా ననుకొనఁడు. అతఁ డెప్పుడును లాగు తొడగఁడు. పంచెయే కట్టును. చూచుటకు బ్రాహ్మణుఁడో, వెలమయో, రెడ్డియో, కాపో, కమ్మయో యనిపించును. అతఁడు మాటాడు తెలుఁగులో తురకలక్షణమే యుండదు. ఉత్తమకులజులైన యాంధ్రులు మాటాడి నట్లే యుండును. అతఁడు నాటకశాలయున్న దొడ్డిమీఁది ముస్తరఫి కాతలల్లో

వాఁడు. వారిలోఁ బ్రధానుఁడు. పురపాలకపుఁ బన్ను మొదలైన శిస్తుఁ జెల్లించును. అతని వయస్సు నలుబదియేండ్లలోపు. అతనికిఁ దెనుఁగు కవిత్వమన్నచో నిష్టము. రంగనాథమున, కతనికి స్నేహమనియే చెప్పవలయును. రంగనాథ మతని యింటఁ గొంతసేపు కూర్చుండి మాట్లాడి యర్జునరావు ప్రసక్తి తెచ్చెను. ఖాసిము అర్జునరావును చాల మెచ్చుకొనెను. ప్రాసంగికముగ రంగనాథ మిట్లనెను: "నాటకశాలాభవనమునకుఁ బురపాలకసంఘమువారికిఁ గట్టు పన్నెంత?"

ఖాసిము-అర్ధ సంవత్సరమునకుఁ బదిరూకలు.

రంగ-నీ వెన్నియేండ్లనుండి కట్టుచుంటివి?

ఖాసిం-పదునే నేండ్లనుండి కట్టుచుంటిని.

రంగ-అదివఱ కెవ్వరు కట్టుచుండెడివారో!

ఖాసిం-నరసింహముగారని యుండెడివారఁట. ఆయన హిందీలో నాటకములు వేసెడివాఁడు. స్త్రీ సాహసము, నారాయణరావుఫార్సు మొదలైన నాటకము లాడెడివారఁట. నరసింహముగారే నాయకపాత్రయు, సుమారసింగు వేషమును వేసెడివాఁడఁట. ఆయన చాల గొప్ప నటకుఁడఁట.

రంగ-ఆ దొడ్డి యెవరిదో?

ఖాసిం-దొరగారిదే. వారి తండ్రిగారు నరసింహముగారి కిచ్చిరఁట.

రంగ-పారీఖత్తు లున్నవా?

ఖాసిం-ఏమియున్నవో, యేమి లేవో యెవ్వరికిని దెలియదు. ఈ బాలసరస్వతీ సమాజము పేరనే పురపాలకసంఘము లెక్కలలో నున్నది. నా చేతికి వచ్చినతరువాత నేను కట్టుచుంటిని.

రంగ-ఇప్పుడు మరల రాజాగారు స్థలమును, భవనమును దనవియే యన్నచో నేమి యగును?

ఖాసిం-మన భుక్తములో నున్నది. నలుబదియేండ్లనుండి దొరగారి భుక్తములో లేదు.

రంగ-ఏమి భుక్తము? మేము వారిని కట్టమన్నాము, వారు కట్టుచుండిరి యన్నచో మనము చేసెడి దేమియు లేదు.

ఖాసిం-దొరగా రట్లందురా?

రంగ-వారనరు. ఆ దారులైన ప్రభువులు- వారికి దొడ్డితో నవసర మేమి? అర్జునరావుగారిని దీసికొనివచ్చి ఇచ్చట నాటకము లాడింపవలెనని యనుకొను

చున్నారు. ఈనాటకశాలయే బాగుచేయించి యిందులోననే నాటకములాడింప వలయును.

ఖాసిం-నిక్షేపముగా వాడింపవచ్చును. నేనున్నాను. ఇది యేమి నా సొంత సొమ్మా? దొరగారి సొమ్మే. నాటకశాల బాగుచేయించవచ్చును. నా కక్కఱలేదు. శిస్తులు దొరగారినే కట్టుకొనుమనుము. దీనిమీఁద నా కధికార మెందుకు? కాదు, నన్నే చూచుచుండు మన్నచోఁ జూచుచుండెదను. లేదా మీరు చూచుచుండవచ్చును.

రంగ-దీనిమీద మీరు ముగ్గురుకదా యధికారులు? వారిద్దఱు నేమందురో?

ఖాసిం-వారికి గోల యసలు పట్టదు.

రంగ-అర్జునరావుగారితో నీ వానాడు మాటాడితివికదా. తరువాతి నిన్ను గురించి నాతోఁ జెప్పినారు. పఠానువేషములో సమాజు చేయుట మొదలైనవి చేసినచో నింక నెక్కువ బాగుగా నుండునట. నిన్ను కనుగొందు మన్నారు. నీ ముసల్మాను మతమును గురించి యాయన నిన్నడిగి తెలిసికొనవలె నన్నారు. నీవు నీ మతమునుగుఱించి బాగుగాఁ దెలిసినవాఁడవని నే నాయనతోఁ జెప్పితిని.

ఖాసిం-ఆయన మరల వత్తురుగదా. అప్పుడు మాటాడుదము.

రంగ-నీవు వేషము వేయుటకుఁగూడ బాగుగా నుందువని యన్నాఁడు.

ఖాసిం-నే నెప్పుడైన చిన్నచిన్న వేషములు వేయుదునుగదా. ఆయన సమాజములో వేయుట నాకు మిక్కిలి యిష్టము.

రంగ-ఆఱు నెలలకు బదిరూకలు కట్టవలయునుగదా, ఎక్కడనుండివచ్చును?

ఖాసిం-సారధి యీయఁడు. అతనిదగ్గఱ డబ్బునులేదు. నేనే నా జేబులో నుండి పెట్టుదును. ఏడాదికొకసారి యితరు లెవ్వరైన వచ్చి నాటకమాడినచో వారు ముప్పదిరూకలు బాడుగ యిత్తురు. టముకు, గోడకాగితములు నప్పుడు మనవే ఖర్చు. ఏమియు మిగిలిచావదు. నా చేతిడబ్బు దీనిక్రిందఁ జాలఁబడు చున్నది.

రంగ—ఇంక నీకా భయ మక్కఱలేదు. అర్జునరావుగారు వచ్చినవెంటనే మనము దీనిని పెద్ద నాటకసమాజము చేయుదము. అసలీపేరు మార్చివేయవల యును. ఏదైన నింగ్లీషుపేరు పెట్టవలయును. ఊరిలోని క్లబ్బు చిన్నయింటిలో నున్నది. ఆక్లబ్బు నిచటికి మార్చుదము. చీట్లపేకమీదఁ దేలికగా రోజునకుఁ బది రూపాయలు వచ్చును. నెలకు మూడువందల రూపాయ లదియొక యాదాయము. నెలకు నాలుగు నాటకము లాడుదము. నాటకమునకు వందరూపాయలు మిగిలింప వచ్చును.

ఖాసిం-ఎట్లు మిగులును? పదిరూకలే మిగులదే?

రంగ-క్లబ్బులో నిప్పు డేఁబదిమంది యున్నారు. వందమందిని జేయుదము. ప్రతివారును నెలకైదురూకలు నాటకములు చూచుట కీయవలయును. వారందఱకు నాటకదర్శనమున కుచితప్రవేశము. వారు వత్తురు, వారు రారు. ఐదురూపాయలు తప్పకుండ నీయవలయును. క్లబ్బులో సభ్యుఁడుగాఁజేరుట కేమియుఁ బుచ్చుకొనము. నెలకు నాలుగునాటకములు కాదు, రెండే వేయుదుము. కాని వినోద కార్యక్రమములు మాత్రము నాల్గుండును. ఒకసారి మ్యాజిక్ పెట్టుదము. మఱియొకసారి నృత్యము. ఇంకొకసారి సంగీతపు కచేరీ. మఱియొకసారి గొప్పకవులచేత శతావధానము చేయింతము. మొదటి రెండేండ్లు నాది పూచీ. నే నెంతమందినో యెఱుఁగుదును. నే నన్నచో వారికి గౌరవము. నేను వచ్చి మా నాటకశాలలో మీ ప్రదర్శన యిమ్మని యడిగినచోఁ గాదనువా రెవ్వరును లేరు. మన మెవ్వరికైన మన నాటకశాల బాడుగ కీయవలసివచ్చినచో రోజునకు వందరూపాయలు తక్కువ పుచ్చుకొనము. నీ కెందుకు? నాటకశాల విషయము నాకు దెలియదు, ఇది యంతయు రంగనాథముగారిదని చెప్పుము.

ఖాసిం-అర్జునరావుగారు నేను వేషమునకుఁ బనికివత్తునని చెప్పిరా?

రంగ-చెప్పిరో, లేదో, నీవే యడుగుదువుగాని. ఆయన రేపు వచ్చును గదా!

రంగనాథ మింటికిఁ బోయెను. తన పథకములో ముప్పాతికమువ్వీసమయిపోయెను. తా నిందులో నెంతయో చేయవలసియుండు ననుకొనెను. వాఁడొక పిచ్చిసాయిబు. కాని మొదటినాటకము నాఁటికే నాటకభవనము క్రొత్తదిగాఁ జేయవలయును. దొరగారు డబ్బీయరు. ఒక వేయిరూపాయలైనఁ బెట్టినఁగాని క్రొత్త తెరలును, రంగులును రావు. తన దగ్గఱ లేవు. రంగనాథము మఱునాఁడే తన పొలములున్న గ్రామమునకుఁ బోయెను. రెండెకరము లమ్మఁజూపెను. తన రైతే యెకరమున కెనిమిదివందలిత్తు ననెను. పోటీలు పెట్టినచో నెకరమునకుఁ బదమూఁడువందలు కూడ వచ్చును. పోటీలు లేకుండనే యెకరమునకు వేయి కనులు మూసికొని యిత్తురు. అంతకంటెఁ గనులు మూసికొని రంగనాథము రెండెకరములు పదునాఱువందలకుఁ దన రైతున కిచ్చెను. వెంటనే వేయిరూపాయ లిచ్చిన నే బేరము నిశ్చయ మన్న నియమముతో వేయిరూపాయలు తీసికొని మఱలఁ దనయూరు చేరెను. క్రొత్త తెరలు, రంగభూమిమీఁద నొకమేడ భవనము బాగుచేయించుట, వెల్లవేయించుట. వీధి ద్వారము క్రొత్తగాఁ గట్టించి పైన "యంగ్ మెన్స్ క్లబ్" అని యక్షరములు చెక్కిం

చెను. రంగులు వేయించెను. చూచుటకు నాటకశాల బ్రహ్మాండముగాఁ గనిపించుచుండెను. అందఱును దిగ్భ్రాంతి పొందుచుండిరి. దొరగారు పెట్టుబడి పెట్టి నాటకభవనము బాగుచేయించి రనియు, మొన్న పఠానువేషము వేసిన యాయనచేత నాటకము లాడింతురనియు బెద్దపుకారు పుట్టించెను. రంగనాథము పొలమమ్మి డబ్బు తెచ్చెనని యెవ్వరికిని తెలియదు. ఖాసింతోఁగూడ దొరగారే డబ్బిచ్చెనని చెప్పెను. అది యంతయు బాగుచేయించుటకు మూడు వేలయ్యెను. పదిరూక లీయవలసినచోట మూఁడురూకలు, వంద యీయవలసినచోటఁ బాతిక, పనివాండ్రు మరియు నడిగినచో "దొరగారికి ఫలానా యూరి శిస్తు రావలయును, ఆతాణాలో వసూలు కాలేదు. వచ్చినంత నే యిప్పింతుమన్నా"రని చెప్పెను. దొరగారిని కాదని యెవ రనగలరు? మరియు నవసరమైనచోఁ దక్కిన యాఱువందలు తెచ్చి సర్దుదమని రంగనాథము నూహ. రంగనాథ మన్నిటికంటె శిఖరాయమాణమైన పని యొకదానిని జేసెను. నాటకభవనము ముందు దొరగారి సిమెంటు విగ్రహ మొకదానిని వేయించెను. అది వందరూపాయ లయ్యెను. ఆ విగ్రహము క్రిందనున్న చతురస్రమైన స్తంభము మీఁద మన్నెసుల్తాన్ మొదలైన తురుష్కభాషా బిరుదులతో దొరగారి పేరు వ్రాయించెను. నాటకకళాపోషకుఁడని, కవిపోషకుఁడని వ్రాయించెను.

ఇంతపని జేయించుచు రంగనాథ మూరకయుండలేదు. విజయనగర సామ్రాజ్య పతన నాటకము ప్రతి నర్జునరావుదగ్గఱనుండి తెప్పించెను. తమ్ముని చేత మిగిలిన పది పాత్రల భాగములను వ్రాయించెను: రామరాయలు పాత్ర ఖాసిం ధరించవలయును. అది యర్జునరావుయొక్క యభిలాషయని చెప్పెను. అతఁ డుబ్బి తబ్బిబ్బు లయ్యెను. అందులోఁ దన కొక వేషము. బంట్రోతు వేషము తన తమ్ముఁడు. అసలు నాటకములో స్త్రీ పాత్రలులేవు. ఈ నాటకములో రెండు స్త్రీ పాత్రములు కలవు. ఒక స్త్రీపాత్రతోఁ బఠానునకు ప్రేమ వ్యాపారము కలిపించి తానే వ్రాసెను. ఆ పాత్రను లలిత ధరించును. రామరాయలకు, మఱియొక తురుష్క స్త్రీకిని గలిగిన సంతానము కదా పఠాను! పఠాను తల్లి వేషమును కల్పించెను. ఆ వేషమును గమల వేయును. కమల కొంచెము పొట్టిది. బొద్దయినపిల్ల. లలిత కాలిపొడుగుపిల్ల. అందులో శాస్త్రి యొక వేషము. మరి రెండు వేషములు తన యిద్దఱు భక్తులు. రంగనాథము తన భార్యనుగూడ వేషము వేయుమనెను. ఆమె ఛీ యనెను. అర్జునరావు లేకుండ ఖాసిము నింటి సావడిలో వీథి తలుపులు వేసి నాటక మభ్యాసము చేయుచుండిరి. ఇంతలో వేసంగి వచ్చెను. ఫిబ్రవరి పదియవ తారీఖున నాటకశాల తెఱువఁబడుననియు, నానాఁటి రాత్రికి విజయనగర సామ్రాజ్యపతనము నాటకము ప్రదర్శింపఁబడు

నవియు, ఖాసిము రంగనాథము లలితా కమలలు వీరందఱు పాత్రలు వహింతు రనియు, దొరగారి యాధ్యక్ష్యముక్రింద నిది జరుగుననియుఁ గరపత్రములు వేయించెను. గోడలకు కాగితము లంటింపించెను ఫిబ్రవరి యొకటవ తారీఖు నుండియే గ్రామములో బండిమీఁద టముకు త్రిప్పించుచుండెను. ఊరంతయు గగ్గోలయ్యెను. పదియవ తారీ కెప్పుడు వచ్చునా యని యెదురుచూచుచుండెను. మానవునియొక్క మన స్సట్టిది. హఠాత్సంభవమైన దానికుఱించి యది యెదో కొండమీఁది కోఁతియైనచో నివ్వఱపాటు భజించును గాని లేనిచో భజించదు. అల్పమైన విషయమైనను సరే, ప్రతీక్షాభావము కల్పించినచో దానిమీఁద జనము నకుఁ గోర్కె కలుగును. అది యాలస్యమైనకొలఁదిఁ గోర్కె పెరుగుచుండును. చివఱ కది లభించిన సమయమున నెట్టిదైనను రమ్యముగా నే కనిపించును. ఈ రహస్యము తెలిసినవాఁ డొక శిల్పి, అది యొక శిల్పము. ఆ శిల్పమునందు రంగనాథ మందె వేసిన చెయ్యి. ఎవనిలో నున్న ప్రతిభయైనను బయటకు వచ్చుటకు దేశకాలపాత్రములు సమకూడిరావలయును.

రంగనాథము దొరగారి దర్శనము చేసి రెండునెలలైనది. రేపు నాటక మునగాఁ బోయి దరిశనము చేయును. అంతవఱకుఁ జేయఁడు. ఐనను నెప్పటి కప్పుడు సర్వవార్తలు దొరగారికిఁ జేరుచునేయుండెను. "ఇంత డబ్బెచ్చట నుండి తెచ్చెనయ్యా" యని ఒకసారి దొరగారనిరి "మీరన్నచో నతనికి గల భక్తి యపార"మని యవధాని యొకసారి చెప్పగా దొరగారు నవ్వి యూఱకుండిరి. అదియంతయు దొరగారి మహానుగ్రహము లభించినదని యర్థము. ఎప్పటి వార్త లప్పుడు రంగనాథమునకుఁ జేరుచునేయుండెను. ఒకసారి దొరగారు "మన దగ్గ ఱకే రాఁడేమి" యనెనఁట. ఈ మాట విన్నప్పుడు రంగనాథము తనలోఁదాను నవ్వుకొనెను.

ఊరిలో రంగనాథము ప్రతిష్ఠ పెరిగిపోయెను. రంగనాథము గా రెంత చెప్పిన దొరగా రంత చేయుదురని, రంగనాథమునకుఁ జెప్పకుండ దొరగా రేపనియుఁ జేయఁడని, దొరగారికి రంగనాథము కుడిభుజమని, ఇన్నాళ్లకు దొర గారికి రంగనాథము మీద నిజమైన యభిమానము కలిగెనని, యితని తాతగారి వలనఁ బూర్వపు జమీందారుకు వృద్ధియయ్యెను; నేఁడు రంగనాథమువలనఁ గీర్తి ప్రతిష్ఠలు సమార్జించునని వేయివిధములుగాఁ జెప్పికొనఁజొచ్చిరి.

మఱియొక క్రొత్త విషయ మేమనఁగా, పదివఱకూరిలో నాటకము లాడు నప్పటి ప్రవేశము రుసుముల వెల వేఱు, నేఁటి వెలలు వేఱు. పూర్వపు నాటక ములలో మొదటివరుసల కుర్చీ రూపాయిన్నర, వెనుక రెండువరుసలు రూపాయి. ఆవెనుక బెంచీలు ముప్పావలా. నేలలో ముందటిసగ మూరణాలు, వెనుక సగము

తేడ. ఇప్పుడు ముందటి కుర్చీ లైదు రూపాయిలు. వెనుకటి రెండువరుసలు మూడు రూపాయలు. బెంచి రూపాయిన్నర. ముందటి నేల రూపాయి, వెనుకటి నేల యాఱణాలు. ఏనను జనము తహతహలాడిపోవుచుండిరి. "ఇవి యేమి, పూర్వపు టమ్మమ్మ నాటకములా, బేసెకు, పణాకుఁ జూచుటకు" అని జనులు సమాధానపడిరి. సమాధానమో పాడో. నాటక మెప్పుడు వేయుదు, రెప్పుడుపోయి చూతము. కొందరికి రంగనాధము గారు వేషము వేయుదురట, పోయిచూడవలయును. మఱికొందరికి లలితా కమలలను జూడవలయును. మఱికొందరికి 'ఖాసిము రాయలటరా. వాని దుంప తెగ! వాఁడు అచ్చముగా హిందువువలెనే యుండును. దర్జాయైనవాడులే. వాని రామరాయలు వేషము భేషుగానుండును చూతుము గదా."

ఈలోప రంగనాధ మూరక యుండలేదు. క్లబ్బును నాటకభవనములోనికి మార్చుటకుఁ గావలసిన ప్రయత్నము లన్నియు జేయుచుండెను. నాటకభవనమున కాపేరు పెట్టఁగా గ్లబ్బువారు నవ్వుకొనిరి. తమ క్లబ్బుపేరు రిజష్టరు చేసికొనలేదు. అందుచేత మన మేమి యనుటకు వీలులేదని కొందఱనిరి. ఒకనాఁడు రంగనాధము క్లబ్బునకుఁ బోయెను. అందఱును వందప్రశ్నలు కురిపించిరి. రంగనాధ మందఱను సద్దుమణఁగించి యిట్లు చెప్పెను. "అర్జునరావుగారు నాకు ప్రాణస్నేహితుఁడు. అతనియంత నటుఁ డీదేశములో లేఁడు. కడచిన వంద యేండ్లలోఁ బుట్టలేదు. మఱి రెండువందల యేండ్లకైనఁ బుట్టునో బుట్టడో తెలియదు. విద్యావంతుఁడు. సౌందర్యవంతుఁడు, గొప్పనటకుఁడు, సంగీతము పాడగలవాఁడు. ఇన్ని లక్షణము లెప్పుడు నొక్కతనిలో నుండవు. అతఁ డెంత వాఁడు కాకపోయినచో దొరగా రింత పని చేయుచున్నారు? నే నీ క్లబ్బులో సభ్యుఁడను కాకపోయినను మీలోఁ జాలమంది నాకు స్నేహితులు. పెద్దయుద్యోగస్థు లందఱు నిందులో నున్నారు. ఈయూరు పూర్వము పండితులు ప్రకాశించినయూరు. మా తాతగారినాడు సరస్వతీదేవి యీయూరిలో నాట్యము చేసినది. అప్పటి దొరగారు రెండు మూడు ప్రబంధముల నంకితము పుచ్చుకొనిరి. అట్టి సరస్వతీ నాట్యప్రదేశము నేఁడు విద్యావిహీనముగా నున్నది. ఈ యూరిలో జిల్లరమల్లర కవు లందఱను గల్పి యేఁబదిమందికిఁ దక్కువలేరు. ఇంతమందికిఁ గవితాభిలాష యెందుకున్నది యని యడిగినచోఁ బూర్వమిచ్చట కవితా సరస్వతి నాట్యముచేసినది కనుక నున్నది. నాటకములు, సంగీతపుఁగచేరీలు, నాట్యము, శతావధానము మొదలైన సర్వవిద్యలు నీ నాటక భవనములో నాదరించుటకు దొరగారు నిశ్చయించుకొనిరి. "వారు నాతో నొకదినమున నన్న మాట మీతోఁ జెప్పుచున్నాను. ఆ క్లబ్బువారు, పాప, మా గుడిసెలో నిబ్బంది

పడుచున్నారు. దాని కేదో యద్దెకూడ నిచ్చుచున్నట్లున్నారు. వారందఱు వచ్చి యీ చీట్లపేక మన నాటకశాలలోనే యాడుకొనవచ్చునుగదా" యని, అప్పుడు నాకీ యూహ తోఁచినది. ఇంగ్లీషులో నందుమే, సుఖము కలిగించు నాశ్చర్య మని,యది మీకుఁ గలిగించుటకు మీ సంఘముపేరు ముందటిదర్వాజా మీద వ్రాయించితిని. మీలోఁ గొంద ఱది వేఱుసంఘ మనుకొన్నారు. గ్రీకు పురాణములలో నొక కథ యున్నది. నార్సిసస్ అనునొక యందగాఁడు చెఱువులోఁ దన నీడ చూచి యింకెవరో యనుకొన్నాఁడట. ఫిబ్రవరి పది యవనాఁడు నాటకభవనము తెఱువఁబడును. ఆనాఁడే మీ రందులోఁ బ్రవేశింతురు. అక్కడ నెంతో విశాలముగా నుండును. ఇక్కడ టెన్నిసాడుటకుఁగూడ స్థలము లేదు. ఆ దొడ్డిలో టెన్నిసు కోర్టు వేయింతము. ప్రతిదినము సాయంకాలమున దొరగారు కూడ మన క్లబ్బునకు వచ్చుచుందురు." సభ్యులలోఁ జాలమంది ప్రశంసాకరాస్ఫాలనములను జేసిరి. తనకు ఖర్చు తగ్గ ననుకొనిరి. రంగనాథము గారెంత మంచివాడనిరి. గ్రీకుభాషావిషయములు,బహుపరభాషావిషయము లాయన కెన్ని తెలియుననిరి. చాలఁ జదివినవాఁడు - ఇప్పుడా దొరగా రాయనను గౌరవించుట పూర్వ మెప్పుడో చేయవలసిన దనిరి. రంగనాథము చేయవలసిన పనియంతయు బూర్వమే చేసి యిప్పుడీయుపన్యాస మిచ్చెను. ఆచేయవలసిన పని యేమనగా క్లబ్బుయొక్క యధ్యక్షుడు, కార్యదర్శి, కార్యనిర్వాహకసభ్యులు- వీ రందఱితో నదివరకే మాటాడుట. అధ్యక్షుఁ డాయూరిలోని పెద్ద యుద్యోగి, జిల్లా మునసబు, కార్యదర్శి యుద్యోగము లేనివాఁడు. అన్నోదకములకుఁ గలిగి క్లబ్బుపని నెత్తిన వేసికొని యీదెడివాఁడు. అతనికిని, రంగనాథమునకును మిక్కిలి నెయ్యము. అతఁడు రంగనాథమున కేదో చుట్టము కూడను. కార్యనిర్వాహకసభ్యు లైదుగురిలో ముగ్గురు తహసీలుదారు, మేజిష్ట్రేటు, పోలీసు సబిన్స్పెక్టరు. సామాన్యముగా నధికారులకు నధికారులయందు, ధనవంతుల యందును గౌరవము. బ్రిటిషువారు మన దేశములో రాజ్యము చేయుచున్నన్ని నాళ్లు సంఘము ద్విధా విభక్తమైయుండెను. ఉద్యోగస్థు లందఱు నొక గుంపు వారు. సామాన్యులతో మాటాడరు. వారి మనస్సునకు సంస్కార మనునది యుండెడిది కాదు. ఉద్యోగము చేయుట, డబ్బు సంపాదించుట, పరులు వచ్చినచో బిగించికొని యుండుట. వారితోఁ గలసి తిరిగినచోఁ దమ మరియాద పోవు ననుకొనుట. ఇట్లుండుటకుఁగారణము చెప్పుదురు. సామాన్యులతోఁ గలసి తిరిగినచో వారికి మొగమాటము లెక్కువయగును. వారి యుద్యోగధర్మములు నిర్వహించుటకు వీలుండదని. ఎక్కువ జీతము తెచ్చు నుద్యోగస్థుఁ డన్నచో గౌరవము.

జమీందారన్నచో గౌరవము. మహాధనవంతుఁ డన్నచో గౌరవము. అందుచేత నధ్యక్షు, కార్యనిర్వాహకు లందఱు పూర్వమే రంగనాథము వేసిన పథకమున కంగీకరించిరి. వారి యంగీకార మున్నదని తక్కినవారి కంతకు ముందే తెలియును. ఒక రిద్దఱు వలదన్నను ప్రయోజనము లేదు. అందులో నొకఁడు చాకు వంటివాఁడు కలఁడు. అతఁడు వారందఱిలోఁ జాల మంచివాఁడు. అతని హృదయము మంచిది. కాని యతఁడు మాటాడుచున్నచో నెక్కిరించినట్లే యుండును. అంతియే కాదు. అతఁ డెప్పుడును నెక్కిరించుచునే యుండును. అతఁడు నింగ్లీషు బాగుగనే చదివినాఁడు. అతఁ డింకొక సభ్యునితో నిట్లనెను. "ఒరేయి! రంగనాథము చెప్పిన కథ బాగుగా నున్నదిరా. అనార్సిససు కథ యెంత యుచితముగా నున్నది! రంగనాథము కవి కాదటరా, యందులో డ్రామటిక్ ఐరనీ పెట్టినాఁడు. అనఁగా భవిష్యత్తులో జరుగఁబోవునది చెప్పినాఁడు. ఆ మాటలలోని యర్థము నాటకములో నితర పాత్రధారులకుఁ దెలియదు. నాటకము చూచెడివారికిఁ దెలియును. అనార్సిసను తన యంత యందగాఁడు లేఁడని దురహంకారము చేత నెవరి సౌందర్యమును మెచ్చుకొనెడివాఁడు కాదు. ఏ స్త్రీయొక్క సౌందర్యమును వానికి నచ్చలేదు. చివరకుఁ దన నీడ తానే చూచికొని మోహించి నదిలోఁ బడి చనిపోయినాడు. మన క్లబ్బేమి కాఁబోవుచున్నదో యీకథతో రంగనాథము విస్పష్టముగాఁ జెప్పినాఁ"డనెను. ఆరెండవ వాఁడు నవ్వెను. ఎందుకు నవ్వెనో తెలియదు. ఎందుకుఁ దెలియదు? వాఁడు లోకములో నున్న యొక మనుష్యుఁడు కనుక నవ్వెను. అనఁగా లోకములోని మనుష్యులు తమ యాపద చూచికొనరు. విచారణ లేనివారు. అవతలివాని యల్పమైన, కృతకమైన వివేకమును మెచ్చుకొందురు. అది తరువాతఁ దన నెత్తి మీఁదికి వచ్చినను సరే. ఇది మానవ స్వభావము. కనుక వాఁడు నవ్వెను.

రేపు నాటక మనఁగా నర్జునరావు వచ్చెను. రంగనాథము పూర్వమునకు వలెఁ దక్కిన పాత్రధారుల నందఱను దీసికొని రావలదని చెప్పెను. ఆనాఁడు నాటక మున్నది యని కూడ వ్రాయలేదు. ఊరకయే రమ్మని వ్రాసెను. అర్జునరావు వచ్చి యీనాటకశాలను జూచి యచ్చెరువుపడెను. అక్కడనుండి యిద్దరు కోటకు వెళ్లిరి. అర్జునరావు దొరగారితో వారి నాటక కళాభిమానమును గూర్చి మిక్కిలి పొగడెను. తాను నెలనాళ్లలోఁ దన కుటుంబమును దెత్తుననెను. దొరగారి కిదంతయు నాశ్చర్యముగా నుండెను. ఆశ్చర్యమో, సంతోషమో యెవరికి దెలియును? ఈసారి యవధాని లేకుండగనే రంగనాథము రాజదర్శనము చేసెను. రంగనాథము దొరగారితో నిట్లనెను. "రేపు ప్రొద్దున నెనిమిది గంటలకు నాటక భవనములో సరస్వతీ పూజ తమరే చేయవలయును. కోటనుండి సన్నాయి

మేళముతో నాటక భవనమునకును వెళ్లుదము. సరస్వతీ పూజ యైన తరువాత నర్జునరావుగారి యుపన్యాస ముండును. రాత్రికి నాటకము. రేపు ప్రొద్దున నే తమరిని దీసికొని వెళ్లుటకు మేము వత్తు"మనెను. రాజుగారు సరే యనిరి. రంగనాథము గాని, యర్జునరావుగాని దొరగారి నోటి వెంట వినిన దదే యొక్క మాట.

ఆ యూరిలో నొకమంగలి దొరగారి ప్రాపకముతో దక్షిణాదికి బోయి సన్నాయి నేర్చికొని వచ్చెను. అతఁ డా ప్రాంతములందు గొప్ప సన్నాయి పాటకాఁడుగా ప్రసిద్ధిపొందెను. అతని మేళముతో నూరేగింపు సాగెను దొరగారనిమిదిగంటలకు బయటికి వచ్చిరి. అంతఃపురములోనుండి బయటకు వచ్చునప్పటికి దొరగారి వేషము పవిత్రముగాఁ గనిపించెను. ఆయన పెద్ద పట్టుతాపితా కట్టికొనెను. మెడలోఁ జంద్రహారము వేసికొనెను రెండు చేతులకు సింహతలాటపు మురుగులు పెట్టికొనెను. పట్టుత్తరీయమును మెడలో వేసికొనెను. మఱియు నొండు రెండాభరణములు వేసికొనెను ఆయాభరణములు పట్టాభిషేకము నాఁడు వేసికోఁదగినవి. దొరగారు వచ్చి బండిలోఁ గూర్చుండిరి. అర్జునరావును, నవధానియు దొరగారి కెదురుగాఁ గూర్చుండిరి. రంగనాథమును గూర్చుండుమని బలవంతము చేసిరి కాని రంగనాథము కూర్చుండలేదు. ఊరేగింపు సాగెను. ఆయూరేగింపు రంగనాథమువాకిటముందుగాఁ బోవలయును. గుఱ్ఱపుబగ్గీ రంగనాథమునింటిముం దాగెను. లోనుండి లలిత వెండిపళ్లెములో నారతికప్పురము, రెండు పూలదండలు తీసికొనివచ్చి దొరగారి మెడలో నొకటి, యర్జునరావు మెడలో నొకటి వేసి, కప్పురము వెలిగించి, యారతి యిచ్చెను. ఊరేగింపు కొంత చుట్టయినను క్లబ్బుయొక్క కార్యదర్శి యింటిముందుగా వెళ్లెను. అచ్చటను పూలదండలును, హారతియు జరిగెను. ఖాసిముయొక్క యింటి ముందుగా వెళ్లెను. అచ్చట నివి జరిగెను. శాస్త్రియింటి ముందుగా వెళ్లెను. తక్కిన యిద్దఱు భక్తుల యిండ్లముందుగా వెళ్లెను. ఈ ప్రతిస్థలమునందుఁ బూలదండలు వేయఁబడి హారతు లీయఁబడినవి. ఇన్నిచోట్ల జరిగినదన్న గుర్తులేదు. అన్నియుఁ గలిపి యారుచోట్లనే. కాని యూరందఱు పూలదండలు వేసినట్లే యనిపించెను. నాటకభవనముకడఁ గోటలోని యిద్దఱు పరిచారికలు వచ్చి పాటలు పాడి యెఱ్ఱనీళ్ళు ఆరతియిచ్చిరి. లోపల వేదపఠనము, సరస్వతీ పూజయు జరిగెను. ఆయూరిలోఁ గళావంతుల యిండ్లు పదిపదేను కలవు. వారిలో భరతనాట్యము నేర్చికొను పిల్లలు కలరు. వారిచేత భరతనాట్యము చేయఁబడెను. తరువాత నుపన్యాస ముండెను. అర్జునరావు గంటన్నరసేపు మాటాడెను. తన నాట్యాభినయమునుగూర్చి కొంత, తన యనుభవములు కొన్ని

పెద్ద యుపన్యాసము చేసెను. అతఁడు మంచి వక్త. సభనంతయు మిక్కిలి నవ్వించెను. ఆంగ్లేయభాషలో నభినయమునుగూర్చి వ్రాయఁబడిన బహువిషయములు చెప్పెను. ఉపన్యాసము పూర్తియగునప్పటికి సామాజికులకు నరుసరావనఁగా మహానటుఁడు, మహావిద్యావంతుఁడన్న యభిప్రాయ మేర్పడెను. అతఁడుపన్యాసాంతమున "నేను మొన్న మీయూరిలో సామాన్యముగా నటించితిని నేఁడు నా నేర్పంతయుఁ జూపుదు" ననెను. దానితో సభలో రాత్రికి నాటకము చూడవలెనన్న తహతహ యిబ్బడియు ముబ్బడియు నయ్యెను. సభ పూర్తియగువేళకుఁ బండ్రెండు గంటలు దాఁటెను. నాటకము రాత్రి తొమ్మిది గంటలకు పాత్రధారులందఱు నాలుగంటలకే నాటకభవనము కేగిరి. ఎనిమిది మొదలు ప్రేక్షకులు రానారంభించిరి. ఇదివఱ కా భవనము ప్రేక్షకులు కూర్చుండు స్థలమున కిరువైపుల దడికలు కట్టఁబడియుండెడివి. ఇప్పుడు గోడలు సున్నము చేయఁబడియుండెను. లోపల విద్యుద్దీపములు. రంగభూమిని జూచినచో స్వర్గలోకమువలె నుండెను. ముందు వాల్చిన తెరమీద వీణవాయించుచున్న సరస్వతి. సరస్వతీదేవికిఁ గిరీటమునను, నామెయంచులను, నామె కూర్చున్న పీఠమునను రత్నములవలె ధగధగలాడుచుండెను. ప్రక్కనున్న సెమలిపురి యింద్రనీలమణులతో, గోమేధికములతోఁ జేసినట్లుండెను. పైకప్పున విద్యుచ్చామరము లుండెను. రంగభూమి ముందుగా బూర్వము చిమ్నీలవరస యుండెడిది. ఇప్పుడు విద్యుద్దీపములు వరుసగా వెల్గుచుండెను. నేలమీఁద బూర్వము తాటాకుల, యీతాకుల చాప లుండెడివి. ఇప్పుడు తివాసీలు పఱవఁబడియుండెను. అది జమీందారీగ్రామ మగుటవలన ననాదినుండియుఁ దివాసీలు నేయువా రుండిరి. తివాసీలు వందరకములు. ఆయూరిలో చాలపాలు రకముల నేయుదురు. రంగనాధము కుత్తిగా నూటయేబదిరూకలకుఁ దివాసీలు నేయించెను కుర్చీలన్నింటిమీఁద మెత్తలు వేయించెను. కొబ్బరిపీచు లోపలఁ బెట్టి పైన గోనెలు కుట్టించినవి. ప్రతిమెత్తపైన చీటిగుడ్డల తొడుగు లుండెను. ఆ గుడ్డ గజము అణాకానీ, అణన్నర. క్రొత్తగుడ్డ లగుటవలన విద్యుద్దీపముల వెలుగులో నవి ధగధగలాడిపోవుచుండెను. బెంచీలకు రంగువేయించెను. ఎవ్వరికిని కుర్చీలును, బెంచీలును ప్రాఁతవే యనిపించలేదు. పూర్వముకంటె పెడమెడముగా వేయించి కనుల కింపుగొలుపుచుండెను.

భవనము కిటకిటలాడిపోవుచుండెను. అపుడు దొరగారు, నవధానియు వచ్చిరి. సభయంతయుఁ గరతాళధ్వనులు మ్రోసెను. పెద యుద్యోగస్థులందఱు వచ్చిరి. సభ కల్పవృక్షమువలె నుండెను. సంగీత మారంభింపబడెను. ఈహార్మనీ చాల పెద్దది. ధ్వని జొంయుమని పోసికొనుచుండెను. ధ్వనితో సభాభవన

మంతయు నిండిపోవుచుండెను. చెవుల కది యొక క్రొత్తగా వినిపించెను. వాసంతియు, శిరీషుడును వచ్చి వెనుకకుర్చీలలోఁ గూర్చుండిరి. రంగనాథము వారికి సుచిత్రప్రవేశపత్రములు పంపించెను. వెళ్ళవద్దని వాసంతి, తప్పేమున్నది వెళ్లుదమని తండ్రి. అంతయుఁ క్రొత్తగాఁ జేసిరఁట, యెట్లుండెనో చూడవలయునన్న కోరిక వాసంతి మనస్సులో నున్నది. చివఱ కదియే గెలిచెను. ఉమాపతి ముందు నేలపై వచ్చి కూర్చుండెను. అచట నెవరో యొకరిద్దఱు స్నేహితులు "మీరిచటఁ గూర్చున్నారేమండీ" అతఁడూరకే శిరఃకంపము చేసెను. వాసంతికి నాటకభవనమంతయుఁ గనులు మిఱుమిట్లుగొలిపెను. దొరగారు పాతికవేలు వ్యయము పెట్టియుందురు. లేకపోయినచో దీని కింత శోభవచ్చునా యనుకొనెను. తండ్రితో ననెను. అతఁడు సంగీకరించెను. నాటకము ప్రారంభింపకముందు వేషము వేసికొన్న యర్జునరావు ముందటి తెర ముందునకు వచ్చి కొంత యుపన్యాసము చేసెను. "దొరగారి నాటకకళాభిమానమువలన నేను నేఁడిచట నుంటిని. నే నింక నీయూరిలోన నే యుండిపోదును. మే మింక క్రొత్త నాటకము లాడుదుము. నెలకు నాల్గు నాటకము లాడుదుము. ఈ యూరిలోని ప్రజలందఱు విద్యావంతులు, పండితులు. మమ్మాదరింపవలయును. నాటకాభినయము పూర్వకాలమున వృద్ధిపొందలేదు. సరియైన తెరలు లేకుండ, సరియైన సామగ్రి లేకుండ నాటకములాడినచో రక్తికట్టవు. ఇంగ్లండులో నట్లుండు, నిట్లుండును" అని రంగప్రసాధన విషయములు కొన్ని చెప్పెను. జనము దిగ్భ్రాంతమయ్యెను.

నాటక మారంభింపఁబడెను. మొదటనే వదులులాగూతో, బొంత చొక్కాతో, బొట్టెలినుచుఁ, గాబూలువానివలెఁ దలపాగా ధరించి యర్జునరావు ప్రవేశించెను. ఆ వెనుకసారి వేష మిట్లు వేయలేదు. పట్టిలాగును, పట్టి చొక్కాయు దొడిగికొని నెత్తిమీఁద టుర్కీటోపీ పెట్టికొని వచ్చెను. ఈసారి వేషమునకు సభాభవనమంతయుఁ జప్పట్లతో మాఱుమ్రోగిపోయెను. ఉమాపతి ప్రక్కవానితో "నది పఠానువేషమా, కాబూలువాని వేషమా" యనెను. పఠానువాఁ డెట్లుండునో, కాబూలు వాఁడెట్లుండునో సభలో నెవ్వరికిని దెలియలేదు. తమకుఁ బరిచితముకానిది, యూహకు దగ్గఱగా నుండునది, యూహకందునది యైన యేక్రొత్త చూచినను జనము మోహపడుదురు. వెనుకటి కొకఁడు పందివలెఁ గూయుదునని వచ్చెనఁట. ఆవాఁడు కూసెను. సభికులందఱు సంతోషించిరి. మఱువాఁ "డంతకంటె బాగుగఁ గూయుదును ర"మ్మనెను. వారు వచ్చిరి. అతఁడొక పందిపిల్లను దెచ్చి గుడ్డతోఁ గప్పి దానిని దాఁచి దానిని నూదిపెట్టి పొడిచెనఁట. అది కీచుకీచు మనెను. కాని జనము నిన్నకూసినదే బాగున్న

నన్నారట. నిజమైన పందికూతకంటెఁ అబద్ధమైన పందికూతయే జనమునకు నచ్చునన్నమాట. యాథార్థ్యము కంటె కృతకవిషయములను జను లెక్కువ మెచ్చుకొందురు. అచ్చముగ నది కాఁగూడదు, దానివలె నది యున్నట్లుండవలయును. నిజమునకు నాటక మట్టిదియే కదా. అర్జునరావు రంగముమీఁద కొన్ని చమత్కారములు చేసెను. స్వగతములు ప్రక్కకుఁ దిరిగి చెప్పును. వెనుకకుఁ దిరిగి చెప్పును. అదియొక మహావివేకవిషయముగా జనులకు భాసించెను. ఉమాపతి ప్రక్కవానితో ననెను. "వేషధారి తనపృష్ఠదేశ మెప్పుడును సామాజికుల వైపు త్రిప్పరాదు" అని.

అర్జునరావు దగ్గఱ మఱియొక విశేష మున్నది. అతని కనులు పెద్దకనులు. వానిని ఱెప్పవాల్పకుండ నత డట్లే నిమేష కాల ముంచగలఁడు. ఆలోచనయు, బీభత్సము, ప్రేమయు మొదలైన పదునొకండు భావములకు నతఁడు చేసెడు నభినయ మదియే. అది సామాజికులకు మిక్కిలి గొప్ప యనిపించెను.

నాల్గవరంగములో లలితయు, నర్జునరావును ప్రవేశించిరి. లలిత హిందువుల పిల్ల. అర్జునరావు ముసల్మాను. వారి యిద్దఱి ప్రేమయు సభ మిక్కిలి ప్రశంసించెను. లలితయొక్క స్త్రీ వేషమే జనమునకు దినదినము గ్రామములో జూచు స్వర్గము వైకుంఠ మైనట్లుండెను. ఆ సమాగమమున హిందూ ముసల్మానుల సమైక్యము సామాజికులకు భాసించెను. నాయకుఁడు హిందువు, నాయిక ముసల్మాను స్త్రీయు వారి యదృష్టవశమునఁ గాలేదు.

మఱియు నాటకము జరిగెను.- రామరాయలు వచ్చెను. సభయంతయు నీలలు, చప్పట్లు. ఖాసిం చమత్కారమైన మనిషి. అతని యూరిలో స్నేహితుఁడు కానివాఁడు లేఁడు. అందఱితో నవ్వులాడును. అందఱు నతనితోఁ బరాచికము లాడుదురు. పసిబిడ్డ బాలాది వాని నెఱుగుదురు. అతడొక నవ్వుల ప్రోవు. ఎఱుఁగనివారికిఁగూడ వాని నెఱిఁగినట్లేయనిపించును. రంగముమీఁద నుండగా నతనికే నవ్వువచ్చును. అతఁడు నవ్వినప్పుడెల్ల సభలోఁ బెద్ద సందడి. రంగనాథము వేషము వచ్చెను. ఆతఁడు లోపల రాజునకు వ్యతిరేకముగ పఠానులకు సాహాయ్యము చేసిన మంత్రి. ఆ మాయయంతయు నతని మొగములో భాసించెను. అతని మొగములో నంత మాయ యున్నదని తత్పూర్వము పాతికముప్పదియేండ్లాయూరివారికిఁ దెలియదు. ఆ వేషమున కతఁడు సరిపోయెను. ఇది చాల చిత్రమైన విషయము. మనుష్యుఁడు నలుబది యేఁబదియేండ్లు బ్రదికియుండును. వాని హృదయములోని ప్రధానభావములు వాని మొగములో జనము చూడలేరు. ఆ గుణ మనుగుణమైన వేష మొక నాటకములో వేసినపుడు వాని వేషమంత యొప్పియుండుటయే యా మొగము వెనుక వాని హృదయములో గాఢమైన

యీ భావ మున్నదని తెలిసికొనఁబడును. కాని సామాజికులు వాఁ డాపాత్రను మిక్కిలి చక్కఁగా నభినయించె ననుకొందురు. ఉమాపతికి నాశ్చర్యమైనది. ఇదియా యితని స్వరూపము. ఇతని మొగము ప్రసన్నముగా నుండెడిది. నేను గ్రహించలేకపోయితిని. ఇప్పటికది యీ వేషముతో నాకు దెలిసినది. అతని మెడ వంచుట, యతనినవ్వు, నతఁడు ప్రక్కగాఁజూచుట ఇవియన్నియు దైనందినము గాఁజూచెడివే. అవి యతనికి విలక్షణములుగా భాసించెను. వాని వెనుక నీరీతిగా స్వామిద్రోహము సేయుటయు, స్వార్థము సాధించుకొనుటయు నున్న వని యిదివఱకుఁ దెలియలేదు. అతనికి సహజమైన విలక్షణాంశములు నిటి పాత్ర ధారణము చేసినపుడు భావస్ఫోరకములైనచో నట్టి యప్పుడు విలక్షణతగా భాసించునేకాని వాని యాత్మద్రవ్య మట్టిదని తెలిసికొనలేము. ఇప్పుడైన నభినయించుచున్నట్లు కనిపించుచుండెను. అతని కభినయము తెలియదు. సహజముగా మాటాడినట్లే మాటాడుచుండెను. సహజముగా నవ్వినట్లే నవ్వుచుండెను. సహజముగా నడచినట్లే నడచుచుండెను. కాని యీ విషయములన్నియు స్వార్థపరుఁడై స్వామిద్రోహము చేయుచున్న యీ మంత్రియొక్క కుత్సిత ప్రకృతిస్ఫోరకములుగా నుండెను అతని సహజలక్షణము లాపాత్రకంత యనుకూలించినపుడు వాని యాత్మద్రవ్యము ప్రధానముగాఁ దల్లక్షణములు కల దన్నమాట." ఇది యంతయు నుమాపతి యూహ.

చివఱకుఁ బఠాను రామరాయలను జంపెను. చంపిన తరువాత వాని తల్లి వచ్చి యతఁడు నీ తండ్రి యని చెప్పెను. ఆ తల్లి వేషము వేసినది కమల. కమల ప్రవేశించినంతనే జనము చప్పట్లు చఱచిరి. కాని యర్జునరావు సభవంక కనులుఱిమి చూచెను. సభ నిశ్శబ్దమయ్యెను. ఉమాపతి యనుకొనెను. "ఇంక నితఁడీ గ్రామమును పాలించును," అని. తండ్రి యని తెలిసిన తరువాత నర్జునరావు రాజుయొక్క నెత్తురును మొగమునకుఁ బూసికొనెను. తలమీది జుట్టంతయుఁ జేతులతోఁ జీకిరిబాకిరి చేసికొనెను. తన తలను దీసికొనిపోయి ప్రక్కగాయి యుండగా దానిమీఁద వేసి కొట్టుకొనెను. చివరి కొక పెద్ద వికారపు కేక పెట్టెను. ఆ కేకతో విరుచుకొని పడెను. ఇంక సభలోని కరతాళధ్వనులకు లెక్కలేదు. అందఱు కరతాళధ్వనులు చేయుచుండఁగా నుమాపతి నవ్వుకొనుచుఁ గూర్చుండెను. అతఁడు "అయ్యో! దేశము" అనుకొనెను. "ఇది యేమి యభినయము" అనుకొనెను. దానితో నాటకమైపోయెను. ముందు తెఱ దింపఁబడెను. అర్జునరావు పిచ్చి వేషముతోడనే తెరముందుకు వచ్చి "నేను మీ యందఱకుఁ గృతజ్ఞుఁడను. ఇదివఱకే దొరగారికి ఋణపడి యున్నాను. ఇంక మిగిలిన నాజీవితమంతయు వారియుప్పు తినుచు వారి చరణ

సన్నిధానమునందే యుండుదు. మీ రందఱు నా సోదరులు. నేను మీ సోదరుడను. నిజముగా నేను నటకుఁడను కాను. (సభలో నుండి "మీరే నటకులు. మఱింకొకఁడు సృష్టిలో లేఁడు") నాయందు మీకంత దయ యున్న దన్న మాట. నేను మీబిడ్డను. మీరు నన్ను పోషించవలయును. నే నీయూరికి దత్తత వచ్చితిని. (అందఱును జప్పటలు కొట్టిరి) నేను మీ యాజ్ఞాబద్ధుఁడను. మీ రేవేషము వేయుమన్న నావేషము వేయుదును. నేను చాల సులభుఁడను. అందఱు నాదగ్గఱకు రావచ్చును. పదియేండ్ల పిల్లవాఁడైనను వచ్చి యన్నా, యర్జునరావా, పులి లేకుండఁ బులి పులి యని యఱచిన గొల్లపిల్లవాని వేషమువేసి నా కొడిపెట్టుమని యడిగినచో నే వాడెదను. బాలురయొక్క కోరికలు తీర్చుటయే నా ప్రథమ కర్తవ్యము. నటకుడయినవాఁ డేవేషమైన వేయవలసినదే. పెద్దవేషము లేదు, చిన్న వేషము లేదు. నేను బంట్రోతు వేషమైనను వేసెదను. అస లది వేయుటయే కష్టము. మీయందఱకు నమస్కారములు" అని దొరగారికి వంగి నమస్కరించి వెడలిపోయెను. నాటకమైపోయినది. సభలో నెవ్వరును లేచి పోరు. సభలోఁ బలుమాటలు చెలరేగెను. నటకుఁడనఁగా నట్లుండవలెను. అంత వినయ ముండవలయును. బంట్రోతువేషమైన వేయవలయును. అంత దయావంతుఁడు కావలయును" మొదలయిన యర్జున ప్రశంసావాక్యములతో సభ రణగొణ ధ్వనిగా నుండెను. "అవధానిగారు మాట్లాడవలయును. రంగనాథముగారు మాట్లాడవలయును." అని సభలోనుండి కేకలు. అప్పు డవధానికి, రంగనాథమునకు మాటాడక తప్పలేదు. వారిద్దఱు చెఱియొక యరగంట మాటాడిరి. అంతయు దొరగారి ప్రశంసయు, నర్జునరావుగారి ప్రశంసయు. రంగనాథ మవధానిని మెచ్చుకొనెను. "వారు పెద్దవారు. ఇది యంతయు వారి యాశీర్వచనము" అని రంగనాథము. "రంగనాథము మహాసమర్థుఁడు. కార్యదక్షుఁడు. అతఁడు లేనిచో దొరగారి కీపని సాధ్యపడెడిది కాదు" అని యవధాని.

మఱునాఁడే క్లబ్బు నాటకభవనమునఁ బ్రవేశించెను. ఆప్రవేశోత్సవము జరిపిరి. అర్జునరావు ప్రధానవక్త. అతఁడు సభ నాజ్ఞాపించఁగలఁడు, నవ్వించఁగలఁడు. అతఁ డాయూరికి రాజని యాసభలోఁ దేలిపోయెను.

ఇంత మహోత్సవము పట్టణములో జరుగుచుండఁగా సారథియొక్క యూసెత్తినవాఁడు లేఁడు. పేరెత్తినవాఁడు లేఁడు. అతఁడు తన తోటలో, ద్రవ్వుకొనుచుండెను. రెన్నాళ్లకొకసారి విశాలాక్షిబసలో భోజనము చేయుచుండెను. సముద్రతీరమునకుఁ బోయి తిరిగివచ్చుచుండెను. ఆనాఁ డుమాపతి చెప్పిన మాటలను ధ్యానించుచుండెను. ఇంద్రియముల కంటని యంతఃకరణమున కంటిన యానంద మనుభవించుటకు సాధ్యపడునా యని విచారణ చేయుచుం

డెను. సముద్రపుటొడ్డునఁ గూర్చుండి దాని నభ్యాసము చేయుచుండెను. అతని కొకఁడు తోఁచెను-ఇది నాట్యవేళ ననుభవములోనికి రావలయు నని.

౧౧

సారథికిఁ గోరిక యోగాభ్యాసముమీఁద. అతని మనస్సునకు నిశ్చలత్వము లేనేలేదు. అతని యూహాపరంపరకుఁ దుదిమొదళ్లు లేనేలేవు. అతఁడు మేల్కొనియున్నంతవఱకు నతని మనస్సు కోడెత్రాఁచువలె నుండును. ఆమనస్సు యొక్క భారము పట్టుకొనలేకయే యతఁడు సముద్రమువెంటఁబడి తిరుగుచుండును. తోఁట త్రవ్వుచుండును. ఏదియో పనిచేయకుండ నిముసమైన నుండలేడు. అంత యుత్సవము పట్టణములో జరుగఁగా నతనికిఁ దెలియనే తెలియదు. అతనిది వేఱే ప్రపంచకము. ఎవ్వరును వచ్చి యిట్లు జరిగినదని చెప్పలేదు. పెలనాళ్లుపైన నైనది, వాసంతియు రాలేదు. వాసంతికూడఁ దనకు వేసము కలయప్పుడు వాని తోటకు వెళ్లుచుండును గాని వట్టియపుడు పోవుట కామె కల వాటు లేదు.

అతని కుండియుండి యేదో నాటకము వేయవలయు ననిపించును. ఒక నాఁడు సముద్రతీరమువెంట నడచుచుండఁగా నతని కొక విచిత్రపు టూహ కలిగెను. సముద్రములో నాగకన్యక లుందురు. వారు పూర్వము రాజకుమారులను వచ్చి ప్రేమించెడివారఁట. తానొక రాజకుమారుఁడు. సముద్రములో నుండి యొక నాగకన్యక వచ్చి తన్ను ప్రేమించెను. తన్ను సముద్రములోనికిఁ దీసికొనిపోయెను. అచట నొక పెద్దరాజభవన ముండెను. తన్నాకన్య రహస్యముగా నంతఃపురమున దాఁచెను. ఆమె గర్భవతి యయ్యెను. అంతఃపుర రహస్యము వెలికిఁ బొక్కెను. మహాసర్పరాజు లతనిని వధించుటకు వచ్చిరి. తాను గరుత్మదుపాసకుఁడు. ఆ సర్పరాజుల నందఱను గెలిచి యానాగకన్యకను భూలోకమునకుఁ దెచ్చెను. ఇట్టి యూహ లతనికి వచ్చుచునేయుండును. చిన్నప్పుడు కాశీమజిలీలు చదివిన సంస్కారము. అరబ్బుదేశరాత్రికథలు చదివిన సంస్కారము. అంతటి మమకారము లేనివానికి, నేది యెట్లయినను సరే యనుకొనెడువానికి నీయూహ లేమిటి యని తానే యనుకొనెను. కాని దానికి సమాధానము చెప్పికొనెను. జీవుఁడు సర్వకామములను గోసివేయవచ్చును గాని స్త్రీకామమును జయించలేఁడు. ఒకప్పుడు నారదుఁడు వైకుంఠమునకుఁ బోయెను. పరాయి పెద్దమనిసి వచ్చినాఁడని లక్ష్మీదేవి తెరవెనుకకుఁ బోయెనఁట. అతఁడు వచ్చినపుడు లక్ష్మీనారాయణు లేకపీఠస్థులైయుండిరి. నారదున కనుమానము కలిగి, భగవంతు నడిగెనఁట: "స్వామీ! నేను నిత్యబ్రహ్మచారిని. ఇం

ద్రియముల గెలిచినవాఁడను. నేనువచ్చినప్పుడుకూడ భగవతి తోలఁగవలయునా యవి. భగవంతుఁడు నవ్వి, యతని నొక చెఱువువద్దకుఁ దీసికొనిపోయి మునుఁగ నిడుమనెను. మునిఁగినది నారదుఁడు, లేచినది యొక యందకత్తెయైన స్త్రీ. ఇంతలో నారాయణుఁ డంతర్ధానము చేసెను. ఆ స్త్రీ యడవులవెంటఁ దిరుగు చుండఁగా నొకరాజు వేటకువచ్చి యామెను మోహించెను. ఆమె యఱువది మంది కొడుకులను గనెను. వారి పేరులే ప్రభవ విభవ శుక్లాది సంవత్సరనామ ములు. తరువాత నేదియో యయ్యెను. కాని లింగసంబంధమైన వాంఛ యటు వంటిది. దేవర్షియైన నారదునకే యీమూలభూతమైన లింగసంబంధమైన వాంఛ పోలేదని దీని తాత్పర్యము. సారధి మఱియు నిట్లనుకొనెను. "మాయాపిహిత మైన పరమాత్మ జీవాత్మ యగుచున్నది. మాయయొక్క ప్రథమ స్వరూపము స్త్రీ. అందుకనియే పురుషుఁడు, ప్రకృతియు నన్నారు. ఈ యిద్దఱు కలిసినపుడే. జీవుఁడు జీవలక్షణ మున్నంతసేపు లింగసంబంధవాంఛ యున్నదన్నమాట. లింగ సంబంధ వాంఛాసహితమైన చైతన్యమే జీవుఁడు" మఱల వెంటనే యిట్లను కొనెను. "అట్టి నాటకము వేయఁగూడదు. మఱి యేమి నాటకము వేయవల యును? ఉషాకన్యాపరిణయము వేసినచో నెట్లుండునో. తాను బాణాసురుఁడు. శ్రీకృష్ణదేవునిచేత బాణుని యహంకారము నిర్మూలింపబడినది. అహంకారము చచ్చినఁగాని జీవుఁడు ముక్తుఁడు కాఁడు. తన లింగసంబంధమైన వాంఛ చావ వలయునుకాని తన యహంకారము నమసిపోయినంతట నేమి ప్రయోజనము? రుక్మాంగదలో లింగసంబంధవాంఛ చచ్చిపోలేదా? చచ్చిపోలేదు. అతని కేకాదశీవ్రత బుద్ధియేకాని భార్యాపుత్రు లుండనే యుండిరికదా. తనకు భార్యాపుత్రులు లేరు. శుకరంభాసంవాదము నాటక మాడినచో నెట్లుండును? శుకుఁడు స్వచ్ఛమైన బ్రహ్మచైతన్యము. ఆయనకు స్త్రీవాంఛయు లేదు. అది కోసికొనుటయు లేదు. స్త్రీవాంఛ యుండి దానిని గెలిచిన నాటకమును వెదుక వలయును. అతఁ డెంత వెదికినను బురాణములలో నట్టి కథ యతని మనస్సునకు స్ఫురించలేదు. కథ యెట్లున్నను వాని సంస్కారబలమువలనఁ గ్రొత్తనాటక మొకటి యాడవలయు నన్న వాంఛ కథకంటెఁ బ్రాముఖ్యము వహించెను. కాని యతని మనస్సు తద్వాంఛతో బెనగులాడ నారంభించెను. అట్టి కథ దొరికినచో యాడుదు ననెను. తరువాత నతఁడు విరూపుఁడై సముద్రతీరమువెంటఁ బోఁజొచ్చెను. అది మధ్యాహ్నము రెండుజాములు. పైనుండి యెండ మాడ్చు చుండెను. సముద్రము మీఁదిగాలి నిస్తబ్దముగా నుండెను. కటిపర్యంతము చల్లగా నున్నను శరీరోర్ధ్వభాగము సూర్యాతపబాధ పొందుచునే యుండును. అట్లే నడచిపోవుచుండెను. కొంతసేపు సముద్రములో

డిగి కిరటపునీళ్లచే దుస్తులు తడుపుకొనుచుండును. తడిసినవని దూరముగా వచ్చుచుండును. కుమారసంభవనాటక మాడినచో? తరువాత శివుడు పార్వతిని పెండ్లాడెను. ఆ భాగము వదలిపెట్టవచ్చును. నాటకముపేరు కామదహనము. శివుఁడు పూర్వము సంసారి. దాక్షాయణీభర్త. తరువాతఁ దపస్సుచేయుచుండెను. మన్మథునిఁ దగులఁబెట్టె ననఁగా దనకుఁ గలిగిన స్త్రీవాంఛను దొలగఁద్రోసె నన్నమాటయేకదా. ఇది బాగుగా నున్నది. కామదహన మాడినచో నెవరు వత్తురు? అసలా నాటకమును వ్రాసెడి వారెవ్వరు? తానే వ్రాసికొనవలయును. రాణాప్రతాపనాటకము కిరీటిచేత వ్రాయించితి నని యవధానిగారికి గోపము వచ్చెను. ఈ నాటక మాయనచేతనే వ్రాయించవచ్చును. ఎవరు వ్రాసినను జివఱకుఁ దానంతయు మార్చునదేకదా! మొదట నొక యాకారముండినఁగాని తాను మార్చలేడు. ఆయాకారమేర్పఱచుటయే తనకుఁ జేతగాని పని. ఓహో! కవియనగా బద్యములు వ్రాయుట కాదు; వచనములు వ్రాయుట కదా. ఒక కావ్యమునకో నాటకమునకో పదకము వేసి నిర్మించుటయన్నమాట! అదే. తాను కవి గాదనఁగా. కానిచో నీ రంగనాథము, నీయవధాని తనకంటె నెక్కువ కవులేమిటి? తనకు గణయతి ప్రాసములు తెలియవు. వారికి దెలియును. తనకుమాత్రము గణయతి ప్రాసములు తెలియవా? తెలియును. తానభ్యాసము చేయలేదు. అభ్యాసము చేసినచోఁ దానుగూడఁ గవియగునా? అందఱివంటి కవియే యగును కాబోలు. కావ్యనిర్మాణశక్తి కావలయును. కవి యనఁగా నతఁడు. మఱి యవధానికిఁ గావ్యనిర్మాణశక్తియున్నదిగదా, అతఁడు వ్రాసిన కావ్యము బాగుగాలేదని తాను మార్చినాఁడే, ఆ కావ్యనిర్మాణశక్తి యతనికి సమృద్ధిగా లేదని యర్థము. అది నిర్దుష్టముగా నుండవలయును. అప్పుడే మహాకవి. తనకు దోషములు కనిపించు కావ్యనిర్మాణము చేయువాఁడు కవియేమిటి? ఇది యంతయుఁ దన కెందులకు? అవధానిచేత నాటకము వ్రాయించి తాను తన భావానుగుణ్యముగ మార్చుకొనును.

మనసులోఁ గామదహనము నిర్ణయమైనది. అతని కొక సంకల్పము దృఢముగా నేర్పడిన తరువాత నింక వేరేయూహ యుండదు. చైతన్యములేని వానివలె నింటికి వచ్చెను. వెంటనే యవధాని యింటికిఁ బోయెను. అవధాని పావడిలోఁ దిరుగుచుండెను. సారధి పోయి నమస్కారము చేసెను. అవధాని నమస్కారము స్వీకరించెనుగాని పలుకరించలేదు. తన్ను సారధి బతిమాలుటకు వచ్చె ననుకొనెను. కాని యతని ముఖలక్షణము చూచినచో దీనముగా లేదు. ఉత్సాహవంతముగా నున్నది. సారధి కొతలివాడు పలుకరించెనో లేదో తెలియదు. అతఁడు మరియాదల ప్రపంచకములో నుండడు. సారధి యిట్లనెను:

"అవధానిగారూ! నాకు మీరొక నాటకమును వ్రాసిపెట్టవలయును. దాని పేరు కామదహనము. కుమారసంభవము కాదు. పార్వతీ పరిణయము కాదు. శివుడు తన కంటిమంటతో మన్మథుని దహించువరకే కథ. నాల్గయిదు దినములలో వ్రాసిపెట్టవలయును".

అవధాని మాటాడలేదు. అతడిట్లాలోచించుకొనుచుండెను. "ఇతడు నన్ను క్షమించుమని యడుగుటకు బదులు గడుసుదనము ప్రకటించుచున్నాడు. నే నిప్పుడు లొంగిపోయినచో నితడే గెలుచును. నేను లొంగను" కాని యవధాని మనస్సు కీర్త్యాశ కలది. సారథియంత గొప్పనటుడు నన్ను వచ్చి బతిమాలుచున్నాడు. "నీవు వ్రాసిన నాటకములు సారథియు నాడును; అర్జున రావు నాడును. నీ ప్రతిష్ఠ హెచ్చిపోవును కదా"యని.

ఈ యాలోచనలో నవధాని రెండు నిముసములు మాటాడలేదు.

సారథి-"ఏమండీ మాటాడరు. నాకు నాటకమునకు బదకము వేయుట చేతగాదు. మీరు వ్రాసిపెట్టినచో నాకనుకూలమైనట్లు నేను దానిని మార్చికొందును. పెద్దలుకదా యని వచ్చితిని. నేను కిరీటిచేత వ్రాయించితి నని మీకు గోపము వచ్చినదని యెవరో యన్నారు. నాకు మీయందు దట్టిభావము లేదని తెలియజేయుటకు వచ్చితిని. తమరికి వీలులేనిచో రంగనాథముగారిని పోయి యడిగెదను." అవధానికి గోపము వచ్చెను. రంగనాథము పేరు చెప్పినంతనే సారథి యెంతపిచ్చివాడు అనుకొనెను. "ఆ, రంగనాథము నీకోసమే యెదురుచూచుచున్నాడు. వెళ్లు"మనెను. మరల నవధాని మాటాడలేదు. సారథి వెడలిపోయెను.

అతడు నాటకశాల చూచి రెండుమూడునెలలైనది. నాటకశాల ముందుగా బోదమని బయలుదేరెను. నాటకశాల ముందునకుబోవు వఱకు నతని కన్నులు మిఱుమిట్లుగొనెను. ఇది నాటకశాలయేనా? దాని కిరువైపుల నిండ్లను జూచెను. "ఇది నాటకశాలయే. ఇంతమార్పెట్లు వచ్చెను? ఎవరు చేసిరి? ఎప్పుడు చేసిరి?" కలవరపడి యిదమిత్థమని నిర్ణయించుకొలేని స్థితిలో లోనికి బోయెను. మొగదల రాజావారి శిలాప్రతిమ కనిపించెను. దొరగారీనాటకశాలను బాగుచేయించిరి కాబోలును. మఱియు లోనికిబోయెను. అది సాయంకాలము. లోపల క్లబ్బుసభ్యులు చీట్లపేక నాడుచుండిరి. రంగప్రదేశమంతయు ధగధగలాడుచుండెను. చుట్టును గోడలున్నవి. విద్యుచ్చామరములు కలవు. అతని కనులకు బైలులు క్రమ్మెను. అతనితో నెవరును మాటాడలేదు. అరగంటసేపు దొడ్డియంతయు, భవనములోనను దిరిగినచోటనే తిరిగి, చూచిన

దానినే చూచి వచ్చెను, అచట సారథి వంద తెలుఁగుదురు. అందుచేత నతఁడు తిరుగుచుండఁగా వలదన్నవాఁడు లేఁడు. చీకటిపడిన తరువాత సారథికి మనస్సు నిలుకడఁబడెను. ఐన నిది యేమియో కనుగొనవలయునని ఖాసిం గృహమునకుఁ బోయెను. ఖాసిం ఇంటిలో లేఁడు. రంగనాథము నింటికిఁ బోవుట కిష్టములేదు.

అతని మనస్సులోఁ దళుక్కున నొక యూహ మెఱసెను. నాటకశాలయొక్క యీ మార్పునకు, రంగనాథమునకు సంబంధమున్నది. అదియే యవధాని యెత్తి పొడుపు. అందుచేత రంగనాథమునింటికిఁ బోఁడు. పోవలదన్నది మొదటి యూహ. ఈ కల్పించికొన్న కారణము రెండవ యూహ. రెండవది కారణము, మొదటిది కార్యము. కార్యము ముందుఁ బుట్టి, కారణము తరువాత బుట్టునా? ఇది యసంభవము. అందుచేతఁ బోననుకొనుట యేమి? కాదు, కాదు. కారణమే ముందున్నది. ఆ కారణమునకు వ్యక్తి మొదటఁ గలుగలేదు. కార్యోత్పాదనము జరిగిన తరువాతఁ గారణమునకు వ్యక్తి కలిగెను. ఆ కారణ మెచట నున్నది? మనస్సున కందకుండ నాత్మలో నున్నది. ఆ యాత్మలోని కారణమే యచటికిఁ బోఁగూడదన్న కార్యమును సముత్పాదించినది. మఱి యెచ్చటికిఁ బోవలయును? ఉమాపతి యింటికిఁ బోయినచోఁ దెలియునేమో! ఉమాపతి యింటికంటె శిరీషకుమారు నింటికిఁ బోయినచో? బాగుగా నున్నది. వాసంతిని జూడవచ్చును. వాసంతియేకదా పార్వతివేషమును వేయును. ఆ పార్వతియందలి కామభావమును శివుఁడు దమనము చేయుట ప్రారంభింపవచ్చును. తొలుత వాసంతియందు గామభావమును పెంచుకొనవలయునుగదా! పెంచుకొన నక్కఱ లేదు. కామభావన జీవునియందే యున్నది. ఆ కామభావనకు వాసంతిని లక్ష్యము చేయుట. ఇదివరకున్న వాసంతి దాక్షాయణి. ఈ వాసంతి పార్వతి. సారథి నవ్వుకొనెను. రుక్మాంగదనాటకము నాటి దాక్షాయణి తాను భస్మమై పోయెను. ఈ నడుమ వాసంతి తనకు వట్టి వాసంతిగానే కనుపించెను. ఇప్పుడామెను మఱలఁ బార్వతిగాఁ జూచును. నాటక మాడినప్పుడు తద్భావనను సంపూర్ణముగా ఛేదించును. ఈ భావనయు, నీఛేదించుటయు నాటకమాడు నాటివఱకును దా నభ్యాసము చేయుచుండును. సరే. వాసంతి యింటికే బయలు దేరెను. ఈ నాటకశాల మార్పు వాసంతీ శిరీషులకుఁ దెలిసియుండదా? వారు చెప్పుదురు. అతఁడు దారివెంట నడచుచుండెను. ఇంతలో నాఁకలివేయుచున్నట్లు తెలిసికొనెను. వెనుదిరిగి విశాలాక్షి పూటకూటియింటిబసకు పోవలయునని అనుకొనెను. కాని పాదములు వాసంతి యింటివైపునకే లాగెను. పార్వతీగత మోహము ప్రారంభించెను. విశాలాక్షి యింటికే పోయి ప్రథమచ్ఛేదము

చేయవలయు ననుకొనెను. కాదు కాదు. దీనినిఁ బెఱుగనిచ్చి ఛేదింపవలయు ననుకొనెను.

వాసంతి సంగీతాభ్యాసము చేయుచుండెను. అప్పట శిరీషు లేఁడు. శిరీషునకు జ్వరము వచ్చి గదిలో బండుకొనెను. సారథిని జూచినంతనే వాసంతి సంగీత మాపి, "అధీ, ఇన్నాళ్ళకు మైనావు" అనెను.

సారధి— నేను నలుబదియైదేండ్లక్రింద సారథినైనాను. ఇప్పటివఱకు సారథిగానే యున్నాను. ఈమూఁడు నెలలలో మాఱిన దేమియు లేదు. కాని గడచిన యైదాఱు గంటలలోఁ జాల మాఱితిని.

వాసంతి—ఎవరుగా మాఱితివి?

సారధి—ఇంక నెవరుగాను మాఱలేదు. మాఱుదమని ప్రయత్నము చేయుచున్నాను. సరేగాని, వాసంతీ! ఆ నాటకశాల యేమి? అది యేదో రాజభవనముగా మాఱినదే! ఇప్పు డందులోఁ గ్లబ్బు పెట్టిరా?

వాసంతి నివ్వెరపోయెను. తమాయించుకొని యిట్లనెను: "ఇంకను దొడ్డిత్రోవనే యున్నావా" యని. వారి మాటలు విని శిరీషు బయటకు వచ్చెను. శిరీషునకు వచ్చినదేమియుఁ బెద్ద జ్వరము కాదు. అతని కెప్పుడును జ్వరము రాదు. జలుబు చేయదు. నలుబదియైదేండ్లవాఁడు ముప్పదియేండ్ల యువకునివలెఁ గనిపించును. అతఁడు తెల్లవాఱుకడ నాల్గుగంటలవఱకు మేల్కొనియుండి యప్పుడు నిద్రపోయినను నాల్గున్నరకే లేచి చన్నీళ్లు స్నానము చేయవలసినదే. అతని కొఁకలి లేకపోయినచో నెన్నఁడును భోజనమే చేయఁడు. కడుపులో బాగుండనిచో నాల్గుదినములయిన నుపవాసము చేయును. అందుచేత నతనికి జ్వరము రాదు. జలుబు చేయదు. నేఁడు వచ్చినది కొంచెము నలపరింత. వెనుకటి దినమున నాఁకలి లేకున్నను నొక స్నేహితుని యింటిలో బలవంతము చేయగా విందారగించెను.

అతఁడు వచ్చినంతనే ముగ్గురును కలసి మాటాడిరి. మూఁడు నెలలకథయుఁ జిలవలు పలవలుగా, ననూయా ద్వేష సహితముగా వాసంతి యావేశముతోడను, శిరీషుఁడు విషయ నిగరణము మాత్రముగాను జెప్పిరి. సారథికిఁ దొలుత గొంచె మచ్చెరువు కలిగెను. మధ్యమధ్య ప్రశ్నలు మాత్రము వేయుచుండెను. చివఱకు "పోనీలే. అది మన సొమ్మా? అర్జునరావు గొప్పవాడైనచో మన కేమి నష్టము? అతని సాధన యతనిది, మన సాధన మనది" యనెను.

సారధి యొక్క యాత్మోన్నత్యము శిరీషునకు బాగుగాఁ దెలియును; వాసంతికిని తెలియును. కాని వాసంతి కోపము నణఁచిపుచ్చుకొనలేదు. ఆమె

కంటగించుకొనెను. మరియు నేనో కోపపు మాటలు మాటాడెను. సారధినవ్వుచు గూర్చుండెను. వాసంతి కోపముతో నిట్లనెను: "అయ్యా! సారధి గారూ! తమరు విరాగులు. ఐనను నాటకములు వేయుదురుగదా! తమరు నాటకము వేసినచోఁ బాతిక రూపాయలు మిగులవు. ఇప్పుడు నాటకశాలకు వందరూపాయలు బాడుగ యీయవలయును. ఎక్కడనుండి తెచ్చియిత్తు" రనెను.

సారధి "నీవు సంగీతపుఁ గచేరీలు చేసి సంపాదించి యిత్తువుగాని" యనెను. ఆమె కోపములోఁ దా నేమనుచుండెనో తెలియక "నేనేమి, నీకు భార్యనా? నేను సంపాదించిన డబ్బు నీ కిచ్చుటకు" అనెను. శిరీషు "భార్యలు మాత్రము సంపాదించిన డబ్బిత్తురా" అనెను. సారధి తన మనసులోఁ గోపముతో నన్న మాటలకు, నవ్వులలో నన్న మాటలకుఁ బట్టింపు లేదనుకొనెను.

ఆరాత్రి వారలు భోజనమునకు లేచుసరికిఁ బదునొకండు గంటలయ్యెను. భోజనము చేసినంతసేపు వాసంతి కోపముగా మాటాడుచునేయుండెను. మధ్య శిరీషుఁ డిట్లనెను: "సారథిగారూ! నీకుఁ దెలియదు. అమ్మాయి సంగీతపుఁగచేరీ కోటలో నేర్పాటు చేయుదురఁట. రంగనాథముగారు చెప్పి" ననెను. సారథి నవ్వుచు నిట్లనెను: "చూచితివా, వాసంతీ! నీవు నా పక్ష మవలంబించితివా, దొరగారికిఁ గాకుండఁబోదువు. మీ నాన్నగారు కష్టపడి నీకు సంగీతము చెప్పించినారు. నీకు బైరాగి వేషములమీఁద మక్కువ యెక్కువ." ఆరాత్రిపూట వచ్చుటనే పండుకొనుమని తండ్రి కూఁతు లిద్దఱు నెంత బలవంతము చేసినను సారథి యాగలేదు.

మఱునాడు ప్రొద్దున సారధి నాటకశాల విషయమే మఱచిపోయెను. కామదహనము నాటకము వ్రాయవలయును. ఎవరు వ్రాయుదురు? అవధాని వ్రాయఁడు. సరికదా రాత్రి తెలిసిన కథవలన రంగనాథ మసలు వ్రాయఁడు. మఱిఁ గిరీటిచేతనే వ్రాయించవలయును.

కిరీటి పసివాఁడు. వ్రాయఁగల్గునా? కలుగునో కలుగఁడో, మఱియొక గత్యంతరము లేదు. అతనిచేతనే వ్రాయించి తాను సరిచేసికొనవలయును. కిరీటి కొఱకు వెళ్లెను. పాఠశాలలోఁ గిరీటి సారధి కనిపించినంతనే తరగతినుండి వెలికివచ్చెను. అతనినిఁ దోఁటకుఁ దీసికొనివచ్చి సారధి యిట్లు చెప్పెను: "కిరీటీ! రాణాప్రతాపచరిత్ర నీచేత వ్రాయించితివని యవధానిగారికి వామీఁదఁ గోపము వచ్చినది. రంగనాధమునకుఁ గోపము వచ్చినది. వచ్చినచో వచ్చినది. మనమేమి చేయుదుము? నా కిప్పు డొక నాటకము కావలయును. దాని పేరు కామదహనము. మన్మథుని శివుఁడు తన కంటిమంటతో దహించిన కథ. నీ కాకథ తెలియునా?"

కిరీటి 'తెలియు' ననెను. సారథి మరల నిట్లు చెప్పెను: "పార్వతి పెండ్లితో మనకు సంబంధము లేదు. మనకున్న సంబంధమంతయు మన్మథుఁడు తగులఁబడుటయే. శివుఁడు మన్మథభావము నశింపఁజేయుటయే. కిరీటీ! జీవుఁడు మాయాపిహితుఁడైయున్నాఁడని నీకుఁ దెలియునా?"

కిరీటి-నాకుఁ దెలియదు. కాని మాటమాత్రము విన్నాను.

సారథి-మాయ యనగా స్త్రీ. స్త్రీయందున్న పురుషునియొక్క యాశయే మాయ. ఆకోరికచేతనే సంతానము కలుగుచున్నది. లోక మిట్లున్నది. ప్రధానమైన యీ కామమునుఁబట్టి తక్కిన కోరికలన్నియు బయలుదేరుచున్నవి. మొట్టమొదట లింగసంబంధవాంఛామాత్రముగా నున్న యీమాయ లోకములోఁ బలుతెఱఁగుల విజృంభించినది. ఆలింగసంబంధమైన వాంఛ నిర్మూలింపఁబడినచో మాయను గెలిచినట్లే.

కిరీటి-సారథిగారూ! నేను మీమాట నిజమనుకొనను. వారముదినముల క్రింద మాయింటి కొక సన్యాసి వచ్చెను. ఆయనకు భార్యయుఁ, బిల్లలును లేరు. కాని యాయనకు డబ్బుమీఁద నున్నంత యాశ నాకెచ్చటను కన్పించ లేదు.

సారథి "అది కాదోయి! ఈమాయ యఱఁటిచెట్టువంటిది. అసలు చెట్టు గెలవేయును. దానిని మనము కొట్టివేయుదుము. కాని దానిచుట్టునున్న పిలకలు కూడఁ జెట్లుగాఁ బెఱుఁగును. దానినిబట్టి వచ్చిన యీపిలకలు నివి చెట్లవలెనే యుండును. అటువంటిది మాయ. దాని ప్రధాన లక్షణము స్త్రీ. అనుబంధ లక్షణములు ధనము, నధికారము మొదలయినవి. లోకముయొక్క లక్షణముచేత నివికూడ దాని యంతటివిగా భాసించును. ఈ సంగతి తెలిసికొని కామచ్ఛేదనము చేసినచోఁ దక్కిన వేవియుఁ జేయలేవు. నీ వానాటకము వ్రాసి పెట్టవలయును. నేనొక పెద్దప్రభువను. నీవు నాయాస్థానకవివి." యని నవ్వెను.

కిరీటి-అవధానిగారివంటివాని నాస్థానకవి చేయుటకంటె నన్ను జేసికొనిన మీరే దొడ్డప్రభువులు.

సారథి-అవధానిగా రంత తీసిపోయినాఁడా?

కిరీటి-ఆయన యేమి తీసిపోయినాఁడు! డెబ్బదియేండ్లు వచ్చెను. తాయి వలె నున్నాఁడు.

సారథి-నాయనా! అట్లు పెద్దవారిని నిందించఁగూడదు. ఆయన కవిత్వము నీకు బాగుగా లేదనుకొనుము. నాకును బాగుగా నుండదు. ఆయన యూరకే పద్యములు వ్రాయుటయే గాని రసౌచిత్యము ఎఱుఁగఁడు. పద్యరచనగూడ మధు

రముగా నుండదు కాని పెద్దవాఁడు. బహుగ్రంథములు వ్రాసినవాఁడు. రాజ ప్రాపకము కలవాఁడు.

కిరీటి—సారథిగారూ! మీకుఁ దెలియదు. ఆయన కన్నియేండ్లు వచ్చి నను శాంతము లేదు. మంచితనము లేదు. నే నెక్కడ, తా నెక్కడ? నేను కుఱ్ఱ సన్యాసిని. ఆయనకు బోలెఁడంత ప్రతిష్ఠ. డబ్బున్నది. ఔనో కాదో, మన తహసిలుదారులు, జిల్లామునసబులు మొదలైనవారు మహాకవి యనుకొను చున్నారు. పదిరోజుల క్రింద నాకొకసారి కనిపించినాఁడు. నేను నమస్కారము చేసినాను. నావంక చూడకుండ, నమస్కారము స్వీకరించకుండ వెళ్లి పోయినాఁడు. నాకాయన కవిత్వము బాగుండదు. కోఁకిస్కాగాడను. నాకు బాగుండి యెంత, బాగుండక యెంత? నావయ సెంత? నాకుఁ బదునాఱేండ్లు దాఁటలేదు. ఆయన కఱువది దాఁటినవి.

సారథి—నిన్ను చూడలేదేమో.

కిరీటి—ఆయనకుఁ బంటిబిగువు, కంటిలగువు చెడలేదు. సరే, నామీద నాయనకుఁ గోపము వచ్చినదని నాకుఁ దెలిసినది. నేను చేసిన తప్పేమిటి? మీ రేదో నన్ను చేసిపెట్టు మనఁగా సరేనని వచ్చితిని. నే నేమో వ్రాసిపెట్టితి నని పేరు. వ్రాసికొన్న దంతయు మీరే. అంతవానికిఁ గోపము వచ్చినదని నేను మఱునాఁడు వారియింటికిఁ బోయి నిజముగా వారి పాదములు పట్టికొంటిని. ఆయన పాదములు తొలఁగించికొని "ఊఁహూఁ. పో. ఎవరు నీవు? నాతో నీకేమి యవసరము? పో పో. నాయింటిలోనుండి పో పో"యని తఱిమెను. ఆయన మానిసియా?

సారథి—నిజమే కాని నీవు మాటలు మిగుల నాడకుము. పోనిమ్ము, నీకేమి నష్టము? నీవు చదివికొని పెద్దవాఁడవు కమ్ము. నాకుఁ దెలియును. నీలోఁ బరమేశ్వరకళ యున్నది. చిన్నప్పుడే తల తిరిగినచో మనుష్యులు బాగుపడరు. రంగనాథ మట్లు చెడిపోయినవాఁడు. అతనిలోఁ జిత్కళ యున్నది. దాని నతఁడు పెంచి వృద్ధిచేసికొనలేఁడు. అతని మనస్సంతయును దొరగారి కోటలో దివాను కావలయునని, పిల్లిమీఁద నెలుక, నెలుకమీఁదఁ బిల్లి నెక్కించవలయు నని. ఈ యూహలతోడనే కాలము గడిపెను. ఏదో కొంత యింగ్లీషు చదివెను. ఇంగ్లీషు చదివినచో నా యుద్దేశ్యములోఁ బ్రతిభ వృద్ధిపొందదు. వృద్ధిపొందు నది బహుసిద్ధాంతము. కవిత్వ మట్లుండవలయు, నిట్లుండవలయునని యైదేండ్ల కొక క్రొత్త సిద్ధాంతము.

కిరీటి—ఆ సిద్ధాంతములు తప్పందురా? నాకు వారు చెప్పెడి మాటలు బాగుగానే యుండునే! నాకట్లు వ్రాయవలయునని యనిపించుచుండును.

సారథి-పెందలకడఁ జెప్పితివి. అట్టి పిచ్చియూహాలు పెట్టికొనకుము. నేను కవిని కాదనుకో. కాని నాకుఁ దెలిసినది చెప్పెదను. అట్లు వ్రాయవలయు, నిట్లు వ్రాయవలయు ననఁగా దేనినిగుఱించి వ్రాయుచున్నారో చెప్పు చున్నారు గాని యెట్లు వ్రాయవలయునో చెప్పుట లేదుగదయ్యా! కవి నేర్చి కొనవలసినది రసముట్టిపడునట్లు వ్రాయుట యెట్లా యనియే కాని దేనిని గుఱించి వ్రాయవలయు ననియా? వారిలెక్క ప్రకారం మీ కామదహనము గూర్చి వ్రాయఁగూడదు. రుక్మాంగదనాటకము వ్రాయఁగూడదు. ఇవి యన్నియు ప్రాఁతపురాణములు. రైళ్ళనుగూర్చి, శతఘ్నులను గూర్చి, ఫ్రెంచి విప్లవము వున్నగు విప్లవమునుగూర్చి వ్రాయవలయును. వానియందు రసముం డదు. అవియన్నియు మనకుఁ దెలిసినవే. అవి చదువుచున్నపుడు మనస్సునకు దీప్తికలుగదు. మనుజులందఱును బ్రదుకుచున్నారు. అందఱకుఁ గూడుగుడ్డలు కావలయును. వానిని సంపాదించుకొనుటకు మనుష్యుఁడు కాలుసేతు లున్నంత కాలము ప్రయత్నముచేయును. ఎవని కెంత ప్రాప్తియో యంత సాధించును. దీనిని మించి మనస్సు కలదు. ఆత్మ కలదు. వానిని వృద్ధిచేసికొనినచోఁ బర లోకములయందు సుఖ మేర్పడును. పరలోకములు లేవందము. నీ మనస్సునకు, నాత్మకు నభివృద్ధి కలిగినచోఁ బరలోకమునందలి సుఖమే కాదు, ఈలోకము నందే సుఖము ప్రాపించును. సర్వజనులకు సర్వమును సంభవింపవు కదా. దొర గారి కున్నడబ్బు నీకు, నాకును లేదు. అవధానిగారి కున్న ప్రతిష్ఠ నీకు, నాకును లేదు. రంగనాథమున కున్న తెలివితేటలు నీకు, నాకు లేవు. అతఁడు కనుఱెప్ప లతో దీప మార్పఁగలడు. ఇవియన్నియు లేనివాఁడు దిగులుపడి చావవలసిన దేనా? వారివలన నపకారములు పొందినవారు క్రుంగి కృశించవలసినదేనా? కనుక మనస్సును పరిపక్వముచేసికొన్నచో, నాత్మ నభివృద్ధి పొందించు కొన్నచో నాపదలు వచ్చినపుడు, నపకారములు పొందినపుడు తమాయించు కొనవచ్చును. అందుచేత నాత్మవిద్య గొప్పది. ఇహ పరసాధకము. పరము లేకపోయినను ఇహసాధకము. కామదహనము వ్రాయు మనుచున్నాను. ఇది దేనికి? మనస్సు నొత్తిపిడి పెట్టుటకు మనస్సులోనున్న యాశలు, కోర్కులు వేయి విధములుగా ప్రజ్వలింపఁ జేసి తనకు శాంతిలేకుండఁగాఁ జేసికొని పరులకు శాంతిలేకుండ జేయుటయా? కనుకఁ గామదహనమును వ్రాసిపెట్టుము.

కిరీటి-మీరు గొప్ప నటకులని మాత్రమే యనుకొన్నాను. ఇంత తెలిసిన వా రనుకొనలేదు. నేను ప్రతిదినము మీవద్దకు వచ్చుచుందును. నాకిట్లే చెప్పు చుండుఁడు.

సారధి-పిచ్చివాఁడా, నేను తెలిసినవాఁడనుకాను. తెలిసికొనువాఁడను. మనదేశములో మనుష్యులు మూడువిధములు. ఒకఁడు తెలిసినవాఁడు; రెండవవాఁడు తెలిసికొననివాఁడు; మూఁడవవాఁడు నావంటివాఁడు. తెలిసికొనువాడు వీఁడు మనదేశములో లేఁడు. నా కేమియుఁ దెలియదు. నీ వేమైనను దెలిసికొనవలయు నన్నచో సుమాపతిగారి దగ్గఱకుఁ బొమ్ము. నేను నీ కీమాటలు చెప్పినచో నివియన్నియు నతఁడు నాకుఁ జెప్పినవే. నేను మఱచిపోక వానిని మననము చేయుచుందును. నీవు వెఱ్ఱివాఁడవని నీకుఁ జెప్పితిని. మఱియొకచోట నేను నోరుమెదపను. నన్నెదుర ప్రశ్న వేసినచో నేను కన్నులు తేలవేయవలయును. కిరీటి! నీ వన్నచో నా కెక్కువ ప్రేమ యనుకొందును. నే నిట్లెప్పుడును మాటాడలేదు, మాటాడను. ఇప్పు డెందుకో యిట్లు మాటాడితిని. నీవు చెడిపోదువని భయము వేసినది.

అని సారధి చివాలునలేచి "నీవు చెడిపోయినచో నా కేమి"యని మొగము బిగించికొని తోటలోనికిఁబోయి త్రవ్వుచుండెను. సారధిలో నీ ఛాయ కిరీటి యెఱుఁగఁడు. ఇదియేమి? మరియాదలేకుండ ప్రవర్తించుచున్నాఁడు. తన తోటకుఁ దాను దీసికొనివచ్చెను గాని నేను రాలేదే యని నిస్తబ్ధుఁడై మఱి కొంతసే పచటఁ గూర్చుండి నెమ్మదిగా లేచి పో నారంభించెను. అతఁడు పోవుచుండఁగా సారధి చూచెను. "నాటక మెన్నాళ్ళలో వ్రాసి తెత్తువు" అని మహోధికారివలె నడిగెను. వెఱ్ఱివాఁడైన కిరీటి యాగాంభీర్యమునకు తట్టుకొనలేక "నాలుగైదు దినములలో దెచ్చెదను" అని వెడలిపోయెను. సారధి తన తోఁటలోఁ ద్రవ్వుకొనుచుండెను.

కిరీటికి లోకానుభవము తక్కువ. అధికారు లట్లు ప్రవర్తించుట యతఁడు కొంచెముగా నెఱుఁగును. నాటకములలో వేషము వేయువాఁ డింత యుద్ధతముగాఁ బ్రవర్తించునని యతఁడనుకొనలేదు. నాటకము వ్రాయుటయా, వ్రాయకపోవుటయా! సారధి రాణా ప్రతాపసింహ నాటకమును వ్రాయించుటచేత దనకుఁ బట్టణములోఁగవి యన్న పే రేర్పడినది. కొందఱు రంగనాధ మెంతకవియో, యవధాని యెంత కవియో తాను నంత కవి యని యనుకొనుచుండిరి. అజ్ఞాన మనేకవిధములు. తా నీ నాటకము వ్రాసినచోఁ దన పేరింకను బ్రశస్తిలోనికి వచ్చును. వ్రాసి యట్టిపెట్టుదము. సారధి మఱల వచ్చి పిలచినచో వెళ్ళవచ్చునని కిరీటి నిశ్చయించెను. పదిదినములు కూర్చుండి నాటకమును వ్రాసెను. అది యతనికిఁ గుదురలేదు. కాని సారధి చెప్పినభావము లన్నియు నా గ్రంథము నిండ నిక్షేపించెను. ఏదోవిధముగా నాటకమును బూర్తి చేసెను. నాటకము పూర్తిచేసిన తరువాత నాల్గయిదు దినములు గడిచెను.

ఉమాపతి యంత గొప్పవాఁడని చెప్పెనుగదా సారధి, యతనివద్దకుఁ బోద మనిపించెను. శన్యాదివారములు సెలవులు వచ్చెను. కిరీటి యుమాపతివద్దకుఁబోయెను. అతఁ డాదరించి 'యెందుకు వచ్చితి'వని యడిగెను. అతని వద్ద నేదైన నేర్చికొనుటకు వచ్చితినని చెప్పెను. ఉమాపతి యిట్లనెను: "బాబూ! ఇప్పుడప్పుడే నేర్చుకొనవలసిన దేదియు లేదు. ఇప్పుడు చదువుకొనవలసి(న)ది యున్నది. ఏపండితునివద్దకైన బోయి సంస్కృతములో బంచ కావ్యములు చదువుకొనుము. రెండుమూడు నాటకములు చదువుకొనుము. కౌముది చెప్పించికొనుము. అప్పుడు నాదగ్గఱకు రమ్ము. నే నేదైనను జెప్పెదను. చదువు రాకముందు పెద్ద విషయములు తెలిసికొన్నచో మనసు చెడిపోవును. పండితమ్మన్యు డనగా వాఁడే. మన యింగ్లీషు కళాశాలలో జూడుము. ఇంగ్లీషుభాషలోని విమర్శనలన్నియు జదువుదురు. మనసునకు విశేష విషయములు తెలియును. నేలంటు వదలలేదు. వారు పెద్ద పెద్ద మాటలు మాటాడెదరు. శబ్దార్థములు తెలియవు. అది యింగ్లీషులో బనికివచ్చునేమోగాని తెనుగునకు బనికిరాదు. కనుక బోయి చదువుకొనుము." కిరీటి కుమాపతియందు బ్రమాణబుద్ధి మున్నే కలిగెను. అతడు చెప్పినది సమంజస మనిపించెను. చిత్తమ్మైనని వెడలిపోవుచుండగా సారధి వచ్చెను. సారధి కనిపించినంతనే కిరీటి మొగము ముడుచుకొనెను. సారధి యతనిని జూచి నవ్వెను. కిరీటి నవ్వలేదు. కాని కొంచెము తేరుకొనెను. సారధి "ఏమయ్యా కవీశ్వరుడా! మీ యింటికి వెళ్లివచ్చితిని. నాటకము వ్రాసితివా? మీ యమ్మగారు వ్రాసితివని చెప్పినదే" యనెను. కిరీటికి మనసులో గలకపాసెను. కాని మొగము తేలుకొనలేదు. సారధి "అదియేమట్లుంటి"వని యడిగి "యోహో, యదియా" యని విఱుగబడి నవ్వి యుమాపతితో నిట్లనెను: "ఏమండీ! ఉమాపతిగారూ! ఈ పిల్లవానిమీద నాకు గోపము వచ్చినదనుకొన్నాడు. నే నతని నగౌరవపఱచితి ననుకొన్నాడు. పూర్వము మీ రెప్పుడో చెప్పిన కొన్నిమాటలు వీనికి హితముగా జెప్పి "నాయనా, నీవు చెడిపోవుదువేమో"యని చెప్పి, "నీవు చెడిపోవుదువేమో యని నాకు భయ"మంటిని. ఇంతలో నా గోలలో నేను పడి "నీవు చెడిపోయినచో నా కేమి భయ"మని వెడలిపోయితిని. పిల్లవాడు దానికి మనస్సున గష్టపడినాఁడు."అనెను. ఉమాపతియు, సారధియు నవ్వుకొనిరి. కిరీటికి దాని యర్థమేమియు దెలియలేదు. అపుడు సారధి కిరీటితో నిట్లనెను. "నీమీద నాకు గోపములేదు. నామీదనే నాకు గోపము. నాటకము తీసికొని సాయంతనము తప్పకుండ ర"మ్మని చెప్పెను. కిరీటి వత్తునని వెడలిపోయెను.

ఆ సాయంతనమున గిరీటి వెళ్లెను. సారధి నాటక మంతయు శ్రద్ధగా వినెను. మాటాడకుండ వినెను. అంతయు నైపోయెను. ప్రొద్దుగ్రుంకవచ్చినది. సారధి పోదమురమ్మని బయలుదేరెను. నాటకమును బుచ్చుకొని బయలుదేరిరి. సారధి యుమాపతి యింటికి దారితీసెను ఉమాపతి యింటివద్దనే యుండెను. సారధి "ఈ పిల్లవానిని నేనొక నాటకము వ్రాసిపెట్టుమని యడిగితిని. అతఁడు వ్రాసినాఁడు. నే నంతయు విన్నాను. మీకు వినిపించుటకుఁ దీసికొనివచ్చితి" ననెను. ఉమాపతియు "వేఱేపని యున్నది. ఆపని రేపు చేసికొందునులే" యని కూర్చుండెను. సారధి కిరీటిని నాటకము చదువు మనెను. అతనికి వణఁకు పుట్టెను. కొంతసేపైనతరువాత వణఁకు తగ్గెను. అతఁడు చదువుచుండఁగా నుమవచ్చి దగ్గఱ కూర్చుండెను. కిరీటి కొంచెము రాగచ్ఛాయగాఁ బద్యములఁ చదువును. ఉమ యతఁడు పద్యము చదువుచున్నపు డానందించునుఁ ప్రసంగ భాగము చదివెడివేళ నొక్కొక్క మాటకు గంతులువేయుచు వినుచుండెను.

నాటకమంతయుఁ జదువుట పూర్తియైనది. రాత్రి తొమ్మిదియైనది. ఉమాపతి యిట్లనెను: "శబ్దదోషములు సమృద్ధిగాఁ గలవు. నీకు ద్రుతప్రకృతికము లేవో, కళ లేవోగూడఁ దెలియదు. పద్యములలో గణములున్నవి కాని మఱి యేమియు లేదు. పద్యరచన నీకుఁ గుదురలేదు. కనుక నీవు చదువుకొనక తప్పదు!" కిరీటి మొగము వ్రేలవేసెను. సారధి నవ్వుచుండెను. కిరీటి "చిత్తము చిత్తము, నల్లే చదువుకొందు"నని బయలుదేఱుచుండెను. ఉమాపతి మఱల ననెను: "నాయనా! నీవు వైధైర్యపడకుము. నేను నీయందున్న దోషములే చెప్పితిని. ఈ నాటకములోనున్న గుణమును జెప్పలేదు. ఆగుణ మెవ్వఁడును నేర్పెడిదికాదు. నేర్చికొనినచో వచ్చెడిది కాదు. నాటక మారీతిగా నంకవిభజనము చేసి, యేయంకమునం దేకథాభాగముండవలయునో, యేది విస్తరించి వ్రాయవలయునో, కథాభాగములో దేనిని వదలిపెట్టవలయునో, యంకముయొక్క యాద్యంతము లెట్లుండవలయునో, యీ కావ్యమునకుఁ బ్రయోజనమేమి, యాఘట్టములో నెట్టిభాగము ప్రదర్శించవలయును, మొదలైన బహువిషయము లున్నవి. అది వేఱే ప్రపంచకము. ఈ ప్రపంచకము కవియొక్క పూర్వజన్మసంస్కారముచేత, ప్రతిభచేతఁ బరిదీప్తమగును. ఆ ప్రతిభ యందఱిలో నుండదు. కొందఱిలో నుండును. అదియే చదువుకొనుటచేత నిక్కలి ప్రకాశించును. దానికి సువిస్పష్టమైన రూపము వచ్చును. వట్టి ప్రతిభ యుండి చదువుకోనివాఁడు కాంతారములో దాని యిష్టము వచ్చినట్లు పెఱిగిన చెట్టువలె నుండును. చదివికొని యా చెట్టునందపుబోదెలకు మలచినవాఁ డుద్యానవన వృక్షమువంటివాఁడు. నీ వడవిలోఁ బెఱుగుచున్న చెట్టువలె నున్నావు. ఉన్న

ప్రతిభను నేను మెచ్చుకొన్నచో నీవు చిన్నవాఁడవు. నీకుఁ దలతిఱిగిపోవును. చెడిపోయెదవు. అందుచేత నేను నిన్ను మెచ్చుకోను. నీవు తప్పకుండ జదువుకొనవలయును. చదువుకొనకపోయితివా, దేశద్రోహము చేసినవాడ వగుదువు, సారస్వత ద్రోహము చేసినవాఁడ వగుదువు. ఓయీ! తట్టెడు పంచదార యున్నది. సెనగపిండితోడనో, గోధుమపిండితోడనో కలిపినచో అది సేవ్యమగును గాని పంచదార యెవ్వఁడును బొక్కఁడుగదా. ఆ సెనగపిండిలోననో, గోదుమపిండిలోననో తట్టెడు పంచదారయు బొర్లించుకొనఁడు. నీతట్టెడు పంచదారయు నెవఁడుకొనును? తలాయొక వీశెఁడు పదిమంది కొందురు. వట్టి ప్రతిభకు వినియోగము లేదు. చదువుకొన్నచో బహు కావ్యములయందు దాని వినియోగము. సారధి యీ పద్యములు మఱెవరిచేతనైనఁ దిఱుగ వ్రాయించినచో నత డందందు దాను తిరిగి వ్రాసికొన్నచో నాటక మాడవచ్చును. నే నెంత సేపు చెప్పిన నింతే. నీలో బంగార మున్నది. దానిని నగలుగా మార్చుటకు నేర్పరి యైన శిల్పి కావలయును. శిల్పము కావలయు నన్నమాట. అనఁగా నీవు చదువుకొనవలయును. చాలమంది దగ్గఱ బంగార ముండదు. ఇత్తడియో, కంచో, రాగియో, యినుమో, మన యవధానిగారివద్ద నున్నట్లు మన్నో యుండును. వారు చదువుకొన్నారు కనుక వానితోడనే నగలో బొమ్మలో చేయుచున్నారు. ఇదియే వారికి, నీకు భేదము. లోకమునకు మట్టిబొమ్మయైనను సరే, బొమ్మయని తీసికొనిపోయి సంక్రాంతిపండుగకుఁ బెట్టికొందురు. ధనవంతులు వెండితోఁ జేసిన శిల్పపు బొమ్మ కొందురు. దంతముతోఁ జేసినవానిని కొందురు. మఱియు విశిష్టులు బంగారముతో జేసినవానిని గొందురు. నీవు చదువుకొని కావ్యములు వ్రాయుము. వారిని మెచ్చుకొన్నంతమంది నిన్ను మెచ్చుకొనరు. వారికి వచ్చి-నంత కీర్తి నీకు రాకపోవచ్చును. కాని నిన్ను నేను మహాకవినైతి వనుకొందును. నావంటివా రెవరో పదిమంది చెదురుగా ననుకొందురు. ఈ ప్రతిభ కదియే ఫలితము" అని. "ఇంక మీరు వెళ్లు"డని యుమాపతి లోనికిఁబోయెను. కిరీటి యుమాపతిని సారధివంటివా డనుకొనెను.

సారధి నాటకమును సిద్ధముచేసెను. ఎవరివద్దకో పోయి పద్యములు తిరుగ వ్రాయించెను. పఠనీయభాగము లన్నియు నందఱకిచ్చెను. వాసంతికిఁ బార్వతీ వేష మిచ్చెను. నాటకశాలలో వేయనిత్తురో, వేయనీయరో. అపుడు ఖాసిం వద్దకుఁ బోయెను. "ఏమయ్యా! సాహెబుగారూ! నే నొక నాటకము వేయవలయును. మీశాలలో వేయనిత్తురా" యనెను. ఖాసిం "ఇప్పుడు మన దేమియు లేదు. అంతయు రంగనాథముగారే. సారధీ! నీవు నాటకము వేయుదు ననఁగా వద్దనునా? అతనితోఁ జెప్పుము, సరిపోవు" ననెను. సారధి "ఒరే పిచ్చి

సాయిబూ! నీవంటివాఁడు కాదు రంగనాథము. నీవుకూడ రా పోదము" అని యిద్దఱును రంగనాథము నింటికి వెళ్ళిరి. రంగనాథము తానంతయు విని నవ్వుచునే "వందరూపాయలు బాడిగ" యనెను.

ఖాసిం "అది యేమి కవిగారూ! సారథిదగ్గఱఁ దీసికొందుమా?" యనెను. రంగనాథము నవ్వుచు "ఖాసిం! నీకుఁ దెలియదు. నాటకములో నెంత మందికి జీతము లీయవలయును? ఎక్కడనుండి తెచ్చి యిత్తుము?"

ఖాసిం-దొరగా రిత్తురు.

రంగ-ఆయన యేమి ధనము ప్రోగుచేసికొని కూర్చున్నాఁడా? దీనిమీఁద వచ్చిన డబ్బు దీనిమీఁద ఖర్చు పెట్టును.

ఖాసిం-ఈ నాటకశాల బాలసరస్వతీ సమాజమువారిది. దొరగారు మహా కార్యము చేయుచున్నారు. కనుక దాని నిచ్చితిమి. బాలసరస్వతీ సమాజము వారి దెట్లో, సారథిదియు నట్లే. అతఁడు నాటకము వేయుట కభ్యంతర ముండఁగూడదు.

అనుసరికిఁ గొంత వ్యవహారము తెలిసిపోవుచున్నదని రంగనాథము క్రొత్త యెత్తు నెత్తెను. "ఆ మాటలు నిజమే. దొరగారితోఁ జెప్పిచేయుదము." అనెను.

సారథి-ఇందులో దొరగారితోఁ జెప్పవలసిన దేమియు లేదు. రంగనాథము గారూ! ఇది యంతయు మీరు సొంతముగాఁ జేసినది. దొరగారి పేరు పెట్టితిరి, దొరగారితోఁ జెప్పవలెనని క్రమ్ముచున్నారు. నాకుఁ దెలిసినది. మీ యూరి వారు నా దగ్గఱ కొకఁడు వచ్చెను. దాని రహస్య మంతయు నాకుఁ దెలిసినది. మీకుఁ దెలియని సంగతి కాదు. నే నొకటి జెప్పెదను. నేనే పట్టుమని పని యేమియు లేకుండనే రెండుపూటల దొరగారి దర్శనము చేసివత్తును. నా కేమి చెప్పకుండగనే యాపనియు నీ పనియుఁ జేయుదును. రెండుమూడు నెలలలో నే వారికి నే నాప్తుఁడ నగుదును. అప్పుడు నా యంతట నే నే పనిచేసినను దొరగారు చేయించినట్లే. వారు కాదనరు కనుక. నా కిష్టములేని పని యెవఁడైనఁ జేసెదనన్నచో దొరగారికిఁ దెలియని యా విషయము నేను దొరగారితోఁ జెప్పి చేసెద నందును. ఇది యంతయు లౌకికము. నే నెదో నాటకములు వేసికొనుచున్నను లోకము తెలియనివాఁడను కాను. నా కెంత లోకము తెలియకపోయినచో మహా నటుఁడనైనాఁడను! ఒక్క ఖాసిమే కాదు, ఇంక నిద్దఱున్నారు. ఖాసిము పిచ్చివాడు. నా రిద్దఱిని మీ రెఱుఁగుదురు. నా రెట్టివారో మీకుఁ దెలియును గదా. వారు న్యాయస్థానపతులు. నే నీనాటకము వేయుదును. మరల నాటకమే వేయనేమో. కాదని బలవంతముచేసి పరమేశ్వరుఁడు నాచేత వేయిం

చినచో నిదికాక యింకొకనాటకము. అయ్యా! రంగనాథముగారూ! నే నింకెన్నాళ్ళో బ్రదుకను. బ్రదికినను బ్రదికినట్లు కాదు. మఱియు నొక మాట చెప్పెదను. మీరు క్లబ్బు సభ్యులనుండి యిట్టి ప్రదర్శనములు చూచుటకు నెలకు మొదట నైదురూపాయిలు తీసికొనిరి. రెండవ నెలనుండి యాఱురూపాయిలు తీసికొనుచుండిరి. నెలకు నాల్గు ప్రదర్శనములు. ఇప్పు డెనుబదిమంది సభ్యులున్నారు. నేను నాటకము వేసినచో నాకు దానిలో నూటయిరువది రూపాయలు రావలయును. వందరూపాయలు మీరు బాడిగక్రిందఁ దీసికొని తక్కిన యిరువదిరూపాయిలు నా కిప్పించినచో, బైరాగి నుండెకొడుకను, నాకు బీడీలు కావలయును గదా!

రంగనాథము నవ్వుచునే యుండెను. కాని యాలోచన చేయుచునే యుండెను. ఇట్లనెను "సారథిగారూ! మీరు నన్నెఱుగరా! నన్ను మీ రెఱుగరా! మీ రేమందురో యని యట్లంటిని" యని జేబులోనుండి యిరువది రూపాయిలు తీసి సారథి కీయఁబోయి "మీ నాటక మెప్పుడో నాకుఁ జెప్పుఁ" డనెను. కాని, రంగనాథము "తిక్కన్నగారు ధర్మరాజును మెత్తని పులి యన్నాఁడు. ఇతఁడు చల్లని నిప్పు. ఆ నిప్పులో దూకెడువఱకుఁ గాల్పదు. తాకినను జల్లగానే యుండును. లోన దూకిన తర్వాత నొక్కసారి భస్మము చేయును. అతఁ డిది యొక నిప్పు. సారథి డబ్బుతీసికొనకుండ నిట్లనెను: "నాకు మీ డబ్బు వద్దు. నేను మీ సభికులు కాని వారికి బ్రవేశపు జీట్లమ్ముదును. పాతికో పఱకో వచ్చును. అది నాకు రెండు నెలల భత్యము. కాని మిమ్ము నే నొకటి ప్రార్థించెదను. ఆ నాటకమునకు మీ యర్జునరావుగారిని దప్పకుండ తీసికొని రావలయును."

రంగనాథము "అది యేమిటండీ! అట్లనుచున్నారు! అర్జునరావుగారే మీ వేషమును జూడవలయు నని చాల సార్లన్నారు. ఒకసారి ఖాసిం దగ్గఱ కూడ నన్నట్లు జ్ఞాపకము. ఏమయ్యా! ఖాసిం" అని ఖాసింవంకఁ జూచెను. ఖాసిమున కాసంగతి జ్ఞాపకము లేదు. అట్లు జరుగనే లేదు. అతఁ డమాయకుఁడు. ఒకవేళ నన్నాడేమో, తాను మఱచిపోయితి నని యతని యుద్దేశము. "అవునవు, నన్నాఁడు" అనెను. సారథికి నిది యంతయుఁ దెలియును. ఖాసిమును, సారథియు వెడలిపోయిరి.

సారథికిఁ దా నన్న మాటలలోని కాఠిన్యము తెలియును. దుష్టుడు భయపడినను దుష్టత్వము మానఁడు. ఇఁకఁ జేతకాక యూఱకుండవలయును గాని యేమాత్రము వెసులుబాటున్నను దన దుండగీనితనమును మానఁడు. మఱియు నందులో సారథి యతనిని భయపెట్టెను. వాని రహస్యము తనకుఁ దెలిసినది

వానికిఁ జెప్పెను. అది భయ మెంత కలిగించునో కోపము నంత కలిగించును. అందుచేత సారధి ఖాసిముకంటె నితరులైన యిద్దఱివద్దకుఁబోయెను. ఈ సంగతి యంతయుఁ జెప్పెను. వా రిద్దఱు తలలూపి 'యాలాగా' యనిరి. వా 'రాలాగా' యన నర్థ మేమనఁగా, హైకోర్టుదాఁక వెళ్లితి మే యని యర్థము.

తరువాత నాల్గుదినములకు రంగనాథమునకు వారిద్దరు కనిపించిరి. వారి మొగములు చూచినంత నే రంగనాథమునకు దెలిసెను. ఇందులోఁ దాను మఱియు నేదైన కుత్సితము తలపెట్టినచో దొరగారిని దావాలలోనికి దింపినట్లగును. ఆయన తనకు సంబంధము లేదనును. తాను వ్యాజ్య మాడలేఁడు. వా రిద్దఱితో దావాలలోనికి దిగుట యనఁగాఁ దనకున్న యిరువదియూఁడెకరములు "స్థలభాండ శుద్ధిరస్తు" అన్నట్లే. వారిద్దఱు తన్ను జూచి మాట్లాడలేదు. తా నే వారిదగ్గఱకు బోయి "ఏమండీ! మన నాటకశాలలో సారధి వేషము వేయుచున్నాఁ"డనెను. అందులో నొకఁడు "అర్జునరావు గారి సమాజములోఁ జేరెనా?" యనెను. రంగ నాథమునకీ వెక్కిరింపు తెలియును. కాని యిట్లు సమాధానము చెప్పెను: "అది యేమిటండీ! సారధి తక్కువనటుఁడా? మన మెఱుఁగమా? ఒకవిధముగాఁ జూచినచో నర్జునరావుగారికంటె సారధియే గొప్పనటుఁడు. కాని యర్జునరావు గారి నాట్యము చేసి కొంచెపు విద్యావంతులకు బాగుగా నుండు"నని నవ్వెను. ఆ నవ్వంతయు వెలికి సౌజన్యమే.

సారధి తన పాత్రలంటఱను పోసచేసి తన తోఁటలో నభ్యాసము చేయు చుండెను. వాసంతికి ఈ సారి సారధి ప్రవర్తన యంతయు విచిత్రముగాఁ దోఁచుచుండెను. అతఁ డభ్యాసము చేయునపుడు కూడ నభినయించుచుండెను. ఇదివఱకు నాటకములలో నభ్యాసములో నతఁ డభినయించుచుండెడివాఁడు. అచ్చముగా నాటకమువేళ నభినయించిన నభ్యాసవేళ నటింపకపోయినను తేలికగాఁ జిత్రముగా ననుచుండెడివాఁడు. తక్కినవారు మాటలప్పగించుచో జీవాట్లు పెట్టుట, కోపపడుట, యది తా నని యభినయించి చూపుట మొదలైన వన్నియు నుండెడివి. అట్లభ్యాస మిచ్చుచున్న సారధిని జూచినఁ జూడముచ్చటగా నుండెడిది. అతనియం దమిత గౌరవము కలిగించెడిది. అతని ప్రతిభయంతయు సాక్షాత్కరింపించుచుండెడిది.

అతనిలోనున్న యభినయసరస్వతి మాటమాటకి వెలికి సముద్భవించు చున్నట్లుండెడిది. కాని యీసారి యభ్యాసమునకును, దానికి నేమియు సంబంధములేదు. ఎవఁ డేమాట యెట్లన్నను సారధి జోక్యము కలిగించుకొనుటలేదు. వాసంతి సామాన్యముగా నుచ్చారణములో దోషము సేయదు. వాక్యమునుటలో సారధి యనుకొన్న యర్థము సరిగా రాకపోయినచో నేభాగమున నొక్కవల

యునో, కాక నెట్లు పుట్టించవలయునో సారథి చెప్పెడివాఁడు. ఆ వాక్య
మనుచు నెట్లు నిలుచుండవలయునో, నిలుచున్నచోట నెట్లు కదలవలయునో
యిదియంతయుఁ జెప్పెడివాఁడు. తను సరిగాఁ జేయకపోయినచోఁ దన్ను
జబ్బ పుచ్చుకొని లాగియు, వీపుమీఁద జిఱుత దెబ్బలు వేసియు నామె నదలిం
చెడివాఁడు. అట్లతఁడు తాఁకుటచేతఁ గొట్టుటచేత జబ్బ పట్టుకొని లాగుటచేత
నామె యేదియో సుఖ మనుభవించెడి దన్నమాట. ఆ సంగతి యిప్పుడు తెలిసి
నది. ఇప్పుడతఁడు తన జోక్యమే కలిపించుకొనుటలేదు. సారథి రావలయును,
జబ్బపట్టుకొని రావలయునని యెదురుచూచును. అతఁడట్లు చేయఁడు. నాలు
గైదుసార్లెదురుచూచెను. అది యట్లు జరుగలేదు.

ఈ యభ్యాసము నాల్గయిదు దినములు జరిగెను. మఱియు రెండుదినములు
జరుగును. నాల్గవదినము జరిగినతర్వాత వాసంతి యింటికి బోయెను. ప్రతిదిన
మింటికిఁబోయి భోజనము చేసి కొంతసేపు సంగీతము పాడుకొనును. ఈనాఁడది
లేకుండ నామె భోజనము చేయకయే తనకు భోజనమువలదని గదిలోనికిఁబోయి
పండుకొనెను. ఆమె మన స్సొక విచిత్రమైన యాలోచన ప్రారంభించెను.
“ఈ యభ్యాసములు నా కెందు కుత్సాహకరములుగా లేవు? సారథి నాకేమియు
జెప్పఁడేమి? ఇదివఱకు దాను చెప్పినట్లు చేసినా? ఇదివఱకు రెండు నాటకము
లలోఁ దాను గొప్పగా నటించినచో నతఁడేమియుఁ జెప్పినది కాదే. కనుక
నతఁ డేమియుఁ జెప్పనక్కఱలే దను అందుకని యూరకుండెనేమో. రుక్మాం
గద సరే, ప్రతాపసింహ నాటకము వేళఁ జూడఁ దాను చెప్పెను గదా. ఈసారి
చెప్పవచ్చును. అతఁడు చెప్పదలఁచలేదు. నాకే కాదు. ఇతరులకును జెప్పుట
లేదు. సారథిలోఁ బూర్వపు టుత్సాహము లేదు. నాటకశాలా భవనమునుగూర్చి
మనసునకుఁ బట్టించుకొని దిగులుపడుచున్నాఁడా? ఆ దిగు లక్కఱలేదు. అది
తీర్మానమైనది. మఱి యెందుకీ ముభావము? అతఁడు నన్ను ముట్టుకొననే
ముట్టుకొనఁడే” ఆమెకు అప్పుడు మఱి యింకొక చమత్కారమైన యూహ
కలిగెను. “అతఁడు నన్ను తాఁకుట యెందులకు? అతఁడు తాఁకవలయునని నే
నభిలషించుచున్నా నన్నమాట. ఎందుకీ యభిలాష? అతఁడిదివఱకు దాఁకి
నప్పుడు నేను పొందిన మార్పేమియు లేదు. మా నాయనగారు ముట్టుకొన్నచో
నెట్లుండెనో యట్లే యుండెను. అట్లే యున్నదా? కా, దదో విలక్షణముగా
నున్నది.” ఆ విలక్షణత్వ మెట్టిదని వాసంతి విచారించెను. ఆమె కేమియుఁ దెలి
యలేదు. తన్ను తన తండ్రి తాఁకును. దగ్గఱకుఁ దీసికొనును. చెక్కిళ్లు చేతు
లతో నిమురును. తలమీఁదఁ జేయి వేయును. అందులో నామె కేమియు మార్పు
కనిపించలేదు. సరిగా నిట్లే సారథియుఁ జేయును. తండ్రి అట్లు చేయుచుం

డఁగా దన కేయూహయు నెప్పుడును రాదు. అది యేదియో మంచినీళ్లు త్రాగినట్లు, భోజనము చేసినట్లు సహజముగా నుండును. దానియందు విశేష మేమియును లేదు. అట్లే సారథి చేయుట విశేషముగా గనిపించును. హృదయమున కేదో యొక యుత్సాహమును, సంతోషమును దోఁచును. ఇప్పు డా విశేషము బాగుగాఁ దెలిసినది. అతఁడు తనకుఁ దండ్రి కాక దండ్రివలెఁ బ్రవర్తించును గనుక నట్లున్నదేమో. తండ్రి తన్నట్లు లాలించినప్పుడు తండ్రి లాలించుట సులభము. తండ్రి కాని సారథి లాలించుట విశేషము. తండ్రి కానివాఁడు తండ్రి వలె లాలించుచున్నాఁడని మనస్సులో నొక విశేషమైన యూహ పుట్టించును. అది యా యూహ కావలయును. అట్టిదైనచో నాలుగేండ్లలో నది ప్రాఁతపడి పోవలయును. పోలేదే, క్రొత్తగా నున్నట్లే యున్నదే, మఱియు నా తండ్రి నా యం దెప్పుడో తన ప్రేమ నట్లు చూపించును. అతఁ డట్లు చూపించవలయునని నేను వాంఛించుటలేదే. అతఁ డట్లు చూపించినను జూపించకపోయినను నా కొక్కటే. కాని సారథి నాయం దట్లు ప్రవర్తించుట లేదని నాకీ నాల్గుదినములు కష్టముగా నున్నది. నే నతఁడు నన్ను స్పృశించుటను వాంఛించుచున్నాను. ఒకవేళ నిట్లయియుండవచ్చును. సహజమైన తండ్రి ప్రేమకంటె నా తండ్రివలె నే ప్రేమ చూపించు మరియొకని స్పర్శ యధికప్రియముగా నుండునేమో! అని మఱియు నిట్లనుకొనెను. "సారథి నన్నట్లు స్పృశించక పూర్వ మేమో తెలియదు. ఈ నడుమఁ దాను తండ్రి తాఁకినట్లు భావించలేదు. అతడు తన్నుఁ దండ్రివలె లాలించుచున్నాఁ డన్న యూహ నాకుఁ గలిగినట్లు నాకు జ్ఞాపకము రాలేదు. సారథి యొక వ్యక్తి, నే నొక వ్యక్తిని. మా యిద్దఱి సంబంధము రక్తస్పర్శతోడిది కాదు. అతనిలో జీవుఁ డున్నాఁడు, నాలో జీవుఁ డున్నాఁడు. ఒక జీవుని కింకొక జీవునితోఁ బరిచయము కలిగినపుడు జీవుఁ డేదో సంతోషించును. అట్టి సంతోషమునే తాను పొందెను. తనకు జ్ఞానము వచ్చినది. తండ్రియొక్క లాలన తన జ్ఞానమును బరామర్శించదు. తన శరీరమును బరామర్శించును. తండ్రి కెక్కువ ప్రేమ తన శరీరముమీఁద; తనయాత్మమీద కాదు. స్నేహితుని ప్రేమ తన మిత్రుని శరీరము మీఁదఁ గాదు. అతని మనోలక్షణముమీఁద. అతని వాగ్వ్యాపారముమీఁద. అతని క్రియాచరణముమీఁద. కొడుకు మందమతియైనను తండ్రి ప్రేమించును. వానికి శరీరబాధ కలుగుట తండ్రికిష్టము లేదు. తండ్రికిఁ గొడుక నఁగా రక్తమాంసములు ప్రధానముగా నదియే. స్నేహితునకు స్నేహితుఁ డనఁగా రక్తమాంసము లప్రధానము. వాని మనోలక్షణములు ప్రధానము. అందుకని స్నేహితుఁడు మరణించినచో మఱియొక స్నేహితుఁడు "చాల మంచివాఁడురా. అట్లు మాటాడెడివాఁ, డిట్లు మాటాడెడి

వాఁ"డనును. కొడుకు చనిపోయినచోఁ దండ్రియొక్క దుఃఖము ప్రధానముగా వాని శరీరము తన కదృశ్యమైనదని. బంధు లక్షణమున శరీరము ప్రధానము. లోకమునకుఁ దద్వ్యక్తియొక్క మనోవాక్క్రియాదుల వ్యాపారము ప్రధానము. తండ్రి కొడుకు నెట్లు చూచునో కొడుకు తండ్రి నట్లు చూచును. వీ రిరువురు తమ స్నేహితులను వేఱు రీతిగాఁ జూతురు. బంధువులయందలి ప్రేమ వేఱు, స్నేహితులయందలి ప్రేమ వేఱు. స్నేహితులయొక్క ప్రేమను జీవుఁడెక్కువ వాంఛించును. అది వాని వ్యక్తిత్వస్ఫోరకము. తండ్రియందలి ప్రేమ తానిచ్చిన జన్మను స్ఫురింపఁజేయునది. స్నేహితునియందలి ప్రేమ తాను బ్రదుకుటను స్ఫురింపఁజేయునది. ఆతండ్రియు,, సారధియుఁ గాక మఱి నన్నెవ్వరు తాఁకరు. తా నెక్కువమంది స్త్రీలతోఁ బరిచితి లేనిది. లలితా కమలలు, వారి తల్లియు మాత్రమే తనతోఁ బరిచయము కలవారు. వారు తాఁకిరో తాఁకలేదో తన కెప్పుడు ప్రశ్నయే పుట్టలేదు. పురుషులు మ రెవ్వరు తన్నుఁ దాఁకరు. తన్ను తాఁకిన వృద్ధులు పురుషులలోఁ దండ్రియొక్క స్పర్శ తనకు విచారణ నెప్పుడు కలిగించలేదు. సారధియొక్క స్పర్శ విచారణను గలిగించుచున్నది. నాకిప్పుడు తెలియుచున్నది. సారధి నన్నట్లు తాఁకఁగా నది పట్టి చనవుమాత్రమే కాదు. నాలో జీవున కొక తృప్తి కలుగుచున్న దన్నమాట. ఆ తృప్తి యెటువంటిది? నా జన్మకు హేతువుకాని యొకవ్యక్తి, నాతో సంబంధము లేని వ్యక్తి నా సంగీతమునకు మోహపడియో, తన సమాజములో స్త్రీవేషము నేను వేయనిచో మఱియొక స్త్రీ పాత్రధారిని వెదుకవలెనన్న కష్టము తొలగినదన్న యూహతోడనో నాయందు ప్రాముఖ్యము చూపించుచు నన్ను గౌరవించుచున్నాఁడని యర్థము. ఇది తానన్మాత్రముగా నాగినదా యని ప్రశ్న. నేను గాయకురాల నని కొందఱు ప్రశంసించువారు కలరు. వారు ప్రశంసించుచుండఁగా నాలో కొంత సిగ్గును, గొంత యహంకారమును గలుగుట నేను జాలసార్లు పరీక్షించుకొంటిని. సారధి నన్నిట్లు పరామర్శించినప్పుడు నేను లజ్జపడుట లేదు. అహంకారమును బొందుట లేదు. నాకుఁ దెలియకుండ నే నెదో తృప్తిపొందుచుంటిని. ఈ తృప్తి యొక్క లక్షణ మెట్టిది? నేను మోహినీ వేషము వేసినపుడు నేను చక్కగా నభినయించితినని చాలమంది యన్నారు. ఆ నాఁడు నా యొడలు నాకుఁ దెలియదు. సారధి యభినయమును జూచి నే నెదో మాఱిపోయితిని. ఆ నాఁడు కొంత విచిత్రముగాఁ బ్రవర్తించితిని. నాటకమైన తరువాత సారధితోఁ జెప్పకుండ నింటికి వచ్చివేసితిని. నే నట్లెందుకుఁ జేసితినో నాకుఁ దెలియలేదు. దానిని గుఱించి విచారించవలయు ననుకొంటిని. ఇంతవఱ కాపని జరుగలేదు.

దానిని గుఱించి మఱచిపోయితిని. అప్పు డట్లేందుకుఁ జేసితిని? నాకుఁ దెలియకుండ నట్లు జరిగినది."

వాసంతి యీ యూహావలన మనస్సులో శ్రమపడిపోయెను. ఆమెకుఁ దెలియకుండ నిద్దురవచ్చినది. ఆమె గాఢనిద్రలో నుండుట చూచి శిరీషా మెను మేల్కొలుపలేదు. గవాక్షమునుండి వెన్నెల నిద్రించుచున్న యామెపైబడి యామె యచ్చరవలె భాసించెను.

## ౧౨

మఱునాటి సాయంతనమున మఱల నభ్యాసము జరుగుచుండెను. ఆనాడు సారథి మఱలఁ బూర్వపు సారథి. పూర్వపు సారథికంటె నెక్కువసారథి. అతడు వాసంతిని నిలువనీయలేదు. వెక్కిరించును, పరాచికమాడును. అట్లు చేయవలయు, నిట్లు చేయవలెయునని వేయిసార్లు చెప్పును. ఇన్ని భంగిమలలో నిలువవలయునని చెప్పును. తా నా భంగిమలు ప్రదర్శించును. ఆ భంగిమలు సరిగాఁ జూపలేని వాసంతియొక్క పాదములు, హస్తములు, మెడ, యూరువులు, బాహువులు, అంగుళులు, చిబుకము, కంటితుదలు, నడుము తాను హస్తముతో నంటి చేతులతో వంచి యప్పటికి నామెకు చేతగానిచోఁ గోపించి చిన్నచిన్న దెబ్బలు కొట్టి యొక్కొక్కప్పు డా దెబ్బలఁగూడ చుఱుకుగా నంటించి, నవ్వి పరాచికమాడి లాలించి బుజ్జగించి యేడిపించి వేయివిధములుగాఁ జివఱకత డెట్లు చెప్పెనో యట్లు చేయునఱకు వదలిపెట్టలేదు. తుట్టతుదకు వాసంతికే యచ్చెరువు కల్గెను. తా నన్నివిధములుగా నిలుచుండఁగలనని యామె యనుకొనలేదు. అతని శిక్షణలో నామె శరీరము దూది యయ్యెను. వెన్న యయ్యెను. అంతసేపు వాసంతికిఁ దాను వాసంతినన్న యభిజ్ఞ యున్నదిగాని, తాను నేర్చుకొనుచుంటి నన్న యభిజ్ఞ యున్నదిగాని దీనిని మించి యేదో తనకుఁ దెలియని స్థితిలో నున్నట్లామె యనుకొనెను. అది నాలుగైదు గంటల యభ్యాసము. తొలుతఁ గొంతసేపటివఱకు వాసంతికి వాసంతిలో మన సున్నది. తఱువాత లేదు. ప్రొద్దు క్రుంక వచ్చెను. చెప్పినదే చెప్పి చేయించినదే చేయించి సారథి యామెయందు శక్తికూడ నుడిగిపోయినదా యన్నంతసేపు చేయించెను. శారీరకముగా నంత శ్రమ వాసంతి యెప్పుడును పడలేదు. ఆమె యొడలు డస్సిపోయినది. కాని యామె మనస్సునకు శ్రమయేమియు ననిపించలేదు. ఆమె యింటికి బోయి వేన్నీళ్లు పెట్టించుకొని స్నానము చేసి కడుపునిండ నారగించి మంచముమీదఁ బండుకొనెను. ఆమె ప్రాణ మెచ్చటికిఁ బోయినదో తెలియలేదు. మరునా డామెకుఁ దెల్లకుఁ దెల్లవాఱి మెలఁకువ వచ్చెను. శరీరము లఘు

వుగా నుండెను. కాని మంచము మీదినుండి లేచుటకు మనసొప్పలేదు. ప్రొర్లుచు నట్లే పడియుండెను. తండ్రి యొకటిరెండుసార్లు వచ్చి లేచి ముఖప్రక్షాళనము చేసికొమ్మని చెప్పెను. వంటకత్తియ కాఫీ చల్లారిపోవుచున్నదని చెప్పెను. ఆమె లేవలేదు. అట్లు పండుకొని యేదో యూహించవలయునని యామె యనుకొనును. ఆమె మనస్సునకే యూహాయు వచ్చుటలేదు. చివఱకు లేవక తప్పినదికాదు. మఱల మధ్యాహ్నము రెండుగంటలకుఁ దోటకుఁబోయెను. తోటలో నొక్క సారధి తప్ప యెవ్వరునులేరు. నిన్న నభ్యాస మిచ్చినంతసేపు వేసములు వేయు తక్కినవా రందఱున్నారు. ఈనా డెవ్వరును లేరు. వాసంతి గంటసేపూఱకే కూర్చుండెను. సారధి యటు తిరుగు, నిటు తిరుగును. ఆమె నెదో పలుకరించును. తక్కిన పాత్రధారులు వచ్చుటకై సారధి విలంబము చేయుచున్నాడని యామె భావించెను. నాలుగుగంటలు కావచ్చినను మఱి యెవ్వరును రాకపోవుటచేత వాసంతి 'నేఁడభ్యాసము లేదా' యని యడిగెను. సారధి 'యెందుకు లే' దనగా 'మఱియెవ్వరును రాలేదేమి' యని వాసంతి యనగా సారధి 'నీవు, నే నుంటిమి కదా. మన్మథుఁ డొక్కఁడే రావలయు'ననెను. మన్మథుని వేషము వేయువాడు రావలయును గాబోలునని వాసంతి యచటనే కూర్చుండెను. మఱికొంత సేపటికి సారధి 'నేఁడు మన మిద్దఱమే యభ్యాసము చేయుట' యని, వాసంతిచేత బూవులు కోయించుట, పరిచర్యాదికము సర్వమును తాను తపస్సు చేయుచున్నట్లు కూర్చుండి మొదలుపెట్టించెను. వాసంతి నిన్న నితఁడు చెప్పినట్లే చేయుచుండినను నడుమనడుమ కొన్ని మఱచిపోయెను. కొన్ని చక్కఁగాఁ జేయలేదు. మఱల నిన్నటివలెనే సారధి యామెను స్పృశించుటయు, భంగిమముల కనుకూలమైన శరీరవిన్యాస మేర్పడుటకుఁ దన చేతులతో నామె శరీరావయవములను మలచుటయుఁ జేసెను. నిన్న నిట్లే జరిగెను. నిన్నటికిని నేటికిని భేద మేమనఁగా, నిన్న నితరు లుండిరి; నే డితరు లెవ్వరును లేరు. ఇతరు లుండుట మూలమున సామాన్య విషయముగా నాటకాభినయ సంబంధముగా మనస్సునకు భాసించిన విషయము నే డంతకంటె నేదో యతీతముగా భాసించెను. సారధి పూర్వము తన బుజముమీదఁ జేయి వేయుట కలదు. తన్నానుకొని నడచుట కలదు. వీపుమీదఁ జిఱుత దెబ్బలు కొట్టుట కలదు. అతఁడు తన యూరువులను, దన కటిప్రదేశమును, బాహుమూలమును, గపోలములను బూర్వ మెన్నఁడును స్పృశించలేదు. నిన్న స్పృశించెను. స్పృశించినప్పుడెల్ల నామె కదో క్రొత్తగా ననిపించెను. అది శరీరము పొందిన యొక చక్కిలిగింతగా నిన్న భాసించెను. నేఁడు నట్లే భాసించుచున్నది. కాని తదతీతమయిన యేదో యొక సుఖరేఖ లోన ననుస్యూతముగాఁ బ్రవహించుచున్నట్లు తోఁచెను.

నిన్నఁ జక్కఁగాఁ జూపిన యొక భంగిమను దానామె పూర్తిగా మఱచి పోయెను. మఱచిపోవను లేదు. నిన్న సుఖముగాఁ జేసినది నేఁడది సులభముగా రాలేదు. దానికి సారథి "ముద్దు పిల్ల" యనెను. "నీ కేమి పనియా, పాటయా? ఇంతలోఁ గూర్చుండి యది చేయించికొని తినియు, నిది చేయించికొని తినియు నీవును మీ నాన్నయు నొడలు పెంచుకొన్నారు. ఒడలు స్వాధీనములో లేనివారు వేషమునకుఁ బనికిరారు. నీవు పెద్ద యభినేత్రివి కావలయు నని నీ కున్నచో భోజన నియమము వలయును. కొంత శరీర వ్యాయామము కావలయును. ఇట్టిట్లని మోటుగా నామె యొడలు వంచెను. బాహ కలుగునట్లు బాహువులు మెదిచెను. తొడలు మెలికపడునట్లు జంఘలతోఁ జరణాధోభాగము పెడకు లాగెను. అప్పటికిని ఊరులు సరిగా వంగలేదని మోకాలును, దొడయును బట్టుకొని గుంజెను. వాసంతి తా నా బాధను నిలుపలేక కన్నీళ్లు పెట్టుకొని యొకసారి తూలి సారథిమీఁదఁబడి మెడ కౌఁగలించికొనెను.

ఈ సర్వాభ్యాస వేళయు సారథి మనస్సుచేత నామెయందు గామమును పెంచుకొనుచుండెను. ఆ కామాభివృద్ధి యట్టి మానసికముగనే యుండెను. ఎంత మానసికముగా నున్నను వాసంతిని శరీరాభివ్యాప్తి కొంత యతనికిఁ దెలియకుండ జరిగెను. సారథి మహాకాముకుఁడు. అతని కామ మొక విలక్షణమైనది. అతనికి నిజముగా స్త్రీగతమైన కామభావన యున్నదో లేదో తెలియదు అతఁడు తుచ్ఛకాముఁడని లోక మనుకొనును. అతఁడు స్త్రీతోఁ గలిసియున్నపుడు వాని కంటెఁ గాముకుఁడెన్నఁటు సారథి యనుకొనఁడు. ఆస్త్రీయు ననుకొనదు. అతఁడు స్త్రీతోఁ గలిసియున్నప్పుడు కూడ, దాదృశ మహాకాముక లక్షణములు ప్రదర్శించుచున్నప్పుడు కూడ నా స్త్రీయందు మనసా వైరాగ్యమునే భావించును. ఆ కాముకత్వమును మనసులో నిందించుకొనుచుండును. ఆస్త్రీకి నభితృప్తి కలుగవలయు ననియే యతఁ డంతటి కాముకలక్షణములను ప్రదర్శించును. కాని వాసంతి తా నిదివఱకెఱిఁగిన కొన్ని వందలమంది స్త్రీలవంటిది కాదు. అతఁడు బుద్ధిపూర్వకముగ నీచస్త్రీసంగమము చేసినవాఁడు. యౌవన ప్రథమదశావిర్భావ వేళ నతనికిఁ గామోదయము కలిగినది. అతఁడు తనస్థితి నెంచికొనినాఁడు. తనకుఁ జదువు లేదు. సంధ్య లేదు. ఆ స్థితి యంతయు నైపోయినది. ఏ దుష్టగ్రహబలమో తాను జీవితమును మరియాదగా గడుపుటకుఁ గాని, సుఖము ననుభవించుటకుఁ గాని తాను జన్మించఁదలే దనుకొన్నాఁడు. ఎత్తిన యీ జన్మ కొనసాగించుటయే యతఁడు నిర్ణయించుకొనిన విషయము. పదేండ్లు నించుమించుగా నతనికి ముప్పది యేండ్లు వచ్చువఱకు నతఁడు స్త్రీసంబంధమైన భావమును బరిహరించికొనెను. అది వానిని పట్టి పాలార్చినది. మరియాద కల స్త్రీ, నాగరకురాలైన స్త్రీ, సౌంద

ర్యవతియైన స్త్రీ మోహమును వృద్ధిచేయును. వృద్ధతరయైన స్త్రీ కామమునందు వైరాగ్యము కలిగించును అని యతడు నిశ్చయించెను. [illegible] స్త్రీ[illegible]భావము జయింపరానిదిగా నున్నది. అందుచేత దాని నతడు వెఱ కంటగా జయింపవలె నని సంకల్పింపఁదొడఁగెను. ఆకలి యగుచున్నది. దానిని సుకుమారమైన, పరమ రుచికరములైన యాహారాదులచేఁదీర్చినచో జిహ్వారుచియెక్కును. క్షుత్తుకంటె జిహ్వ బాధించును. జిహ్వారుచిని బెంచని, తక్కువపఱచెడి యాహారములు తిని నారకములై తిందమన్న యాశను గూడఁ దగ్గించును. అట్టిదే కామమని యతడు భావించెను. నీచస్త్రీసంగమము చేత స్త్రీగతవాంఛ తగ్గిపోవును. కాని యతనికి దరువాత మఱికొన్ని విషయములు తెలిసెను. నీచస్త్రీ యనగా నీచకుల సంజాత కాదు. అనభిజ్ఞాతరసభావ నీచస్త్రీయని. ఒకటి రెండుచోట్ల నతడు తన నిశ్చయమును మఱచిపోయెను. నెలయో రెండునెలలో మిన్నుమన్ను తెలియక యాస్త్రీలే సర్వపరమార్థమన్నట్లు ప్రవర్తించెను. ఆలోచనము చేసి కొని తరువాత మనసును విఱుచుకొనెను. ఆరీతిగా నతడు రెండుగెలుపులను గెలిచెను. ఇప్పుడతనికి స్త్రీగతమైన వ్యామోహమే లేదు. స్త్రీశరీరగతమైన యభి లాష లేదు. కాని యతని యాత్మ చిత్రముగా సౌందర్యవతులైన స్త్రీలను తానప్పుడప్పుడు భావించుచుండును. ఆ సౌందర్యవతులైన స్త్రీలుకూడ మనుష్యస్త్రీలు కారు; అప్సరసలు, నాగకన్యకలు. ఈ భావమును దొలగించ వలయు నని యతడు కామదహనమును సంకల్పించెను. తాను మొదట వాసంతి కాని మఱి యేపాత్రధారిగాని నాటకములో నెట్లు చేసినను దాను బట్టించుకో దలచలేదు. అభినయము సరిగా లేక పోయినను, వాచికము సరిగా లేకపోయి నను దానూఱకుండెను. నాల్గురోజు లభ్యాసము చేసిన తరువాత నతఁ డొక యూహ చేసెను. "వాసంతియందు దానాయప్సరస్త్రీలను, నాగకన్యలను భావించవలయును పార్వతీదేవి సర్వజగదేక సౌందర్యరాశి. సర్వసౌందర్య జన్మభూమి. సౌందర్యమనగా నెట్టిది? పట్టి యవయవవిన్యాసము సౌందర్యమా? హేలామనోజ్ఞత సౌందర్యమా? సౌందర్యము దేహావయవముల చాలనములో నధిక ముగా నున్నది. పరమసుందరముగా నున్నదన్న శిలాప్రతిమయొక్క సౌంద ర్యము శిల్పి యా ప్రతిమయందారోపించిన భంగిమయొక్క చారుత్వముచేతఁ ప్రకాశించుచున్నది. కనుక వాసంతి వాసంతిగా నున్నచో నతడు సంకల్పించి నది పరిపూర్తి కాదు ఆమెకు సుందరములైన బహుభంగిమములు నేర్పి నాట కము నాడువేళ దాను వానిని భావించి తన జీవునిలో నున్న యా వాంఛ నం తయు నామెయందుఁ బుంజీభవింపఁజేసి జ్ఞానఖడ్గముతో నొక్కసారి నఱుక వలెనని యతని సంకల్పము. పట్టి జీవితములో నాజ్ఞానఖడ్గము తత్కాలమున

నిన్నఁ జక్కఁగాఁ జూపిన యొక భంగిమను దానామె పూర్తిగా మఱచి పోయెను. మఱచిపోవను లేదు. నిన్న సుఃభముగాఁ జేసినది నేఁడది సులభముగా రాలేదు. దానికి సారధి "మొద్దు పిల్ల" యనెను. "నీ కేమి పనియా, పాటయా? ఇంటిలోఁ గూర్చుండి యది చేయించికొని తినియు, నిది చేయించికొని తినియు నీవును మీ నాన్నయు నొసలు పెంచుకొన్నారు. ఒడలు స్వాధీనములో లేనివారు వేషమునకుఁ బనికిరారు. నీవు పెద్ద యభినేత్రివి కావలయు నని నీ కున్నచో భోజన నియమము వలయును. కొంత శరీర వ్యాయామము కావలయును. ఇట్టట్లని మోటుగా నామె యొడలు వంచెను. బాధ కలుగునట్లు బాహువులు మెదిచెను. తొడలు మెలిక పడునట్లు జంఘలతోఁ జఘనాధోభాగము పెడకు లాగెను. అప్పటికిని ఊరులు సరిగా వంగలేవని మోకాలును, దొడ యును బట్టుకొని గుంజెను. వాసంతి తాను బాధను నిలుపలేక కన్నీళ్లు పెట్టు కొని యొకసారి తూలి సారధిమీఁదఁబడి మెడ కౌఁగలించికొనెను.

ఈ సర్వాభ్యాస వేళయు సారధి మనస్సు చేత నామెయందు గామమును బెంచుకొనుచుండెను. ఆ కామాభివృద్ధి వట్టి మానసికముగనే యుండెను. ఎంతి మానసికముగా నున్నను వాసంతివి శరీరాభివ్యాప్తి కొంత యతనికిఁ దెలియ కుండ జరిగెను. సారధి మహాకాముకుడు. అతని కామ మొక విలక్షణమయినది. అతనికి నిజముగా స్త్రీగతమైన కామభావన యున్నదో లేదో తెలియదు. అతఁడు తుచ్ఛకాముఁడని లోక మనుకొనును. అతఁడు స్త్రీతోఁ గలిసియున్నపుడు వాని కంటెఁ గాముకుఁడున్నట్లు సారధి యనుకొనఁడు. ఆ స్త్రీయు ననుకొనదు. అతఁడు స్త్రీతోఁ గలిసియున్నప్పుడు కూడ, దార్ఢ్యమహాకాముక లక్షణములు ప్రదర్శిం చుచున్నప్పుడు కూడ నా స్త్రీయందు మనసా వైరాగ్యమునే భావించును. ఆ కాముకత్వమును మనసులో నిందించుకొనుచుండును. ఆ స్త్రీకి సభితృప్తి కలుగ వలయు ననియే యతఁ డంతటి కాముకలక్షణములను ప్రదర్శించును. కాని వాసంతి తా నిదివఱకెఱిఁగిన కొన్ని వందలమంది స్త్రీలవంటిది కాదు. అతఁడు బుద్ధిపూర్వకముగ నీచస్త్రీసంగమము చేసినవాఁడు. యౌవనప్రథమదశావిర్భావ వేళ నతనికిఁ గామోదయము కలిగినది. అతఁడు తనస్థితి నెంచికొనినాఁడు. తనకుఁ జదువు లేదు. సంధ్య లేదు. ఆస్తియంతయు నైపోయినది. ఏ దుష్టగ్రహబలమో తాను జీవితమును మరియాదగా గడుపుటకుఁ గాని, సుఖము లనుభవించుటకుఁ గాని తాను జన్మించలే దనుకొన్నాఁడు. ఎట్టిన యీ జన్మ కొనసాగించుటయే యతఁడు నిర్ణయించుకొనిన విషయము. పదేండ్లు నించుమించుగా నతనికి ముప్పది యేండ్లు వచ్చువఱకు నతఁడు స్త్రీసంబంధమైన భావమును బరిహరించికొనెను. అది వానిని పట్టి పాలార్చినది. మరియాద కల స్త్రీ, నాగరకురాలైన స్త్రీ, సౌంద

ర్యవతియైన స్త్రీ మోహమును వృద్ధిచేయును. తృప్తితరయైన స్త్రీ కామమునందు వైరాగ్యము కలిగించును అని యతడు నిశ్చయించెను. స్త్రీసంభావము జయింపరానిదిగా నున్నది. అందుచేత దాని నతడు పెక్కు కరతిగా జయింపవలె నని సంకల్పింపఁదొడఁగెను. ఆకలి యగుచున్నది. దానిని సుకుమారమైన, పరమ రుచికరములైన యాహారాదులచేఁదీర్చినచో జిహ్వారుచియెక్కును. క్షుత్తుకంటె జిహ్వ బాధించును. జిహ్వారుచిని బెంచని, తక్కువపఱచెడి యాహారములు కొన్ని నారకములై తిందమన్న యాశను గూడఁ దగ్గించును. అట్టిదే కామమని యతఁడు భావించెను. నీచస్త్రీసంగమముచేత స్త్రీగతవాంఛ తగ్గిపోవును. కాని యతనికి దరువాత మఱికొన్ని విషయములు తెలిసెను. నీచస్త్రీ యనగా నీచకుల సంజాత కాదు. అనభిజ్ఞాతరసభావ నీచస్త్రీ యని. ఒకటెరెండుచోట్ల నతఁడు తన నిశ్చయమును మఱచిపోయెను. నెలయో రెండునెలలో మిన్నుమన్ను తెలియక యాస్త్రీలే సర్వపరమార్థమన్నట్లు ప్రవర్తించెను. ఆలోచనము చేసి కొని తరువాత మనసును విఱుచుకొనెను. ఆరీతిగా నతఁడు రెండుగెలుపులను గెలిచెను. ఇప్పుడతనికి స్త్రీగతమైన వ్యామోహమే లేదు. స్త్రీశరీరగతమైన యభిలాష లేదు. కాని యతని యాత్మ చిత్రముగా సౌందర్యవతులైన స్త్రీలను తానప్పుడప్పుడు భావించుచుండును. ఆ సౌందర్యవతులైన స్త్రీలుఁకూడ మనుష్యస్త్రీలు కారు; అప్సరసలు, నాగకన్యకలు. ఈ భావమును దొలగించ వలయు నని యతఁడు కామదహనమును సంకల్పించెను. తాను మొదట వాసంతి కాని మఱి యేపాత్రధారి గాని నాటకములో నెట్లు చేసినను దాను బట్టించుకొ దలచలేదు. అభినయము సరిగా లేక పోయినను, వాచికము సరిగా లేకపోయి నను దా నూఱకుండెను. నాల్గురోజు లభ్యాసము చేసిన తరువాత నత డొక యూహ చేసెను. "వాసంతియందు దా నాయప్సర స్త్రీలను, నాగకన్యలను భావించవలయును పార్వతీదేవి సర్వజగదేక సౌందర్యరాశి. సర్వసౌందర్య జన్మభూమి. సౌందర్యమనగా నెట్టిది? వట్టి యవయవ విన్యాసము సౌందర్యమా? హేలామనోజ్ఞత సౌందర్యమా? సౌందర్యము దేహావయవముల చాలనములో నధిక ముగా నున్నది. పరమసుందరముగా నున్నదన్న శిలాప్రతిమయొక్క సౌంద ర్యము శిల్పి యా ప్రతిమయం దారోపించిన భంగిమయొక్క చారుత్వముచేతఁ బ్రకాశించుచున్నది. కనుక వాసంతి వాసంతిగా నున్నచో నతఁడు సంకల్పించి నది పరిపూర్తి కాదు ఆమెకు సుందరములైన బహుభంగిమములు నేర్పి నాట కము నాడువేళ దాను వానిని భావించి తన జీవునిలో నున్న యా వాంఛ నం తయు నామెయందుఁ బుంజీభవింపఁజేసి జ్ఞానఖడ్గముతో నొక్కసారి నఱుక వలెనని యతని సంకల్పము. వట్టి జీవితములో నాజ్ఞానఖడ్గము తెక్కలమున

లభించును. లభించకపోవును. నాటకములోఁ గథావిషయగతమై యాఖడ్గము ప్రత్యక్షమగును. దానికిఁ దన పూర్వపు భావనచేతఁ బదునుపెట్టి యీ కామలతను ఛేదించుట సుకరమని యతఁడనుకొనెను. ఈ భావనాపరంపరలో నతడొకసారి తక్కిన నాటకమంతయుఁ బూర్తికాకుండగనే యీయంకము చివఱ దాను వెడలిపోవుదునేమో యని భావించెను.

ఇట్టిది యొక్క మహాసాధనావిశేషముగ భావించిన సారథి నిన్న లేడు. నేఁడే కొంతమో యేమో, వాసంతియొక్క శరీరావయవ విన్యాసము తానెఱుఁగని యొకానొక యనుద్దిష్టమైన యాభిముఖ్యముగా భాసించుటచేతనోయేమో; తనయందు వాసంతి యుంచిన సంపూర్ణవిశ్వాసమును దన యజ్ఞానముచేత విస్మరించుటచేతనోయేమో, తనయందంతర్నిగూఢమై దాగికొనియున్న యొకానొక జీవలక్షణమైన స్త్రీవాంఛయొక్క సంపూర్ణ స్వరూపమునకు సమావిష్కృతి పరమయోగ్యస్థానము వాసంతియగుటచేతనోయేమో వాసంతి తన మెడ కౌగిలించుకొనగా నామెయొమ్ము తనవక్షస్థలమునూర్ధ్వభాగమందానగా, దూలి తన మీదఁ బడుటలో నొక మనోహరహేల భాసించగా సారథిమనసు లిప్తార్ధకాలమునఁ జెదరిపోయెను. అతఁడించుమించుగా నామెను మఱల గౌగలించికొనెను. ఆమెను గాఢముగా నెదకత్తుకొని చుంబనము చేసెడువాఁడే. తల్లిప్రాచరమార్ధ భాగమున నతనికి మెలకువ వచ్చెను. వెంటనే యతఁడు గ్రహించెను. ఆమెకు భంగిమలు నేర్పుటలోఁ దచ్ఛరీరావయవగాఢ సన్నికర్షముచేత నతని మనస్సులో నతనికిఁ దెలియకుండ స్త్రీగతవాంఛ మెలఁకువచ్చెను. ఆమె యిట్లు తన మెడ కౌగిలించుకొన్నప్పుడు సువ్యక్తముగా భాసించెను. పరమేశ్వరుఁడు తనయందున్నాఁడు. లేనిచో నిన్నాళ్లు తను దొలగించుకొనుచు వచ్చిన పతనము నేఁడు నిస్సందేహము, పరిపూర్ణము నయియుండెడిది. జీవితాంత మతఁడు తాను తొలగించుకొనఁదగినదై యుండెడిది కాదు అందుకనియే తాను నీచ స్త్రీ సంగమము చేసెను. ఇదియేదియు దన్ను బాధించదు. బాధింపలేదు. ఇది బాధించదనుట లేదు.

సారథి తాను కౌగలించుకొనెను. ఆ కౌగలించుకొనుట వాసంతి తూలి పడిపోవునేమో యని పట్టుకొనుటవలె నటించి యామెను నిలువఁబెట్టి "యింక చాలులే. ఇంక నీవు చేయలేవు. ఇంటికిఁ బొమ్మనెను. ఆమె పోలేదు. అక్కడనే యుండెను. ఇంక నతఁడు నేర్పవలయుననియు, మఱియు నతని గౌగలించుకొనవలయు ననియు నామె యూహగా గనిపించెను. ఆమె శరీర మొక మధుర స్పర్శ ననుభవించుచుండెను. ఆమె యొడలామెకుఁ దెలియుటలేదు. ఒడలంతయు నది యెదో యొక రమణీయ మధురస్పర్శ వాహినీతరంగ పరిప్లుతముగా

భాసించుచుండెను. దాని స్వరూప మామెకుఁ బోడకట్టలేదు. ఆమె యట్లే నిలుచుండెను.

సారథి యిట్లూహింప నారంభించెను. స్త్రీ వాంఛ నిర్మూలించుటకు స్త్రీ సంపర్కము కావలయునా? తాను తనకు యౌవనము వచ్చిన తరువాతఁ బదుమూఁడు పదునాలుగేండ్లు దానిని నిగ్రహించెను. శరీరమునకు స్త్రీసంబంధము లేకుండ నిగ్రహించెనే గాని మనసుచేత నిగ్రహింపలేకపోయెను. ఒక్కొక్క జీవుని సాధన యొక్కొక్క తీఱు. ఆ జీవునకున్న శరీరము వాని సంస్కారానురూపము. ఒకనికి స్త్రీసంపర్క మున్నచో శరీర మారోగ్యముగా నుండును. లేనిచో రోగగ్రస్తుఁ డగును. ఈ శరీరగత కామము శతసహస్రాధిక సంఖ్యాకము. తన శరీర మొక విలక్షణమైనది. ఇది నాల్గుదినము లన్నము లేకుండ నుండఁ గలదు. నాల్గురాత్రులు నిద్రలేకుండ నుండఁగలదు. తిన్నచో నొక్కసారి పదిమంది తినునంత యన్నము తినఁగలఁడు. పండ్రెండు గంట లెత్తిన పాఱ దింపకుండ తోట త్రవ్వఁగలఁడు. మనసుతో సంబంధము లేని కామ మీ శరీరమునకుఁ గలదు. నిత్య బ్రహ్మచర్యులైన మహాత్ములు కలరు. వారి శరీరములు వారి తీవ్రవ్రతమున కనుకూలము లైనవి. నా శరీర మట్టివ్రతమునకు ననుకూలమైనది కాదు. శరీర గత శక్తియే మనుజుల నొక్కొక్కతీఱుగా మలచును. ఒక పెద్ద మల్లుఁడు రెండు వేల దండెములు తీయును; నాల్గు వేల బస్కీలు తీయును; రోజునకు బది మైళ్లు పరుగెత్తును. వాని శరీర నిర్మితి యటువంటిది. వాని శరీర మంతటి వ్యాయామమును దట్టుకొనఁగలదు. మఱియొక డధిక వ్యాయామమును జేసినచో రోగగ్రస్తుడై నశించును. ఇట్లే యొకని శరీర నిర్మితి యోగానుకూలమైనది. మరియొకని శరీర నిర్మితి యోగమున కనుకూలమైనది కాదు. నా శరీర నిర్మితి స్త్రీసంబంధము లేకుండ నారోగ్యము కలిగియుండెడిది కాదు. నేను వైరాగ్యమును బొందవలయునన్నచో దానిని మనస్సుచేతనే సాధింపవలయును గాని శరీరనిగ్రహముచేత సాధింపలేను. నాకుఁ గలిగిన కామము స్త్రీ శరీర సన్నికర్షచేతఁ గలుగును. దానిని పరిహరింపవలయును. ఇంతకంటెఁ జూడ నా శరీరగతలక్షణములు కొన్ని దుష్టములుగా నున్నవి. వానిని వానిదారిని బోనిమ్ము. అది నాయెడ గుదియ కారాదు. వాసంతి నాకు బిడ్డవంటిది. ఎవ్వరి యందును జలింపని నా మనస్సీమెయం దీవేళఁ జలించినది. ఈ చలించుటకు గారణము రుక్మాంగద నాటకము పూర్వరంగమై భాసించుట. నా మనస్సే చిత్రముగా నున్నది. కొన్నాళ్లు తీవ్రవైరాగ్యముతో నుండును. మఱికొన్నాళ్లు లోకసామాన్యముగా నూహించుచుండును. దుర్యోగమువలన రుక్మాంగద నాటకమునాఁడు నా మనస్సు వైరాగ్యభావనలో లేదు. అందుచేతఁ దెలియని వాసంతి

యొక్క తెలియని ప్రవర్తనకుఁ దలిచి నంటకట్టితిని. తగినంత యనుభవించితిని. ఈ దుష్ట సన్నివేశ మిట్లు సంప్రాప్తించినది. ఆహా! దీని నిప్పుడు గెలిచితిని. ఈమె కేమియుఁ దెలియదు. శరీరగతాభిమానమును బసిదాని కీమెకు వదలలేదు. తన తండ్రి యీమెను స్త్రీ పురుష విభేదజ్ఞానముకూడ లేకుండఁ బెంచినాడు. ఆటలు సంగీతము, భోజనము- మఱియొక భావన లేదు. తండ్రి కూతుల మధ్య జరిగెడి ప్రసంగమంతయుఁ బరవిషయమే. కాని లింగవిషయము కాదు. నేను తప్ప మఱియొక పురుషునితో నీమె దగ్గఱగా నడచికూడ నెఱుగదు. ఈ పిల్ల మనోలక్షణములు చిత్రములు. మిక్కిలి తెలివికలది. పలువిషయము లాలోచన చేసికొనును. మిక్కిలి తెలివిగా మాటాడును. స్త్రీ పురుష సంబంధమైన ప్రశంస వచ్చినచో మొగము తెల్లవేసికొని చూచును. శిరీషు డీమెకు నిచ్చలు వెన్నంటియుండును. ఆమె హృదయము పరుని గుణాదికములచేత నాకర్షింపబడకుండ నిత్యము కాపాడుచుండును. ఒక్క నా విషయములోననే అతడు శ్రద్ధ వహించెను. నన్నెఱింగినవాడు. నా హృదయరహస్యము లన్నియు దెలిసినవాడు. నా స్వభావమును గాచి వడబోసినవాడు. నన్నొక్కని నతడు వదలిపెట్టెను. తనకు, నాకు భేదము లేదనుకొనెను. వాసంతికిఁ దానెట్లో నేనట్లే యనుకొనెను. కాని యీభేద మున్నది. వాసంతి యతని కడుపునఁ బుట్టినపిల్ల. ఆ మహావిషయము జీవిత సర్వకాలము కామప్రవృత్తిని నిషేధించునది. నా యందట్లు నిషేధించెడి ముఖ్యకారణములైన జనకుడగుటయో, సోదరుడగుటయో లేదు. ఏమి మన్మథుడు! వా డీరెండు ప్రదేశములను వదలిపెట్టును. నీవైనచో బాణము వేయుటకు సిద్ధముగా నున్నాడు. ఈ మన్మథుని దహించవలయును.' అని సారథి వాని కొఱకు సవాశేరు మతాబాలమందు తెచ్చిపెట్టితిని" యనుకొనెను.

వాసంతి యింతసేపును నివ్వెఱపోయి సారథి వంకఁ జూచుచుండెను. అతడు తాను పలుకరించినను మాటాడునట్లు లేడు. కొంతసేపటికిఁ గాళ్లు నొప్పులుపెట్టి ప్రక్కనున్న బాతియరుగుపైఁ గూర్చుండెను. అప్పటి కొక యరగంటయైనది. వాసంతి యెందుకు నవ్వుచున్నావని యడిగెను. సారథి 'నీ వున్నావా' యని యడిగెను.

ఆ రాత్రిపూట వాసంతియుఁ, దండ్రియు మాటాడుచుండిరి. వాసంతి తండ్రియెడల నెక్కువ ప్రేమ గలిగించుకొని యెక్కువగా మాటాడెను. అతనికి దగ్గఱగాఁ గూర్చుండుట, యతనిని మాటిమాటికి ముట్టుకొనుట యిట్లు చేసిచేసి చివఱకొక తెచ్చికొనిన పొంగులోఁ దండ్రిమెడ కౌగిలించికొనెను. ఆసమయమున వాసంతి మొగము తండ్రియొక్క వీపునైపున నుండుటచేత

శిరీషు డామె మొగమును జూడలేదు. చూచినచో నే ప్రేమతో నామె కౌగిలించికొన్నదో యా ప్రేమ యామె మొగములో లేదు. గాఢమైన యాలోచన యున్నది. ఏదో తనలోఁ దాను చూచికొనుట యున్నది.

తన్ను వాసంతి మిక్కిలిగా ప్రేమించుచున్నదని శిరీషునకుఁ దెలియును. ఆమెకుఁ దానే సర్వస్వము. వాదించునప్పుడు తనకు వ్యతిరేకముగా వాదించుచుఁగాని తన్నుఁ బ్రేమించినట్లు మఱియెవ్వరిని బ్రేమించదని యతనికిఁ దెలియును. అతని మనస్సులో నతఁడు తన్నుఁదా వంచించుకొనును. ఒక స్త్రీ భర్తనింతకంటె నెక్కువ ప్రేమించుట యసంభవము. తన్నట్లు ప్రేమించు తన కూతురు భర్తను బ్రేమించ నేలేదని. కనుక నామె తన్ను వదలిపెట్టి యెవని యందో మక్కువ పెంచుకొనదు. కాని వాసంతికిఁ దనయం దింత ప్రేమ ప్రేమ కాదు, ప్రేమ నావిష్కరింపఁజేయుట మున్నెన్నఁడును లేదు. ప్రేమకు రెండు దశలు. మొదటిది మనోగతమైన బీజదశ; రెండవది ప్రకటించుట యను నావిష్కారదశ. తండ్రియందలి యామె ప్రేమ యొక్క మొదలి దశ సంపూర్ణము, నిరవధికమును నని శిరీషునకుఁ దెలియును. ఈ రెండవ దశ పూర్వ మెప్పుడును లేదు. రెండు దశలున్నప్పుడే ప్రేమకు సంపూర్తి. అట్లు తన మెడను గౌఁగలించికొన్న కూఁతును శిరీషు గాఢముగాఁ జేతులతో నత్తుకొని యామె బుజముపై నుద్దికొని యామె మొగమును బుజముపై నుండి తీసి మూర్ధాఘ్రాణము చేసి తాను తన జీవితమంతయు దేనికొఱకు తపస్సు చేసెనో యా తపస్సు ఫలవంతమైనదని సంతోషించుచుండెను. అత డాయానందమును బట్టుకొనలేక "అమ్మా! కొంతసేపు సంగీతాభ్యాసము చేయుము. ఈనాటకాభ్యాసము చేసిన వారముదినములు నీవు సంగీతాభ్యాసమే నెఱపలేదు. ఈనాటకము రేపటితోఁ బూర్తియగునులే, ఓపిక లేక పోయినచో వద్దు. ఎల్లుండినుంచి మొదలుపెట్టుదువుగాని. పండుకొని నిదురపోమ్మని వెడలిపోయెను. వాసంతి తాను మంచముమీద బరుండెను. ఆమె యిట్లాలోచింప నారంభించెను: "నేను నా తండ్రిని గౌగిలించికొంటిని. సారథిని గౌగిలించికొన్నప్పటి యనుభూతికిని, దీనికి నేమి సంబంధము లేదు. ఈయన నా తండ్రి. నన్ను గన్నవాఁడు. నే నాయన ప్రేవును, అన్నమనోభావమే ప్రబలముగా నున్నదిగాని నా రక్తనాళములయందేమియు మార్పులేదు. ఈ ప్రేమచేత నా శరీరములోని నెత్తురు శాంతముగానే ప్రవహించినది. అసలు నెత్తురు ప్రవహించుట మానివేసినదేమో యన్నట్లున్నది. ఈ కౌగిలింతవలన నాలో జరుగుచున్న మార్పు జాగ్రత్తగాఁ బరిశీలించితిని. నాకు మార్పేమియుఁ గనిపించలేదు. ఒడలు చల్లగా నున్నది. నామనస్సేమియు దొందఱపడలేదు. ఇంతబాగుగా విచారించలేదు కాని సారథిని హఠాత్తుగాఁ

కౌగిలించికొన్నప్పుడు నాశరీరములో నెత్తురు పరుగులెత్తినది. నామనస్సు తన యున్న స్థానమునుండి లేచిపోవునా యన్నంత దుడుకుపడినది. కనుక దండ్రిని కౌఁగలించికొనుటయుఁ, దండ్రి కానివానిని కౌగిలించి కొనుటయు నొక్కటి కాదు. ఇది శాంతమైన స్థితి. అది యశాంతమైన స్థితి. ఇచ్చట సుఖమున్నది. అచ్చట సుఖములేదు. లేదు కాని యది యెక్కువ ప్రియముగా నున్నది. శరీరములో నెత్తురు పరువులెత్తుటయు, మనసు దూఁకుటయు సుఖములు కావు కదా. కాని యదియే సుఖమనిపించుచున్నది. సుఖమో సుఖము కాదో మఱల నాయనుభూతి కావలయు ననిపించుచున్నది. అదికాక నే నప్పుడు సారథి నేర్పిన భంగిమ లభ్యసించునప్పుడు శ్రమపడి యుంటిని. గంటగంటన్నర విశ్రాంతి లేని స్థితిలో నుంటిని. అందుచేత నెత్తురు పట్ట యెక్కియున్నది. ఆలక్షణమే కౌగిలించికొన్నప్పుడు క్రొత్తగా నున్నదని యారోపించికొని పొరపాటుపడితి నేమో! అదియేదియో నిరూపించుకొనవలయును.

ఐనను నామనస్సిదియేమి యీయంతః పరిశీలనమును మొదలు పెట్టినది. నాకు బుద్ధి తెలిసినప్పటినుండి యిట్టి యాలోచన లెప్పుడును చేయలేదు ఈ యాలోచనలు దేనికి వచ్చుచున్నవి? సారథి మహానటకుడు. అతఁ డనినచో నాకు గౌరవము, ప్రేమయు. అతఁడును నాతండ్రివంటివాఁడే. కాని యిద్దఱి మధ్య నేదో భేద మున్నది. ఆ భేదము నాకుఁ దెలియకుండ నా యాత్మ గుర్తించినది. ఆ నా గుర్తించుట నాకుఁ దెలియకుండ జరిగినది. అది తెలిసికొనవలయునన్నదే యిప్పుడు జరుగుచున్నది.

ఆమెకు హఠాత్తుగా నొక యూహ కలిగెను. "నేను స్త్రీని. నాతండ్రియు, సారథియుఁ బురుషులు. ఈ స్త్రీపురుష భేద మేమిటో? పురుషుల శరీరములు వేఱు, స్త్రీల శరీరములు వేఱు. స్త్రీ యైనచోఁ గూతురు. పురుషుఁడైనచో గొడుకు. స్త్రీ యైనచో భార్య, పురుషుఁడైనచో భర్త. స్త్రీ యైనచో చెల్లెలు. పురుషుఁడైనచో నన్న, ఎందు కీభిన్నమైన నామములు?"

అనుకొనినంత నే యామె మనస్సులో నొక తళుకువలె మెఱసెను. ఆమె కంతయు దెలిసిన ట్లయ్యెను. కాని యామె కేమియుఁ దెలియలేదు ఇన్నాళ్లీ సామాన్యమైన విషయమును దాను తెలిసికొనలేక పోయితినని యామెయే యాశ్చర్యపోయెను. తన సంగీతము, తన తండ్రి నాటకములు, తండ్రి తనకుఁ జెప్పెడు వేదాంత విషయములు: మఱి యేవిషయములు తనకుఁ దెలియకుండ నిన్నాళ్లు విచిత్రముగా బ్రతికితినని యనుకొనెను. స్త్రీ పురుష విభేదములోఁ దాననుకొనిన వరుసల భేదమే పరమార్థ మని యామె యనుకొనినది. తక్కిన దేదియో తనకుఁ దెలియనిది కొంత యున్నట్లు భాసించెను. ఆమె

మనస్సున కది యేదియో తెలిసికొనకపోయినను నష్టము లే దనిపించెను. కాని తన కేదో మహావిషయము తెలిసినట్లు సంతోషించుచుండెను. ఒక్కటి గోచరించెను. తండ్రి కానివానిని గౌగిలించికొనఁగూడదు. అది సుఖహేతువుకాదు. మఱియు నొక్కటి తెలిసినది. ఆ సుఖహేతువుకానిదానియందే మనస్సులగ్నమగుచున్నది. ఈ జీవు డసుఖమును వాంఛించుచుండునా? విచారించువేళ నసుఖ మనిపించుచున్నది. అనుభవవేళ నసుఖముగా లేదే? నేను సారధి మెడఁ గౌగిలించికొనినపుడు నే నసుఖమును బొందలేదు. సుఖమును బొందినట్లే యున్నది. మనసు గుడుకు పొందుటయు, శరీరమునందు రక్తము వేగముగాఁ బ్రసరించుటయు నసుఖముగా నేను వ్యాఖ్యానము చేసికొంటిని. అది నిజముగా నసుఖమైనచో మఱల నట్టి యనుభవము కోసము నా మన స్సెట్లు కోరుచున్నది? అది యసుఖముకాదు. సుఖమే. విచారణ చేసినప్పు డసుఖము విచారదశయం దసుఖముకాని యనుభవదశ యం దసుఖముకాదు. సుఖమైనది యుభయదశలందు సుఖముగా నుండవలయును. అందుచేత సుఖముకాదు. కాని సుఖ మనిపించుచున్నది. మన సట్లే లాగుచున్నది. అసుఖమైనదానియందు మనస్సు ప్రవర్తించదు. ఇది తెంపరాని ముడిగా నున్నది. ప్రధానముగా నది శరీరము శ్రమపడ్డ వేళ సారధి మెడ గౌగిలించుకొనుటవలన జరిగిన విషయ మా శ్రమ పొందనిసమయమునఁగూడ నతనిని గౌగిలించికొన్నచో నా సుఖానుభూతి కలుగునా? సారధి కాక మఱియొకనిని కౌగిలించికొనిన నట్లే యుండునా? అస లంతటి నెందుకు గౌగలించికొందును? ఇతరులు న న్నెందుకుఁ దాకుదురు? తండ్రినే నే నానికొని నడతును. సారధి నానికొని నడతును. ఈ భేదము తండ్రి మధ్య సారధి మధ్య విచారింపఁబడినదే కాని తదితరుల విషయమున నాలోచించనక్కఱలేదు. రేపు సారధి నా ఱకె గౌగలించికొని పరీక్షించవలయును." అని యామె నిదురపోయెను. మఱునాడు సారధి నామె కలిసికొనలేదు. అతని కోస మతని తోటలోనికి వెళ్లినచో నతఁ డుండును. నాటకమునాటి ప్రొద్దున నతఁడు దుస్తులు కుట్టించుకొనుచుండును. నాటకమునకు గావలసిన పరికరములు సంగ్రహించికొనుచుండును. మఱల సారధిని గలిసికొనుట నాటక సమయమందే.

ఆ రాత్రి తొమ్మిదిగంటలకు బండివచ్చెను. తండ్రి కూతు లిద్దఱు నాట్యశాలకుఁ బోయిరి. సారధి యాదినమే వేసము వేసికొనెను. ఆమెకు వేసము వేయుటకు వచ్చెను. ఆమెకు స్తనవల్కలము లతఁడే కట్టెను. చీర యొక చిత్రమైన కట్టు కట్టెను. మొగమున నొక విలక్షణమైన తిలకమును దిద్దెను. చెక్కులయందు మకరికాపత్రము లలంకరించెను. కనులకుఁ గాటుక పెట్టి కనుకొలఁకుల కొమరు కణతలమీదికిఁ బోవునట్లు గీతగీసెను. ఆ తిలకముమీద ఫాలభాగము

నుండి పాపటలో నడినెత్తివఱకుఁ గొట్టవచ్చు నెఱ్ఱనిరంగు రేఖగాఁ దీసెను. నుదురుమీద పాపటమీఁదఁ బొడిపొడిగాఁ గుంకుమము చల్లెను. సన్నజాజుల దండలు తెచ్చి మణికట్టుల, బాహుదండముల, మెడలోఁ దానే యలంకరించెను. కట్టిన చీర సీలమండలమీద వ్రేలాడకుండఁ గుచ్చెళ్లు వెనుకకుఁదీసి బిగించెను. తెల్లని వలిపెపుఁజీర. దానిపైన వెడల్పయిన నక్కు కుట్టిన పట్టా నడుమునందు బిగించెను. చీర బొడ్డుక్రిందికి లాగెను. గుండెనుండి నాభివఱకు నల్లని రంగుతో గీతగీసి దాని కిఱువైపులఁ జిమ్ముర్లు పెట్టెను. చీర నాభిదేశమునకుఁ బైన లాగికోఁ గూడదని చెప్పెను. ఆమె వేసము నంతయుఁ బూర్తిచేసెను. తాను శివునివేసము తోడనే యుండెను. తన కా సంగతి తెలియక నీ విప్పు డచ్చముగా పార్వతి వలె నున్నా వనెను. అంతకుముందే శిరీషు డచ్చటినుండి యెచ్చటికో వెడలిపో యెను. అతడు తనకు వేసము తీర్చుచున్నంతసేపు వాసంతి యతని నేర్పునకు నివ్వెఱపోవుచుండెను. అతడు తన జడయే యూడదీసి యొక విలక్షణమైన చుట్ట జుట్టెను. తాను ముందఱ నొకయద్దము వెనుక నొక యద్దము పెట్టి యాచొల్లెమును జూచుకొనెను. అందులో నాల్గయిదు జడ లున్నవి. ఏదో సింహముఖమువలె నున్నది. తనకు సారధి గంటసేపు వేసమును వేసెను. ఆ వేసములో దన్నుఁ దా జూచుకొనఁగాఁ దనకుఁ దా నామె లోకోత్తర సౌందర్యవతి యనుకొన్నది. తన యందుఁ దన కొక యనురాగము కలిగినది. ఈ సౌందర్యము సంపాదించిన వాఁడు సారధి. అతనిమీద ననురాగము కలిగెను. ఆ సమయములోనే పూర్వ రాత్రమునఁ దనకుఁ గలిగిన సందేహము యొక్క నివృత్తి చేసికొనవలయు నన్నది. తండ్రి లేడు. తాను శ్రమపడలేదు. తనకు వేసము వేయుటలో సారధి శ్రమపడవలయును గాని తా నంతసేపు కుర్చీమీద సుఖముగా గూర్చుండెను. ఆమె తన గుండియను బరీక్షించుకొనెను. గుండె కొట్టుకొనుట సహజముగా నున్నది. సమానముగా నున్నది. సారధియందుఁ దనకుఁ గలిగిన యనురాగము తా నింత యందకత్తెగాఁ గనిపించుట కతడు హేతువగుటయే కాని మఱి యేమి యును లేదు. తండ్రి తన కొక వెలగల చీర కొన్నచో మనసునకుఁ గలిగెడు సంతో సము తన కిపుడు కలిగినది. వాసంతి తన వేసము వంకఁ బరకాయించి చూచు చున్న సారధి కెదురుగా నిలుచుండి, నిన్న సాయంకాలము తా నభ్యాసములోఁ జేయలేని భంగిమను బట్టుటకుఁ బ్రయత్నించెను. వంపులేకుండ నా భంగిమ వచ్చెను. వాసంతి యట్లు నిలుచుండి సారధి "నిప్పు డెట్లున్నా"నని యడిగెను. అత "డచ్చముగాఁ బార్వతివలె నున్నా"వనెను. వాసంతి "సారధీ! నీవేసమును నీవు జూచికొనలేవు. నీ వచ్చముగా శివునివలె నున్నావు" అని యతనిని గాఢ ముగాఁ గౌగలించికొనెను. సారధి దిగ్భ్రాంతు డయ్యెను. "ఇదియేమి? నే నీమె

లేదియుఁ దెలియదనుకొంటిని. ఈమె తెలియనిదికాదు" అనుకొని నవ్వుచు నామె చేతులు విడదీసి, "నే నచ్చముగా శివునివలె నున్నచోఁ గౌఁగలించుకొన వలయునా? ఈ నాటకములో శివపార్వతులు కౌఁగలించుకొనరు" అనెను. వాసంతి కొంచెము దూరముగా నిలుచుండి తనలోఁ దా నాలోచించుకొను చుండెను. సారథి యామెను జూచి, యామె పరిష్వంగసుఖ మనుభవించుచున్న దనుకొనెను. అతని మనసులో టాయిపడెను. అపుడు వాసంతి యిట్లనెను: "ఇది పార్వతి శివునిఁ గౌఁగిలించుకొనుట కాదు. వాసంతి సారథిని గౌఁగలించుకొనుట" యనెను. ఆమె యనదలచుకొన్నది యిదికాదు. "వాసంతి తన తండ్రికాని యింకొక పురుషుని గౌఁగలించుకొనుట" యని యామె యనవలె ననుకొన్నది. ఆమెకుఁ దెలియకుండ 'సారథి' యన్నమాట వచ్చెను. సారథి వెంటనే యీదోషము సరికట్టఁదలచెను. "తల్లీ! స్త్రీ పరపురుషునిఁ గౌఁగిలించుకొనరాదు."

వాసంతి-పరపురుషు డనగా నేమి?

సారథి-భర్తకానివాడు.

వాసంతి-భర్తనుకౌఁగలించుకొనవచ్చునా?

సారథి-భర్తనే కౌఁగిలించుకొనవలయును.

వాసంతి-తండ్రిని గౌఁగిలించుకొనరాదా?

సారథి-వాసంతీ! నీకుఁ దెలిసి యడుగుచున్నావా? నీవు దెలియక యడుగుచున్నావా?

వాసంతి-"తెలియుట యేమి, తెలియకపోవుటయేమి? ఏమి తెలియవలయును? అఁ! నాకొక యనుమానము కలిగినది. అది నివర్తించుకొనుట కడుగుచుంటిని. దీనిని గుఱించి చాలఁ జెప్పవలయును. అదిగో గంట కొట్టినాడు. నేను వెంటనే రంగభూమి కవతరించవలయును. రేపో యెల్లుండియో వచ్చి యడిగెదను. నీకు నాటకమైన మఱునాడు పిచ్చియెక్కును. తోటలో నుండవు. ఊపెచ్చుటకిని బోవుము." అని రంగభూమి కవతరించెను.

అంతవఱకుఁ గొంతనాటక మయ్యెను. ఇంద్రుడు తారకుని బాధలు బ్రహ్మతోఁ జెప్పుట, బ్రహ్మ శివునియొక్క తేజమే తారకుని వధించ వలయు ననుట, ఇంద్రుడు మన్మథుని బంపించుట యైపోయెను. ఈ యంకమున నారదుడు హిమవంతుని దగ్గఱకు వచ్చును. అపుడు పార్వతి కూడ హిమవంతునిదగ్గఱ నుండును. ఇది కొంచెము పెద్ద యంకము. అప్పటికే రాత్రి పన్నెండు కావచ్చినది. దీని తరువాతి యంకములోఁ గాని శివుడు రాడు. సారథి యచట నిలుచుండి యాలోచించుచుండెను.

"వాసంతి కది తనమీది ప్రేమ కాదు. ఆమెకు లోకజ్ఞానము లేదు. లోకజ్ఞానము లేకపోవుటయేమి, లోకజ్ఞానము కావలసినంత యున్నది. స్త్రీ పురుష విభేద పరిజ్ఞానము లేదు. ఆమెలోని యౌవనము తా నాయౌవన మెందులకో వెదకికొనుచున్నది. లోకములోఁ బండ్రెండేండ్ల స్త్రీకే యాభావము కలుగుచున్నది. అది వారికి సహజముగాఁ గలుగుట కాదు. వారి పెంపకములో వారి చుట్టుపట్ల జరిగెడి పరిస్థితులలో నాభావము వారికిఁ బెందలకడనే కలుగుచున్నది. ఆ భావము వారిని వీరిని జూచి నేర్చుకొన్నది గాక సహజావిష్కృతి పొందునట్టి పెంపకము. శిరీషుడు పెంచినాడు. పదునాఱేండ్లు దాటుచున్నవి, మంచి పోషణగల పిల్ల. ఊహాశాలినియైన బాలిక. తండ్రివలన బహువిషయములు విన్నది. తండ్రి చదివిన విషయములు తాను దండ్రియుఁ గలిసి విచారించుటచేత నూహాశక్తి యెక్కువైనది. ఈ స్థితిలో నున్నది. నన్ను ప్రేమించుట లేదు. నన్నెందుకు ప్రేమించును? ఆమెయే యన్నదికదా- నీవు నా తండ్రివంటి వాడవని. బ్రదికితిని. ఆమె మనస్సులో నేదియో యూహాయున్నది అది యెదో రేపు చెప్పును కదా" యనుకొనెను. శిరీషుడు మఱల రాలేదు. అతడు తన పాతు వేషము వచ్చునని పోయి సామాజికులలోఁ గూర్చున్నాడు. వెనుకటి యంకము పూర్తియయినంత తెఱ వ్రాలినది. మఱలఁ దెఱనెత్తుటకుఁ జాలజాగైనది. ఈలోపుగా నతడు సామాజికులను బరిశీలించుచుండెను. ముందువరుసలో దొరగారు కూర్చున్నారు. ఆయన కెడమవైపున రంగనాథము కూర్చున్నాడు. కుడివైపున నర్జునరావు కూర్చున్నాడు. క్లబ్బులోని సభ్యులందఱు నుండిరి. కిరీటి తన ప్రక్కనే కూర్చుండెను. ఉమాపతి యెప్పుడును ముందటి నేలమీద గూర్చుండును. అతనివంకఁ జూచి శిరీషుడు నవ్వెను. ఆయనయు నవ్వెను. వారి పరిచయమున కౌద్యంతము నదే. వెనుకటి నేలలో నెవ్వరును లేరు. పదిపదేను మంది కూర్చుండిరి. సభలో టిక్కెట్టుకొని వచ్చినవాడు కనిపించలేదు. అర్జునరావు వేషము వేసినప్పుడు ముందు వెనుక నేలలు కిటకిటలాడిపోయెను. శిరీషుడవధానికోసము వెదకెను. ఆయన యెక్కడను గనిపించలేదు. అర్జునరావు నాటకమును జూచుటకు వచ్చుట యందఱకు నాశ్చర్యముగా నుండెను. అనగా నర్జునరావంతటివాడు తానీ నాటకమును జూచుటకు రాడు. అతడు మంచివాడు కనుక వచ్చెను.

తెఱ యెత్తబడెను. హిమవంతుడు గూర్చుండెను. ఇదివఱకు నతడెప్పుడు వేషము వేయలేదు. అత డాఱడుగులకంటె నెత్తయిన మనిషి. అతని మొగమున కట్టిని [illegible]రం గుండెను. తక్కిన శరీరమెల్ల గ్రిందెంతయో వదులుగా నున్న తెల్లని బురఖా తొడిగికొనెను. అతడు కూర్చుండడు. ఎప్పుడు నిలుచుం

డియే మాటాడును. తలమీద నొక తెల్లనిపాగా ధరించెను. ఆపాగాపైన మూడు కోసలుండెను. నారదుడు వచ్చెను. ఇంతలోఁ బార్వతి వచ్చెను. ఆ పార్వతి సారథి చెప్పినట్లు నడచుచువచ్చెను. జనమంతయు కరాస్ఫాలనములచేత సభనంతయు మార్మోగునట్లు చేసిరి. నారదుడు కాని పార్వతికాని మాటాడునప్పటి యభినయము తీర్చినట్లున్నది. వివాహము పేరు చెప్పినపుడు వాసంతి లజ్జాభినయము చేయుచు నొక భంగిమలో నిలుచున్నది. ఆమె యావేసము, నా సౌందర్యము, నా యభినయము దొరగారి గుండెలో శూలములవలె గ్రుచ్చుకొనెను. "మీ రా యమ్మాయి యెంత యందగత్తెయో పూర్వము సరిగాఁ జూచి లేదు దొరగారూ" అని రంగనాథము చెప్పిన మాట యెంత నిజము!

ఆ రంగ మైపోయినది. అర్జునరావు రంగనాథము బలవంతముచేతఁ బిచ్చినాటక మొకదానిని జూచుటకు వచ్చితి ననుకొనినవా, డింతవఱకుఁ బిచ్చినాటకము నే చూచుచుంటిననుకొనినవాడు తాను కదలిపోయెను. సారథి తక్కిన పాత్రలను గుఱించి, తక్కిన రంగములనుగుఱించి తాను శ్రద్ధ తీసికొనలేదు. ఈ రంగము, తాను వచ్చు తిరువాతిరంగము వీనిని గుఱించియే శ్రద్ధ తీసికొనినాడు. ఆ సంగతి యెవరికిని దెలియదు. తెఱ పడినది. సభలో నా రంగముయొక్క తీర్పునుగురించి, వేసములనుగూర్చి, వాసంతియొక్క యభినయమునుగూర్చి ప్రక్కవానితో ననని వాడు లేడు. నారదుని వేసము విలక్షణముగా నుండెను. నారదునకు, హిమవంతునకు నొక్కటియే భేసము. నారదుడు వేసికొనిన తెల్లని యంగీ క్రిందఁ బాదములు కనిపించుచుండెను. నారదునకు గడ్డములు, మీసములు కలవు. తెల్లని గడ్డము, తెల్లని మీసము, తెల్లని జడలు. హిమవంతునకు గడ్డము మీసములు లేవు. హిమవంతుడు వేసికొనిన యంగీ నేలమీదికిఁ జాలభాగము ప్రాలి బొమ్మకడనుండి వ్యాపించి నేలమీదఁ జాలదూరమునందు గుండ్రముగా నుండి పర్వతాకారము వచ్చినట్లుండెను. నారదుని వేష మట్లుండుననని యెవ్వరనుకొనలేదు. క్రొత్తగానున్నది. వారికిఁ దెలియలేదు.

తెఱపడిన తరువాత శిరీషు డుమాపతిదగ్గఱకుఁ బోయి కూర్చుండెను. "అది యేమండీ! నారదుని వేస మట్లు వేసెను" అనెను. ఉమాపతి నవ్వి యూరకుండెను. శిరీషుడు మఱలనడుగగా నుమాపతియిట్లనెను: "నారదుడు దేవర్షి. సర్వజ్ఞుడు" మఱల దెఱ యెత్తఁబడెను. రంగము చిత్రముగ్గా నలంకరింపఁబడెను. అది యడివిగా నుండెను. సారిధి తన తోటలోని మొక్కలు తెచ్చి యచ్చటఁ బెట్టినట్లున్నాడు. సారథిముందుగూడ మొక్క లున్నవి. అవి కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. వాని నేర్పాటుచేసిన పద్ధతి యభినయించువారి యభినయము సామాజికులకు దృష్టినిరోధము లేకుండఁ గనిపించును. సారథి పులితోలు కట్టలేదు.

మెడలోఁ బాములు లేవు. జటాజూటమునందు గంగవలె బొమ్మ పెట్టలేదు. గంగ దూఁకుచున్నట్లు కనిపించుటకుఁ బ్రయత్నమే లేదు. శరీర మంతయు నెఱ్ఱని విన్నియ పూసికొనెను. కంఠముమాత్రము నల్లగా నుండెను. మొగమునం దేమి రంగులుకలిపి పూసికొనెనో చూచెడివారికి మహాశివుని జూచినట్లుండెను. ఫాల మునందు గన్నుండెను. కనురెప్పలు పైరెప్ప వెంద్రుకలు విస్పష్టముగాఁ గనిపించుచుండెను. అదియొద్దో వేసి కట్టినట్లున్నాడు. జడ లెఱ్ఱగా నున్నవి. బంధింపబడియున్నవి. యోగదండముమీద వ్రాలి పద్మాసనము వేసికొని సమాధి స్థితుడై యున్నాడు. అందఱ కాశ్చర్యము కలిగెను. శివు డెట్టివాఁడా యని శిరీషు డుమాపతి నడిగెను. ఉమాపతి "యీశివుడు తపస్వి. అతని తపోగ్ని జడల యందును శరీరమునందును వ్యాపించి యెఱ్ఱపడె"నని చెప్పెను. పార్వతి వచ్చి నది. వీరి యిఱువురి నడుమఁ బ్రక్కతెఱలో మన్మథుడు బాణమెక్కువెట్టి నిలు చుండెను. వాసంతి పోయి శివునివద్ద మోకరించి కూర్చుండెను. శివుడు కన్నుల దెఱచెను. ఈమె పూవుఁబుట్ట శివుని కందించెను. అప్పుడు బాణముపడెను. అట్లు నిశ్చలముగా గూర్చున్న సారథి యొడలి యెఱ్ఱతనము సర్వము మాఱిపోయెను. జడలు తెల్లపడెను. అతని శరీరమునందున్న ప్రత్యంగుళ సహస్రాంశము మేఱ శరీరము పులకరించెను. ఆపులకరించుట సామాజికుల కందఱకుఁ గనిపించెను. ఆయెఱుపంతయుఁ దెలుపెట్లయ్యెనో యెవరికిని దెలియలేదు. పూవు బాణము రివ్వున శివునిమీదఁ బడుట కనిపించెను. మహార్నవమిధనుస్సు వంటి ధనుస్సుచేసి పూవుగా బుట్టపెట్టి దానినిండ దెల్లని బుక్కాము పోసి యాబుక్కామంతయుఁ దన తలమీద, యొడలిమీద లిప్తలో నెట్లు వ్యాపించు నో యట్లా బాణమును వేయుట మన్మథుని వేసము వేసినవానికి సారథి నేర్పెను. అది యెవ్వరికిని దెలియదు. కడచిన పదునేను దినములనుండి యర్ధరాత్ర మున వాని కది నేర్పెను. వాని కాయభ్యాస మిచ్చుచున్న సమయములందు సారథి కింత ధనుర్విద్య యెట్లు తెలియునని యా మన్మథపాత్రధారి యాశ్చర్య పడుచుండెను. సారథి కాగితములతో నా పువ్వు నట్లు తయారు చేసెను. ఆ పూవు తన జడమీద బడినంతనే తాను సమగ్రీవానాభిదేశుడై కూర్చున్న ప్పు డాబుక్కామంతయుఁ దన జడలమీదఁ దన యొడలిమీద సంపూర్ణముగా గ్రుమ్మరించును. పూవురేకులలో మిగులనే మిగులదు. అది యట్లు చల్లుకొను నా కాగితములో నతడు మడచిన మడుపులు నా నడుమనడుమఁ బోసిన బుక్కాము తన సర్వశరీరముమీదఁ బడునట్లు మలచెను.

సారథి కనులు పెద్దవిగాఁ దెరచి పార్వతివంకఁ జూచెను. వాసంతి భయ పడెను. ఆమె వెనుకవెనుకకుఁ బోయెను. శివుడు కదలలేదు. కదలెను. ప్రక్క

చూపు చూడలేదు. చూచెను. నవ్వలేదు. నవ్వెను. అది యేమి యభినయమో యెవ్వరికినిఁ దెలియలేదు. ఎవ్వరికిని గుటకపడుటలేదు. అందఱు నొక విగ్రాంతిలో నుండిరి. సారధిలో నేదో మార్పు వచ్చినట్లున్నది. [illegible]రాలేదు. కొదనుటకు వీలులేదు. జౌ ననుటకు వీలులేదు. ఇంతలో నదివరకే సారధి శిథిల సమాధి బంధుడైనాడు కాబోలు, నప్పుడెవ్వరును గుర్తించలేరు. ఇప్పుడు మఱల దేహమును నిక్కించెను. ఆ నిక్కించిన పద్ధతి యెట్టిదో యతని శరీరము మఱల నెట్టఁబడెను. తల కదలించెను. జడ లెత్తబడెను.

ఆ బుక్కా మంటుకొను, నంటుకోదు. సారధి దానిని తెచ్చెను. దానిలో నేదియో కలిపెను. ఆ యూరి పాఠశాలలో నొక ప్రకృతిశాస్త్రోపాధ్యాయుడు కలడు. అతడు పదార్థ తత్త్వాభిజ్ఞుడు. అతనికి, సారధికి జాల స్నేహము. అతని దగ్గఱ నిట్టివి సారధి తెలిసికొనుచుండును.

శివుడు నాల్గు వైపులఁ బరికించి చూచెను. ప్రక్క తెఱలోఁ బ్రత్యాలీఢ పాదుడైన మన్మథుడు కనిపించెను. శివుని నోటివెంట హుంకారము బయలుదేఱెను. సారధి తన ఫాలమునందు నొక్కెను. ఫాల నేత్రముయొక్క కనుఱెప్పలు తెఱచికొని లోనుండి మన్మథుడున్న తావున కొఱని యొక తీగ వ్యాపించెను. సభికు లందరు దీనిని జూచుచుండిరి. కన్ను తెఱవైపునకు మఱలు సరికి నచ్చట యెఱ్ఱని మహాగ్ని మండుచుండెను. తెఱలోనుండి హా హా యని కేకలు వినిపించెను. వెంటనే తెఱపడెను. తరువాత నైదునిముసములు గడచినవి. మఱలఁ దెఱ లేవలేదు. లోన సారధి తన కంటినుండి మంట వెలికివచ్చినట్లు నటించిన సమయమునందే కూర్చున్న పీటమీదినుంచి క్రిందఁబడెను. వేషధారు లందఱు చుట్టుమూగిరి. వాసంతి వచ్చి యాదుర్దాపడుచుండెను. లోపల నేదో యాపద కలిగినట్లు సామాజికులకుఁ బొడకట్టెను. కారణమేదియో తెలియలేదు. కిరీటి, శిరీషుడు, నుమాపతియు లోనికిపోయిరి. ఉమాపతి యందఱను దొలగుడనెను. సారధిని తెఱవెనుకకు దీసికొనిపోయిరి. ఉమాపతి ముక్కుక్రో వులకడ వ్రేలు పెట్టి చూచెను. ఊపిరాడుచున్నది. గుండెమీదఁ జేయివైచెను. నాడిచూచెను. నాడిలో దోష మేమియులేదు. అందఱును వెళ్లిపొండనెను. సారధి వేషము వేసికొనుటకు నది యొక చిన్న గది. ఉమాపతి తలుపువేసి సారధి చెవిలో నేదియో చెప్పనారంభించెను. రెండు నిముసములు గడచిన తరువాత సారధికి స్మృతి వచ్చెను.

సారధి-ఏమైనది?

ఉమాపతి – సారధీ! నీవు నాదగ్గఱ నేర్చుకొన్నవాడవు. నీకు సిద్ధి కలిగినది. నాకీ జన్మకు గలుగదుకదా, పది జన్మలకుఁగూడఁ గలుగదు.

సారథి-నేను నిద్రపోలేదు, నా శరీరము క్రింద బడ్డది. నాకు దెలియును.

ఉమాపతి-నాకును దెలియును.

సారథి-సామాజికులలోఁ బెద్దధ్వనిగా నున్నది. సామాజికులు వెళ్లిపో లేదా? నాటక మైపోయినదికదా!

ఉమాపతి-నీవుపోయి చెప్పవలయును.

సారథి-మూడవ కన్ను తీసి జడలఁ తొలగించి తొందఱ తొందఱగా ధోవతి కట్టుకొని చొక్కా తొడిగికొని ముండాసె తల ద్రోసికొని రంగభూమి యొక్క పరమపురోదేశమున నిలుచుండెను. సామాజికులందరు నిశ్శబ్దముగా నుండిరి. సారథి రాజాగారికి, నర్జునరావునకు, రంగనాథమునకు నమస్కరించెను. రంగనాథము తబ్బిబ్బయ్యెను. అత డిట్లనెను: "అయ్యా, నాటక మైపోయినది. ఇది కామదహనము. రతీవిలాపము నే నిందులోఁ బెట్టలేదు. ఏదో యభినయించితిని. ఇది నాటకము కాదని నాకు దెలియును. మీరు క్షమించవలయును. ఇంక మీ రింటికి బోవచ్చును. క్షమించుడు. సెలవుతీసికొందును." సభాసదులు జాప్యముగా లేచి యొకరొక్కరే వెడలిపోయిరి.

ఆ మఱునాడు క్లబ్బులో దీర్ఘచర్చలు ప్రారంభింపబడెను. "అది యేమి నాటకము? అందులోఁ గథయులేదు, పాడునులేదు. శివుడు నాయకుడా. అత డొక్కమాట మాటాడినది లేదు. మన మతడు నటించెనని యనుకొనవలయును.

"ఆ వాసంతి లేకపోయినచో నాటకమంతయు బగ్గుమపాడు. ఆ హిమవంతు డదియేమి? నారదు డది యేమి? నారదుడు వీణ లేకుండ నుండునా? ఆ తెల్లని బురఖా యేమిటి?"

"అన్నిటికంటె హిమవంతుడురా. మనము కొండ నిలుచున్న దనుకొనవలయును. నెత్తిమీదఁ గిరీటము చూచితివా? ఒకటి ఎవరెస్టు. ఒకటి కాంచన గంగ. ఒకటి కైలాసము. అంతయు ధ్వనిమయము. ధ్వని లేని ధ్వని."

"అర్జునరావుగారు సభలో నుండగా నే మొగము పెట్టుకొని యీ నాటకము వేసినాడు? తా నిదివఱ కీయూరిలో నటుడు. ఆ రోజులు వెళ్లిపోయినవి"

"మన క్లబ్బు సభ్యులు లేకపోయినచో నాటకము జూచెడివాడు లేడు. గొప్ప సమాజమున కాడెడివాడు. కుర్చీలకు బెంచీలకు. నిజానికి ఆనాటకము జూడదగిన దదియే."

"ఇటువంటి ప్రదర్శనములు నెలకు నాల్గు జూచినచో మన మిచ్చు నెల సరి చందా యాఱురూకలును నిచ్చుట మానివేయవచ్చును. అస లీ నాటకము వకు మనకు ముదరా రావలయును."

ఇట్లనుకొనుచుండగా రంగనాథము, నర్జునరావును వచ్చిరి. వారు వచ్చిన తరువాతఁ గూడ నీ విమర్శన మిట్లే సాగెను. రంగనాథము నవ్వెను. ఆనవ్వులో ననేకయనేకార్థములు. సారథి వ్యర్థుడని యొక యర్థము. వా రన్నమాట నిజమే యని యొక యర్థము.

అర్జునరావు మాట్లాడలేదు. ఎవ రేది చెప్పినను దల పంకించి యూరకుండెను. తమ విమర్శల కన్నింటికి నర్జునరా వంగీకరించినా డనియుఁ, బెద్దమనిషి తమ హాకు భంగమని సమాధానము చెప్పడనియు నందరనుకొనిరి. అందులో నొకరు డర్జునరావును గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. "మాకు నాటకములోని మెలకువలు తెలియవు. మీరు తెలిసినవారు. మేము బాగుగా నుండలేదని యనుకొనుచున్నాము. మా యభిప్రాయములు నిజమా, యబద్ధమా మీరు చెప్పు"డనెను. అర్జునరావు కొంత సే పాలోచించి "యీ నాటకము నాకును సరిగా నర్థము కాలేదు. మఱికొంత యాలోచించి చెప్పెద" ననెను. మఱియొకడు "సారథి గొప్ప నటకుడనుకొనా కాదా' యని యడిగెను. "అరె! అతడు నోరే తెరువలేదాయె. అర్జునరావుగారి నేమి చెప్పమందువురా" యని యింకొక డనెను. ఇట్టి మాటలతో సరిపోయెను. మొత్తానికి సారథి యెందుకుఁ బనికిరానివా డనియే నిర్ణయింపబడెను కొందఱు రంగనాథముతో "కవీశ్వరా! బలే మంచి నాటక మాడించితివయ్యా!" యనిరి. నాటకమున కవధాని రాకపోవుట యవధాని వివేకముగా వ్యాఖ్యానము చేయఁబడెను. మఱియొక డిట్లనెను. "తెఱ దిగినతరువాత రంగములోఁ బెద్ద గందరగోళము జరిగినది. మీకుఁ దెలియునా" యని యడిగెను. అందఱు "నేమి జరిగినది,యేమి జరిగినది చెప్పు"మనిరి. అతడు తనకుదెలిసి చెప్పుట కిష్టము లేనివానివలె గొంతినటించి "వాసంతితండ్రి శిరీషుడు లోనికిఁబరుగెత్తెను. తెలియ లేదా" యనెను. వినవలె నన్న యాశ యందఱకుఁ దటసూపెను. అందఱు వ్యగ్రముగానుండగా నత డిట్లనెను: "ఆమె పార్వతియట. తాను శివుడట. అదే యల్లరి. ఆమె పెద్దగా నఱచినది. నాటక సమాజములోని వా రందఱు వచ్చి చూచి సారథిని జీవాట్లు పెట్టిరట. అప్పుడు శిరీషునకుఁ గోపము వచ్చెను. అందఱు సర్ది పంపించిరి."

అందఱు ముక్కు మీద వ్రేలిడికొనిరి. "ఇటువంటివారు నాటకము లాడుట వలననే నాటక సమాజములకు మర్యాద లేదు. అర్జునరావుగారి వంటి నీతిమంతుడు, మర్యాదస్థుడు, శీలవంతుడు నాటకములు వేయువలయుఁ గాని యీ సారథిని మన మెఱుగమా? విశాలాక్షి పూటకూళ్ల బసయే దానికిఁ బ్రబలసాక్షి. ఆ మాధు డున్నాడే శిరీషుడు – వానికి బుద్ధిలేదు. గాయకురాలిచేత నాటకము

లలో వేషము వేయించుట యేమి? ఇంక వానితోఁ జచ్చినను మఱల వాసంతి వేషము వేయదు."

సరిగా నా సమయమునకే వాసంతి సారధి తోటలోనికి వెళ్ళెను. సారధి యొంటరిగాఁ గూర్చుండెను. సారధి యిట్లనెను. "నీ కోసము కూర్చున్నాను. నేను ప్రతిపద జ్యేష్ఠను. నా కాలిలో దురదపెట్టుచున్నది. నీవుందువన్నావని యెచ్చటికిని బోలేదు."

వాసంతి - సరే, మంచి పని చేసితివి.

సారధి - నా కేదియో చెప్పెదనంటివి కదా? వాసంతీ! నా మాట విని నీవు తొందరగాఁ బెండ్లి చేసికొనుము.

వాసంతి - మా నాయనగారు నన్ను పెండ్లి చేసుకోవద్దందురు. పెండ్లిచేసికొన్నచో నా సంగీత విద్య నశించిపోవునట. పెండ్లి చేసికొన్నను భర్తను ప్రేమించుటయే కదా. ఆ ప్రేమ యంతయుఁ దండ్రిమీదనే చూపించవచ్చును.

సారధి - తండ్రిమీదఁ జూపించు ప్రేమ వేఱు, భర్తమీద జూపించు ప్రేమ వేఱు.

వాసంతి - అది యడుగుటకే వచ్చితిని. ఆఁ! రాత్రి నీవు భర్తను దప్ప మఱి యెవ్వరిని గౌగిలించరాదన్నావు తండ్రిని కూడ గౌగిలించికోవందా?

సారధి - తండ్రి నెవ్వరు కౌగిలించుకోరు.

వాసంతి - మొన్న రాత్రి నేను కౌగిలించుకొన్నానే?

సారధి - ఊరకే కౌగిలించుకొనవచ్చును.

వాసంతి - ఊరకే కాక?

సారధి - అది యట్లుంచుము. మొన్న రాత్రి నీవు నన్ను గౌగిలించుకొంటివి. ఎందుకు కౌగిలించికొంటివో నాకుఁ జెప్పెదనంటివి. ముందఱ నది చెప్పుము.

వాసంతి - సారధీ! దీనిని గుఱించి మొదట నాలోచించినప్పుడు నాకు వట్టి తెలిసికొనవలసిన సంగతిగా గనిపించినది. తరువాతఁ దరువాత నాకుఁ గారణము తెలియకుండ సిగ్గువేయుచున్నది. నన్ను నీవును, నాన్నగారును తప్ప మఱి యెవ్వరును దాకరు. నాన్నగారు, నీవు నా బుజాలమీదఁ జేతులు వేయుదురు, నన్నానుకొని నడుతురు. నీవు నన్నానుకొని నడచినపుడు నాకుఁ జాల సరదాగా నుండును. మొన్న నీవు నాకు భంగిమలు నేర్పునపుడు నే నలసిపోయి నీమెడ గౌగిలించుకొంటిని. నీవు మఱలఁ గౌగిలించుకొన్నావు. ఆసమయమున నాయొడలిలోని నెత్తురు పరువెత్తినది. నా మనస్సు దూకినది. దాని స్వరూపమును విచా

రించినాను. నాన్నగారిని గౌగిలించికొన్న గూడ నట్లే యుండు నేమో యని యాయనను గౌగిలించికొంటిని. అట్లు లేదు. నాకొక సందేహము కలిగినది. భంగిములు జూపి చూపి నేనలసిపోయితిని. అప్పుడు నిన్ను గౌగిలించుకొంటిని. ఆ నెత్తురు పరుగెత్తులు నా శ్రమచేత నేమో యనుకొంటిని. అది యానో కాదో యని రాత్రి పరీక్షించితిని.

సారథి కూర్చున్నవాడు కూర్చున్నట్లు క్రుంగిపోయెను. అతనికి వాసంతి మీదఁ జెప్పరానంత గౌరవము కలదు. ఈమె మనుష్యస్త్రీయా, దేవతయా యని పించినది. వయసు వచ్చిన తరువాత నాలుగేండ్లకు నామె యట్టి స్థితిలో నున్న దనగా గాళిదాసు చెప్పినట్లామె వాసన చూడని పూవనిపించెను. ఇంత యమాయకురాలేనా యనిపించెను. ఇంత విచారణదక్షురాలియం దమాయికత యెట్లు న్నదని విచారించెను. కొంతసేపాగిన తరువాత నిట్లనెను: "సరే, నీ తండ్రిని గౌగిలించికొన్నట్లే యున్నదికదా. అందులో విశేషమేమియు లేదు" వాసంతి సారథివంకఁ దీవ్రముగాఁ జూచి యిట్లనెను: "శర్ధీ! నాకిదివఱకేదియుఁ దెలియదు. ఈ మూడు రాత్రులనుండి నాకుఁ జాల తెలిసినది. నన్ను మోసపెట్టుటకు నీవట్లనుచున్నావు. నేను నిన్ను గౌగిలించికొన్నప్పుడు మా నాయనగారిని గౌగిలించికొన్నట్లు లేదు. ఏదో క్రొత్తగా నున్నది. బాధగా నున్నది. ఏదో తెలియని యాశగా నున్నది. అది సుఖముగా నాకు గనిపించుటలేదు. రాత్రి నిన్ను నేను గౌగిలించికొన్నప్పుడు నే నేమి శ్రమపొందిలేను కాని నామనస్సు పరుగెత్తెను. శరీరములోని రక్తము వేడియెక్కెను. దీని కేదో కారణ ముండవలయును. నీవు రాత్రి పరపురుషుని గౌగిలించుకొనరాదంటివి. భర్త నెందుకు గౌగిలించికొనవలయును? పరపురుషు నేల గౌగిలించుకొనరాదు? పరపురుషుని కౌగిలించికొనినచో నిట్లే యుండునా? అది యొక సుఖమైనపుడు సుఖము కాదందము- సుఖమని యనుకొన్నప్పుడు పరపురుషు నేల గౌగిలించుకొనరాదు?

సారథి యాలోచనలోఁ బడెను. ఏమని చెప్పవలయును? ఈ తెలియని పిల్లకుఁ దెలిపినచో నామె శీలము నశించు మార్గము చెప్పినట్లు. స్నేహితుడైన శిరీషునకు ద్రోహము చేసినట్లు. చెప్పకపోయినచో నీయూహాపరంపర యే చెడు త్రోవకుఁ దీయునో తెలియదు. ఆమె యెట్లయినఁ దన కేమి యని వాసంతిని గూర్చి యూరకుండఁగలఁడా? ఈ వాసంతిని బురస్కరించికొని తన జీవునిలో వంతర్యాఖ్యతమైయున్న స్త్రీవాంఛను గతరాత్రమునఁ దాను బెల్లగించితి ననుకొనెను. రాత్రి తానట్టిస్థితిలోఁ బడిపోయెను. అట్లు జరుగుటచేతఁ దన జీవగతి స్త్రీవాంఛ నశించిపోయినదా? పోయినచో నిప్పుడీ వాసంతిని గురించి యింత విచారణ తన కెందుకు? ఓరి పిచ్చిసారథీ! ఒక్క స్త్రీవాంఛయేనా

నీయందున్నది? స్నేహితునకు ద్రోహమని మొదలైన పలువిషయములందు నీ యభిమానము చావలేదు. నీ మనస్సు వైరాగ్యాంచలములను మాత్రమే స్పృశించినది. నీది మాయను గెలువవలయు నన్న ప్రయత్నబాహుళ్యము గల జన్మకాని గెలిచెడు జన్మ కాదు. నీకు వాసంతియనగా నెట్లున్నది? పసిబిడ్డప్పటినుండి యెఱుఁగుదువు కనుక నామెమీద ముద్దు. తల్లిలేని పిల్ల యని జాలి. స్నేహితుని కుమార్తె యని నియమము. రుక్మాంగదనాఁడు నన్ను ప్రేమించిన దనుకొన్న భావశేషము. కామము జయించవలయునన్న యూహకు నాలంబము. ఆమె మధురమైన కంఠస్వరమునకుఁ బరవశత్వము-ఇన్ని భావములతోఁ గూడియున్నది వాసంతి నీమనస్సులో. ఏభావమును లేని స్థితిలో నున్నది సర్వజయము. సారథి కేమియుఁ దోచలేదు. ఇట్లనెను. ఇట్లనుచుంటినని తెలియక యనెను. పతివ్రతకు భర్తను గౌఁగిలించికొన్నప్పుడే, యతఁడు కౌఁగిలించినపుడే యట్టి సుఖానుభూతి యుండును. పరుఁడు కౌఁగిలించికొన్నప్పుడు నొడలంతయు మండిపోవును. దుఃఖము వచ్చును. ఒడలఁ దేళ్ళు ప్రాకినట్లుండును. పతివ్రతలు కాని స్త్రీలకు నెవరు కౌఁగిలించికొన్న నొక్కటే".

వాసంతి- ఎందు కీ కౌఁగిలించుకొనుట?

సారథి-అంతయు దెలిసిన దానవికదా?

వాసంతి-నీవు చెప్పవు. నేనే తెలిసికొందును లెమ్ము.

సారథి-అందులోఁ దెలిసికొనదగిన దేదియును లేదు. ఈ కాలమున దెలియనిదానవు నీ వొక్కతెవే. నీ నాయన చేసిన మహాకార్య మిది యొక్కటియే. నిన్నిట్లు పెంచఁగలుగుట. కొంత నీ ప్రకృతిలోన నున్నది.

వాసంతి "అందఱకును దెలియునా? నాకొక్కర్తెకే తెలియదా" యని యాలోచించుచుఁ గొంతసే పచటనే యటునిటు తిరిగి యామె సారథితోఁ జెప్పకుండనే వెడలిపోయెను. సారథికి దా నామెయొక్క యీ వాంఛకు విషయభూతుఁడు కాఁడని నమ్మకము కలిగెను.

అప్పటికి ప్రొద్దు క్రుంకినది. సారథి యాలోచనలోఁ బడి సముద్రపుఁ బల్లలవెంటఁ దిరుగఁబోయెను. చీకటిలోఁ జాలసేపు తిరిగెను. కొంచెము ప్రొద్దు బోయెను. తానింటికిఁ దిరిగి వచ్చుచున్నానని తెలియకుండఁ దిరిగివచ్చెను. ఎవరో యెదురుగా వచ్చు వ్యక్తి తన్ను గుర్తుపట్టి నిలుచుండెను. అది లీలగా మనస్సునకు స్ఫురించి సారథి యాగెను. ఇద్దఱు నొకరినొకరు గుర్తు పట్టిరి. సారథి చేతులు జోడించి "యయ్యా! నమస్కార" మనెను. సారథి జోడించిన చేతులు విదిలించి యావ్యక్తి "అయ్యా! మీ రింతటి మహానటులని నాకుఁ

తెలియదు. నా యహంకారము పూర్వము మీ దర్శనము చేసినపుడు మీతో సరిగా మాట్లాడనీయలేదు. ఇందాక క్లబ్బులో గూడ నా యహంకారము నన్ను మాటాడనీయలేదు. మీరు పరమశివులు" అనెను.

## ౧౩

నాటకమునకుఁ జైన డబ్బెక్కువగా రాలేదు. నలుబది యేఁబది రూపాయలువచ్చెను. ప్రవేశపు టీట్లు రంగనాధమేయమ్మెను. ఎంతవచ్చినదో యెవ్వరికిని దెలియదు. నాటక మయిపోయిన తరువాత మూడవరోజున సారధి కొక పదిరూకలు కావలసివచ్చెను. అతడు రంగనాధము నింటికిఁబోయెను. "రంగనాధముగారూ! నాటకమైన తరువాత నా కిరువది రూక లిత్తునంటిరికదా! ప్రస్తుతము పదిరూకలు కావలయును. తరువాత పదిరూకలు మీ యిష్టము వచ్చినప్పుడీయవచ్చు"ననెను. రంగనాధము"దమ్మిడీ వసూలు కాలేదు. పరాయిగా నొక్కటిక్కట్టయిన నమ్మలేదు. అసలు మిమ్ము నాటకశాలలో నాటకమాడనిచ్చుటయే నేనుచేసిన మేలు. నే నానాడు మీకు నిరువదిరూప్యాయలీయఁబోగావలదంటిరి. ఇప్పుడిత్తమన్నను నావద్దలేదు. ఐన నెచ్చటనైన దొరకునేమో ప్రయత్నింతును. రెండుమూడు రోజులైనతరువాత దయచేయు" డనెను. ఈ మాట లన్నియు నవ్వుచునే యనెను. ప్రేమ యుట్టిపడునట్లనెను. యథార్థము చెప్పుచున్నటనెను. అట్టిమాట లనకతప్పక వచ్చిన ట్లనెను. సారధి "యయ్యా! నేను రెండు మూడు రోజు లైనతరువాత నే వచ్చితినిగదా! నేను సదా బైరాగిని. నా కేపూట కాపూటకుఁ జిలుమునకుఁ గావలయును. ముందు రెండు రూక లిప్పింపుడు. తక్కువ డబ్బునకు రేపో యెల్లుండియో వత్తును." రంగనాధము "ఒట్టండీ, ఒట్టు. నాదగ్గఱ డబ్బున్నచో లేదందునా? అందులో మీకు. ఈ పూట నింటిలోఁ గూరాకులుకూడ లేవు. ఏదో పటిపప్పు వండమన్నాను" అనుచుండగనె కమల తొందరగా వచ్చి "నాన్నగారూ! మీ జేబులో రెండు రూపాయలు తీసికొన్నాను." అనెను. రంగనాధ మాశ్చర్యపడినట్లు నటించి "జేబులో డబ్బెక్కడిది? డబ్బు లేద" యనెను. కమల "ఇంకను బదిరూపాయలున్న"వనెను. రంగనాధము "ఇంకను బదిరూపాయలా" యని యాలోచించి "యోహో! నిన్న నవధానిగా రిచ్చిరి. నా స్నేహితు డొకడు పట్టణమునకుబోవుచున్నాడు. అవధానిగారు పెట్టెయొకటి కొని తెచ్చిపెట్టమన్నారు. ఆ డబ్బు సాయంత్రమున నతని కీయవలయును. ఆడబ్బు మనది కాదు. జేబులోఁబడవేయుము" అనెను. కమల "ఇదివఱకే ఖర్చుపెట్టితి" ననెను. రంగనాధము నోరు తెఱచియూ మెవంక చూచి "సాయంత్రమతనికీయవలయును. సరే, రెండురూపాయ

లెట్లును జూడవలయునుగదా. మఱి రెండుకూడఁ జూచెదను. సారథిగారికిఁ గావలయునట. అందులోనుంచి మఱి రెండు రూకలు తెమ్మనెను. ఆమె తేఁగా రంగనాథము రెండురూకలు సారథి కిచ్చి "మఱచిపోయినానండీ! నా డబ్బయినదో జ్ఞాపక ముండెడిది. నేనబద్ధము చెప్పితిననుకొందురేమో. దైవసాక్షిగా మఱచిపోయితి" ననెను. సారథి ఆరెండురూకలు తీసికొని, "దయచేసియెల్లుండి తక్కిన యెనిమిది రూపాయ లిప్పించుడు. మఱచిపోకుండ యిప్పించు"డని వెడలిపోయెను. వెళ్లుచున్న సారథివంక రంగనాథము నిశ్చలముగా జూచుచుండెను. అతనిని బడగొట్టవలయునని తాను చేసిన ప్రయత్నమంతయు వమ్మయ్యెను. అతడే గెలిచెను, ఇతనికి రెండు పరాభవములు చేయవలయును. ఆ రెంటిలో నొకటి ప్రారంభించినగాని రెండవదానికి బునాది వేయఁబడదు. వెంటనే రంగనాథము బయలుదేఱి, శిరీషునింటికిఁబోయెను. తండ్రి కూతులు కూర్చుండియుండిరి. రంగనాథ మిట్లనెను: "శిరీషుగారూ! మా క్లబ్బులో నెలకు నాల్గు వినోద కార్యక్రమములు పెట్టవలయును. ఈనెల పదునేనుదినములు గడచినను మొన్న నాటక మొక్కటియే జరిగెను. రెండవది యర్జునరావుగారి నాటకము పెట్టించవలయును. ఆయన కేదో సుస్తీగా నున్నదట. నెలాఖరునకు వేసినను నీలోపుగా వాసంతిచేత సంగీతసభ పెట్టించవలయునని దొరగారి పట్టుదల. అర్జునరావుగారుకూడ నమ్మాయి సంగీతము వినవలయునని తహతహలాడుచున్నారు. దొరగా రమ్మాయికి చిన్న సమ్మాన మేదియో చేయవలయునని యనుకొనుచున్నారు. పెద్దసమ్మానము తరువాత జేయుదురట. దేవిడీలోఁ బాడించి యది చేయుదురు. మొన్న నాటక సమయముననే మీతో మాటాడుద మనుకొన్నారు. మీరు దూరముగాఁ గూర్చున్నారు. మిమ్ము దగ్గఱకు రమ్మని నాతో జెప్పుమన్నారు. నేను మీ కోసము చూచెడిలోపుననే మీ రక్కడనుండి వెళ్లిపోయినారు. నేను నిన్న మొన్ననే రావలసినది కాని నాటకము వేసినతరువాత రెండు మూన్నాళ్లు తీఱి చావదు" అనెను. శిరీషు కొండయెక్కెను. "అయ్యయ్యో! అంతకన్ననాండీ! దొరగారి యనుగ్రహము మా యమ్మాయిమీద ప్రసరించుటయు, మేము కాదనుటయునా? సిరి రా మోకాలడ్డువారుందురా?" యనెను. వాసంతి "నాన్నగారూ! నా కంత యారోగ్యముగా లే" దనెను. శిరీషుడును, రంగనాథమును ఫరవాలేదని బలవంతము చేసిరి. ఆమె యూరకుండెను.

రంగనాథము తనగృహమునకుఁ బోయి స్నానముచేసి యుదికిన వస్త్రములు ధరించి కోటలోనికిఁ బోవుదమని బయలుదేఱెను. అతడెచ్చటికిఁ బోదలచుకొన్నాడో యెవ్వరికిని దెలియదు. బయలుదేఱినవాడు మఱల మానివేసెను.

ఇంతవఱ కతఁడు దొరగారి దర్శనము చేయలేదు. నాటకములో దొరగారి ప్రక్కన గూర్చుండినను దొరగారితోఁ దాను మాటాడలేదు; దొరగారు తనతో మాటాడలేదు. దొరగారికిఁ దనయం దనుగ్రహము కలిగినదని పదిమంది చెప్పగా వినెను. ప్రభువుల యనుగ్రహము దానియంతట నది ఫలించదు. ఫలించునట్లు మనమే చేసికొనవలయును. తా నొక్కఁడు కోటలోనికిఁ బోయినచో నెదో వ్యవహారముమీద వచ్చినట్లుండును. తనయు, దొరగారియు సంబంధమునకు వ్యవహారచ్ఛాయ లేకుండ జేయవలయును. వారి కుటుంబము, తన కుటుంబము నొక్కటియే యన్నట్లు తాను ప్రవర్తించవలయును. మొదట నంతఃపురములో బలుకుఁబడి సంపాదించవలయును. రాణులతో తన కూతుండ్రకు మిక్కిలి పరిచయ మేర్పడి యాప్రేమానుబంధము వాత్సల్యపు లోతులకు దిగినచో దొరగారెప్పుడును గాదనలేడు. మఱియొక భావము రంగనాధము నెడదలోఁ గలదు, దాని నతడు మనస్సుచేతఁ బరామర్శించడు.

ప్రొద్దు వాటాఱిన తరువాత రంగనాధమును, వాని కూతుండ్రిద్దఱు గోటలోనికి బయలుదేఱిరి. లలిత పూర్వపు లలిత కాదు. అర్జునరా వాపట్టణములో మూడు నెలలనుండి యుండెను. వారు, వీరు తఱచుగా నొకరియింటి కొకరు రాకపోకలు జరుపుచుండిరి. లలిత యెక్కువభాగ మర్జునరావుగారి యింటిలోననే యుండును. అర్జునరావుభార్య యనారోగ్యవతి. అర్జునరావునకు కాఫీ కాచి యిచ్చుటకాని, ఫలాహారములు చేసిపెట్టుటకాని లలితయే చేయుచుండెను. చేలాంచలాకర్షణములు, కరాంతస్పర్శము, బుజములు బుజములు రాచుకొనుటలు, కిలకిలారు నవ్వులు. ఒకరొక గ్రంధము చూచుచుండగా మఱియొకరు వారి బుజముమీద వంగి యాగ్రంధమునే చూచుచుండుటలు, చమత్కారపు మాటలు, గోడ వెనుకనున్న మన్మథునికి దగిలెడి మాటలు శరపరంపరగా సాగుచుండెను. అర్జునరావు యొక్క భార్య యొక్క యనారోగ్యవతియే కాదు. భర్తయొక్క యిట్టి ప్రవర్తనను బట్టించుకొనెడిది కూడఁ గాదు. భర్త నటకుడు. నటకులైనవారికీ ప్రవర్తన యుండు ననియు, నది వారింపరానిదనియు నామెకుఁ దెలియును. పైగా నిది యొక సరదా. అంతకంటె నేమియు లేదని యామె యుద్దేశ్యము. అర్జునరావునుండి రహశ్చుంబనము లొకటి రెండు సార్లు జరిగినను లలిత విదలించుకొనియే పోయెను. కాని యామెయందు మన్మథుడు వ్యగ్రుడై యుండెను. ప్రతీక్షా తీవ్రుడై యుండెను. తొలుత నర్జునరావు లలితకుఁ జిన్నిచిన్ని కానుక లిచ్చెను. చిన్నకానుకలలోని యుత్సాహము లలితకుఁ దగ్గిపోయెను. పెద్దకానుకల కర్జునరావువద్ద డబ్బులేదు. మొదటి నెల నాల్గువందలు రంగనాధము కచ్చితముగా నిచ్చెను. రెండవ నెల వెనుకముందు

చేసెను. మూడవ నెల మఱల కచ్చితముగా నిచ్చినను రెండవ నెలలోఁ జేసిన
చిల్లరయప్పునకు సరిపోయినది. ఋణ మొక విచిత్రమైనది. ఎప్పుడు కావలసిన
డబ్బప్పుడున్నచో నెలకు మన కింతయని వచ్చినచో నీవ్యయమున కాయాదా
యమునకు సరిపోయినను డబ్బు మిగిలిన ట్లుండును. ఒక నెలలో డబ్బు రాక
యప్పుచేసితివో రెండు నెలల డబ్బు ఒక్కసారి వచ్చినను జాలదు. మన
మెక్కువవ్యయము చేయలేదు. ఎందుకుఁ జాలదో తెలియదు. ఈ సృష్టిలో
ననేకము లిదమిత్థమని నిర్ణయింపరాని వున్నవి, ఇది మిక్కిలి యల్పిష్టమైనవిషయ
మైనను వానిలో నిది యొకటి. లలితయందు మన్మథుడు ప్రతీక్షాతీవ్రుడై
యున్నాడు. ఈ ప్రతీక్షాతీవ్రత యెట్టిది? దాని యంతట నది ముందఱికి వచ్చు
నది కాదు. మన్మథుని కంటె నస్వతంత్రుడు లేడు. కావ్యాదులయందు శీత
మయూఖమధుమాసమలయాచలానిల తరంగపికకూజితాదుల సాహాయ్యము లేక
వాఁ డెట్లు ప్రవర్తించలేఁడో లోకము చాటూక్తులు హృదయానందము కలిగించు
చీరలు నగలు వినోదదర్శనములు లేకుండ నట్లు స్వతంత్రముగాఁ బ్రవర్తించ
లేడు. ప్రధానభూతుడైన మన్మథునికంటె నప్రధానముగాఁ గనిపించు వీనికిఁ
బ్రధానత యెక్కువ. ఇట్టి ప్రాధాన్య వివక్షకల నగలు చీరలు కొనుక లిచ్చు
టకు నర్జునరావునకుఁ జేయి తిరుగుట లేదు. పూర్వ మెద్పుటికో పోయి నాటక
ములో వేసము వేసి వచ్చినంతనే రెండువందల రూక లొక్కసారి కనిపించె
డివి. ఇతడు పెద్ద నటకుడని జిల్లా మునసబు వానికిఁ గమిషనులు వేయుచుం
డెను. కమిషనులు దాక నీ యూరిలో రాలేదు. ఇక్కడి మునసబు వానిని వీని
కతీతుడనుకొనుచుండెను. రంగనాథము తన కీయవలసిన వేయిరూక లెప్పుడో
యిచ్చునని, వానితో నామెకుఁ జీరలు నగలు కొనవలయునని యర్జునరావు
తలంపు. మఱియుఁ దన తండ్రి తనకు వేయిరూక లీయవలయునని లలితకుఁ
దెలియును. అందుచేత నతడు తనకుఁ గానుక లిచ్చినట్లే లలిత భావించవలయు
నని యర్జునరావులోని స్వార్థము. పరోక్షస్థితుడైన మన్మథుడు ప్రత్యక్షమగు
టకు ప్రత్యక్షవిషయముల నే మన్నించును. ఇందులో నొకరి స్వార్థము లేదు.
ఒకరి పట్టుదలలు లేవు. అది బిగించుకొనుట కాదు. ఆనుకూల్యము లేకపోవుట
కాదు. పరోక్షమం దున్న మన్మథుడు ప్రత్యక్షమగుట కది యొక్కటే మహా
సాధనము. దాని స్వరూప మట్టిది. అర్జునరావువలన లలిత యొక్క మనస్సు
వికసించెను. అనూహితములైన విషయము లూహాగమ్యము లయ్యెను. ఆమె యింటి
లోని స్వాతంత్ర్యము నియమము నేర్పినది, లలితమన స్సెట్లున్నదనగా, నిట్టి
యనుభూతులేమియు లేని కమలమనస్సులో మన్మథు సంకురింపఁజేసినది.
ఎట్లంకురింపఁజేసిన దనగా నింతటి చిత్రమైన యనుభూతి లేకుండగనే యామె

యందు మన్మథుడు ప్రత్యక్షము కాఁగల డన్నట్లు చేసినది. లలిత ప్రకృతి వేఱు; కమల ప్రకృతి వేఱు. లలితలో సర్వవస్తువులయందు, సర్వజనులయందు నొక నిరాదరణ మున్నది. ఆమె యెవనినైనను తేలికగా విదలించివేయును. లలిత యందు యౌవనము యొక్క మూర్తిమత్త్వము లేదు. కమలయందుఁ గలదు. కాని లలిత విప్పాటి మాట్లాడును. విప్పాటి ప్రవర్తించును. అది పురుషుల కౌతూజనకముగా నుండును. కమల ప్రకృతి నిగూఢము. లలితను దాకినచో విదలించి కొట్టును. తాకినచో నామె ప్రసన్నగా నుండునన్న భావము కలుగును. కాని విదలించి కొట్టును. కమలను తాకినచో నేమనునో యని భయము. ఆమె యం దట్టి యూహ కలుగుటకే యామె ప్రవర్తన యెడ మీయదు. కాని యామెను దాకినచో నామె విదలించి కొట్టదు సరికదా, యామెయందు ప్రసన్నత భాసించును. బహిరంతర్లక్షణములకు సంయోజనము ప్రకృతియందు దుర్లభమైనది. లలితార్జునుల హేలా విశేషములకు గమల బహుసమయసాక్షిణి. ఆమెయందుఁ దత్పూర్వభావనా జనిత మాన్మథ భావపరిణామసంచలనము జరిగెను.

రంగనాథము కూతుండ్రతోఁ గోటలోనికిఁ బోయెను. అతనిని గావన్న వా రెవ్వరును లేరు. అడ్డుపెట్టినవారు. లేరు. ఉన్న సేవకులందఱు వంగివంగి నమస్కారములు చేసినవారే. కొన్నియేండ్లనుండి దినదినము కోటలోనికి వచ్చు నొక యధికారి వెళ్లినట్లున్నది కాని యింకొకవిధముగా లేదు. దొరగారు మేడ పైన గూర్చుండిరి. అచటనున్న సేవకుడు మఱియెవ్వరు వచ్చినను "అయ్యా! దొరగారితో మనవిచేసివచ్చెదను" అని యనుమతి తెచ్చుటకుఁ బోవును. అతడు రంగనాథమును జూచి "దొరగారు లోననున్నారు. తమరు వెళ్ళవచ్చు" ననెను. రంగనాథము నివ్వెఱపోయెను. లోనికి వెళ్లెను. ముప్వురును దొరగారికి నమస్కారము చేసిరి. అచటనున్న కుర్చీలమీద ముప్వురును గూర్చుండిరి. రంగనాథము తన కూతుండ్రను జూపించి "అది మా పెద్దయమ్మాయి. దాని పేరు లలిత. ఈమె రెండవది. ఈమె పేరు కమల" యనెను. దొరగారు "ఎఱుగుదు" ననెను. రంగనాథము "రాణిగారు వెనుక మాపిల్లలు వచ్చినపుడు మఱల నొకసారి రమ్మనిరట. వీరిని నేను కోటలోనికి దీసికొనివచ్చి మూడునాల్గునెల లైనది. పిల్లలు రాణిగారి దర్శనము చేయుదుమన్నారు. తీసికొనివచ్చితిని" యని, కూతుండ్రను గాంచి "లోనికిఁ బొండు" అని పంపించెను. వారిద్దరు వెడలినతరువాత రంగనాథము నవ్వుచు గూర్చుండెను దొరగారి మొగము ప్రసన్నముగా నున్నను రంగనాథమువంక నాతని చూచుటలేదు. కొంతసేపటికి రంగనాథ మిట్లనెను: "మన నాటకభవనములో నా సంతియొక్క సంగీతపుగచేరి శనివారమునాఁ డేర్పాటు

చేసితిని. ఆమెకచేరి తమరు వినవలయునని వాసంతియు, నామెతండ్రియు మిక్కిలి కోరిక పడుచుండిరి. తమరితో మనవి చేయుమని నన్ను దినదిన మడుగుచుండిరి. ప్రభువుల మనస్సు తెలియకుండ నేర్పాటుచేయుటకు నేను సాహసించలేదు. ఐన నేర్పాటుచేసితిని. తమ రానా డనుగ్రహించి సభకుఁ దప్పకుండ రావలయునని కోరిక. ఆసభకుఁ దమరే యధ్యక్షులు. వాసంతి కేదైన చిన్ని కానుక యీయవలయునని యనుకొన్నాము. అది తమరి చేతిమీదుగా విప్పించవలయు నని యామెతండ్రి పట్టుపట్టెను. తమరికి మనవి చేయవలయునని వచ్చితిని" దొరగారు మాఱుమాటాడలేదు. అనగా నంగీకరించినారని యర్థము. చెప్పిన మాటలు పదియైనను అన్నియు నొక్కసారి చెప్పినవి కావు కనుక నడుమ నడుమ మాటాడకుండఁ గూర్చున్న వేళయే యధికముకనుక దొరగారి యీయంగీకారము వచ్చుటకు గంటపట్టెను.

రంగనాథమునకు తరువాత నేమి మాటాడవలయునో తెలియలేదు. నాటకభవనముయొక్క యాదాయవ్యయములు దొరగారితోఁ జెప్పవలసియున్నది. కాని యది చెప్పుటకు వేళ పరిపక్వము కాలేదు. అంతఃపురములోనికి బోయిన కూతుండ్రు తిరిగి రాలేదు. వారిని వదలిపెట్టి తాను వెళ్లవలయునా? మనసులో నింకొక యూహ యున్నది. వారి నచ్చట వదలిపెట్టి తాను వెళ్లినచో రాజవంశముమీదఁ దనకున్న యభిమానము, గౌరవము నధికముగా భాసించును. అందుచేత "నయ్యా, నేను సెలవు తీసికొందును. పిల్లలు రాణివాసములో నున్నారు. అమ్మగారితోఁ జెప్పించి వారి నింటికిఁ బంపించవలసినది"యని దొరగారితో జెప్పి తాను బయలుదేరెను. దారిలోఁ బెరుమాళ్లు కనిపించినాడు. పెరుమాళ్లు పెద్ద కాసా. అతడు జమీందారు తానే యున్నట్లుగాఁ బ్రవర్తించును. దొరగారి రహస్యము లన్నియు వాని చేతిలో నున్నవి. దొరగారికి వచ్చెడి ప్రతిష్ఠాప్రతిష్ఠలు వాని యధీనములు. వాడు కోటకు రాజు. వానిని జూచినచో నందఱికి భయము. వానిని మంచివానిని జేసికొనకుండ దొరగారి యనుగ్రహమును సంపాదించుట యసంభవము. దొరగారికి వాడు సర్వమును. అంగరక్షకుడు, మహామంత్రి, సేనానాయకుడు, శృంగారసఖుడు మొదలయిన పది పదకొండుద్యోగములు వానికి సర్వభుక్తములు. దొరగారు ఏకపత్నీవ్రతస్థుడని లోకమందరు జెప్పుకొందురు. కాదని తెలిసినవాడు వాడొక్కడే. కాదని యూహించినవాడు రంగనాథము. వారిద్దరు నొకరి నొకరు కలసికొన్నప్పుడు రహస్యలోకములు, తల్లోకాధిపతులు భయపడిరి. పెరుమాళ్లు రంగనాథముతో మాటాడలేదు. కాని యతని చూపులు, నడక, నవ్వులు, అతడు తనవంక చూచెడి మెలపు సర్వము నదివరకే పెరుమాళ్లు గుర్తుపెట్టెను. పట్టణములో నెవరినిజూచినను పెరుమాళ్లకు

భయము లేదు. రంగనాధమును జూచినచో భయము. రంగనాధము తాతగారు దివాన్‌జీ చేసినా డన్న గౌరవమో, వారిద్దరు సమానమయిన ప్రకృతులు కనుక తన వివేకముకంటె రంగనాధముయొక్క వివేక మధిక మని వాడంతఃకరణ సాక్షిగా దెలిసికొనెనో తెలియదు. రంగనాధము కోటలోనికి బోయినపుడు పెరుమాళ్లు చూడలేదు. ఇప్పుడు చూచెను. పెరుమాళ్లు గుండెలో గుబుక్కుమనెను. ఇతడు దొరగారివద్దకు రాకపోకలు సాగించినచోఁ దన నోట దుమ్మే. పెరుమాళ్లు రంగనాధమునకు నమస్కారము చేసెను. రంగనాధ మొక యొయ్యారముగా నమస్కార మందికొని, సెలవివాఁ నవ్వి "ఖులాసాగా నున్నావా" యనెను. వాడు "చిత్తము బాబయ్యా" యనెను. "పెరుమాళ్లులోతు రంగనాధమునకు దెలియును. రంగనాధ మిట్లనెను. "పెరుమాళ్లూ! నీతో రహస్యముగా మాట్లాడవలయును. నేటిరాత్రి పన్నెండుగంటలకు మాయింటికి రాఁగలవా? ఇది పరమరహస్యము. మూడవకంటికిఁ దెలియరాదు" అనెను. పెరుమాళ్లు భయపడెను. సంతోషించెను. ఏమి చెప్పునోయని భయము. కాని తనతో నాలోచనచేయ మొదలుపెట్టెనుగాన దన స్థితికి భంగములేదు. పెరుమాళ్లు సెలవు తీసికొనెను. రంగనాధము వెడలిపోయెను. పెరుమాళ్లు వెంటనే దొరగారిదగ్గఱకు వెళ్ళెను. దొరగా రితనినిజూచి యిట్లనెను: "పెరుమాళ్ళూ! రంగనాధము గారి కూతుండ్రు దొరసానిగారి దగ్గఱ నున్నారట మాటాడుట యైపోయిన తరువాత వారిని వారియింటికిఁ బంపించు"మనెను. పెరుమాళ్లు నవ్వెను. దొరగారు మాటాడలేదు. పెరుమాళ్లు రెండడుగులు వేసి, మరల దొరగారి దగ్గఱకు వచ్చి అక్కడ నెదో సర్దుచున్నట్లు నటించి "రంగనాధముగారి కుమార్తెలకుఁ బెండ్లిండ్లు కాలేదండి. పెద్దమ్మాయిని గురించి యూరిలో విపరీతముగా జెప్పుకొనుచున్నారు. పఠానుగారికి లలితమ్మగారికి పెండ్లికావచ్చును. పఠానుగారి భార్య ఎప్పుడును మంచములోననే యుండునట. ఆమె యెప్పుడు చనిపోవునా యని యెదురు చూచుచున్నారు."దొరగారు- "అది యేమిరా! అర్జునరావుగారి భార్యమొన్న నాటకమునకు వచ్చినదట. రంగడు చెప్పినాడు." పెరుమాళ్లు- "రాణివాసములోనుండి వారి నట్లు పంపించనా? తమరి దర్శనము చేసినతరువాత పంపింతును. కోటలోనికి వచ్చినతరువాత తమ దర్శనము చేయకుండ వారు వెళ్ళరేమో" దొరగారు మాటాడలేదు. ప్రొద్దు ప్రుంకవచ్చినది. లలితాకమలలు రాణివాసమునుండి వెలికివచ్చిరి. ఇద్దఱికిఁ జెఱిరెండు పట్టురవికలు, మూడుపుంజీల బత్తాయిలు, పసుపుకుంకుమలు, చక్రకేళీలు మొదలైనవానితో వచ్చిరి. పెరుమాళ్లు "అమ్మా, ఇంటికిఁ బంపించుమందురా" యనెను. కమల "దొరగారి దర్శనము చేసి పోవలయును" అని యక్కగారితో ననెను.

పెరుమాళ్లు దొరగారి దగ్గఱికి వారిని దీసుకొని వెళ్ళెను. వారిద్దఱు దొరగారికి యెదురుగుండ కూర్చుండిరి. రాణిగారు చాల దయగాజూచి రని, సీని నిచ్చిరని చూపిరి. దొరగారును, లలితయు మాట్లాడ నారంభించిరి. నాటకములు, నర్సునరావు నభినయము, సారధి ప్రశంస యథేష్టముగా సాగుచుండెను. లలిత యేదో చెప్పుచుండుటయు. దొరగారు నడుమనడుమ నొక మాట యనుటయుగా సంభాషణము సాగుచుండెను.

దొరగారు కూర్చున్న గదికిఁ బ్రక్క గదిలోఁ గత్తులు కటారులు డాళ్లు మొదలైన చూడఁదగిన వస్తువు లున్నవి. వానివి జూడవలయునని కమల కోరెను. అవి యెక్కడ నున్నవని లలిత నడిగెను పెరుమాళ్లు "నేను చూపించెదను రమ్మ"ని కమలను బిలిచెను. పెరుమాళ్లు వెంటఁ గమల యెక్కడికో యేగిపోయెను. పెరుమాళ్లు వెడలిపోవుచు దొరగారి వంక నది యొక చూపు చూచెను. దొరగారి కన్నులు కదలినవో, కదలలేదో చెప్పుటకు వీలులేదు మఱి రెండు మూడు నిముసములైన తరువాత దొరగారు ప్రక్కనున్న గదిలోనికి బోవుటకు లేచెను. లలితయు లేచి నిలుచుండెను. దొరగారు నడిచెడి తీఱు లలితను మాటాడుచు దన వెంట రమ్మన్నట్లుండెను. లలిత నిర్భయస్వభావురాలు. చొరవ కలది. వెళ్ళకపోవుటా వెళ్ళఁగూడదా యన్న సంశయమే యామె మనస్సునఁ బొడమదు. వెంటనే వెళ్ళెను. ఆ గదిలో గోడల వెంట రంగులతో వేసిన పెద్ద చిత్రములు గోడకు దగిలించియున్నవి. దొరగారి తండ్రి తాత ముత్తాతలవి, దొరగారి ముత్తవతల్లి తాతమ్మగార్లవి, నడుమ నొకటి రంగనాథము తాతగారి ఛాయాచిత్రము చిన్నది యున్నది. లలిత తన ప్రపితామహుని బొమ్మ యెఱుగును. దానివంక జూచుచు నిలుచుండెను. దొరగారామె వెనుక నానుకొని నిలుచుండెను. నిలుచున్నంత వఱకామెకుఁ దెలియలేదు ఆమె వెనుతిరిగి చూచెను. తొలగలేదు. ముందునకు జరుగలేదు. దొరగారామెను తక్కిన బొమ్మలు చూడుమని వరుసగాఁ జూపింప నారంభించెను. ఆ చూపించుటలో నొకసారి భుజముపై చేయి వేసెను. మఱి రెండు మూడుసార్లు రాచుకొని తిరిగెను. ఆమె మాటాడలేదు. ఇప్పుడు దొరగారుగూడ నామెతో సమానముగా మాటాడుచుండెను. అచట నొక పెద్ద మంచమున్నది. లలితను దానిమీదఁ గూర్చుండుమని యామె కూర్చున్న తరువాత దొరగారు తానొక పెట్టె తెఱచి యందులోనుండి యొక దంతపు వస్తువు దీసెను. నాల్గుదంతపు టేనుగులు చిన్నవి. తొండములెత్తికొని అలమీద భూగోళమును మోయుచున్నట్లు చెక్కబడిన దా బొమ్మ. దొరగారు దానిని లలితకు జూపించెను. ఆమె "చాల బాగుగా నున్నదండీ" దొరగారు "నీకుఁ గావలయునా" యనెను. అనుచునే దాని నామె కిచ్చుటయు, నామె ప్రక్క నానుకొని

కూర్చుండుటయు, నామె బుజముమీఁదఁ జేయివేయుటయు, దగ్గఱకు లాగుకొనుటయు, దన ఱొమ్ముమీఁది కౌన్చుకొనుటయు, కపోలము చుంబించుటయు జరిగెను. ఇదియంతయు నొక లిప్తలో జరిగెను. ఆమె చకితురాలయ్యెను. వెంటనే విదలింపుతో లేచి తాను సావడిలోనికి చఱచఱ నడచివచ్చెను. దొరగారికి మనస్సులో భయము వేసెను. ఆయన యిట్లన్న దెఱుఁగడు. పెరుమాళ్లు తెచ్చిన స్త్రీలు తానట్లు చేయుటకుఁ బ్రతీక్షించి వెంటనే నిరుత్తరలు, నిశ్చేలలు నయ్యెడివారు.

లలిత పోయి సావడిలోఁ గూర్చుండెను. కమల రాలేదు. పెరుమాళ్లు సావడిలోనికి జూచెను. అంతయు గ్రహించెను. వా డావులించినచో బ్రేవులు లెక్కపెట్టెడివాఁడు. అతఁడు వెనుదిరిగిపోయి కమల నింకొక గదిలోనుండి దొరగారున్న గదిలోనికిఁ దీసికొని వచ్చెను. దొరగారున్న గదియొక్క సావడి తలుపుమూసెను తిరిగి లలిత వద్దకు వచ్చి "కమలమ్మగారిని మఱల దొరసానమ్మగారు పిలిచిరి. ఆమె యిప్పుడే వచ్చును" అని చెప్పి తానచ్చటనే తారాడుచుండెను.

లోపల గదిలో దొరగారు కమలను జూచెను. లలిత నిరాదరించినంతనే దొరగారికి భయము వేసెను. కోపము వచ్చెను. అతఁడు క్రుద్ధుఁడై యుండెను. తన కొక స్త్రీ లొంగనిచో దప్పు పెరుమాళ్లుది. అతఁ డీ సంగతి గ్రహించి రెండవ యామెను దీసికొనివచ్చెనని దొరగారు గ్రహించిరి. దొరగారు మఱియొక సందర్భములో నైనచో గమలను వెంటనే గోరెడివాఁడు. కాని యామె మొగమునందు బసితనమెక్కువ యున్నది. లలిత ప్రౌఢ; ఈమె ముగ్ధ. తాను తొందఱపడఁ గూడదని తెలిసెను. ఆమెకు నెమ్మదిగా గోడలమీఁది చిత్రములన్నియు జూపించెను. కత్తులు కటార్లు డాళ్లు చూచితివా యని యడిగెను. ఈ యేనుఁగుల బొమ్మ నీ కిత్తు ననెను. కమల సులభగా గనిపించెను. ఏమి చేసిన నామె మఱుమాటాడ లేదు.

రాత్రి యెనిమిదిగంట లైనది. లలిత తొందఱపడుచుండెను. పెరుమాళ్లు సర్ది చెప్పుచుండెను. కొంతసేపామెనుగూడఁ దీసికొనిపోయి కత్తులు కటార్లు చూపించెను. చిట్టచివఱకుఁ గమల వచ్చెను. ఆమె పట్టుజరీచీర యొకటియు, రెండు దంతపుదువ్వెనలు, బంగారపుఁజీరపిన్ను, రెండు వెండి గిన్నెలను దెచ్చెను. బండిమీఁదఁ బెరుమాళ్లు వారిద్దఱను బంపించెను. ఇవియన్నియు రాణిగా రెందు కిచ్చిరని యనగాఁ గమల యిట్లు చెప్పెను: "నేను వెళ్లినంతనే రాణిగారు నా వయస్సడిగినది. నాకుఁ బదునాలుగేండ్లని చెప్పితిని. ఆమె అందుకనియే నిన్ను పిలిపించితిని. నీ వొకసారి దొరగారి దగ్గఱకు వెళ్లుమన్నది.

కే కెందుకని యడిగితిని. పెరుమాళ్లు చెప్పసాగెను. దారిలో పెరుమాళ్లు నాతో నిట్లు చెప్పెను: "దొరగారికిఁ బదునాలుగేండ్ల కూతురు పూర్వము చనిపోయెను. ఆ సంగతి మీకు దెలిసియే యుండును. ఆమె సరిగా నీనాఁడే చనిపోయెను. ప్రతియేఁడాదియు నీ రోజున, పెండ్లికాని పదునాలుగేండ్ల పిల్లలకు దొరగారొక పట్టుచీర పెట్టుచుందురు. ఈ సంగతి రాణిగారి కంత యిష్టము లేదు కాని దొరగారు ప్రొద్దుటినుండియు దిగులుగా నున్నారు. నేఁ డెవరును దొరకలేదు. పెండ్లికాని పిల్ల పదునాలుఁగేండ్లు దాటినను సరే, ఎవరికైన నిత్త మనుకొన్నారు. ఆ పిల్ల కిచ్చుటకుఁ బూర్వము తాను తన కూతునువలె దొరగారు ముద్దుపెట్టుకొనును. కౌగిలించుకొనును. దొరగారు పై కంత బిగువు కలవారుగాఁ గనిపింతురు కాని మనస్సులోఁ జాల మెత్తనివారు. ఆయన యీ పిల్లను గౌగిలించికొని ముద్దాడి తన చనిపోయిన కూతును గౌగిలించికొన్నట్లే సంతోషింతురు" అని. నేను దొరగారున్న గదిలోనికి వెళ్ళితిని. ఆయన నాకు బొమ్మలన్నియుఁ జూపించెను. ఆయన పెట్టెలో నాకూతుయొక్క ఛాయాచిత్ర మున్నది. దానిని జూచి చాలసేపు విచారించినాడు. కన్నీళ్లు పెట్టుకొన్నాడు. తరువాత నన్ను గౌగిలించికొని ముద్దుపెట్టినాడు. ఈచీరయు నిదియు నిచ్చి పంపినా"డని చెప్పెను. లలిత "కమలా! అబద్ధములు చెప్పకు" మనెను. కమల "ఒట్టు" అనెను. లలితకు మనస్సులో సందేహము పోలేదు కాని యిట్లనెను : "నన్నుగూడఁ గౌగిలించుకొని ముద్దుపెట్టుకొనినాడు. ఆకూతుయొక్క బొమ్మ తీయుటయు, దుఃఖపడుటయు నేను చూడలే"దనెను. "నన్ను గౌగిలించుకొని ముద్దుపెట్టుకొనిన తరువాత నే కూతుబొమ్మ తీసెను. దొరగా రట్లు చేయుదురని ముందు పెరుమాళ్ళు నాతోఁ జెప్పెను. కనుక నేను భయపడలే" దని కమల చెప్పెను. అది యొక రహస్యము. కమల చెప్పిన దబద్ధమని లలితకుఁ దెలియును. లలిత నమ్ముట లేదని కమలకుఁ దెలియును. తాను నమ్ముట లేదని కమలకుఁ దెలియునని లలితకుఁ దెలియును. లలిత నమ్ముచున్నట్లే నటించుచుండెను. ఆమె నమ్మినట్లే కమల ప్రవర్తించుచుండెను. ఈ సంగతి లలిత యెవరితోడను జెప్పదని కమలకుఁ దెలియును. తా నెవ్వరితోడను చెప్పనని లలితకుఁ దెలియును. ఇది యంతయు నింటిదగ్గఱఁ జెప్పరాదు. లలిత యిట్లనెను: "కమలా! ఈకథ యింటిలోఁ జెప్పకుము. దొరగారీచీర యిచ్చిరని, రవికలు మొదలైనవి రాణిగా రిచ్చిరని మాత్రమే చెప్పుము. రాణిగారికిఁ దెలియకుండ దొరగా రీచీర యిచ్చిరి. మన యింటిలో నీమాట చెప్పినచో రాణిగారితో మీరు దయతో నిచ్చిన చీర మాయమ్మాయి కట్టుకొనుచున్న దని యమ్మగారు గాని, నాన్నగారుగాని రాణిగారితో చెప్పుడైన నన్నచో నామె కష్టపడును" అనెను. కమల 'నిజమే' ననెను.

ఈ మాటతో రహస్య ముభయులకు దెలిసినదన్న విషయ మిద్దఱకుఁ దెలిసెను. కాని రహస్యము రహస్యముగానే యున్నది. వాచ్యము కానేలేదు.

దొరగారికిఁ బెరుమాళ్లు తెచ్చిన స్త్రీల సౌఖ్యమే కాని తన స్వశక్తితో స్త్రీని సంపాదించిన సౌఖ్యము పూర్వము లేదు. మఱియు వయసు కడచినవారు, సుపరిచితమన్మథలు నైన స్త్రీలతోడిదే పరిచయము. ఈమె యనాఘ్రాతపుష్పము. కరరుహములచేత నలూనమైన కిసలయము. ఇందు వట్టి ప్రసన్నతయే లేదు. ప్రసన్నతా ప్రసన్నతలు రెండును గలవు. ప్రసన్నత భాగమాత్రము. అప్రసన్నత ముప్పాళ్లు. ఇది యనుభవించీ యనుభవించన ట్లున్నది. సుఖము పొందీపొందనట్లున్నది. ఈ యవ్యక్తమధురిమకు దొరమనస్సు లొంగిపోయెను. ఇది కామతృప్తి కలుగరాని విషయము. తృప్తి కలిగినతరువాత మోహము విచ్ఛిత్తిపొందును. మోహవిచ్ఛిత్తి కలుగకుండుటకు నస్పృష్టపుష్పాఘ్రాణమే చేయవలయును. అది మోహమును నిలబెట్టును. కామమును బరిపోషించును. ఆశను జీవత్స్థితిలో నుంచును. క్రొత్తదనము క్రొత్తదనముగానే యుంచును. ఇట్టిది నవోఢాసంగమము. నవోఢ యనగా నవస్పృష్ట. ఈ రహస్యము తెలియకుండ దొరగారికిఁ దెలిసినది. అతఁడు తొలినాటి తన భార్యా సంగమము స్మరించికొనెను. అందీమధురిమ తా ననుభవించినట్లు జ్ఞాపకము లేదు. మఱియు నిందులో నొక యహంకారరేఖ భాసించుచున్నది. కమల తన వర్ణముకంటె నధికమైన వర్ణమునందుఁ బుట్టిన స్త్రీ. అది యొక యధికమోహము. ఆమెయందుఁ బరిశుద్ధత యామె తనూగతరమణీయత యొకానొక శుచిభావముచే నావరింపఁబడినది. అది యొక విచిత్రముగా మనస్సున కానందమిచ్చుచుండెను. కమలయందు బహుభావములు సన్నిహితములైయున్నవి. ఆమెతోడి పరిచయము సర్వసృష్టి నధిగమించిన ట్లుండెను. ఈ దేశము చాతుర్వర్ణ్యనిష్ఠము. ఆమె యిందలి పరమోత్తమవర్ణసంజాత. ఇన్నాళ్లు తాను వట్టి ప్రభువు. ఇప్పుడు చాతుర్వర్ణ్యమునకుఁ బ్రభువనిపించుచున్నది. తత్కుల సంజాతు లిదివఱకు నధికులని తన మన స్సొప్పుకొనకపోయినను తన యాత్మలో నొక రేఖగా నొక భావము భాసించుచున్నట్లు తోఁచెను. ఇప్పు డా రేఖ తుడువబడినట్లు కనిపించెను. వారి యాధిక్య మిప్పుడు కనిపించలేదు. తత్కుల జాతియైన యొక్క స్త్రీయొక్క సంగమమాత్రమున నిట్టి భావము కలుగుట చిత్రముగానే యున్నది. ఆకులమంతయుఁ దనకు వశమైనట్లు, నా కులమునందలి సర్వస్త్రీలు తన్నభిసరించినట్లు రాజు తలపోసెను. అతని మనస్సులో నా కులమునందలి గౌరవము నశించెను. ఓహో! ఏమి మనస్సు. ఈ భావముతోనే పవధానిని కలిసికొనునా? ఆ రంగనాథము నే నిరాకరింపవీలగునా?

తద్వర్ణ సంజాతులు పట్టణములోఁ గొందఱధికారులు కలరు. వారు తనకు లోఁబడుదురా? వారి స్త్రీలను తా నవమానించఁగలఁడా? సాధ్యము కాదు. లోకము వేఱు, మనస్సు వేఱు. మనస్సనం దట్లున్నది. లోకమునం దది సాగదు. అనియు రాజు గ్రహించెను. అక్కడికి రాజు బుద్ధిమంతుఁడే. కాని మనస్సు వెనుదిరిగి కమలమీఁదనే ప్రసరించుచున్నది. మఱల గమల తనకోట కెప్పుడు వచ్చును? ఇట్లే యెప్పుడో తండ్రి తీసికొని రావలయును. ఈసంగతి రాణివాసములోఁ దెలిసినచో నేమగును? ఇదివఱకటి వన్నియు స్వయంగ్రాహములు. ఆ రాక అవ్యక్తికి దప్ప మఱెవ్వరికిఁ దెలియదు. ఈయక్క సెల్లెండ్రు వచ్చుట, ప్రొద్దు పోవు వఱకిచ్చట నుండుట. ప్రొద్దుండఁగానే వారు రాణివాసమునుండి వెలికి వచ్చుట యిది కోటలోఁ దెలియకతప్పదు.

తప్పదేమిటి? మఱునాటికే రాణివాసమునఁ దెలిసినది. రాణీగారు వారి నింకఁ గోటలోనికి రానీయవద్దని యాజ్ఞచేసినది. పెరుమాళ్లును పిలిచి చెప్పినది. దానితోఁ దలుపులు మూతలుపడినవి. దొరయొక్క మనస్సు వివిధముగా భ్రమణము చేసినది. మనుష్యమాంసము రుచిమఱిగిన పులివలె వతఁడు కలవరపడుచుండెను. మనుష్యమాంస మంత సులభమైనది కాదు. పల్లెలచుట్టు దొంగగా దిరుగవలయును. లేడివలె, మహిషమువలెఁ దనయున్నచోటికి రాదు. తా నచ్చటికిఁ బోవలయును. తెలియక డొంకవెంట నేలపాటలు పాడుచుఁ బోవు గొల్లపిల్లవానిని సంహరించవలయును. అడవిపొలములో గడ్డికోయుచున్న కాపుపడుచును వెనుకనుండి పోయి మెడపట్టుకొని గెంటవలయును.

రంగనాథము శనివారమునాఁడు వాసంతి సంగీతసభ నేర్పాటుచేసెను. ప్రొద్దుటిపూట వచ్చి దొరగారిని రమ్మని చెప్పెను. అప్పటి రంగనాథముయొక్క నవ్వులు, వినయములు, ప్రక్కచూపులు వాసంతిని దనకువశము చేయ నన్నట్లున్నవి. అతనితో మాటాడినంతసేపును దొరమనస్సు ద్విధాభూతముగా నుండెను. ఇతనికిఁ దన కూతుసంగతి తెలియదా? తెలిసికూడ నింత నిర్లజ్జముగా బ్రవర్తించుచున్నాఁడా? తనకు వాసంతియందు బ్రేమకలుగుటకు తన కూతును రుచిచూపించినాఁడా? ఔనన్నట్లున్నది. కాదన్నట్లున్నది. రంగనాథము తరుపాలో నిన్న తనకుఁ గనిపించినంతటి వినయము నేఁడు కనిపించలేదు. నిన్నటి యభ్యర్థన నేఁడు లేదు. నిన్న తాను ప్రభువు. నేఁడు రంగనాథము ప్రభువు. ఈమార్పు నిజమా, యబద్ధమా? తొలుత దొర రంగనాథమును జూచినంతనే మనసులో భయపడెను. ఆభయము క్రమముగాఁ దీరెను. ఇది చిత్రముగా నున్నది. నిన్న నతఁడు తనకు లోఁబడునైనా డనుకొనెను. నేఁడు తా నతనికి లోఁబడునైనట్లున్నది.

సాయంతనమున వాసంతి గానసభ జరుగుచుండెను. దొరగారి ప్రక్కనే రంగనాథము కూర్చుండెను. మాటిమాటికి రంగనాథము వాసంతియొక్క సంగీతమును ప్రశంసించుచు నామె సౌందర్యాతి యున్న విషయము చమత్కారముగా గలిపి చెప్పుచుండెను. సభలోఁ గమలాలలితలు రంగప్రదేశమునం దున్న పెద్ద బల్లమీఁదఁ గూర్చుండిరి. దొరదృష్టి లలితమీఁదఁ బడెను. లలిత తన మోమును వెనుకకుఁ ద్రిప్పికొనెను. దొరమోము కమలమీఁదఁ బడెను. కమల మోము త్రిప్పికొనదు. దొరయు త్రిప్పికొనుచుండెను. కమలవంక నట్లే చూచినచో రంగనాథ మేమనుకొననో! ఒక సంగతి దొరకుఁ దెలియలేదు. కమలకు వయస్సు వచ్చినను ముఖలక్షణముల చేత బసిపిల్లవలె నుండుటచేత నామె వంకఁ జూచినను పరు లను మానించరు. రంగనాథమునకు సందేహము కలుగదు. అందుచేత రాజు వాసంతిమీఁదనే దృష్టి నిలిపెను. వాసంతి దొరవంకఁ జూచును. అలినిమీఁదఁ బడిన దృష్టిని తొలఁగించవలయు నన్న ప్రయత్నము వాసంతిలోఁ గనిపించలేదు. దొర పరీక్షింపఁగా వాసంతి యెవ్వరి దృష్టిని పరిహరించదు. మఱి యింకొకని వంకఁ జూడవచ్చును. ఆ మాటలలో యాదృచ్ఛికముగా మొగము త్రిప్పికొనిన లుండును గాని యేదో మనోగతభావముచేతఁ ద్రిప్పికొనినట్లుండదు. అంత సూక్ష్మదర్శి కాఁడు దొర. మానవుని నెత్తురు తాగిన పులి గాయములేని దేహముమీఁదనే నెత్తురు చూచుచుండెను.

సభ యైపోయినతరువాత వాసంతికి బంగారుపతకము నొకదానిని బహుమతి చేయుటకు రాజుగారిని కోరిరి. ఆ పతకమునకు బొడుగైన పట్టుత్రాడు కట్టబడియుండెను. దానిని దొర యామె మెడలో వేయవలయును. దొర యేదైనఁ జెప్పి పతకమును బహూకరించవలయును. దొరకు పదిమందిలో నోటవెంట మాట రాదు. అందుచేత ముందవధాని యుపన్యసించెను. అప్పుడు రాజుగారు లేచి తెరలోనికిఁ బోయి రంగభూమికి వచ్చి పతకమా మెచేతి కీయఁబోయెను. రంగనాథము మెడలో వేయుడనెను. రాజు చేతికే యిచ్చెను. వాసంతి దొర చేయి తన చేతికి బాగుగాఁ దగులునట్లు గ్రహించెను. ఆమె దేనికొఱ కట్లు చేసెనో దాని సంపూర్ణభావగతి లేక దొరగారి రెండుచేతుల తన దోసిలి చొప్పించెను. దొరగా రామె రెండుచేతులపైన దన రెండుచేతు లానించెను. వాసంతి రెండు లిప్తల కాలము నిమీలితనేత్రయైయుండెను. అంతఁ దన దోసిలి హఠాత్తుగా లాగుకొనెను. ఆమె మొగమునం దొక వికారరేఖ తోఁచెను. కన్నులలో భయము కనిపించెను. దొర దీని నేమీ గ్రహించలేదు. అతని కామె తన దోసిలి తన చేతులయం దుంచుట మఱియొక కమలవశమైనట్లు భావించెను. అతని మొగమునం దొక వికాసము కలిగెను. అతడు వాసంతిచేతిలో నున్న పతకమును దీసి

కొని యామె మెడలో వేసెను. సభయంతయు నవ్వులతో గరస్ఫాలనములు చేసిరి. సభ గ్రహించినట్లున్నది. రాజు మనసు నొచ్చుకొనెను. కాని యతని మనస్సులో నేమున్నదో వానిముఖములోఁ దెలియని జాతికనుక బైటఁబడలేదు. సభ పూర్తియయ్యెను.

రాత్రి వాసంతి తండ్రి నిదురపోయిన తరువాత దానొక్కర్తయు మంచముపైఁ బండుకొని యాలోచించెను. సారథి భర్తకానివానిని స్పృశించినచో దేహము మండునని చెప్పెను. దొరగారి చేతులు నా చేతుల నత్తుకొనగా నా చేతులపైని చర్మము భగభగలాడెను అతడు చెప్పినమాట చాల నిజము. కాని సారథి నన్ను స్పృశించును. నా భుజముమీదఁ జేయి వేయును. నా చెక్కిళ్ళు తాఁకును. రైక లేని భాగమున నా హస్తమును స్పృశించును నేను క్రిందబడినపుడు నా పాదము లూరుపర్యంతము హస్తములతో నిమిరెను. సంవాహనము చేసెను. నా కతని స్పర్శ సుఖముగానున్నది. దొరగారి హస్తస్పర్శయే నాకుఁ జర్మదాహకముగానున్నది. ఇందులోని మర్మము నాకుఁ దెలియుటలేదు. సారథి నాకు భర్తయా? వివాహముకాని నాకు భర్తయెవరు? అంతదాక యెందులకు? నాన్నగారు నన్ను దాకుచున్నాడు. నాయొడలు మండుటలేదుకదా. అట్లే సారథియు. సారథి నాకు దండ్రివంటివాడు కాబోలును. కాని సారథి నా కింకొక మాట చెప్పినాడు. తండ్రియు, సోదరులు కానివారందఱు పరపురుషులని అతడు పరపురుషుడే. అతడు నన్ను బిడ్డవలెఁ జూచుచున్నాడేమో! నేనతనిని తండ్రివలెఁ జూచుచున్నానా? మాచుటలేదు. అతడు నాకుఁ దండ్రి కాడని నాకుఁ దెలియును. మానవుల కితరులయందుఁగల ఆర్ద్రిత వివిచ్యమానమై భిన్నముగా నుండును. ఒకనియం దధికమైన యార్ద్రిత యుండును. ఆయార్ద్రితకు మనము పేర్లుపెట్టుదుము. ఆమె నాకు బిడ్డవంటిదని, అతడు నాకుఁ దండ్రివంటివాడని. అద్భుతమైన ఆయార్ద్రితకు లోకములోని యొకానొక సంబంధము పేరు కల్పించుట. తండ్రి, కూతురు, అన్న, చెల్లెలు, భార్య, భర్త మొదలైన విస్పష్టములైన వ్యభిచరించని యార్ద్రిభావములు కలవు. తక్కిన యార్ద్రిభావము వీనిక్రిందికిఁ దీసికొనివచ్చి తమ్మునివలెఁ జూచుచున్నాను, బిడ్డవలెఁ జూచుచున్నానని చెప్పుదురు. ఈ 'వలె' యన్నమాటలో నీభావమందారోపితమైనదని తెలియుచున్నది. ఆరోపితమైనది నివారితము కావచ్చును. అది సహజమైనది కాదు. దీని కావన్నియు తెచ్చితిమి. ఆవన్నియు తుడిచివేయవచ్చును. వర్షమునకు గాలికి నెండకు నావన్నియు మాసిపోవచ్చును. ఒక యార్ద్రిత పలికారణములచేత సంఘధర్మేతరమైనచో దానియం దీయారోపణ జరుగుచున్నది. ఇట్లూహించినచో సహజములయిన పిత్రాది సంబంధములకు వెలియైన

సర్వమైన యార్ద్రితయు స్త్రీపురుష మధ్యగతమైనచో భార్యాభర్తృ సంబంధమైనదిగా నిశ్చితము కావచ్చునేమో. మఱియు నీస్పర్శచేత నే నింతనిర్ణయించినచోఁ దొందఱపడుచుంటి నేమో. ఈ స్పర్శకూడ నుచితవేళ జరిగినది కాదు. నేను రెండున్నర గంటలు పాడుచు శ్రమపడితిని. దొరగారి చేతినుండి పదకము గ్రహించుట యొక్క విశేషముగా నేను భావించి యుద్విగ్నురాలి నైతిని. నా శరీర మపుడు స్విన్నమై యుండెను. దొర శ్రమపడనివాడు కనుక నతని చేతులు వెచ్చగా నుండెను. నా చేతులు చెమటచేతఁ జల్లగా నుండెను. అందుచేత నా కట్లనిపించిన దేమో. దొరయైనను నన్నిట్లు స్పృశించుటకు వీలైనది. దీని పరమార్థము తెలిసికొనుటకు నే నుద్వేగము పొందనపుడు దొరయొక్క హస్తస్పర్శ చేయవలయును. అపుడు దాని యాథార్థ్యము తెలియును. ఆయన యింటిలో నేదియో యక్కఱ యుండుటకదా. అపుడేదో సాకుఁ గలిపించుకొని దీనిని బరీక్షింపవలయును. కోటలో నట్టి సభకు నా కిదివఱ కాభిముఖ్యము లేదు. ఇప్పుడు దాని నభినయింతును" అని నిశ్చయించుకొని వాసంతి నిశ్చింతముగా నిదురపోయెను. ఆ నిదురలో నామె కొక స్వప్నము ఘటిల్లెను తా నొక యప్సరస్త్రీ. మబ్బులలో విహరించుచుండెను. భూమిమీది ప్రజలు కనిపించుచునే యున్నారు. ఆ జనములోఁ గొందఱు తన్నుఁ జూచి చంద్రరేఖ యన్నారు. మఱికొందఱు కాదప్సర యన్నారు. వారిలో రంగనాథము కనిపించెను. అత డందఱను జూచి నవ్వి "కాదయ్యా! ఆమె మన శిరీషుగారి కూతు" రనెను. తాను వెలవెలపోయెను. తా నీయాకాశములో నుండి మఱియొక యాకాశములోని కెగిరిపోయెను. అచట సారధి కనిపించెను. సారధినిగూడ మబ్బులలోనికి రమ్మని తాను పిలిచెను. సారధి కొంతదూర మెగిరివచ్చి మఱల క్రిందికి దిగిపోయెను. తా నాకాశములో మఱియు విహరించెను. ఇంతలోఁ బడమటినుండి పెళపెళార్భటులతోఁ గాళరాత్రివంటి మేఘము తనమీదికి వచ్చెను. తనకు దిశలు తోఁచలేదు. అప్పుడే తనతండ్రి కనిపించెను. అతనిని గౌగలించుకొనెను. అతఁ డేడ్చుచుండెను. ఇంతలోఁ దనకు మెలఁకువవచ్చెను. సావడిలోనికిఁబోయి గుఱ్ఱుపెట్టి నిదురించుచున్న తండ్రిని జూచెను. ఇంతలోఁ దనకు మంచి నీళ్లయిన ట్లనిపించెను. పడమటింటిలోనికిఁబోయి బిందెలోనున్న మంచినీరు త్రావెను. మఱల వచ్చి పండుకొనెను. వెంటనే నిదురపట్టలేదు. మనస్సు సారధిమీదికిఁ బోయెను. అతని నీ నడుమఁ జాలదినములుగాఁ జూడలేదు. రే పతనివద్దకు బోవలయును. ఈ సంగతి చెప్పవలయును. తాను చేయదలచుకొన్న పరీక్ష పూర్తి కాకముం దేల పోవలయును? రేపు పోదును. మఱల నిదురపట్టెను. మఱల నేవో యేవో కలలు వచ్చుచునే యుండెను. నడుమ నడుమ గలలు వచ్చుట, నడుమ

నడుము సగము మేల్కనుట, యది కలయని తెలియుట, మఱల నిదురపోవుట ఇట్లు తెల్లవారెను. ప్రాతశ్శిశిరవేళా మందమంద మలయానిల సుందరతరంగ చాలిత పక్ష్మాంచల వాసంతి చిలుకలలు మఱచిపోయి తొలిస్వప్నమును భావించుచుండెను.

రంగనాథము తన పడకమునకు నడుము మాణిక్యము చెక్కగా జుట్టును ముత్యాలు గ్రుచ్చగా బయలుదేఱెను. ఒకనాడు దొరగారి కడకుంబోయి యిట్లు చెప్పెను: "అయ్యా! మన నాటకసంఘమున కొక్క పదివేలు కావలయును. ఆ ధనమున్నచో నేను దీనిమీద ఏడాదికిం బాతికవేల లాభము చూపింతును. నే నిదివఱకు దీనిమీద రెండువేలు పెట్టితిని. నెల నెల కర్జునరావుగారికి నాల్గువంద లీయవలసి వచ్చుచున్నది. రెండువేల పెట్టుబడితో నెలకు నాల్గు వంద లర్జునరావుగారి కిచ్చుచుంటిమనగా మఱి పదివేలైనచో నెంతలాభము తీయవచ్చునో తమరే యాలోచించుడు. నాటకరంగము పెద్దది చేయవలయును, సభాభవనమును బెంచవలయును. సుమారు వేయిమంది జనము కూర్చుండుటకు వీలైనంత భవనము నిర్మింపవలయును."

దొర— పదివేలు పెట్టినచో భవనమునకే సరిపోవును.

రంగ—కంట్రాక్టున కిచ్చినచో నది యట్లు జరుగును. నాల్గువేలలో నే నంతటి భవనమును వేయింతును. తక్కిన యాఱువేలతో రంగురంగుల తెఱలు, గొప్పదుస్తులు, గుఱ్ఱములు, ఏనుగులు, రథములు మొదలైనసామ్రగి తయారు చేయింతును. తమరు చూతురుగాని. నాటక మాడినచో నది రంగముకాదు. భూలోకవైకుంఠము. అట్లు చేసెదను.

దొర—ఇదివఱకే మీరు రెండువేలు పెట్టుబడి పెట్టితిరి. మీసొమ్ము మీరు తీసుకొనినచో మిగులునది యేమిమిగిలెడు లేకదా?

రంగ—నాసొమ్మునకుం దొందఱ లేదు. నేను తరువాత తీసికొనెదను.

దొర—నాదగ్గఱం బదివేలు లేవు. నాల్గువే లిచ్చెదను. మీ రేమి చేసుకొన్నను సరే.

రంగ—తమరు నాల్గువేలు దయచేయుడు. మఱి యాఱువేలు నా కప్పిప్పించుడు. నా కింక నిరువదియెకరముల పొలమున్నది. దానిని తాకట్టు పెట్టెదను.

దొర—ప్రస్తుతము నా దగ్గఱ నంత లేదండి

రంగ—ప్రభువులు తలచికొనినచో నిది యొక లెక్కా? తమ రనుగ్రహించవలయును. ఇది నాకోసము చేయుట లేదు. తమరికొఱకే చేయు

చున్నాను. తమరి ప్రతిష్ఠ దిగ్దిగంతములవఱకు వ్యాపింపఁజేయుటకు నేను చేసెడి ప్రయత్నమిది.

దొరగారు మాటాడలేదు. రంగనాథము దొరగా రంగీకరించినట్లే ప్రవర్తించెను. అతని కొక యూహ తోఁచెను. తన కూతుండ్రు వచ్చినప్పుడు కోటలో నంత మర్యాద చేసిరి. వారిని మఱలఁ గోటలోనికిఁ బంపించి దీనివలన లాభమున్నదని కూతుండ్రచేత రాణిగారికిఁ జెప్పింపవలయును. అతడు దొరతో నిట్లనెను. "ప్రభువా! నా సంతతికిఁ దన సంగీతము కోటలో వినిపింపవలయునని యున్నది. దొరగారు విన్నారు; దొరసానిగారుకూడ వినవలయునని యామె యాశ. బుల్లిదొరగారి కక్షరాభ్యాసము చేయుదురనియు, నా సముఖమునఁ దన పాటకచేరి తమరు పెట్టెదరనియు నామె యాశపడుచున్న" దనెను.

దొరగారు డబ్బువిషయమయి మఱల మాటాడలేదు. దీనితో మాటాడింపవలయునని రంగనాథము ప్రయత్నము. మఱియును దొరగారు మాటాడలేదు. రంగనాథ మిట్లనెను. జమీందారులవద్ద మాటాడు నేర్పుతో ననెను. "సాయంతనమున నేను మన జ్యోతిష్కుని కలిసికొంటిని. అక్షరాభ్యాసమునకు ముహూర్తము పెట్టించెదను. బుల్లిదొరగారి జాతకము నవధానిగారు చూచిరి. వారు జ్యోతిషములో మహాఘనులు. తమకు తెలియుదురు కదా. దొరగారు పెద్ద భాషాపోషకులగుదురట. వారి కక్షరాభ్యాసము తొందరగాఁ జేయింపవలయును. ఇది శూన్యమాసము. ఎట్లయినను నాలుగైదు నెలలలో ముహూర్తము పెట్టించకతప్పదు. బుల్లిబాబుగారు మొన్న తింగణామీద స్వారిచేయుచుండగా జూచితిని. ఆ వయసులోననే యెంత రాచదర్జా! బాబుగారిని నేను పిలిచితిని. వారు నావంక చూచిరి. ఒక మహాచక్రవర్తి తన బంటువంక చూచినట్లు చూచెను. ముమ్మూర్తుల ప్రభువులే యవతరించిరి" ఈ మాటలాడుచున్నప్పుడు రాజుగారి వదనమున మందహాసాంకుర మయ్యెను. రంగనాథము సెలవు తీసికొని వెడలిపోయెను.

ఆ సాయంతనమున లలితాకమలలు కోటలోనికి వచ్చిరి. తండ్రి వెళ్లుమనగా లలిత యిష్టపడలేదు. కమల ముందునకు దూఁగెను. లలిత కనుబొమలు నలుపుచేసికొనెను. వెళ్ళక తప్పినదికాదు. వారు కోటలో కడుగుపెట్టుటను జూచి కాపావాండ్రు మొగాలు మొగాలు చూచుకొనిరి. ఆ సమయమునకు పెరుమాళ్లు మొగసాలయందుండెను. అతనికి భయము వేసెను. వారు రాణిగారి వద్దకుఁ బోదుమనిరి. పెరుమాళ్లు కాదని చెప్పి దొరగారి వద్దకు దీసికొనిపోయెను. దొరగారు కూర్చుండిరి. ఇద్దఱివంక తీక్ష్ణముగాఁ జూచిరి. ఆయనకు దెలిసెను. కూతులచేత బని సాధించుకొనుటకు రంగనాథము పంపించెనని.

తాను లోఁగకూడ దనుకొనెను. కాని మన్మథునియొక్క బలము పర్యాప్తి కాయి. వారి నిద్దఱను గూర్చుండుఁ డనెను. ఏదో యేదో మాటాడఁజొచ్చెను. లలిత యేమియు మాటాడలేదు. ఏ ప్రశ్నకును సమాధానము లేదు. కమల నవ్వుచు మాటాడెను. దొరగారు తన కేదో పనియున్నట్లు చిత్రపటము లున్న గదిలోనికిఁ బోయెను. కమల రాజును వెంబడించెను. లలిత కమలవంక కోపముగాఁ జూచుచుండెను. గదిలోనికిఁ బోయిన తరువాత కమల దొరచేయి పట్టుకొని "ఏమండీ! మీకే లాభముకదా. నాయనగారికిఁ బదివే లిచ్చినచో నష్టమేమి? నాకొఱకు పదివేలిమ్మనినచో నీయరా" యనెను. దొర తలుపు వేసెను. అప్పటికే తెలిసిన రహస్యమైపోయినది.

కమల మంచముమీదనే లేచి కూర్చుండి పదివే లిమ్మని దొరను బలవంత పెట్టసాగెను. రాజు చివఱ కంగీకరించెను. రేపు మీ నాయనగారిని రమ్మనుమనెను. కొంతసేపటికి అక్కచెల్లెండ్రిద్దఱు తమ యింటికి వెడలిపోయిరి. దారిలో లలిత మాట్లాడలేదు. ఇంటికిఁ బోయినతరువాత నామె బిగింపు పోయినది. ఏమియు జరగనట్లే కమల యెంతో నవ్వుచుఁ ద్రేలుచుండెనో తాను నట్లే యుండెను. ఇద్దఱును దండ్రితోఁ జెప్పిరి. "నాన్నగారూ! దొరగారు రేపు మిమ్ము రమ్మనినా" రనిరి. రంగనాథము కొంపెయెక్కెను. తన కూతులు చికిలి చేసిన బాణములు; వారియందు రాణిగారికి మిక్కిలి ప్రేమయని.

మఱునాడు రంగనాథము కోటలోనికిఁ బోయెను. దొరగారి దర్శనము చేసెను. ఇతడేదో సోది చెప్పుచుండెను. దొరగారినుండి సమాధానము లేదు. ప్రొద్దుగ్రుంకెను. దొరగారచ్చటినుండి వెడలిపోయిరి. కొంతసేపటికి గుమాస్తా యొకడు వచ్చి "అయ్యా! దొరగా రొకమనిషికోసము కబురంపించిరి మాయన యింకను రాలేదు. రాత్రి కెంత ప్రొద్దుపోయినను వచ్చును. రేపుదయమున మీరు రావచ్చునని చెప్పుమనిరి" యనెను. రంగనాథము లేచి వెడలిపోయెను. వాసంతి పేరు చెప్పినచో మాటాడెను. డబ్బునకు సంబంధించనప్పుడు స్వేచ్ఛగా నుండును. ఇప్పుడు మఱల జమీందారీ బిట్టుపోవుచుండెను. రంగనాథమున కిది లెక్క లేదు. వెళ్లిపోయి, మఱునాటి ప్రొద్దున వచ్చి దొరగారివద్దకు బోయెను. ఇతనిని జూచి దొర యొక గుమాస్తాకుఁ గబురంపించెను. రంగనాథ మట్లే కూర్చుండెను. రెండుగంటలైనతరువాత రంగనాథమును గొన్ని కాగితములమీద దస్కతులు పెట్టుమనిరి. రంగనాథ మన్నియుఁ జదివెను. అది తాకట్టుదస్తావేజు. తన యిరువది మూడెకరములు తాకట్టుపెట్టికొని పదివే లప్పిచ్చునట్లు వ్రాయబడియున్నది. తన పొలము నాలుగుచోట్ల నున్నది. దాని హద్దులతో వ్రాయఁబడియున్నది. అప్పు తీసికొనుటకుఁ గారణము నాటక భవన నిర్మాణముగా

పేర్కొనబడినది. రంగనాథ మాలోచించెను. నాటక భవనము దొరగారి చేత నున్నది. నిర్మాణము తనది ఇది యెట్లు పొసగును. దొరగారితో ననెను. దొర "మీరు మాకు సంవత్సరమున కింత యని యా దొడ్డికి బాడుగ యిచ్చుచుండు" డనెను.

రంగనాథ—"అదికూడ ఖరారునామా వ్రాయబడియును గదా. మఱియు వడ్డీ రూపాయి యాఱణాలు వేయించితిరి. ఇంత వడ్డీ—"

దొర—"పొలమునకు పాతిక వేలు లాభము వచ్చును గదా. ఆ వడ్డీ యెక్కువ యేమున్నది? మొదటి యేఁడాదిలోననే మా యప్పంతయుఁ దీఱిపోవును."

రంగనాథమునకు మనసులోఁ గోపము వచ్చెను. వాసంతిదగ్గఱ జమీందారును నిలుచుండఁబెట్టెను. వాసంతి తనకు వశము కాలేదు. రాజు తనకు వశము కాలేదు. ఆమె కొరీతి, యితని కింకొక రీతి!

రంగనాథము నవ్వెను. అతని నవ్వులోని ప్రసన్నత, వినయము, రాజభక్తి ముప్పేటగొనెను. రంగనాథ మిట్లనెను: "ప్రభూ! నా యీ శరీరము మీది. ఆపొలము మీ తాతగా రిచ్చినది. నే నార్జించినది కాదు. నేను వట్టివ్యర్థుడను, పనికిమాలినవాడను. ఏదో పద్యాలు వ్రాసికొనుట తప్ప నా కేమియుఁ దెలియదు. మీయాస్తి మీరే తాకట్టు పెట్టుకొని మీరే డబ్బిచ్చుచున్నారు. ఖరారునామా యక్కఱలేదు. ఒక యేఁడాదిలో వచ్చు పాతిక వేల లాభము మీకే యిచ్చెదను. ఆ తాకట్టు పత్రముల్లేయుండును. మీ పాతిక వేలు మీకిచ్చి నేను వైదొలఁగెదను" అని కాగితముమీద దస్కతులు చేసెను. పదివేల రూకలు తీసికొనిరాబడి రంగనాథమున కీయఁబడెను. రంగనాథము గృహాభిముఖుడగు వేళకుఁ బ్రొద్దు నడినెత్తిన ఉండెను.

అదిమొదలు నాల్గునెలలు క్లబ్బు వేఱేచోటికి మార్చిరి. పదివేలు చాలదని రంగనాథమునకు దెలియును. అతడు తన గ్రామమునకుఁ బోయెను. అచటఁ దన పొలము దొరగారికిఁ దాకట్టు పెట్టెనని యెవ్వరికిని దెలియదు. గ్రామకరణమున కొక్కనికే తెలియును. దొరగారు పంపించిన గుమాస్తా కరణమును గనుగొని హద్దులును, పరిమాణమును వ్రాసికొని పోయెను. రంగనాథము కరణము వద్దకు పోయి యతనితో స్నేహము చేసికొనెను. దొరగారి గుమాస్తా యీ సంగతి తెలిసికొనిపోయెనని కరణ మెవ్వరికిని చెప్పలేదు. తన పొలము తాకట్టు పెట్టి రంగనాథము పదివేలు తా నప్పు తీసికొనెను. ఒక పెద్ద వడ్డీవర్తకు డిచ్చెను.

ఆ యిరువదివేలతో రంగనాథము నాటకభవనమును సుధర్మాభవనమును జేసెను. నాలుగునెలలలో నచట నొక మహాభవన మేర్పడెను. పాలగచ్చుతాలు,

నును పైన గోడలు, గోడలమీద రంగులు. ముందు బజారము. స్త్రీలకు టిక్కెట్లమ్ముస్థలము వేఱు. ఏడురకాల టిక్కెట్లయిదుగదులలో వేఱుగా నమ్ముదురు. లోన నాల్గు కిటికీలు, పూలమొక్కలు, రంగభూమి యంతయుఁ సువేగభవనము. బంగారమును భ్రాంతి కల్పించు సింహపుఁ దలలు, కీర్తిముఖములు, చిత్రచిత్ర వల్లులు, ప్రభాతోరణములు, పది తెఱలు ఒక తెఱ మీద మహా పట్టణ రాజ మార్గము, మఱియొక తెఱ మీద మహాటవి. రంగులు కొట్టవచ్చుచున్నట్లున్నవి. లోపలఁ జిన్న మేడ. తూప టుయ్యాల. తీగతో మనిసి క్రిందికి దిగవచ్చును. తీగతో మనిసి పైకి లాగబడును. ఒక భూగృహము. దానికి గీలు తలుపు. అచట నిలుచున్నచో మనిసి లిప్తలో భూమిలోనికి దిగిపోవును. అవి యెన్ని యెన్ని యందములు చేసెనో!

ఈ లోపుగా రంగనాథ మూఱకుండలేదు. తాను నాల్గు నాటకములు వ్రాసెను. అవి యన్నియు పాటలు. దొంగతనము, నాగలోకమునకు బోవుట, స్వర్గలోకమునకు బోవుట, ఏనుగులమీద, గుఱ్ఱములమీద మనుష్యులు సంచరించుట - పురాణములలో నెన్ని యద్భుతములు చెప్పబడినవో వాని నన్నిటిని రంగమువీద ప్రదర్శించుటకు వీలుగా రంగులు వేసిన యట్టలతో దీపము లార్పి వేసి సన్నని వెలుగులో ప్రదర్శింప వచ్చును. ఆ దమిక్కు దుస్తులకు జనులు కనులలో మిఱుమిట్లు పడవలయును. ఒక్క రాజు వేషమునకు వేయి రూపాయిలు వ్యయము పెట్టెను. మొదటిది దశావతారముల నాటకము.

అది వారి తీఱవలయును. నాటకము తెల్లవార్లాడుదురు. జనము క్రిక్కిఱిసి పోయిరి. నాల్గు నెలలలో నీ నాటకముల యొక్క ప్రశస్తి యాసేతు శీతాచలము వ్యాపించెను. పూనానుంచి, ప్రయాగనుంచి, కలకత్తానుంచి జనములీ నాటక ప్రదర్శనములకు వచ్చుచుండిరి. నాటకము నెల నాళ్లున్న దనగా టిక్కెట్టు కొనవలయును లేనిచో కూర్చుండుటకు స్థలము దొఱుకదు. స్థలము దొఱుకక రెండు మూడు నెలలు ప్రతీక్షించినవారు కలరు. సభా భవనమున ముందు భాగమున నటు నిటు కల గోడలకాని రెండు మేడలుగా నున్నవి. అందులో గదులు భార్యాభర్త లిద్దఱే కూర్చుండవచ్చును. ఒక్కొక్క గదికి నేబది రూకల బాడిగ. ఒక్క నాటకము వేసినచో నాఱువేలు వచ్చుచుండును. నాటకము వేయుటకు మూడు నాల్గు వేలు వ్యయమగు చుండెను. రెండు నెలలైన తరువాత రోజు విడిచి రోజు నాటక మాడు చుందురు. జీతములు పెరిగి పోయెను. అర్జునరావున కిప్పుడు నెలకు వేయి రూకలు జీతము. అందులో నాల్గు వందలకు తక్కువ జీతగాడు లేనేలేడు. ఇట్లు మూడు నెలలు నేకాధ్వర్యముగా సాగిపోయెను. అప్పటికి దొలుత రంగనాథము దొరగారికి దాకట్టు

వ్రాసిన రోజయి యేడాది యైనది. రంగనాథము చేతిలో నలుబదివేల రూకలు మిగిలెను. రంగనాథము మహాప్రభువుగా నుండెను. అతడు మోటారుమీద గాని పోడు. పట్టు బట్టలు గాని ధరించడు. అతని పరిచిన ముకుటము బడికొప్పులు పడి యుండె నటయును. కాని నాటకములన్నియు దొరగారి పేరనే జరుగుచుండెను. రంగనాథము వట్టి దివాను. దొరగారి నాటక భవన మనియే పేరు. వేసంగి తీవ్రముగా మండుచుండెను.

## ౧౪

రంగనాథము కొన్నాళ్ళు మథనపడెను. అన్ని యమ్ములు తన చేతిలో నున్నవి. ఏయుచ్చు లాగవలయునో తెలియలేదు. చివరకు దొరగారి యొద్దకుఁ బోయి పాతికవేలాయన చేతిలోఁ బోసెను. "అయ్యా! నా తాకట్టు పత్రము నా కిప్పించుడు. తొలుత నేను పెట్టిన రెండువేలు నాకు దయచేయించినచో నాటకభవనము, దానిమీది సర్వలాభములు తమవి. తమయనుజ్ఞయైనచో బూర్వమువలెనే తమ సేవ చేసెదను. లేనిచోఁ దొలఁగెదను" అనెను. రాజున కొక్కసారి పదమూడు వేలు కనిపించెను. అతని తాకట్టు పత్ర మతనికిచ్చివేసెను. రెండువేలు తరువాత నిప్పింతు మనెను. తాను చేతిలోఁబోసిన డబ్బు తనది తన చేతిలోఁ బోయుటకు నంతలోభము చూపించెనే రాజని రంగనాథము మరియును దింపవలయు ననుకొనెను. ఇప్పుడు రాజు మిక్కిలి ప్రసన్నుడు. నిముషములోఁ దనకు లొంగిపోయినవాఁడు. వంటనే రంగనాథము వాసంతియొక్కయు, సారధియొక్కయు వ్యవహారము ప్రారంభించెను. "ప్రభూ! ఈ మాసములో నాటకములమీద మూడు వేలు లాభము వచ్చెను. ఆ డబ్బు తమరికీయను. చిన్నదొరగారి యక్షరాభ్యాసమునకు ముహూర్తము పెట్టించితిని. మహాకవి, జగత్పండితుడు నైన యవధానిగారిచేత నక్షరాభ్యాసము చేయింతము. ఆనాఁడు వాసంతియొక్క పాటకచేరీ పెట్టింతము. వాసంతి కోటలోనికి రావలయును ఆమె సంగీతము, నామెయుఁ దమరిని సంతోషపెట్టవలయును" అని వెడలిపోయెను. రాజు పసికట్టెను. రంగనాథమునకీయవలసిన రెండువేలెగగొట్టెను గదా. ఇంకొక వేయి నష్టము. వాసంతి వచ్చుచున్నదిగదా, నష్టము లేదు.

మాసాంతమునఁ జిన్నదొరగారి యక్షరాభ్యాసము జరిగెను. కవులు, గాయకులు వచ్చిరి. ఎవ్వరికిని దమ్మిడీ యిచ్చినదిలేదు. దొరగారి మందహాసము గూడ లేని ప్రసన్నముఖదర్శనమే సర్వజనులకు బహుమతి ప్రదానము. వాసంతి యొక్క పాటకచేరీ జరిగెను. రాత్రి ప్రొద్దుపోయెను. రంగనాథము తన

కూఁతుండ్ర నింటికిఁ బంపించెను. వాసంతియొక్క తెయే యుండెను. శిరీషుఁడును వచ్చుటనే యుండెను. రాణిగారు వాసంతినిఁ జూడవలయునని కోరుచున్నారని పెరుమాళ్ళు చెప్పెను. శిరీషుఁ డంగీకరించెను. వాసంతి కోటలోనికి పోయెను. ఆమె నంతఃపురములోనికిఁ దీసికొనిపోలేదు. పెరుమాళ్ళామెను రాజుగారి గదిలోనికిఁ దీసికొని పోయెను. దొర వచ్చెను. దొర యెంత మాటకారి యనిగాని, యెంత నవ్వుచు మాటాడుననిగాని వాసంతి యెఱుఁగదు. దొర యిట్లనెను: "మా కోటలో మీ సంగీతము పెట్టించవలయునని మూడు నాలు గేండ్లుగా నున్నది. నేటికి సంభవించినది. ఆనాడు మీ మెడలోఁ బూల హారము వేసితిని. నేడు నీ మెడలో నీ ముత్యాల హారము వేయుచుంటిని." ఆ ముత్యాల హారము సులభముగాఁ బాతిక వేలు చేయును. దానిని దొర వాసంతి కోసము పెట్టెను. అక్షరాభ్యాసమునకు మూడు వేలు వ్యయమన్నచో లెక్క జూచుకొనిన రాజు పాతిక వేలను లెక్క సేయలేదు. ఈ గుణము రంగనాథునకుఁ దెలియును. తన కూఁతుండ్రకు నూఱికే రెండు వేలు రూకలిచ్చెను. రాజు స్త్రీవిషయములో నెంతయైన నిచ్చును. ఈ విలువ చేయుట యంతయు నా వ్యయము చేయుటకు. ఇది వాసంతీ ప్రయోగము. ఈ ప్రయోగమును రాజు తట్టుకొనలేడు. తట్టుకొన్నచో దట్టుకోలేని ప్రయోగము రంగనాథ మింకొకదానిని సిద్ధము చేసి పెట్టినాడు. అది నూరిపెట్టిన కత్తి. ఆ కత్తి నాటకములలో స్త్రీ వేషములు వేయుచున్నది.

రాజు ముత్యాలహారము వాసంతి మెడలో వేయుచు నా చేతులను జెక్కిళ్ళమీఁదికిఁ దీసెను. వాసంతి స్పర్శను బరీక్షించుచుండెను. అప్పటికిఁ బాటకచేరీ యైపోయి గంటసేపయ్యెను. వాసంతి యుద్వేగము తగ్గెను. రాజుయొక్క హస్తస్పర్శ సుఖదాయిగా లేదు. వాసంతి యూఱకున్నదని రాజింకొక సోపాన మెక్కెను. రాజామె కపోలమును జుంబించెను. వాసంతి కిది భగ్గున మండినది. ఇది లక్షణార్థము కాదు. కాని వాసంతి యా మంటయొక్క స్వరూపమును భావించుచుండెను. శరీరము మండినట్లు లేదు. మనస్సే మండినట్లున్నది. ఆ మాట యూహాపథములో లేదు. అనుభవపథములో నున్నది. రాజునందు వైముఖ్యము లేదు. ఊహచేత నసహ్యించుకొనుటలేదు. శరీరము నగ్ని స్పృశించినట్లు లేదు. అగ్ని స్పృశించినట్లున్నది. చేతికి నిప్పు తగిలినచో వెంటనే వెనుకకు లాగికొందుము. ఇదియొక విచిత్రమైన యగ్ని. వాసంతి వెనుకకు లాగికొనలేదు. భయపడలేదు. దానియం దిష్టము లేదు; అనిష్టము లేదు. అది వహ్నిగా భాసించుచున్నది. ఒక యనుభూతి మనస్సునకు వేద్యమగును. ఒకానొక యనుభూతి మనస్సునకు వెగటై శారీరకమైన యనిష్టము ప్రకటించఁబడకుండ విలక్షు

ణముగా నుండెను. ఒకొక్కప్పు డొకొక్కమాటకు మిక్కిలి కోపము వచ్చును. అది మనస్సులో నుండిపోవును. ఆ మాటాడిన వానియందు ద్వేషము జూపింపదు. నవ్వుచు మాటాడినచో నవ్వుచునే మాటాడును. లోపల నా మాట నుండించుచు నేయుండును. ఆ మంట తద్వాక్యోక్తభావన. ఇపుడు వాసంతి యొక్క రాజుయొక్క చుంబనమువలనఁ గలిగిన యనుభూతిభావన గాయగ్ని.

రాజు వాసంతియొక్క తూష్ణీంభావమును మఱియు ననుకూలతగా భావించెను. ఆమెను గాఢముగా గౌగలించికొనెను. ఇపుడు వాసంతికి దదనుభూతి మనోవిషయము కాక శరీరవిషయ మైనది. ఆమె కొంచెంతయు దళ్లు ప్రాకినట్లయినది. ఈలక్షణముకూడ వాసంతిలో విలక్షణముగా భాసించెను. చుంబనవేళ ననుభూతి భావన చేసి యా భావన మనోంతర్నిష్ఠమై యుండెను. అది భావనామయమైన మనఃపరిధిని దాటి శరీరస్పృశ్యమైన మనస్సు నంటెను. అందుచేతఁ దళ్లు ప్రాఁకిన ట్లుండెను. వాసంతిశరీరస్పృశ్యమైన మనస్సోపానము దెప్పు డడుగిడినదో వాసంతి కప్పుడు విచిత్రముగా నొక విషయము తెలిసెను. ఆమెమనస్సులో మన్మథుఁడు గోచరించి దొరయొక్క శరీరసన్నికర్ష కలిగినంతనే తన శరీరమునం దొక వినూత్నమైన యుద్వేగము చెలరేగెను. ఆ యుద్వేగ మామె యిదివఱ కెన్నఁ డెఱుఁగనిది. ఆమెకు నిముసములో స్త్రీపురుషసంబంధము యొక్క స్వరూపము తెలిసినది. ఆమెకు భయము వేసినది. అప్పుడు తన కామ మేమియో తెలిసినది. శరీరము, కామము, మనస్సు, ఊహ, భావన, బుద్ధి, అహంకారము, ఆత్మ, జన్మచరితార్థత - ఈ సర్వవిషయములు మూటకట్టి యొకచోట నున్నట్లు, అవి యన్నియు గలిపి తన్నివేశమందు భాసించుచున్నట్లును గనిపించెను. తన్నివేశమున వాసంతికి రాజుయొక్క స్పర్శవలన జరిగిన వహ్నియొక్క లక్షణము తెలిసెను. ఇతఁడు తనకు భర్త కాఁడు. అతని శరీరమునకుఁ దన శరీరమునకు సంబంధము లేదు. వాని యాత్మకుఁ దన యాత్మకు సంబంధము లేదు, వాని సృష్టికి హేతువులైన యణుసంతతికిఁ, దన సృష్టిహేతువులైన యణుసంతతికి సామ్యము లేదు. ఈ సంయోగము రాక్షసము. దైత్యభావసమ్మిశ్రితము. ఆ లిప్తలో వాసంతికి మఱియొక విషయము తెలిసినది. స్త్రీయందు సంతానము కలుగుచున్నది. తన కించుమించుగా నిఱువదియేండ్లు వచ్చినవి; తా నిదివఱకంత మూఢురా లేమి! ఇంత సులభమైన విషయము తన బుద్ధి కేల గోచరించలేదు? ఇప్పు డెట్లు గోచరించెను? ఏ విషయమైన నొకరు చెప్పినచోఁ దెలియవలయును. ఇది యెవ్వరును జెప్పకుండ నెట్లు తెలిసినది? తెలియుట యనఁగానే యీయూహలో వాసంతికి మెలఁకువ వచ్చెను. రాజేది యేదియో తనశరీరముతో జోక్యము కలుగఁజేసికొనఁబోవుచున్నాఁడు. వాసంతి

తన యూహను కదలిపెట్టి దొరను దూరముగాఁ ద్రోసి యిట్లనెను: "అయ్యా! నాయొడల నాకుఁ దెలియదు. నేనెదో యూహించుకొనుచున్నాను. ఒక యనుభవముయొక్క లక్షణమును బరిశీలించుచున్నాను. మీకును నాకును సంబంధము లేదు. మీరు స్పృశించినప్పటినుండి నా శరీరము తపఁబడిపోవుచున్నది. నేను మీ భార్యను కాను. నన్ను మీకొఱకు భగవంతుఁడు సృష్టించలేదు. మిమ్ము నాకొఱకు సృష్టించలేదు. మన శరీరాంతర్గతశక్తులు భిన్నములు. అట్టి సంయోగము చేయరాదు. నాకీసంగతి తెలియదు. నన్నే పురుషుఁడును సాహసించి ముట్టుకొనలేదు. నాకింతవఱకు సృష్టిలోని యీ ప్రథమరహస్యము తెలియదు. నే నిన్నాళ్లొక పశువుగా నుంటిని. తమరి దయవలన నాకిప్పుడు నేను జన్మయెందు కెత్తితినో తెలిసినది. మీకుఁ గృతజ్ఞురాలను. నేను సెలవుతీసికొందును" అని వాసంతి వడలిపోవుచుండెను. రాజున కామె యన్నమాట లర్థము కాలేదు. స్త్రీలు మొదట నిరాకరింతురు. నిరాకరించిన ట్లభినయింతురు. ఇది యాలక్షణ మనుకొనెను. పోవుచున్న వాసంతిని పట్టుకొని బలవంతముగా లాగినచో నామె వశమగు ననుకొనెను. కాని రాజున కాసాహసము లేదు. లేదనఁగా నిదివఱకెప్పుడును చేయలేదు. చేయవలసిన యవసరము కలుగలేదు. వెంటనే రాజు మనసులో నొకయూహ కలిగెను. పాతికవేల ముక్తాహారము నిర్హేతుకముగా దాటిపోవుచున్నది ధనముమీది యాశ రాజుచేత సాహసము చేయించినది. అతఁడు వాసంతిని బట్టుకొని "నీమీద నా కెంత ప్రేమయున్నది! నాలుగేండ్లు నిన్ను భావించి యెంత తపన పడితిని! నీ మెడలోని ముక్తాహారము పాతిక వేలు వెలకలది. నే నే స్త్రీకిని ఇంత కానుక నీయలేదు" అనెను. పోవుచున్న వాసంతి యూహలో ముక్తాహారము లేదు. ఆమెకు వెంటనే స్మృతివచ్చెను. ఆమె వెంటనే ముత్యాలహారమును తీసి రాజున కిచ్చి యాయన చేతులు బలవంతముగా వదిలించుకొనినది. ఆ వదిలించుకొన్న యప్పటి వాసంతి మొగమును జూచినంతనే రాజునకు భయము వేసెను. ఆమె రాక్షసి కాదు. రాక్షసి యనిపించెను. ఆమె యగ్ని కాదు. అగ్ని యనిపించెను. ఆమెలో నున్న సర్వరక్తబిందువులు తనయందు విముఖమై తాను పురుషుఁడే కానట్లు, తాను మానవుఁడే కానట్లు, తా నొక మట్టిముద్దయైనట్లు రాజునకుఁ దోఁచెను. ఆ లిప్తలో రాజునకుఁ దాను పరాభవింపబడుచున్నా ననిపించెను. కాని వాసంతి ముఖములో దన్ను పరాభవింపవలె నన్న భావము కనిపించలేదు. సాయంకాలపు గాలి తగిలి దిరిసెన చెట్టుయొక్క యాకులు ముడుచుకొన్నట్లుండెను. ఆ యాకుయొక్క యీనెల కంటియున్న చిన్నిచిన్ని యాకులలో వాడుటలేదు. ముకుళించుకొనుట యున్నది. ముకుళనము దాని యీనెలయందున్నది. ఆకులు

దిగ్గలిపగ్గలి నవ్వుటలో నున్నది. ఆకువంపు వాడుటలేదు. ఈ నెలయందు గార్న్యములేదు. అట్లు వాసంతి మొగమునందు వాడుటలేదు. మొగమునందలి రక్తబిందువులు ముద్దకట్టినవి. రక్తచ్ఛాయలలోని తళుకుపోలేదు. రాజునకీ యభిజ్ఞ కలిగెను. రాజు భావనాశీలి కాఁడు. అతని మనస్సున కిదియంతయు స్ఫురించెను. అతనికే యాశ్చర్యము వేసెను. రాజామె మొగమును జూచి వెనుకకుఁ దగ్గెను వాసంతి వెలిపోవుచుండెను. రాజున కామెకు ముత్యాలహార మీయవలె ననిపించెను. కాని ధనాశ వెనుకకు లాగెను. ఇట్టి స్త్రీనిఁ దా నిదివఱ కెఱుఁగఁడు. ఇది యొక విలక్షణమైన యనుభూతి. రాజేమి చేయవలయునో తెలియులేదు. తా నొక పరాభవభావము ననుభవించెను. తాను తన బలము నుపయోగించినచో వాసంతి యేమియుఁ జేయులేదు. తన్నెవ్వరు నేమియుఁ జేయలేరు. రాజుయొక్క మనస్సు తీవ్రముగాఁ బోవుచుండెను. వాసంతి మెట్లు దిగెను. అవి యిఱుకు మెట్లు. దిగుటకుఁ గాలము పట్టెను. ఆమె కేకలువేసినను ఫలములేదు. ఆమెను బలవంతముగా లాగికొని రావలయును. రాజు బయలుదేరెను.

శిరీషుఁడు తన కూఁతు నెంతసేపటికిని రాలేదని తానా మెట్లెక్కఁబోవుచుండెను. పెరుమాళ్లచ్చట నిలుచుండెను. అతఁడు "అయ్యా! వాసంతమ్మగారు రాణివాసమునుండి రాజుగారి గదిలోనికి వచ్చిరి. వా రామెకుఁ గానుక లిచ్చుచుండిరి ఇప్పుడే యిఁక దిగివత్తురు" అనెను. మెట్లు కొంతదూరమువచ్చి యొకమలుపునకు మలఁగెను. వాసంతి మలుపులో నున్నది. రాజు మెట్ల మొదట నున్నాడు. శిరీషుఁడును, పెరుమాళ్లును మెట్ల చివర నున్నారు. రాజునకు వీరు కన్పించరు. వీరికి రాజు కనిపించఁడు. వాసంతి కుభయులును గనిపింతురు. రాజు మలుపులోనికిఁ దొందరగా దిగివచ్చెను. వాసంతిని గట్టిగా పట్టుకొనెను. కూఁతును బట్టుకొనిన రాజు శిరీషునకుఁ గనిపించెను. రాజు పెరుమాళ్లు, శిరీషులను జూచిలేదు పెరుమాళ్లు వెంటనే గ్రహించెను. అదృష్టముకలన రాజు వాసంతి చేయిమాత్రము పట్టుకొనెను. పెరుమాళ్లు వెంటనే "దొరగారూ! వాసంతమ్మగారి తండ్రి యిదుగో యిక్కడనున్నారు. వారి యమ్మాయికోసము వచ్చినా" రనెను. ఆ పెరుమాళ్లు గొంతులో నేదో యొక విపరీతపరిస్థితి జరిగినదన్న భావమే లేదు రాజు తలయెత్తి చూచెను అతఁడు వెంటనే వాసంతితో నిట్లనెను: "అమ్మా! వాసంతీ! ముత్యాలహారమును వదిలిపెట్టిపోవుచుంటివి! ఇదిగో తీసికొని వచ్చితిని. నీ కంఠ మాధుర్యమునకు నే నెంత సంతోషించితిని. ఇదిగో తీసికొమ్మ" అని ముత్యాలహారము నామె చేతి కిచ్చెను. ఆమె కొనియు

సములో నూహాయే లేదు. చేతితోఁ దీసికొనెను. రాజు వెడలిపోయెను. వాసంతి మెట్లు దిగి వచ్చెను.

లోకమే చిత్రము. ఏదో వ్యతిక్రమము జరిగినట్లుండును. ఆ గాలిలోననే వ్యతిక్రమము జరుగలేదన్నట్లు నుండును. వ్యతిక్రమము జరుగకుండ నుండుట మానవేప్సితము. మానవ ప్రకృతి జరుగనట్లున్న యలుపపు గాలినే పెంపొందింపఁజేసికొని జరుగనట్లు వ్యాఖ్యానము చేసికొనును. శిరీషుఁడు చూచియుఁ జూడలేదు; తెలిసికొనియుఁ దెలిసికొనలేదు.

దారి వెంటఁ బోవుచు శిరీషుఁడు కూఁతుతో "దొరగారు నీచేయి పట్టుకొన్నాడు. మీ కంత చన వెక్కడిది" యని యొక వికృతపు వెక్కిరింపుతో ననెను. వాసంతి "యిందులో నేమున్నది నాన్నగారూ! ఆయన యూఁతకయే పట్టుకొనెను. ఆయన నాకు ముక్తాహారమిచ్చెను. నేను వలదంటిని. అంతవెల కలది నా కక్కఱలే దంటిని. అని వచ్చివేయుచుండఁగా మఱలఁ దెచ్చి యిచ్చెను. మెట్లుదిగుటలో నాచేయి పట్టుకొన్నాఁ డనుకొందును." అనెను. శిరీషుని మొగము కందగడ్డయయ్యెను. అతని కిదమిత్థమని తోఁచలేదు. వాసంతి తానెఱిఁగినంతవఱకు నట్టి పరిజ్ఞానము లేనిది. అంత పరిజ్ఞాన మొక్క నిముసములో రాదు. ఆమె రహస్యమును దాఁచుచున్నచో నామె కంత నేర్పు లేదనుకొనెను. ఆ రహస్యపరిజ్ఞాన మెప్పుడు కలుగునో యా నేర్పు నప్పుడే కలుగును. ఇది యిచ్చట నప్రసక్తమైనను శిరీషునకుఁ దెలియని విషయము. అట్టి పరిస్థితి యేర్పడినచో ముక్తాహార మేల తీసికొనదు? దాని కప్పుడు బలవంత మక్కఱలేదుగదా. వదలిపెట్టి వచ్చుటలేదుగదా! పొరపాటున వచ్చెననుకొందమన్న బాలిక వేలవెల గల వస్తువుమీఁదఁ బొరపా టుండదుగదా. వాసంతి కిది యొక క్రొత్తయనుభవము. ఈయనుభవావేశములో మఱచిపోయి యుండ వచ్చును. వాసంతి మొగమునందు, శరీరమునందు, మాటలయందు నట్టిచిహ్నము లేవియు లేవు. ఆ యొక్క చేయిపట్టుకొనుటతప్ప మఱి యింకేమియు లేదు. వాసంతి యంతిపురములోని కనుటచేతఁ బంపించెను. ఈ మేడ యంతఃపురము కాదేమో. తాము మోసగింపఁబడితిరేమో. వేయి యూహలైనను బూతుతో వనరానివి. అన్నిటికంటెఁ బైని నట్టివి జరుగలేదన్న యొక దృఢవిశ్వాసము.

వాసంతికి నొక మహావిషయపరిజ్ఞానము కలిగినట్లున్నది. తన.కననుభూతమైనది, తానెఱుఁగనిది, యొక మధురమైనది తనకుఁ దెలిసినది. తదనుభవ మెట్లుండును? మిక్కిలి దుఃఖజనకముగా నుండును. క్లేశజనకముగా నుండును. రాజు తన్నుఁ గౌఁగిలించుకొన్నప్పుడు, చుంబించినప్పుడు తన యొడలికి సుఖములేదు. తన యాత్మకు సుఖములేదు. తన మనస్సునకు సుఖములేదు. ఈ

సుఖము లేకపోవుట దేహమెత్తినదానికిఁ జారితార్థ్యమా! ఈదుఃఖమునందు లోకము రమించుచున్నదా! సంతాన మిట్టి దుఃఖజనితమా! అది దుఃఖజనకమై సంతాపజనక మగుచుండెఁగా లోకము సాగుచున్నదా! చిత్రముగా నున్నది. ఊహించుట కామె కెడములేదు. తండ్రికూతు లిద్దఱు నింటికిఁ బోయిరి. ఆనాడు వాసంతి భోజనము చేసెను. తా నొంటరిగాఁ బరుండెను. ఆమెకు నిదుర రాలేదు. శిరీషునకు నిదుర రాకపోవుట యన్నది యెన్నడును లేదు. అతఁడు గుఱ్ఱుపెట్టి నిద్రించుచుండెను. వాసంతియూహ యిట్లు సాగెను. "ఇది భర్తకాని పురుషునియం దసుఖము. భర్తయైన పురుషునియం దసుఖము లేదు. మఱి యట్లే పురుషునకుఁగూడ భార్యకాని స్త్రీయం దసుఖమై యుండ వలయును. సుఖభ్రాంతిచేఁగదా దొర తన్నట్లు పట్టుకొనెను. ఇది తా నను కొన్నట్లు కాదు. ఐనచోఁ దండ్రి తన్నెందుకట్లు ప్రశ్నించును? ఇందులో మఱియు నేదోయొక కిష్టసమస్య కలదు. తాను సారథిని స్పృశించి నప్పు డిట్టి బాధలేదే? అది సుఖముగానే యున్నదే! సారథి తనకు భర్తకాఁడే! తనకు భర్తయే లేఁడే! భర్తయైనవాఁడు స్పృశించినచో సుఖమా? ఎవఁడు స్పృశించినచో సుఖమో వాఁడు భర్తయా? ఈ భార్యా భర్తృభావము మనుష్యకల్పితమా? పరమేశ్వర కల్పితమా? ఎవరైనను లోకములో నీ రీతి తను సంసర్గజనిత సుఖాసుఖ విచారణ చేసి పెండ్లిండ్లు చేయుచున్నారా? పదియేండ్ల బాలికలకు వివాహము జరుగుచున్నది. అపుడుగూడ నిటి యనుభూతి విశేషముండునా? ఈవిశేషము యౌవనానంతరమున గలుగునా? వాసంతికి వందప్రశ్నలుదయించెను. ఒకదానికిని సమాధానములేదు. మఱల నామె యిట్లూహించెను: "నా కొనిముసములో నిది యిట్టిదని తెలిసెను. ఎట్లు తెలిసెను? నాకెవరును జెప్పినది కాదు. నే నొకచోటఁ జదివినది కాదు. తెలిసె ననఁగా నేమి? బుద్ధికి భాసించుట. ఆ బుద్ధికి భాసించుట చదివిననే తెలియవలయునా, చెప్పిననే తెలియవలయునా? చెప్పినచోఁ దెలియుట యనఁగా శ్రవణ రంధ్రముద్వారా బుద్ధి కవగతమగుట. అపుడైనను బుద్ధికి భాసించుటయే. ఇప్పుడు శరీరముద్వారా యనగా స్పర్శమార్గమున బుద్ధి కావిషయము భాసించెను. అప్పుడు శ్రవణమార్గమున భాసించును. తెలియుటయనునది యొకప్పుడు చెవిద్వారా, మఱియొకప్పుడు కంటిద్వారా, మఱియొకప్పుడు స్పర్శేంద్రియముద్వారా, తినువస్తువులయొక్క రుచి జిహ్వాద్వారా. తెలియుట యనఁగా నిది. నా కిది తెలిసినది. తెలిసి యేమి ఫలము? ఇం దనేక సందేహములు కలుగుచున్నవి. ఈ సందేహము లెట్లు నివారితము లగును? ఈ స్పర్శమువలనఁ దెలిసికొనుటకు నేను మిక్కిలి శ్రమపడితిని. దీనికొఱకుఁ

ప్రయత్నించితిని. నాల్గయిదుసార్లు సారథివద్దకుఁ బోయితిని. అతఁడు నన్ను శరీరమునఁ బలుచోట్లఁ దాఁకునట్లు పరిస్థితులు కల్పించితిని. ఆయనుభవముతోఁ బోల్చిచూచుటకు రాజును నన్నుఁ దాఁకనిచ్చితిని. అప్పుడు నాకుఁ దెలిసెను. ఇట్లు సారథి నన్నెప్పుడు చేయలేదేమి? తండ్రి యెన్నఁడును జేయఁడన్న మాట. ఇది భార్యాభర్తల సంబంధ మన్నమాట. సారథి నాకుఁ దాను తండ్రి వంటి వాఁడనును. అందుచేత సారథి నన్నట్లు కౌఁగిలించుకొనఁడు. అందుచేత నన్నతఁడు చుంబించఁడు. తండ్రిభావము గల పురుషుడు స్త్రీ నారీతిగా స్పృశించడు. ఆ స్పృశించుటలోననే యొక వైపరీత్యము కలదు. దాని లక్షణము. వేఱు..ఈ తండ్రిభావము నిదివఱకు నాలోచించితిని. నాయొక్కయు సారథియొక్కయు నడుమ నీ తండ్రిభావ మారోపితము. సహజమైనది భార్యాభర్తృభావము. అతఁడు నన్ను స్పృశించినప్పటి సుఖము రాజు నన్ను స్పృశించినప్పటి యసుఖము దీనిని నిర్ధారణఁ జేయుచున్నది. ఒకవేళ మఱియింకొకపురుషుఁ డెవ్వఁడైన నన్నిట్లు స్పృశించినచో అప్పుడుకూడ నాయనుభవ మిట్లే యున్నచో సారథివిషయము గట్టిగా నిశ్చయింపఁబడును. ఈ కోటలోఁగనుక నట్టి యేకాంతము రాజునకు నాతోఁ గలిగెను. తక్కినచోట్లఁ గలుగదు. భార్యగాని స్త్రీని స్పృశించుట ధర్మవ్యతిరేకము. ధర్మమనఁగా నీశరీరమునందుఁ దత్కాలమున సుఖాపాదన జరుగకపోవుట. ఐనచో రాజు సుఖేతరమైనదానికిఁ ప్రయత్నము చేసె నన్నమాట. ఇందు మఱియుఁ బరీక్షించి చూడవలయును. మఱి యింకొక పురుషునితోఁ గూడ నాయనుభవమిట్లే యున్నచో నీయసుఖము సార్వజనీనము కాదు. ఇది నాయొక్క ప్రత్యేక విలక్షణమై యుండవలయును. నాశరీర మింత ప్రత్యేక లక్షణ విలక్షణమై యెందు కుండవలయును? నాతండ్రి నాకు వివాహము చేయఁడు. నన్నిట్లే యుండిపొమ్మనును. అందఱు జేసికొనుచున్న వివాహము నన్ను వలదనుట చేత నాతండ్రికి నాశరీరములోని యీవైలక్షణ్యము తెలియు నన్నమాట" అని వాసంతి మంచముమీఁదినుండి లేచి తండ్రివద్దకుఁ బోయి కూర్చుండెను. అతనికి నిద్రలోఁ బ్రక్క నెవరో కూర్చుండిరన్న యలికిడి తగిలి నిద్రమెలఁకువవచ్చి చూడఁగాఁ గూఁతురు. అతఁ డామెను "అమ్మా! నిదురపట్టలేదా? ఎందు కిట్లు వచ్చితి"వని యడిగెను. వాసంతి యిట్లనెను. "నాన్నగారూ! నాకేల వివాహముచేయరు?" అనినంతనే శిరీషుఁడాలోచనలోఁ బడెను. ఇందాఁక బుట్టిన ప్రశ్నలకు సమాధానము జెప్పికొని శాంతిపొందిన యతని మనసులో మఱలఁ గలవరము గలిగెను. కాని యాకలవరములో వాసంతికి, రాజుకు సంబంధము కలుగలే దన్నది ధ్రువపడెను. అతని కొక యూహ

వచ్చెను. తన కూఁతు రదివఱ కప్రబుద్ధ. నేఁడు ప్రబుద్ధ. తాను పదునెన్మిదేండ్లు శ్రమపడి పోషించుకొనుచువచ్చిన సర్వప్రయత్న మొక్క గంటలో వ్యర్థమయ్యెను. అతనికిఁ గోపము వచ్చెను. అతఁడు మఱియు నాలోచించినచోఁ దెలిసెడిది: ఇది స్వభావము. కట్టవేసి కట్ట నిలిచినంతసేపు నీరు పల్లమునకుఁ బ్రవహింపదు. గండిపడినచోఁ బ్రవహించును. ఆ కట్టలో గండిపడకుండఁ బ్రతిసమయము రక్షించుకొనవలయును. ఒక సమయములో భగవంతుఁ డను కూలింపఁగా. ఆ నిముషమును బ్రతీక్షించుటకు వేయికన్నులు చాలవు. అట్లు జరిగినది. ఈమెయందా ప్రబోధము కలిగినది. ఏమి చేయవలయును? వాసంతి యిట్లన్నది. “నాన్నగారూ! మీరు నాకెందుకు వివాహము చేయరో నాకుఁ దెలియును. నేనొక ప్రత్యేకమైన వ్యక్తిని. లోకసామాన్యురాలను గాను. నా శరీరము విలక్షణమైనది. అందుచేత మీరు చేయరు. ఈ సంగతి మీ కెట్లు తెలియునో నాకాశ్చర్యముగా నున్నది. ఐనను దనబిడ్డ సంగతి తండ్రికిఁ దెలియకుండునా? శిరీషున కామె యేభాష మాటాడుచున్నదో తెలియదు కాని యామాటలలో నావిషయము స్ఫురించుటకు వీలు కలిగినది. అతఁడిట్లనెను: “ఔనమ్మా! అందుకనియే నిన్ను వివాహము చేసికొన వద్దనుచున్నాను. నీ వొక ప్రత్యేకవ్యక్తివి” అని యూఱకున్నచో బాగుండెడిది. పైన నిట్లన్నాఁడు: “నీవు సంగీతముకొఱకుఁ బుట్టితివి. సంగీతమే నీ జీవితములోఁ బరమావధి. వివాహమును గుఱించి యాలోచించవలదు.” వాసంతి వెంటనే తన గదిలోనికిఁ బోయెను. మఱల శిరీషుఁడు నిదురపోయెను. వాసంతి యిట్లాలోచించెను: “నేనొకటియనఁగా నాన్నగారింకొకటి యనిరి. ఆయనకీ విషయము తెలియునా, తెలియదా? తెలిసి నన్ను మోసపుచ్చుచున్నాఁడా? నాకు భర్తను వలచుట కష్టమువిద్యా? నా శరీరమందున్న యీ లక్షణము మఱియుఁ బరీక్షింపఁబడినదా? మఱియొకరిద్దఱు పురుషులు నన్ను స్పృశించినచోఁ దదనుభూతినిఁ బోల్చికొని నేను నిర్ణయించుకొనవచ్చును. ఆ రీతి జరుగుట యసంభవము. తనభార్యను వదలి పెట్టి యేపురుషుఁ డిట్లోపలు మండించుకొనును? రాజెందుకు మండించుకొనఁ బోయినాఁడు? లోకములోఁ గొందఱు సాహసులుందురు. ఇల్లు తగులఁబడి పోవుచుండఁగా దానిలోనికిఁ దూఁకుదురు. దానియందు లోకోపకారబుద్ధి యున్నది. తత్కాలాసుఖము భవిష్యత్కాలసుఖముగా భాసించును. రాజున కేతత్కాలాసుఖమువలన భవిష్యత్తులోఁ గలుగఁబోవు సుఖ మేమున్నది? లోకములోఁ గొంద ఱసుఖమే వాంఛింతురా? వాంఛించినచో వారు రాజువంటివారు.”

మఱునాఁడు రంగనాథము శిరీషునింటికి వచ్చెను. అతఁడు వాసంతిని జూడవలయునని; ఆమె పతనమును దెలిసికొనవలయునని తా నుచ్చులు వేసి ఓగించినాఁడు. లేడి గిజగిజ తన్నుకొనుచున్నదా ప్రాణముపోయి? మాంస ఖండముగా నున్నదా? చూడవలయునని వచ్చెను. వాసంతి యతనినిఁ జూచినవెంటనే యనేకములైన యూహలకు నివాసభూమి యయ్యెను. ఆమె మనస్సులోఁ గ్రొత్తలోకములు భాసించెను. ఒక్కసారి వైదాఖండమునుంచి తాను జూచియుఁ జూడఁజాలని బహువిషయములు స్ఫురించెను. అతనివంక దన వయసుకన్నెలు స్త్రీలు చాలమంది చూతురు. అతఁడు వారివంక నవ్వుచుఁ జూచుచుండును. ఇదియంతయు నేత్రద్వయ యుక్తమైనదా? పదిమంది కన్నె లితని నా దృష్టితోఁ జూతురా? వారి నితఁడా దృష్టితోఁ జూచునా? తనకుఁ దెలిసిన యీయసుఖము కొఱకా యీ ప్రవర్తన? లోకమంతయు నసుఖము వెంటఁ బోవుచున్నదా? ఇది నిజముగా నసుఖము కాదా? రాజు తన్ను స్పృశించినప్పుడు తనకుఁ దెలియని యేవో కారణాంతరములవలన నది యప్పు డసుఖమైనదా?" వాసంతి రంగనాథునితోఁ బూర్వమువలెనే మాట్లాడెను. పూర్వముకన్న నెక్కువ చనవు చూపించెను. కాఫీ యిచ్చినప్పుడు చేయికిఁ జేయి తగిలించి రెండు మూడు లిప్తల కాలము పరీక్షించెను. తన కేమియు సుఖభావన కలుగలేదు. అతఁడు మాత్రము తాను పన్నిన పన్నాగము ఫలించినదని వాసంతికి దానితో నాభావము వృద్ధయైనదని తోఁచెను. వాసంతి తనకు సులభురాలుగాఁ దోఁచెను. శిరీషునిఁ బ్రతారించి యామెతోఁ దన కేకాంతము కుదిర్చికొనినచో నామె తనది యగునని యనిపించెను. వాసంతి రాజుగారిచ్చిన ముత్యాలహారమును రంగనాథునకుఁ జూపెను. దాని వెల పాతికవేలని దొరగారు చెప్పినారని చెప్పెను. రంగనాథునకు నిస్సంశయమయ్యెను. అతని మనస్సులో ఏకొసము కలిగెను. తన కూతుండ్రు చెడిపోలేదు. వాసంతి చెడిపోయెను. తన కూతుండ్రు తెచ్చిన కానుకలు రాణీగా రిచ్చినవి. తమ చనిపోయిన కుమార్తెయొక్క స్మరణమున కిచ్చినవి. ఇది ప్రత్యక్షముగా రాజుగారిచ్చినది. ఇంతకంటె నేమి కావలయును? ఈవిషయమున వాసంతి నెత్తిపొడువవలయును. ఆమెను దనవశము చేసికొని, నీ పతన హేతువను నేనేనని చెప్పవలయును. అప్పుడు కసితీరును. ఒక్కసారథియే ఏమి? దొరగారు కూసెను, తాను కూసెను.

రంగనాథ మింటికిబోయి ముత్యాలహారము సంగతి భార్యతోఁ, గూతుండ్రతోఁ జెప్పెను. భార్య యసహ్యించికొనెను. లలిత పెదవివిఱిచికొనెను.

కమల యాశ్చర్యపడెను. కమల మఱలఁ దాను దొరగారివద్దకుఁ బోలేదు. పోయి నప్పుడు తానుకూడ నొక ముత్యాలహారము తెచ్చికొనవలయు ననుకొనెను.

రంగనాథునకు నవి యెప్పుడు వచ్చినను రెండుమూడుపనులు వచ్చును. అటు రాజయొక్క పతనమునకు బునాదులు వేసెను. అటు మాచుకొనవలయును. ఇటు వాసంతికిఁ దనకు నేకాంతము కుదుర్చుకొనుటకు నేదోపథకము వేయవలసివచ్చెను. మఱునాఁడు రంగనాథము దొరగారివద్దకుఁ బోయెను. తాను కుదిర్చిన యీ వాసంతీ సంయోగముతో రాజు తనయందు బరమప్రసన్నుఁడగు ననుకొనెను. కాని రాజునం దాలక్షణము కనిపించలేదు. అప్రియముగా నప్రసన్నుఁడుగా లేఁడు. ఈమాటమాత్ర మనెను. "ఏమండీ! మీ యమ్మాయిలు నిన్న వచ్చిరి, వెళ్లిరి. పాటకచేరి యైనతరువాతఁ బదినిముసములైన నుండలేదు" రాజునకు వాసంతీప్రయత్నవిషయమై నైరర్థ్యము మనస్సును కమలమీఁదికిఁ ద్రిప్పినది. రంగనాథము "చిత్తము. తమరి దయ యెప్పుడైనచో నప్పుడే వారు వత్తురు. నిన్నటి జమాఖర్చు లిట్లున్నవి. మూఁడువేలలో రెండువందలు మిగిలినవి" అని రంగనాథము రెండునోట్లు తీసి బల్లమీఁద బెట్టి "యింక నీనాటక వ్యవహారము చూచుటకు మరియెవ్వరినైన నియమింపుఁడు. నేను చాల శ్రమపడితిని. ఒక్క వీడాది విశ్రాంతి తీసుకొనవలయునని యున్నది. అర్జునరావుగారినిజూపమునవచ్చును. ఖాసీం దీనికి దగినవాఁడు. పెరుమాళ్లే చూచినచో నభ్యంతరమే లేదు. ఇప్పుడు నాటకసమాజములో స్త్రీపాత్రలు ధరించు నిద్దరు స్త్రీలున్నారు. ఒకతె వనగరాజకుమారి. రెండవయామె చంద్రమతి. వారిలోఁ జంద్రమతి మిక్కిలి మధురముగా బాడఁగలదు. మిక్కిలి యందగత్తె. అభినయముకూడ నెంతయో బాగుగాఁ జేయును. ఈకారణములచేత నామెకు గర్వముకలదు. సమాజములో నామె లేనిచో డబ్బు తక్కువ వచ్చును. ఆమె చీటికిమాటికి దన జీతమును దాటి డబ్బడుగును. ఈయనిచో బోదునని బెదరించును. వేషము వేయువేళకు నింటిదగ్గఱ బిగించుకొని కూర్చుండును. తలనొప్పియనును. కడుపునొప్పి యనును. "ఏదో గొంతుకమీఁదికి వచ్చినది. నామనస్సు సరిగా లేదండీ, వందరూపాయిలిచ్చినచో గాని యీయాపద దాఁటదు. ఇంత మనస్సుఖము లేకుండ నేను వచ్చి యేమి యాడుదును? ఏమి పాడుదు"ననును. 'తమరు ప్రభువులు కనుక దమమాట వినవలయును గాని నావంటి వారి మాట యది వినదు" అనెను. రాజు పెరుమాళ్ళును బిలిచి యాసంగతి యంతయుఁ జెప్పించెను. "రంగనాథముగారు కొన్ని నెలలపాటు విశ్రాంతి తీసుకొనవలయునట. నీవీ నాటకములు సంబాళింతువా" యనెను. అతఁడు దొరగారి యాజ్ఞయైనచో నట్లేయనెను. రాజునకు మనసులో జంద్రమతిని జూడవలయు ననిపించెను. రంగనాథము వెళ్లిపోవుచుండఁగా మఱల రాజాయనకూతుం ద్రెను

గోటకుఁ బంపించవలయు ననియు, రంగనాథము పడిన ఈ శ్రమకుఁ బ్రతిఫలము తరువాత ముట్టజెప్పగు ననియుఁ జెప్పెను. రంగనాథము వెనుదిరిగివచ్చి ఘంటల దొరతో నిట్లనెను: "అయ్యా, ఇందులో నొక విషయమున్నది. తమరికి మనవి చేయకుండ నేను వెళ్ళరాదు. నేను నాల్గునాటకములు వ్రాసితిని. అవి ద్యైహో యనవి. మఱిఁ గ్రొత్తనాటకములు వ్రాసి యాడించినగాని నాటకసమాజము యొక్క పేరు నిలువదు. దానికి దమరొక యాస్థానకవిని నియమింపవలయును. అవధానిగారున్నారనుకొండు. అర్జునరావుగారితో నిద్దఱుకవులు వచ్చిరి వారి ద్దరిలో నొకరి కాపదవి యిప్పింపవలయునని యర్జునరావుగారి కోరిక. నిజాని కందులో నొకరు సమర్థులు. ఆయన కిచ్చినచో నవధానిగారికి గోఘసువచ్చును. తమకు దెలిసిన విషయమే. అవధానిగారు పండితుఁడేమో కాని కవితాశక్తి తక్కువ. ఎవరినో యొకరి నాస్థానకవిగా దమ రేర్పఱచుకోవలయును. ఎంత పని? నెలకు వందరూపాయ లిచ్చినచో నెక్కువ" యనెను. దొరగారు "మీ రెదో విశ్రాంతి కావలయు ననుచున్నారు. కనుక మే మనుకొంటిమి. మీరు పైపరామరిక చూచుచుండవలయును. మీ కిది తప్పదు. మీరు కావలయు నన్నచో నెల కింతయని తమ కేర్పాటుచేయుదు" మనెను. రంగనాథము "ప్రభువు నాకీవలయునా? నేను తినుచున్నది మీ యుప్పు కాదా" యని సెలవు తీసికొనెను.

రంగనాథము తన వద్దనున్న పదునేను వేలలోఁ బదునొకండు వేలు వడ్డీతో సహా యప్పుతీర్చెను. తాకట్టు వదలించుకొనెను. తన పాలను తనకు మిగిలినది. విరోధినియైన వాసంతి కనుకొన్నంత యైనది. రాజునకు గోయి త్రవ్వి యట్టి పెట్టినాఁడు. సారధి మిగిలినాఁడు వాసంతిచేఁ దానుచేసిన శిక్ష యామెకు ప్రత్యక్షపఱచుట మిగిలినది. తనవద్ద నాల్గువే లున్నవి. అచ్చముగాఁ దనకు నాటకసమాజముమీఁద నధికారము పోలేదు. కోటలోనికి రాను పోను వచ్చును. ఒకదానికి బీజము వేసినాఁడు. ఆస్థానకవి పదవి నిర్మించవలయును. దానియం దవధానిని భంగించవలయును. అవధానిమీఁద నీ కోప మెందులకు? ఎందుకా? తా నుండఁగా నవధాని కవి యేమిటి? మూఢలోక మవధానిని గవి యనుకొను చున్నది. అతని కొకశిక్ష జేయవలయును. ఒకటి రెండు మూఁడు నాల్గు వ్యవహారములు తన చేతిలో నున్నవి. తనకు విశ్రాంతియు లభించినది. ఇంక నాల్గు బండ్లొక్క సారి తోలవలయును.

అన్నింటిలోఁ బ్రధానముగా రంగనాథమునకు వాసంతి నేకాంతముగాఁ గలిసికొనుటయే ప్రథమకర్తవ్యముగఁదోచినది. దానికిఁ దొలుతఁ బ్రాతస్స్నాయం

కాలముల రెంటియందును విడువకుండ శిరీషు నింటికిఁ బోవుటయు, వాసంతి సంగీతమును నది యొక విద్యగాఁ బ్రశంసించుచుండుటయుఁ జేయవలయును. కొన్ని దినము లితరములైన పను లన్నియు వదలిపెట్టికొనవలయును. రంగనాథ మీ పని మొదలు పెట్టెను. ప్రొద్దుటిపూట కాఫీ వారియింటనే త్రాగును. భోజన సమయమునకటకు నుండును. వారు భోజనమునకు లేచెడి వేళకు వా రతనినిగూడ భోజనమునకు నుండుమన్నచో నంటనే యుండిపోవును. సాయంత్రన మునువనకు వచ్చుటనే యుండును. ఇట్లు పదిదినములు గడచినవి. ఒకనాటి రాత్రి ప్రొద్దు పోవువఱకు నందే యుండెను. వాసంతి కొంత యభ్యాసము చేసెను. ప్రక్క నే వినుచుఁ గూర్చుండెను. మిక్కిలి ప్రొద్దుపోయినది. శిరీషు "రంగనాథము గారూ! మిక్కిలి ప్రొద్దుపోయినది. ఇపు డింటికి వెళ్ళకపోయిన నేమి? ఇచటనే నిదుర పోరాదా" యనెను. రంగనాథము 'సరే' యనెను. వాసంతియే యతని కింకొక మంచము వేసెను. ఆనాఁడు మంచము వేయువేళ నొక పరిస్థితి జరిగెను. శిరీషు బయటకుఁ బోయెను. వాసంతి మంచము తెచ్చుచుండెను. మంచము గదిలో నుండి సావడిలోనికిఁ దీసికొనిరావలయును. వాసంతి వచ్చువేళకు సావడిలో దీపములేదు. రంగనాథము చీఁకటిలో మంచము తెచ్చిన వాసంతితో "గాలికి దీప మారిపోయినది. నేను మంచము తీసికొనెదను, నీవు వెలిగించుకొని ర"మ్మని మంచమును దాను వాసంతి చేతిలోనుండి తీసికొనెను. ఆ తీసికొనుటలోఁ జీకటిలో వాసంతి కనుపించనట్లు మంచము సరిగా నెందున్నదో తెలియనట్లు వాసంతి హస్తములను, శరీరమును సంస్పృశించెను. ఇంతలో శిరీషుఁడు వచ్చెను. గాలికి దీప మారిపోవుట చెప్పఁబడెను. వాసంతి పోయి దీపము తెచ్చెను. రంగనాథమునకు వేఱే ప్రక్క వేయఁబడెను. రెండు మంచములమీఁద శిరీషుఁడును రంగనాథమును బండుకొనిరి. వాసంతి పోయి గదిలోఁ బండుకొనెను. శిరీషుఁడును, రంగనాథమును మఱి కొంత సేపు మాటాడుకొనిరి. శిరీషుఁ డెప్పుడు నిదురపోవునా యని రంగనాథము ప్రతీక్షించుచుండెను. ఆ శిరీషుఁడు వారముదినములు నిద్రాహారములు లేకుండ నుండఁగలవాఁడని రంగనాథమునకుఁ దెలియదు. "ఇంక నాకు నిదుర వచ్చుచున్నది, పండుకొంద"మని రంగనాథ మనలేదు. అన్నచో నతని కోర్కె సులభముగా నెఱవేరెడిది. ఏలయనఁగా నిదురకు దిగినవెంటనే శిరీషునకు నిదుర పట్టును. రంగనాథమునకు గంటసేపు పొర్లినగాని నిదురపట్టదు. కాలము గడచుచున్నది. వాసంతి తన గదిలోఁ బండుకొన్నది. తాను మంచము తీసికొని పోవువేళకు దీపము లేకపోవుట, రంగనాథ మేమియుఁ దెలియనట్లు దన్ను స్పృశించుట, యాస్పృశించుటలోని యొకలాలనయు వాసంతి గ్రహించెను.

కాని రంగనాథ మట్లు చేయునని తా ననుకొనలేదు. ఆమె కీభావములు లేవు. వాసంతి యొకదానికి సంతోషించెను. అతని నేకాంతముగఁ గలిసికొనుట తన కవసరము. దాని కతఁడే ప్రయత్నము చేయుచుండెను. ఆ సంగతి యామె కిప్పుడు తెలిసినది. ఆమె సందేహపడలేదు. అతఁడు తనను స్పృశించుటకును నట్లు జరుగుననియు ననుకొనలేదు ఆమె దానికి సిద్ధపడిలేదు. అందుచేత నాతని స్పర్శ యిదమిత్థమని యామె గుర్తుపట్టలేదు. ఇంతలోఁ దండ్రి వచ్చెను. అయ్యో! లభించిన యవకాశము పోయినదని యామె యనుకొనెను తండ్రి నిదురపోయినతరువాత నతఁడు తాను నిదురించుచున్న గదిలోనికి రహస్యముగా రావచ్చునన్న యూహయు వాసంతికిఁ గలుగలేదు. అట్లెందుకు వచ్చును? రాఁడనియే యామె యుద్దేశ్యము. వచ్చునో రాఁడో. ఆ యూహయే వాసంతికి లేదు. "అయ్యో! మనసా సిద్ధముగ లేకుంటిని. సరిగాఁ బరిశీలింప లేకపోయితిని" యని యామె యనుకొనెను. శిరీషుఁడు తెల్లవాఱులు మాటాడుచునే యుండెను. తూర్పు రేకలారినవెంటనే శిరీషుఁడు లేచి స్నానము చేయుటకు బయలు దేరెను. రంగనాథ మేమి చేయవలయును? అతనికి నిదురలేక దేహమంతయు రోకళ్లతో బొడిచినట్లుండెను ఇంచుమించుగాఁ దెల్లవాఱవచ్చె. వారి యింటిలో వంటకత్తె తానును మేలుకని యింటిలో నటు నిటు తిరుగఁజొచ్చెను. వాసంతి పండియున్న గది తలుపోరగాఁ దెరచియున్నది. తాను సాహసించి లోనికిఁబోవుట యాపోవకుండుటయా? పోయినచో నేమగునో. రాత్రి తాను స్పృశించినపుడు వాసంతి యఱవలేదు. భయపడలేదు. దేహమునందుఁ జలించ లేదు. అది యంతయు నామె ప్రసన్నత యనియే రంగనాథ మనుకొనెను. మఱల నౌనో కాదో యని యనుమానము. తాను సాహసించి గదిలోనికిఁ బోయి నచో వంటకత్తియ చూడవచ్చును. ఇంతలో శిరీషుడే రావచ్చును. అన్నిటికిని మించి రంగనాథముయొక్క శరీరము వాని యదుపులో లేదు. అతని యారోగ్య మొక వింతవస్తువు. అది యున్నది, లేదు. తగిన వేళలయందు నిద్రాహారము లున్నచో వాని శరీరము పనిచేయును. లేనిచోఁ గాడిక్రిందవేయును. అతఁడా యూహ లన్నియు నుపసంహరించుకొని తన యింటిత్రోవ పట్టెను. ఇంటికి బోయి పరుండెను. నిదుర ముంపుగా వచ్చుచుండెను. కాని నిదురపట్టదు. ఒక గంట గంటన్నర మంచము మీఁదఁ బొరలి చివఱకు లేచి స్నానాదికృత్యములు చేసి ఫలాహారము కానిచ్చి యేమి చేయవలయునో తోఁచక కూర్చుండెను. భోజనవేళ కావలయును. భోజనము చేయవలయును. అపుడు నిదురకుఁ బ్రయత్నించవలయును. దాని దయవలనఁ గొంత నిదురపట్టినచో సాయంకాలమున

కతఁడు కొంత తేరుకొనును. అది యొక్కటియే యుపాయము. ఇది యాతని శరీర తత్త్వము.

తరువాత వారము దినములు గడచెను. ఈ వారము దినములు రంగనాథము శిరీషునింటికిఁ బోలేదు. అతఁడు మఱలఁ దన కారోగ్యము కుదిరిన దనుకొనుటకు వారముదినములు పట్టెను. ఆనాడు మఱల శిరీషునింటికిఁ బోయెను. మధ్యాహ్నపుఁబూట వెళ్ళెను. వారముదినములు పోలేదు కనుక రాత్రి ప్రొద్దుపోవు వఱకు నున్నచోఁ దప్పులేదు. రాత్రి అచ్చటనే భోజనము చేసెను. శిరీషు డచ్చటనే పండుకొమ్మనెను. రంగనాథ మంగీకరించెను. ఆనాఁడు పాకడిలోనికిఁ దేబడిన మంచము పాకడిలోనే యుండెను. వెనుక దీప మాఱిపోలేదు. పోయినను ప్రయోజనము లేదు. రంగనాథము పండుకొనినంతనే శిరీషుతో "నిదుర లేనిచో నాయారోగ్యము చెడిపోవును. మాటాడకుండఁ గొంతసేపూరకే పండుకొన్నఁగాని నాకు నిదురపట్టదు. మనము మాటాడకుండఁ బండుకొంద"మనెను. శిరీషుడు సరే యనెను. ఐదునిముసములలో శిరీషుఁడు గుఱ్ఱుకొట్టి నిదురపోఁ జొచ్చెను. రంగనాథ మతని యారోగ్యమును జూచి యాశ్చర్యపడఁ జొచ్చెను. శిరీషునకుఁ జీకు చింత లేదు. దురాలోచనలు లేవు. దురాచారములు లేవు. దురూహలు లేవు. అందుకే యతనికి నిదురపట్టెనది. తనకును, నిదురకును సంబంధము లేదు. ఆ నిదురను బొట్టు పెట్టి పిలువవలయును. ఆమె రాదు. తాను రానీయఁడు. నిదుర రావలయు నని యతని శరీరము కోరుచుండును. అతని మనస్సు వేయి విషయముల మీఁదఁ బరుగెత్తును. మనసులోనికి వచ్చిన యూహల నన్నింటినిఁ బ్రతి యైదు నిమేషములకుఁ దోలఁగించుకొనుచు నొక యఱ నిముసమో, పావు నిముసమో నిదురను ధ్యానించును. మఱల మనస్సు దేనిని గురించియో యాలోచించ నారంభించును. ఈ రీతిగా నతని యదృష్టము కొలఁది పెందలకడ నిదురపట్టును.

శిరీషుఁడు నిదురపోవుచుండెను. వాసంతి గదిలో నిదురపోవుచుండెను. శిరీషుని నిదుర యొక చమత్కారమైనది. అతఁడు గుఱ్ఱుపెట్టి నిద్రించినను ప్రక్కన గాలి కదలినచో వెంటనే యతనికి మెలఁకువ వచ్చును. రంగనాథము మడతమంచము మీఁదఁ బండుకొనెను. రంగనాథ మటు నిటు పొరలినచో, గూసములు కిఱ్ఱుమనుచుండెను. పట్టా ధ్వనిచేయుచుండెను. అతఁడు రెండు మూఁడుసార్లు మంచముమీఁదినుండి క్రిందికి దిగెను. వెంటనే శిరీషునకు మెలఁకువ వచ్చెను. రంగనాథము మంచినీళ్ళకో, దేనికో లేచినట్లభినయించెను. రాత్రి రెండుగంట లయ్యెను. రంగనాథమునకు నిదుర పట్టదు. రంగనాథము మఱల నిదుర లేవఁగా శిరీషునకు మెలఁకువ రాలేదు. అతఁడు మెల్లగా వాసంతి

గదిలోనికి దారితీసెను గదితలుపు తెఱచియే యుండెను. రంగనాథ మది యానుకూల్యలక్షణముగా భావించెను శిరీషుఁడు మేల్కొన్నచోఁ దాను తన మంచముమీఁదఁ గనిపించఁడు. ఏమి చేయవలయును? దీపమును నెమ్మదిగా రంగనాథ మార్పివేసెను శిరీషుఁడు మేల్కొనినచోఁ దన కలికికి తగులును. అప్పుడు చీఁకటిలో గదిలోనుండి అతఁడు నెమ్మదిగా రావచ్చును. గదిలో దీపముగూడఁ దీసివేయవలయును. గదిలో దీపముండి తాను [illegible]నుండి వచ్చినచోఁ దాను గదిలోనుండి వచ్చుచున్నట్లు తెలియును. రంగనాథము గదిలోనికిఁ బోయెను. వాసంతి నిదురపోవుచుండెను. ముందు వాసంతిని స్పృశించుటయా, దీపమును దగ్గించుటయా? దీపమును దగ్గించి వాసంతినిఁ దాకినచో నామె నిదురలోనుండి యులికిపడి లేవవచ్చును. దీపము లేనిచో భయపడి యఱువవచ్చును. కనుక దీప మట్లే యుండవచ్చును. వాసంతిని దాఁకినచో నామె యులికిపడి లేవవచ్చును. అతఁడు సాహసించి వాసంతిని ముట్టుకొనెను. ఆమెకు వెంటనే మెలఁకువ వచ్చెను కనులు తెఱచి చూచెను. రంగనాథ మచట నిలుచున్నాఁడు. ఆమె మాటాడలేదు. అతఁ డామెమంచముమీఁదఁ గూర్చుండవలయు ననుకొనెను. కాని సావడిలో శిరీషుఁడు నిదుర లేచునేమో యని భయము. అతఁ డేమియు మాటాడకుండ సావడిలోనికిఁ బోయెను వాసంతి సగమునిద్దుర, సగము మెలఁకువతో నతఁడు గదిలోనికి దేనికివచ్చెనో విచారించకయే నిదురపోయెను. మఱల రంగనాథము గదిలోనికి వచ్చెను. ఆమెను దాఁకెను ఆమె వెంటనే మేల్కొనెను. ఈసారి యతఁడు సాహసించి మంచముమీఁద నామెప్రక్క మీఁదఁ గూర్చుండెను. వాసంతికిఁ జక్కగా స్పృహ వచ్చెను. అతఁ డట్లు వచ్చుటలో నామెకుఁ దప్పు కనిపించలేదు. తండ్రి మేల్కొన్నచో నేమగునో యన్న యూహ యామెకు లేనేలేదు. ఆమెకు నాక్షణమునందుఁ దన తొలియూహ స్ఫురించెను. ఇప్పుడు రంగనాథము తన్ను గౌఁగిలించుకొన్నచోఁ, దన్ను చుంబించినచోఁ దా నావిషయమును నిర్ధారణము చేసికొనఁగలదు. తానే కౌగిలించుకొనరాదా, తానే యతనినిఁ జుంబించరాదా యన్న ప్రశ్న పుట్టెను. ఆమె యట్లు చేయరాదు అట్లు చేసినచో నామెకుఁ దన యభిలషించిన యర్థము సిద్ధించదని యూహ. రంగనాథము సాహసించి యామె బుజముమీఁదఁ జేయివైచెను. చుంబించలేదు, కౌఁగిలించుకొనను లేదు. మీఁద వేసినచేయి యెట్లున్నదని వాసంతి యూహించ నారంభించెను. ఆ యూహించు వేళ యిట్లుండును. ఆమె కనులు మూసికొనును. తన దృష్టిని ఫాలదేశమునఁ గేంద్రీకరించును. అచటినుండి తలవెనుకలోనున్న మెదడులోనికి నూహ ప్రసరింపఁజేయును.

గదిలో దీపము కొంత తగ్గించియున్నది. దీపము వీరిద్దఱికి వెనుకభాగమున నున్నది. వాసంతి కనులు మూసికొన్నదో, తెఱచికొన్నదో యతనికిఁ దెలియదు. తాను భుజముమీఁదఁ జేయివేయఁగా వాసంతి యూఱకున్నదని మాత్రమే రంగనాథునకుఁ దెలిసెను. అతఁడు హఠాత్తుగా నామెను గౌఁగిలించికొనెను; చుంబించెను. ఆ కౌఁగిలింతలో నామెతోఁబాటు తాను మంచముమీఁద నొడ్డిగిలెను. ఇది యొక నిమేషకాలము పట్టినది. వాసంతి యీ యనుభవమును విస్పష్టముగాఁ బరిశీలించెను. సరిగా రాజు తన్నుఁ గౌఁగిలించికొన్నప్పుడెట్లున్నదో యిప్పుడు నట్లే యున్నది. రంగనాథము తన్ను మంచముమీఁదికి లాగి ప్రక్కనఁ బండుకొనినంతనే యామెలో నుండి యొక యగ్నిజ్వాలల బయలుదేఱెను. ఆమెకుఁ దన నాభిగోళమునుండి నిశ్వాస రంధ్రముల ద్వారా నొక నిప్పుతోఁ గూడినది, యశుచిమంతమైనది గాలి వెలికివచ్చెను. ఆమెగొంతులో మండెను. ఆమె వెంటనే లేచి నిలుచుండెను. రంగనాథము భయపడి లేచి నిలుచుండెను. ఆమె యిట్లనెను: "రంగనాథముగారూ! మీ రింక వెడలిపోవచ్చును. మీ రీపని చేయుదురా చేయరా, ఒంటరిగా మనమిద్దఱము కలిసికొనుట యెట్లు, మిమ్ముఁ బరీక్ష చేయుట యెట్లు అని యనుకొంటిని. తమరే వచ్చితిరి. కృతజ్ఞురాలను. మీ రింక వెడలిపొండు" అనెను. ఈమాట లామె నెమ్మదిగా ననలేదు. బిగ్గఱగానే యనెను. అతనికి గుండెలో దడపుట్టెను. ఈమాటలు శిరీషునకు వినిపించునేమో. అతఁడు మేల్కొనునేమో? రంగనాథము తల వంచుకొని బయటకు వచ్చి తన మంచముమీఁదఁ బండుకొనెను. శిరీషునకు మెలఁకువ వచ్చెను. అతఁడు దీపము పోయినదని తాను పోయి దీపమును వెలిగించెను. అట్లు మేల్కొనిన శిరీషుడు మఱలఁ బండుకొనలేదు. మంచముమీఁదనే కూర్చుండి కునికిపాట్లు పడుటయు, నడుమ నడుమ రంగనాథముతో మాట్లాడుటయుఁ జేయుచుండెను. రంగనాథమున కేయూహయు రాలేదు. తాను గదిలోనికిఁ బోయిన వర్తమానము శిరీషునకుఁ దెలియలేదని విశ్వాసము కలిగించుకొనుటలోననే యతని మనస్సంతయు లీనమైయుండెను. చివఱకుఁ దెల్లవాఱెను. శిరీషుని ప్రసంగవైఖరి తాను రెండు రాత్రులు చూచెను. నడుమనడుమ వేదాంతము, నాట్యము, కవిత్వమునుగూర్చి వచ్చుచుండినను నతని ప్రసంగము ప్రధానముగా సంగీతమును గూర్చియుఁ, దన కుమార్తెయొక్క విద్యను గూర్చియు నుండును. "ఆనాడు మాయమ్మాయి ఫలానా కీర్తన పాడెను. అక్కడ నాస్వరము వేసెను. ఆ సంగతి వేసెను. అది దక్షిణదేశములో నాపండితుఁడు వేయును, తెలుఁగుదేశములో రాగాలాపనమునందు వాసంతిని మించినవారెవ్వరును లేరు. వాసంతిని దక్షిణదేశమునకుఁ

దీసికొని పోవలయు నని యున్నది. నేను వెళ్లుదు ననఁగా నా కిచ్చుటఁ దీరుబడి లేదు. మాయమ్మాయికి సారథి నాటక సమాజములో వేషములు వేయుటయం దున్నంత యభిమానము సంగీతముమీఁద లేదు. ఆ సారథి నాటకమాడి యిప్పటి కేడాదియైనది. అతని కెప్పుడో యెందుకో యెదో నాటక మాడవలయు ననిపించును. దాని నొకసారి యాడును. మఱల దానిమీఁది కతనిమనసే పోదు. అందులో నిప్పుడు నాటకశాల దొరగారి స్వాధీనములోనున్న తరువాత నతఁడు నాటకములే తలపెట్టుటలేదు. అతఁ డూరిలో నుండెనా? నేను గాని, మాయమ్మాయి గాని యతనినిఁ జూచి పదినెల లయినది." శిరీషు ప్రసంగ మీరీతిగా సాగెను. ఇందులో నడుమ గొన్ని కొన్ని మాటలు రంగనాథును వేఱే యాలోచనలోనికి దింపినవి. ఆ చివఱిమాట మఱియును. వాసంతి సారథిని జూచి పదినెలలయినది. వాసంతికి సారథికి సంబంధ మున్నచోఁ బదినెల లీ రీతిగా నెట్లు నడచును? ఈ యిల్లొక చమత్కారముగా నున్నది. వీరి జీవితము చిత్రముగా నున్నది. వీరియందు మానవత్వము కనిపించలేదు. ఎక్కడనైనను బాట కచేరీ యున్నచో వెళ్లుట తప్ప మఱియొక ప్రసక్తిలేదు. ఈ తండ్రి కూతుండ్ర కెట్లు తోచుచున్నది? ఇంటిలోఁ బిల్లపాపలు లేరు. ఇట్టి జీవితము గడపుటకంటె నెందులోనైన బడి చచ్చుట మేలు. వీరికి విసుగే లేదా? మార్పక్కఱలేదా? ఇది యొక మాంద్యము. ఇదియొక జాడ్యము. వీరి కాయూహాయే లేదా? ఆ వాసంతి యది యేమి స్త్రీ? ఆమెలో జీవములేదు. కదలిక లేదు. తాను పోయి యామె మీద జేయివేయఁగా నామె కదలలేదు. కౌఁగలించుకొని మంచముమీఁదఁ దాను వాల్చెను. ఒక కట్టెను వాల్చినట్లున్నది గాని స్త్రీని వాల్చినట్లులేదు. లేచి యా యనిన మాటలేమి? తనకు, నాకు నేకాంతము తాను కోరినదా? నన్నుఁ బరీక్షించుటకా? నన్నేమి పరీక్షించును? నా శీలమును బరీక్షించునా? నా శీలమును బరీక్షించుటకుఁ దా నెవరు? నాయందుఁ గోరిక కలిగినచో నాతో నేకాంత మభిలషించవలయును. ఏకాంతమును బరీక్షించుటకుఁ గోరుటయేమి? రంగనాథున కేమియు నర్థము కాలేదు. ఆమె బిగ్గఱగా మాటాడెను. శిరీషుడు మేల్కొన్నచో నేమగును? తండ్రి మేల్కొన్నచో నామెకు భయము లేదా? నేను గదిలోనికిఁ బోయి మానభంగము చేయుటకు యత్నించితినని చెప్పుటకు ఆమెకు నేమియు నభ్యంతరముండదు. అటువంటి స్త్రీ నాతో చను వంత యెందు కభినయించినది? మొదటిసారి పోయి నేను తాఁకగాఁ గనులు తెఱచి చూచి యూఱకున్నది. రెండవ సారి లేచి కూర్చున్నది. కౌఁగలించుకొన నిచ్చినది. ముద్దుపెట్టుకొననిచ్చినది. చివఱకు హఠాత్తుగా లేచి యిట్లనినది. ఈ లోపుగాఁ దండ్రి మేల్కనినచో రభస యగునని యనుకొన్నచోఁ దనతో

నెమ్మదిగా జెప్పవచ్చును- "ఇప్పుడుగాదు రంగనాథముగారూ! మా నాయనగారు మేలుకొనవచ్చు"నని. అపుడు నా యంతట నేనే బయటికి వచ్చెడివాఁడను. ఆమె మాటలో స్నేహము లేదు. మార్దవము లేదు. వాంఛలేదు. ఇది యేమి యాడది! నన్నుఁ బరీక్షించుట యేమి? నా కా మాట యే యర్థ మగుట లేదు. మఱల నెప్పుడయిన నేకాంతముగాఁ గలిసికొని యామె నడుగవలయును. ఈమెతో నేకాంతమున కిదియే మార్గము. ఒక్క రాత్రి నిద్దుర లేనిచో వారముదినములు నా కారోగ్యము సరిగా నుండదు. పండ్రెండుగంటలవఱకు నిదురయే పట్టదు. అపుడు మంచముమీఁదఁ బరుండవలయును. నిదురకొఱకుఁ బ్రయత్నించవలయును. అపుడు నిద్రవచ్చును. తెల్లవాఱులు నేడో యెనిమిదో యగువఱకు నిద్రపోవలయును. అనిద్ర పట్టుట యాలస్యమైనచో మఱునాఁ డారోగ్యముగా నుండదు. ఇన్నాళ్లు నాటకములాడించినను బండ్రెండుగంటలైన తరువాత నే నెన్నడును నాటకభవనమున నుండను. రెండు మూఁడేండ్లక్రింద నారోగ్య మింతకంటె బాగుండెడిది. కాలము గడచినకొలఁది నాయారోగ్యము చెడిపోవుచున్నది. ఎంత విచారించినను వాసంతి నా కర్థమగుటలేదు. - మఱల రంగనాథమున కింకొక యూహ వచ్చెను. ఈమెను దొరగారు నామీఁదఁ బ్రయోగించిరా? దొరగారు, నీమెయుఁ గలిసి నన్నుఁ బరీక్షింపనెంచిరా? నేను దన్నిట్లు చేసితినని దొరతోఁ బోయి చెప్పెనా? దొర నాశీలమును బరీక్షించుట కీమెను నియమించెనా? తనకుఁ బ్రియురాలైన వాసంతిని నే నభిలషించితినని దొరకుఁ గోపమువచ్చెనా? ఆయనకు, వాసంతికి నొక్కనాటి స్నేహము. అంతలో నింత పరమానురాగ మెట్లు కలిగెను? తన కిష్టమైన వాసంతినిఁ బరుఁ డింకొకఁడు వాంఛించుట యాదొరకంత యనిష్టమైనచో నాఁడాఁక నెందులకు? తనకంటెఁ బూర్వుఁడు సారథి యున్నాఁడుగదా- ఆ సారథిని సాధించరాదా? సారథిని సాధించుట కిదివఱకే నిశ్చయించియుండును. నన్నుఁగూడ నారాశిలోఁ జేర్చుట కీప్రయత్నమేమో! రంగనాథము మనసులో మిక్కిలి పిరికివాఁడు. అతఁడు మఱల వాసంతినిఁ గలసికొని తన సంగతి రాజుతోఁ జెప్పవద్దని బతిమాలుటకు నిశ్చయించికొనెను. తఱువాత నాలుగు దినములకుఁ దాను శిరీషు నింటికి వచ్చి తానును, వాసంతియు నిద్దఱే యున్న యొక నిముసమున వాసంతితో నిట్లనెను: "వాసంతీ, నేను నీయందు దుర్భావము కలవాఁడను కాను. నే నిట్లు చేసితి నని దొరగారితో జెప్పకుము" వాసంతి నివ్వెఱపోయెను. ఆమె కెందుకో నవ్వు వచ్చెను. ఆనవ్వుతో రంగనాథమునకుఁ బైప్రాణములు పైనఁ బోయెను. ఇంతలో శిరీషుడు వచ్చెను. కాని రంగనాథమునకుఁ బ్రాణములు సర్దికొనెను. వాసంతి నిది యొక బతి

యర్జునరావును నేఁడొక చక్రవర్తినిఁజేసెను. చక్రవర్తియనఁగా నిజముగాఁ జక్రవర్తియే. అర్జునరావిప్పుడు రాజువేషములు వేయుచుండెను. రాజువేషమనఁగా వేషముకాదు. నిజముగా రాజే. అతఁడా వేషముమీద ధరించెడిదుస్తులు వేయిరూపాయలు చేయును. పాగమీఁది కలికితురాయి యొక్కటియే రెండువందల రూకలు. అతఁడు ధరించెడు కత్తిపిడి బంగారము పైన మణులు పొదిగినది. ఆవేషము చూచుటకే జనులు విరగఁబడి పోవుచుండిరి. అతఁడు సంగీతము పాడినచో సంగీతమనఁగా నట్లే పాడవలయునని దేశములో నభిప్రాయ మేర్పడినది. అతఁడు రంగముమీఁద శృంగార మభినయించును. నాయికవేషము వేసిన స్త్రీ భుజముమీఁదఁ జేతితోఁదట్టును. వంకరగానిలుచుండి యామెవంక జూచును. వెనుకనుండి వచ్చి కనులుమూయును. నిదురపోవునట్లు నటించి యొక్కసారి కనులు తెఱచి పకాలున నవ్వును. వెడలిపోవుచున్న నాయికయొక్క చీరకొంగు పట్టుకొని లాగును. ఆమె వెనుతిరిగి నవ్వును. అతఁడు ముద్దుపెట్టుకొన్నట్లు మూతి ముందఱకుఁ ద్రోయును. శయ్యాగతయైన నాయికయొక్క పాదములను సంవాహనము చేయఁబోవును. ఆమె నివారించును. ఇట్టి శృంగారరస చేష్టలు రంగముమీఁద వందలుగాఁ బ్రదర్శింపఁబడుచుండును. అతఁడు దేశములోఁ బలుమందికి శృంగారశిక్షాగురు వయ్యెను. నాటకభవనములో స్త్రీలకుఁ బ్రత్యేకింపబడిన స్థలము చాలక దానినిఁ బెంచవలసి వచ్చెను. అర్జునరావు న్యాయవాదివృత్తి నే మానివేసెను. అతఁడు తనయిల్లు వదలిపోఁడు. వెడలిపోయినచో మోటారుమీఁదనే పోవును. అతని బయటివేసమే పట్టుచొక్కాలు, పట్టుధోవతులు, అత్తాకోవిళ్ళ పట్టుత్తరీయములు. నాలుగువ్రేళ్ళ కుంగరాలు. మెడలో బంగారుగొలుసు. ఎడమచేతికి సింహతలాటపు మురుగు. కాళ్లకు జమ్కా చెప్పులు. చేతిలోఁ బొన్నుకఱ్ఱ. మనిసి యెఱ్ఱనివాడు. నల్లని గుబురైన మీసములు పెంచెను. పుస్తీలు పెట్టెను. రాజువేషము వేసి రంగముమీఁద నెట్లు నడచునో మఱియెచ్చట నడచిన నట్లే నడచుచుండెను. అతఁడు వారమున కొకసారియైన రైలుస్టేషనుకుఁ బోయి రెండవతరగతి విశ్రాంతి గృహములోఁ గూర్చుండి కొంతసేపు ప్లాటుఫారముమీఁదఁ బచారుచేయును. అందఱు నతని వంకఁ జూచుచుందురు. నాటకములు చూచినవారందఱు నతఁడొక యవతార పురుషుఁడు. చూడనివా రతఁడెవరో జమీందా రనుకొందురు. కొందఱాయూరి జమీందా రాయనయే యనుకొందురు. కొందఱు కుఱ్ఱవాండ్రతనిదగ్గఱఁ జేరి తిరుగుచుందురు. వారితో నతఁడు "మన మే జమీందారుల మనుకొనుచున్నారు" అని చెప్పుచుండును. ఈరీతిగా నర్జునరావు చక్రవర్తి యయ్యెను. ఇది తనమూలముగా నయ్యెను. అట్టి తనకే యతఁడు ద్రోహము చేసినాఁడు. నాకూఁతురు

తనకుఁ గూఁతురువంటిది. నేను స్నేహితుఁడుగదా యని, భార్య యోపిక లేనిదికదా యని నమ్మి పంపించినాను. ఇతనిని నే నేమి చేయవలయును? సారథియు, వాసంతియు, నవధానియు నకారణవిరోధులు. జమీందారును, నర్ధనరావును సకారణ విరోధులు. జమీందారు నాశనముతో వీఁడును నాశనమగును. కాని తనకు వచ్చిన యప్రతిష్ఠ యెట్లు పోవును? లలితవయ స్సిరువదియేండ్లు. అతనిమీఁద దావా వేయుటకుఁగూడ వీలులేదు. కనుక నతఁడు లలితను వివాహము చేసికొనునట్లు చేయవలయును. అతని భార్య యొప్పుకొనదు.

కొన్ని రాయబారములు, బెదరింపులు, కోపములు, ననునయములు చాల నాళ్లు జరిగిన తరువాత, లలిత పోయి దినదినము ప్రార్థించిన తరువాత నర్ధనరా వామెను వివాహము చేసికొనుట కంగీకరించెను. కాని యామె పుట్టినింటనే యుండును. అతఁడు వచ్చిపోవుచుండును. లేదా వేరే యిల్లద్దెకుఁ దీసుకొని యందులో సంసారము పెట్టును. రంగనాథము దాని కొప్పుకొనక తన యింటి లోననే తన కూఁతు రుండుననెను. వివాహమైనది. ఉంగరములు మార్చుకొని న్యాయాధిపతి దగ్గరకుఁబోయి యచటఁ బెండ్లిండ్ల ఖాతాలో నిద్దఱును దస్కతులు చేసిరి. ఈరీతిగా రంగనాథమునకు నెలా నెలపదు నేనుదినములు మనస్సునకుఁ దగినంత విశ్రాంతి లభించినది. మఱల నర్ధనరావునకు, రంగనాథమునకు స్నేహ మేర్పడినది. స్నేహముకాదు- బంధుత్వ మేర్పడినది. ఇప్పుడు రంగనాథమునకు మఱియొక విచార మేర్పడెను. రాజునకు గోయితీపివాఁడు. అతఁ డందులోఁ బడుచున్నాఁడు. పడుచున్నాఁ డనఁగా నొక గజము పడినాడు. నెలలోఁ దీసిన గోతులలో నొక్కసారియే పడుదురు. రంగనాథము తీసిన గోతులలోఁ గొంతకొంత గాఁ బడుదురు. ఇప్పుడు పెరుమాళ్లు నాటక భవనము మీఁద వచ్చెడి రాఁబడి పోఁబడులకు యజమాని. అతఁడు మొదటఁ జేసిన పని- తా నొక చిన్న మేడ వేసికొనినాఁడు. రంగనాథము చంద్రమతి చేతిలో రాజు చిక్కుకొనుననుకొనెను. రాజు రంగనాథము వేసిన పథకములోఁ బడలేదు. దొర వేఱే పథకమును వేసికొని దానిలోఁబడెను. ఆ పదకము నగరాజకుమారి. పూర్వము చంద్రమతి నాయికావేషములు వేసెడిది. ఇప్పుడు నగరాజకుమారి వేయుచున్నది. నగరాజకుమారికిఁ గోటలో నీ వస్తువు కావలయునన్నచో లభించును. ఇది లభించదన్న విచారణ లేదు. మఱియు నాటకములో వేసములు వేసెడివా రందఱు-కనీసము పెద్దవేసములు వేసెడివా రందఱకుఁ జెప్పరానన్ని ఋణము లున్నవి. సరిగా రాత్రికి నాటక మనఁగా వారికి ఎరెస్టు వారంట్లు వచ్చును. నాల్గవందలో, ఐదువందలో, యాఱువందలో యది రాజుగారి యద్ద

క్షముమీఁద నాధారపడియుండును. నగరాజకుమారి యనఁగా సాక్షాత్పార్వతి. అమ్మవారి దయ యిట్లుండునని చెప్పఁగలమా? నగరాజకుమారి దయకుఁ బాల సముద్రము. ఆమె. కౌలునెలల పసిపిల్లకూడ నున్నది. ఆ పాలసముద్రముమీఁద బండుకొన్న దొరగారు జలధివీచీవాత్యతగిలి పూర్వము కఠినుఁడైన వాఁడిప్పుడు మెత్తనివాఁ డయ్యెను. పూర్వము పైసా కైటఁబెట్టనివాఁ డిప్పుడు పైసా సహస్రములు చెల్లించుచుండెను. ఒక యేఁడాది యొప్పందములలో రాజుగారు రంగనాథము తీసిన గోతి కడుగుభాగమునఁ బడును. అప్పు డర్జునరా వేమగును? తన కూఁతు రేమగును? కనుక నర్జునరావును రక్షించవలయును. ఆ రక్షించుట యెట్లు? నాటకమున కొక్కొక్క వారంటు తన యల్లునిమీఁదఁ బుట్టవలయును. తక్కినవారిమీఁది వారంట్లు బండలమీఁద నున్నవి. అర్జునరావుమీఁద వారంట్లు వేలమీఁద నుండవలయును. రంగనాథ మర్జునరావునకు నీ హితోపదేశమును జేసెను. అతఁడును సుఖముగా స్వీకరించెను. దొరగారు కృష్ణుఁడు పాలవెల్లిమీఁదఁ బండుకొను భగవంతుఁడు. ఆ కృష్ణు నిప్పు డర్జునపక్షపాతిగాఁ ద్రిప్పవలయును. దానికిఁ గొన్ని చెణుకులు చేయవలయును. తన గొప్పతనము దొరగారికిఁ దెలియజేయవలయును. తాను రాజువేషము వేసినప్పుడు దొరగారు చూడవలయును. ఒకసారి దొరగారిని బలవంతముగాఁ దెచ్చి చూపించెను. ఆ రోజుతో దొరగారికిఁ గూడ నర్జునరావు శృంగారరసశిష్యుఁ డయ్యెను. నాటి నుండి దొరగారు వచ్చి చూడని నాటకమే లేదు. అప్పటినుండి యర్జునరావు మీఁది వారంట్లు చెల్లుబడియగుచుండెను. కాని మఱల నొక మార్పు జరిగెను. నాయికావేషము నగరాజకుమారికిఁ బోయి మఱలఁ జంద్రమతికే వచ్చెను.

ఇది యిట్లుండఁగాఁ గమల తన యక్కగారి వైభవమును జూచి మనసులో నాశమీఁది యాశగా బాధపడుచుండెను. రాజుగారు పూర్వము తన చనిపోయిన కుమారి కొసప్రతిగాఁ దన కిచ్చిన బహుమానము జరిగి యేఁడాది యైనది. రాజువద్దనుండి కబురు లేదు. కమల కాదినము గురుతున్నది. ఏఁడాది తిరిగి యాదినము వచ్చునప్పటికిఁ గమల తనయంతటఁ దానే కోటలోనికి బయలుదేఱెను. ఎందుకు బయలుదేఱినదో లలితకుఁ దెలియును. చెల్లెలు చెడిపోవుచున్నదని తా నారాటపడ నారంభించెను. తా నానాఁడు కోటలోనికిఁ బోదునని కమల లలితతో వారముదినములనుండి చెప్పుచుండెను. లలిత వలదనఁగా “నీ వర్జునరావును జేసికొనలేదా? నే నట్లే దొరగారిని జేసికొందు” ననెను. లలిత “నిన్నాయన పెండ్లిచేసికోఁ” డనెను. “ఎందుకు చేసికోఁడో యడిగెద” నని కమల యనెను. లలిత కిది సంకటమయ్యెను. తండ్రితోఁ జెప్ప

టకు వీలు లేదు. భర్త యున్నాఁడుగదా. అర్జునరావుతో నెమ్మదిగాఁ జెప్పెను. అర్జునరావునకు దొరగారిమీఁద మిక్కిలి కోపము వచ్చెను. "పసిపిల్ల కోట లోనికిఁ బోయినచో దొర యిటు చేయునా" యని అర్జునరావునకుఁ దొలిసారి వచ్చిన కోపము తగ్గి తరువాత రెండుమూఁడు నాళ్లిట్టి ప్రసంగము జరుగుచుండగా మఱల నర్జునరావు వల్లె యనఁగా లలిత "దొర గారి తప్పేమున్నది? తమరు మాత్ర మంతకంటె నేమి చేసితిరి? ఇప్పుడు ప్రధానము దొరగారిమీఁదఁ గోపము కాదు. కమల వచ్చుటకుఁ బోకుండఁ జూచుట" యనెను. అప్పుడుగాని యర్జునరావునకుఁ దన తప్పు తనకుఁ దెలియలేదు.

అర్జునరావు కమల కోటలోనికి బయలుదేరఁగాఁ దానుకూడ వెంట బయలుదేరెను. కమల వద్దనెను. కాని యర్జునరావు నిర్బంధించెను. ఇద్దఱును గలసి మోటారులో బయలుదేరిరి. "ఇదిగో, శిరీషునింటికిఁ బోయి యతనితో నొకమాట మాటలాడవలయును. అచ్చటినుండి కోటలోనికిఁ బోద"మని యర్జునరావు కారును శిరీషునింటివైపునకు మరలించెను. తాను లలితతో సఖ్యము కలిగించు కొన్నప్పటినుండి తమ యిద్దఱి వ్యవహారము కమలకుఁ దెలియును. కమల తెలిసియే యూరకున్నది. పలుసార్లు కమలయే సంధానము చేసినది. అర్జునరావుకు మనసులోఁ గొంత భయముగా నుండెడిది. కమల యెప్పుడైనఁ దన రహస్యము బయటఁ బెట్టునేమో యని. అందుచేతఁ గమలను గూడ వశపరచుకొనవలయునని ప్రయత్నించినాఁడు. అది తన యక్కగారికిఁ గోపహేతు వగునని యేమో కమల యంగీకరించలేదు. అప్పటినుండి కమలకు వివాహము చేయవలయునని యతఁడు సంబంధములు వెదుక నారంభించెను. లలితకుఁ గాకుండఁ గమల కెట్లగును? కనుకఁ గమలకుఁ గూడ నెవనితోనైనో యొకనితో సంబంధము కలిగించినచోఁ దన రహస్యము భద్రముగా నుండును. ఎవనితోఁ గలిగించవలయును? అతనికిఁ జూడఁగాఁజూడఁగా శిరీషకుమారుఁడు కనిపించెను. శిరీషుఁడు నలుబదియేండ్లవాఁడు, మంచి ఆరోగ్యవంతుఁడు. తల వెంట్రుక యొక్కటి నరయలేదు. ఆస్తిపరుఁడు, మగబిడ్డలు లేనివాఁడు. ఈ యాస్తి యంతయు వాసంతి పరమగును. ఆమెకుఁ బెండ్లి పెటాకులు లేవు. కమలను సంధానపఱచినచో నుత్తరత్ర యతనికిఁ గమలను వివాహము చేసికొనక తప్పదు. తన రహస్యము బైటఁ బడదు. కమలకు లాభము. తరువాత రంగనాథమునకుఁ దెలిసినను రంగనాథము సంతోషించును. ఈ నిశ్చయము నర్జునరా విదివఱకే చేసికొనియుండెను. ఇంతలో లలిత గర్భవతి యగుటయుఁ, గొన్ని నెలలు వారికిఁ దనకు మాటలు లేకపోవుటయుఁ, దాను విచారగ్రస్తుఁడగుటయు నీ కలిగిన యూహకు రెక్కలు తెప్పిం

చుటకు సాధ్యము కాలేదు. ఇప్పుడు క్రొత్తగా నీసంగతి బయలుదేరెను. కమల పిచ్చిది కనుక తాను లలితను జేసికొన్నట్లు దొరగారు తన్ను చేసికొను ననుకొనుచుండెను. ఆమె దొరగారిదగ్గఱకు వెళ్లినగాని దాని యాథార్థ్యమామెకుఁ దెలియదు. అసలామె పెళ్ళికుండఁ జేయవలయు నని యర్జునరావు నూహ. ఆరీతిగా నామెభావము నిశ్చయమైనఁగాని తన ప్రయత్నము కూడఁ గొనసాగ దని తెలియును కాని ముందు శిరీషుతోఁ బరిచయ మొకటి యేర్పాటు చేసి నచోఁ దరువాత ఫలించునని యర్జునరావు కాగతని యింటికిఁ బట్టించెను. శిరీషును, వాసంతియు నింటివద్దనే యుండిరి. ఎన్నడును రాని యర్జునరావు తన యింటికి వచ్చుట శిరీషునకు బ్రహ్మానందమయ్యెను. వాసంతి నింటిలో వదలిపెట్టి వెళ్లి శిరీషు డర్జునరావు నాటకములను జాల జూచెను. వచ్చి మఱునాఁడు వాసంతితో నాతని నటనావైశిష్ట్యమును దండ్రి చెప్పుటయు, వాసంతి వాని నన్నిఁటిని విమర్శించుటయు జరుగుచుండెను. అర్జునరావు వచ్చుట గంటసేపుండెను. ఈగంటలో బహుప్రసంగములు తెచ్చి శిరీషునకు మఱల వివాహము చేసికొనవలయు ననియుఁ, జేసికొననిచో నతని యాస్తి యెవ్వరికిఁ బోవలయు ననియు, మొదలైన మాటలన్నియు ననెను. ఇవియన్నియుఁ గమల వినవలయునని, యతనినిఁ జేసికొనినవాఁడు సుఖపడునని. "అతని కేమి మహారాజు. అతని భార్యకు నేది కావలసినచో నది కొని పెట్టఁగలఁడు." కమల మనస్సులో నీబీజము లచ్చముగాఁ బడకుండఁ బోలేదు.

ఆపూటకుఁ గోటలోనికిఁ బోవుట పడలేదు. సాయంత్రమున కమల కోట లోనికి వెళ్లెను. అర్జునరావు వారించలేదు. అర్జునరావుమీఁద లలితకుఁ గోపము వచ్చినది. అర్జునరావిట్లు చెప్పెను: "పిచ్చిదానా! ఇప్పుడు కమల మనము చెప్పినచో వినదు. రాజుదగ్గఱ నిరాకరణము జరిగినఁగాని యామె మన ధోరణిలోనికి రా"దనెను. లలిత మఱల నాదుష్టుఁడు కమలను స్పృశించుననెను. అర్జునరావిట్లు చెప్పెను: "నేనాభయము లేకుండఁ జేసితిని. కమలకు హితోపదేశము చేసితిని. మన సంబంధము, రాజుగారికిఁ దనకుఁ గల సంబంధములలోని భేదమును నిరూపించి చెప్పితిని. ఆమె గ్రహించెను. రాజుగారు తన్ను దాక వచ్చినచో వివాహమున కంగీకరించినచోఁ దాఁకనిమ్ము; లేనిచో నిరాకరించి వచ్చివేయుమని చెప్పితిని. ఆమె యంగీకరించెను. దానికి భిన్నముగా నడువరాదని నీమీఁద, నీనాన్నమీఁద, నీయమ్మమీఁద నొట్లు వేయించితిని. నాకుఁ దెలిసినంతవఱ కామె జాగ్రత్తగానే యుండును." ఈమాటలు విని లలితకూడ శాంతపడెను.

కమల కోటలోనికి వెళ్లఁగా రాజుగారు, నగరాజకుమారియు నుండిరి. కమల లోనికి వచ్చుటకే వీలులేకపోయెను. ఆమెను మేడమీఁదికే పోనీయలేదు. అచ్

టపుడు పెరుమాళ్లు లేఁడు. కమల కదలలేదు. రాజుగారి దర్శనము చేసి గాని పోనని కూర్చుండెను. నగరాజకుమారి రాత్రి ప్రొద్దుపోయి బయలుదేరెను. అచటఁ గూర్చున్న కమలవంకఁ గోటలోనివారందఱు చూచుచు నవ్వుచు రాజుగారితో నేమిపనియని వెక్కిరించుచు ననేకములైన పోకళ్లు పోవుచుండిరి. ఆమె యచట నాలుగుగంటలు కూర్చుండెను. ఆమె కప్పటికే సగము తెలిసెను.

లలితార్జునరావుకుఁ దనకు జమీందారుగారికిఁ గల స్నేహము క్రమముగా దెలియఁజొచ్చెను. అర్జునరావు చెప్పినది నిజము. నగరాజకుమారి మేడమెట్లు దిగివచ్చి యచ్చట నున్న కమలను జూచెను. ఖాసావాండ్రు తిరుగుటయు, వెక్కిరించుటయుఁ బరిశీలించెను. ఆమె వెంటనే గ్రహించెను. ఆమె తిరిగి మేడమీఁదికి బోయి దొరగారితో మీ ప్రాత స్నేహితురాలొకామె వచ్చి మేడమెట్ల దగ్గఱ గూర్చున్నదని యాయనను చేయిపట్టుకొని తీసికొనివచ్చి చూపించెను. దొర కమలను చూచెను. కమల దొరతో మాటాడబోయెను. దొర యామెను గుర్తుపట్టెను. కాని తానామె నెఱుగనట్లు "ఎవరమ్మాయీ! నీవు? కోటలో నీకేమి పని? నాతో నీకవసరమేమి? ఏరా పెరుమాళ్లూ, ఒరేయ్, ఈవిడ యెవరో బయటికిఁ బంపించివేయుఁడు" అని తనదారిని దానుపోయెను. నగరాజకుమారికి నాటకము తెలియును. ఆమె నవ్వుచు "అమ్మాయీ! నిన్ను నే నెఱుఁగుదును. దొరగారు నిన్నెఱుఁగకుండ నుండుటకు వీలులేదు. మీ నాయనగారు గొప్పవాఁడు, మహాకవి. ఆయన కిది యప్రతిష్ఠ. ఇక్కడనున్న జన మందఱికి నీవు ఫలానాయని తెలియును. వారెట్లు ప్రవర్తించిరో చూడుము. నీవు చిన్న పిల్లవు. రాజులు మదోన్మత్తులు. ఇప్పుడు రాజుగారికి నేను దవతిని. నీ వంకఁ జూడఁడు. నేను గనుక నీతో నిట్లు మంచిగా మాటాడుచున్నాను. మఱియొకర్తుక మాటాడదు. నీ తన సంగతి నాకుఁ దెలియఁగూడదని రాజుగారట్లు మాటాడినారు. అట్టి రాజు వలన నీకేమి ప్రయోజనము? ఇది నలుగురికి దెలిసినచో మీ నాయనగారి కెంతటి యపకీర్తి" యని యామెను వెంటఁదీసికొని, ఆమె యింటివద్ద దింపి తాను వెడలిపోయెను.

కమల నిర్ఘాంతపోయెను. ఆమెలోఁ జైతన్యములేదు. ఏమియుఁ దెలియని యాపసిగుండెకు, వయసుమాత్రము తెలిసిన యాపసిగుండెకు నిది మిక్కిలి బరువయ్యెను. ఆమెకుఁ, దెల్లవాఱులు నిదురలేదు. మఱునాటి ప్రొద్దుట నుదయసూర్యునితోఁ బాటామె కను లెఱ్ఱవారెను.

కమలకు నిదుర లేకపోవుటవలన మఱునాటికి దుఃఖ మపనయింపఁబడలేదు. ఆమె స్థితి బాగుగాలేదు. ఆమె తన యింటిలోననే యున్నచో సంద

లును గ్రహించిపోదురని యర్జునరావు తనయింటికిఁ దీసికొనిపోయెను. అతఁడామె నన్నగారివలెఁ జూచి నాదరించెను. పది దినములలో నామె తనదుఃఖమును మఱచిపోయెను. ఈ పది దినము లతఁడు శిరీషుని గుణగణములఁ బ్రశంసించుట, శిరీషుఁడు గొప్ప పండితుఁడని చెప్పుట, యతనివద్ద కమల చదువుకోవలయుననుట యిట్టి మాటలే మాటిమాటికిఁ జెప్పుచుండెను. అర్జునరావు ప్రతిదినము శిరీషు నింటికి బోవుచుండెను. కమలనుగూర్చి చెప్పుచుండెను. చిన్న చిన్న సన్నివేశములు కల్పించి చమత్కారముగా కమలకు శిరీషునిమీఁద నెంతో యభిమాన మున్నట్టి యర్థము వచ్చునట్లు మాటాడును. వాసంతికిఁ గమలమీఁద నొక యభిమాన మేర్పడెను. వాసంతికిఁ బూర్వ మెవ్వరితోడను బరిచయము లేదు. ఒకనాటి సాయంతనమున నర్జునరావు గమలను శిరీషునింటికిఁ దీసికొనిపోయెను. వాసంతియుఁ, గమలయుఁ గలసికొనిరి.

ఇదివఱకు వా రిరువు రొకరి నొక రెఱుఁగుదురు. ఇదివఱకుఁ జాలసార్లు కలిసికొనిరి. కాని యిప్పుడు కలసికొనుటలో భేద మున్నది. కమల పూర్వపుఁ గమల కాదు. వాసంతి పూర్వపు వాసంతి కాదు. కమల లలితాద్గుణములను జూచి తా నొక గాలిమేడ కట్టికొనెను. అది గాలిమేడ యని తెలియుటతోడనే యామె యధఃపాతాళమునకుఁ బడిపోయెను. అచట నుసుసుల్లినడెను. విచ్చిచెడిచేయుంగల విన్నపము లయ్యెను. దానితో నామె మనస్సు పరిశేశలమయ్యెను. జీవుఁడు తనకు వచ్చిన యాపదలో దుఃఖపడి యా దుఃఖములోనుండి బయటఁబడుటకు మిత్రుఁడను నాలంబము కోరును. సుఖముగానుండుట, హాయిగానుండుట, యానంద లక్షణములు కలిగియుండుట - యివి జీవునకు సహజ పరిస్థితి. ఆస్థితిలోనికి దుఃఖమునుండి వచ్చుటకు జీవుఁడు దేనినైన నాలంబముగ గ్రహించును. కమలకుఁ బూర్వము మనసు మెత్తఁదన మెట్టిదో తెలియదు. కొంత పసఁదనము, కొంత లెక్కలేనితనము, కొంత యన్నియుఁ దనకుఁ గావలె ననుకొనుట. ఆమెకుఁ దగిలిన యీ దెబ్బ యామె మనస్సునకు నీ యల్పగుణములను బోఁగొట్టి యొక పరిణతిని దెచ్చెను. ఇప్పుడామె స్నేహము చేయఁగలదు. ఒకరిని ప్రేమింపఁగలదు ఈ స్థితిలో వాసంతినిఁ జూచెను.

వాసంతి పూర్వ మొక కొయ్యబొమ్మ. తండ్రి యామె నటు తయారు చేసెను. ఆమె తన యూహాబలముచేత మఱల మనిషియయ్యెను. కమలజాతి జీవుఁడు మృణ్మయుఁడు. వాసంతిజాతి జీవుఁడు లోహముడు. వాఁ డనుభవముచేతఁ దెలిసికొనును. వీఁ డాలోచనచేతఁ దెలిసికొనును. వాసంతిలో స్వర్గుణవివేచన జనిత పరమార్థజ్ఞాన మామె సర్వశరీరాణువుల యందుఁ బ్రవేశించి యామె

మనః పరిపాకమున నొక విక్షిప్తి జరిగెను. ఆమెకుఁ బూర్వ మెవ్వరితోడను సంబంధము లేదు. తండ్రియు, దాసు నిద్దే. సారథియం దామెకు మార్దవము లేదు. సారథి యభినయము తన కాశ్చర్యకారి యగుటచేత నామె యతని యభినయము నే ప్రేమించుచుండెను. ఆమె సంగీతమును మెచ్చును. అభినయమును మెచ్చును. కవిత్వమును మెచ్చును. ఈ మెప్పు తావన్మాత్రముగా నాఁగిపోవును. ఆవిద్యలు ప్రదర్శించిన వ్యక్తియందు వ్యాపించవు. ఏజీవుఁడు తన శరీరమునందు దన రక్తమునందుఁ దన యింద్రియాభిలాషలయందు నభివ్యాప్తుఁడైయుండునో వాని కితరవ్యక్తులయందు సౌహార్దము, ప్రేమ కలుగును. ఒకపురుషుఁ డింకొక పురుషునిఁ బ్రేమించుచుండెననగా నర్థమేమి? ఆపురుషుఁడో స్త్రీయో యెవరు? ఇంద్రియ వాంఛలయొక్క సమాహారము. మనోవాంఛలయొక్క కూడిక. మనోభావములయొక్క యునికిపట్టు. ఇవియన్నియు లోకాభిముఖముగాఁ బ్రవహించునవి. స్నేహ మనఁగా నిద్దఱు వ్యక్తులు. ఈ యింద్రియ వాంఛావిషయముల యొక్క పుంజీభావములు కనుక నొక యింద్రియవాంఛ కల చోటు మఱియింకొక యట్టిచోటునందు నదియుఁ దనవంటిదే యనుకొనుట. ఇది స్నేహమనఁగా. వాసంతి యిట్టిస్థితికి వచ్చెను. ఆమె కింద్రియపరిజ్ఞానము కలిగెను. తదభిలాష కలిగెను. లోకము తెలిసెను. సర్వలోకము నట్టిదియే. ఆ లోకమునందు ప్రేమ పుట్టుట సహజము. వాసంతియుఁ, గమలయు నీరెండు ప్రక్రియలచేత నార్ద్రప్రవృత్తులైయున్న సమయమునందు వారి యీ కలయిక వారిని నిముసములో మిత్త్రములను జేసెను. వాసంతి కమలను దాఁకును. తన చెక్కిలి యామె చెక్కిలివద్దకుఁ దీసికొని పోవును. ఆమెను గౌగిలించుకొనును. ఆమె నానుకొని కూర్చుండును. కమలయొక్క స్పర్శ వాసంతికి బాధాజనకముగా లేదు. లేదనరికదా, సుఖముగా నున్నది. ఆసుఖమును వాసంతి పరిశీలించెను. తాను సారథిని దాఁకినప్పటి సుఖమిది కాదు. తండ్రిని దాకినప్పటి సుఖ మిది కాదు. తండ్రిని దాకినప్పుడు సుఖమే లేదు. సారథిని దాకినప్పటి సుఖము కమలను దాకినప్పటి సుఖమునకు భేదమున్నది. కమలను దాఁకినప్పుడు మనస్సులోనుండి యొక సుఖరేఖ శరీరములోనికిఁ బ్రవహించుచున్నది. సారథిని దాకినప్పుడు సుఖరేఖ శరీరమునుండి మనస్సునకుఁ బ్రసరించెను. తాను తనతండ్రిని తాఁకినప్పుడు తత్సుఖరేఖ యథాస్థితికముగా నుండెను. దానికిఁ బ్రసరణమే లేదు. అది యొక సుఖము. శరీరాణువులు కదలలేదు. మనస్సు చలించలేదు. ఇది యొక త్రిధాస్రవంతి

కమల వాసంతి తన్ను గౌగిలించుకొనఁగా రాచికొని తిరుగఁగా జెక్కిలిఁ జెక్కిలిఁ జేర్పఁగా దుఃఖాపనోదకమైన యొక సుఖము కలిగెను.

ఆమెశరీరము సేదదేరెను. ఆమె మనస్సునకు విశ్రాంతి కలిగెను. లలిత తన కక్కరగారు. ఆమె తన్నీరీతి చెప్పుడు నాదరించలేదు. తన తల్లిదండ్రులు చెప్పుడిట్లు తాకలేదు. రాచుకొని తిరుగలేదు. ఈ శరీరము తాదృగనుభూతికై నిత్యప్రతీక్ష చేయునుగాబోలు. దీనిని గౌగిలించుకొనవలయును దీనిని రాచికొని తిరుగవలయును. దీనిని ముద్దు పెట్టుకొనవలయును. అప్పు డీశరీర మొక చరితార్థతను బొందినట్లు భావించునుగాఁబోలు. ఆ చరితార్థత త్రిక్కరణముల చేయు వ్యక్తిపై నాధారపడి యుండును. దానప్పుడున్న స్థితిమీద నాధారపడి యుండును. కమలకుఁ గూడఁ బూర్వము దొరతాఁకిన నాటి యనుభవము స్మృతిలోనికి వచ్చెను. ఆ యనుభవ మొక్కసారి తనలో నిగూఢమైయున్న యేదోయొక మహాసుఖానుభూతిని హఠాత్తుగా వెలికిఁ ద్రవ్వెను. ఈ వాసంతీ పరిష్వంగాదులు దానిని ద్రవ్వలేదు. కాని దానినిఁ ద్రవ్వఁబోవుచున్నట్లుండెను. అది సుఖమో యిది సుఖమో నిర్ణయింప రాకుండెను. ఇది మార్గము; అది ప్రాప్యము. ఇది ప్రయత్నము; అది ఫలితము. ఫలితము పొందితిమన్న యనుభూతి ప్రయత్నము చేతఁగాని పరమ స్వాదువు కాదు. హఠాత్తుగాఁ బ్రయత్నరహితముగా లభించిన యొక నిక్షేపము దిగ్భ్రాంతి హేతువగును. శాంతముగా ననుభవించుటకు యోగ్యమైనది కాదు. ఈ వాసంతీ స్పర్శలో, నొక మాధుర్య మున్నది. ఒక యౌదార్య్మ కలదు. మండుచున్న శరీరముమీఁద శీతలీకరణమయిన మందు రాచినట్లున్నది.

సాయంకాలము నాలుగుగంటలకు వచ్చిరి. రాతిరి తొమ్మిదైనది. కమలా వాసంతు లొకరినొకరు వదలిపోలేరు. కమలార్జునరావులు నాటిరాత్రి యచటనే భోజనము చేసిరి. వాసంతి కమల నచటనే యా రాత్రి యుండి పొమ్మనెను. అర్జునరావు కాదని తీసికొనిపోయెను. ఈ స్నేహము పదిదినములు పెరిఁగెను. దాని కవధులు లేకపోయెను. అర్జునరావు కమల నచ్చట దించి తనదారిని దాను వెడలిపోవును. కమలా శిరీష వాసంతులు ముగ్గురే యింటిలో నుందురు. వాసంతి శిరీషునివద్ద కెట్లు పోవునో కమల యట్లే పోవుచుండెను. తొలుతటి మూఁడు దినములు జరిగిన తరువాత శిరీషుడు కమల బుజముపై చేయి వేయును. వారిరువు రొకరినొకరు రాచుకొనియే తిరుగుదురు. కమల శిరీషు నానుకొనియే కూర్చుండును. శిరీషు డొక పుస్తకమును జూచుచున్నప్పుడు నొక నూత్నవస్తువు పరిశీలించుచున్నపుడు వారిద్దఱు చెతి యొకనైపునఁ గూర్చుండి, యతని బుజముఁమీదినుండి దానిమీఁదికి వ్రాలుదురు. భోజనము చేయుచుండఁగా నొక పదార్థ మెవ్వరికైన నెక్కువయైనచో

రెండవవారికి వేయుదురు. శిరీషునకుఁ బ్రారంభమునుండియుఁ గమలతోడి యీ పరిచయము వాసంతీపరిచయమునకంటె భిన్నముగానే యుండెను. అతఁ డదివఱ కెన్నఁడెఱుఁగని యొక సరదా క్రొత్తగా సముద్భూతమయ్యెను. పదునాఱేండ్లక్రిందటి తన భార్యతోడి యనుభూతి క్రమక్రమముగా జ్ఞాపకమునకు వచ్చెను. అతనిలో నిద్రాణుఁడైయున్న మన్మథుఁడు క్రమ క్రమముగా మేల్కొనెను. మేల్కొనిన కొలఁది నతఁ డామెతో వాడు పరిహాసములు, నామెను స్పృశించుటకుఁ జేయు నధిక ప్రయత్నములు, నధిక సుఖాపాదకములైన కపోలాదిస్థాన స్పర్శన చుంబనములు నధికములయ్యెను. ఇవియన్నియు నతనికిఁ దెలియకుండ వాసంతికి గలిగిన జాగ్రదవస్థను వృద్ధి చేయుచుండెను. కమల ప్రతీక్షావ్యగ్రురాలై యుండెను. కమలయందవాలోచితముగానే తెలిసియే దొరతోఁ దాను పొందిన యనుభూతికి నిది మర్యాద కలిగిన స్వర్గముగా నెఱింగి యామె యొక సుఖ మనుభవించుచుండెను. ఆ పరమానుభూతికి వాసంతి యచట నుండుట యొక యడ్డంకిగా నిరువురకుఁ దెలియును. ఇరువురు నోటితో ననలేరు. ఆ వాంఛను గొంచెముగానైన బయటఁ బెట్టలేరు. ఇట్లు మఱి నాల్గయిదు దినములు గడచెను. ఏనాటి రాత్రియు నర్జునరావు కమలను నవ్వుట నిదుర పోనీయలేదు.

కమల శిరీషునింటిలో నిట్లున్నదనియు, గమలావాసంతులు ప్రాణమిత్త్రములైరనియు రంగనాథమునకుఁ దెలిసెను. భగవంతుఁ డతని కెదురుగా నవ్వుచున్నాఁ డనిపించెను. వాసంతితోఁ దన కంటిర్విఘ్నము. ఈ స్నేహ మతని కభివాంఛనీయము కాదు. కాని యిందులో నతని కొక సులభమైన మార్గము గోచరించెను. ఈ చెలిమి కారణముగా వాసంతి నతఁ డేకాంతముగాఁ గలిసికొన వీ లేర్పడవచ్చును. అట్లే తన కూతునకు, శిరీషునకు నేకాంత మేర్పడవచ్చునన్న యూహ యతనికి రాలేదు. అట్లు వచ్చుట మానవస్వభావము కాదు. అందుకనియే మానవ స్వభావము మాయయనుట. వచ్చినచో వాఁడు జ్ఞాని. రానిచో వాఁడు మనుష్యుఁడు. ఇంతే భేదము.

శిరీషుని భార్య యెన్నియేండ్ల క్రిందనో చనిపోయెను. తదాది శిరీషుని యందుఁ గామవాంఛయే కనిపించలేదు. ఈనాఁ డది పొడసూపి క్రమక్రమముగా వృద్ధిపొందఁజొచ్చెను. కమలయం దొక విలక్షణమైన సౌందర్యము కలదు. లోకములో స్త్రీగత సౌందర్యము వేయివిధములు. అన్నియు నందఱకు నచ్చవు. ఒకరకమైన సౌందర్య మొకనికి నచ్చుననగా దాని శరీరగతాణు సంయోజన పూర్వక సృష్టిలోని వైలక్షణ్య మది. కొందఱికిఁ గోలమొగ మిష్టము. మఱి

కొందఱికి గుండ్రని మొగ మిష్టము. ఒకనికి దవడయెముకలు కొంచెము ముందఱికిఁ జొచ్చియున్న యొక స్త్రీ మొగ మిష్టము. ఇట్లే శరీరప్రమాణమును. కొందఱికి బక్కపలుచగాఁ బొడవుగానున్న స్త్రీలే సౌందర్యవతు లనిపింతురు. మఱియొకనికి గుమ్మటమువలె జీడిమామిడిచెట్టువలె నున్న స్త్రీలు సౌందర్యవతు లనిపింతురు. తన తల్లి యిట్టులుండు నన్న గుర్తు వాసంతికి లేదు. శిరీషుఁడును, శిరీషుని భార్యయుఁ బూర్వమెప్పుడో ఛాయాచిత్ర మొకదానినిఁ దీయించికొనిరి. అప్పటికి ఛాయాచిత్రములు తీసెడి విద్యయే లోకమునందుఁ బరిణతస్థితిని బొందలేదు. ఆచిత్రము శిరీషుని పెట్టెయడుగున నున్నది. ఆమె చనిపోయిన తొలుతటి రోజులలో శిరీషు డాచిత్రమువంకఁ బలుసార్లు చూచుచుండెడివాఁడు. వాసంతియుఁ దల్లియొక్క చిత్రము రెండుమూఁడుసార్లు చూచెను. ఆమెకు గుర్తులేదు. శిరీషుని చనిపోయిన భార్య యించుమించుగాఁ గమలవలెనే యుండెడిది. కమల శిరీషునికిఁ దన భార్యను స్మృతికిఁ దెచ్చెను. అతనిలో నిదురబోవుచున్న మన్మథుని మేల్కొలిపెను. మన్మథుఁడు మేల్కొనుటయే కాదు. సఫలుఁడగుటకుఁ గూడ నానుకూల్యము కలిగియుండెను. పగలు కనీసము మూఁడు నాల్గుగంటలు కమల తన యింటిలో నుండును. రాత్రికూడ నుండదు. పగలు ఏకాంతము లేదు. రాత్రిపూట భోజనము చేసినతరువాతఁ గమల నచ్చటనే యుండనిండు; వాసంతియుఁ గమలయుఁ గలసి పండుకొందు రని శిరీషుఁ డర్జునరావుతో రెండుమూఁడుసార్లనెను. ఎక్కువసార్లన్నచో నర్జునరావు సందేహపడునని యతనిభయము. అర్జునరావు సందేహపడుటకు నా రెండు మూఁడుసార్లే చాలును. అతఁ డీ విద్యలో నిష్ణాతుఁడు. అర్జునరావున్నప్పుడు కూడఁ గమలయు, శిరీషుడును మిక్కిలి చనవుగా నుండుట కనిపించుచునే యున్నది. దేని నర్జునరా వభిలషించెనో యది పరిణతదశలోనికే వచ్చుచున్నది. వారి కేకాంతము కలుగుటయే తన పథకము ఫలించుట. వాసంతి యుండఁగా నేకాంతము కలుగదు. వాసంతి నిదురపోవునపుడు కమలా శిరీషులు కలసికొనుట యర్జునరావునకు వాంఛనీయము కాదు. శిరీషుఁడు గొప్ప యాలోచనాపరుడు. తాను కమలతో సంబంధము పెట్టుకొన్నచోఁ దరువాత నేమగునో యన్న విచారణ పోలేదు. కామభావ మంతటి యేకాగ్రమైన విషయము. దాని కున్నంత యేకాగ్రత దేనికిని లేదు. అది మఱియొకదాని నూహించనే యూహించనీయదు. సర్వోహాలు తదనంతర కాలికములు. కామ మెంతవఱకు జీవునిఁ దానాకర్షించును? ఆలోచననుఁ దొలఁగఁద్రోయును. విచారణకు స్వస్తిచెప్పును. అదివఱ కున్న యాచారములను సడలించును. ఇతరమైన విషయములం దున్న శ్రద్ధనుఁ దగ్గించును.

వాసంతి యిన్నియేండ్లుగాఁ దండ్రిని వదలి యెచ్చటకును బోలేదు. ఒకటి రెండుసారులు సారథివద్దకు వెళ్లెను. అట్లు వెళ్లుట శిరీషునకుఁ గష్టమయ్యెను. సర్వకాల సర్వావస్థలయందుఁ గూఁతురు తనకుఁ గనిపించవలయును. అట్టి కూఁతు రిప్పుడు నిత్యము తన దగ్గఱ నుండుట శిరీషునకు నేలనో కష్టమయ్యెను. ఆమె యెచ్చటికిని పోదేమి? పూర్వ మొకటి రెండుసార్లు తా నొక్కర్తియు సారథియింటికిఁ బోయెను. ఇప్పు డొకరోజునఁ బోరాదా? పొమ్మని తా ననరాదా? అన్నచో వాసంతి గ్రహించునేమో? గ్రహించినచోఁ దప్పేమి? కామవాంఛ లేకుండ నామె నిస్వాళ్లిపించెను. ఇప్పు డా భావన మామెలోఁ బ్రవేశించునేమో? నిజముగాఁ గామభావ మామెలోఁ బ్రవేశింపకుండెనున్నదా? ఆమెలోఁ దా నొక విచిత్రమైనమార్పును జూచుట లేదా? ఆమెచూపులో మార్పున్నది. నడకలో మార్పున్నది. మనిసిలో మార్పున్నది. ఆమార్పు చాల సూక్ష్మముగా నున్నది. ఆమెకన్నులు పూర్వము వట్టి కన్నులు. ఇప్పుడు దేని కోసమో ఎగురుచూచుచున్న ట్లున్నవి. ఎంత తండ్రియైనను శిరీషున కామార్పు లీలగా గోచరించెను. కాని యామార్పు శిరీషుఁడు గమనించియు గమనించలేదు. గమనించఁడు. అతఁడు తండ్రి యన్న విషయము గమనించనీయదు.

వాసంతికిఁ గమలతో స్నేహమైనకొలది కమలయు శిరీషుఁడు తమ మనోభావము లెంత గోప్యముగా దాచుకొనుచున్నా మనుకొనినను వాసంతికి వారి యిద్దఱి ప్రవర్తనలో నొక విశేషము కనిపించకపోలేదు. ఆమెకు నొక పరపురుషుఁడు నొక స్త్రీయు నట్లు రాచికొని తిరుగుట పరాచికములాడుట మొదలైన చమత్కారము లిదివఱకుఁ దెలియవు. కమల ఫలహారము చేయుచుండఁగా శిరీషుఁడు వెనుకకు వచ్చి కూర్చుండి యామెను భయపెట్టినట్లు సన్నగాఁ గూయును. ఆమె చీరకొంగు పట్టుకొనిలాగును. "నీవు మంచిదానవు కావమ్మా. నేను నీతో మాట్లాడ"నని యొక చమత్కారము. కమల కోపమువచ్చినట్లు నటించఁగాఁ దా నామెను బతిమాలుట. ఇది యంతయు నవ్వులలో భాగమే. ఆమె గడ్డమును బుచ్చికొని, "కమల మంచిదికాదూ! నామాట విను" కమల యింకను బిగించి కూర్చున్నచో "నామీఁద నొట్టు" మొదలైన మాటలు. తరువాత నిద్దఱు కిలకిలా నవ్వుట. ఆనవ్వుటలో నొకరిమీఁద నొకరు పడిపోవుట. ఇట్టి హేలా విశేషములు చూచెడివారి మనసులోఁ దెలియఁబడకుండనే మన్మథభావము గోచరించును. ఆభావ మిదివఱకే ప్రబుద్ధమై యున్న వాసంతిమనస్సులో నా భావము వికసింప నారంభించెను. తనతోఁగూడ నొక పురుషుఁ డిట్లు ప్రవర్తించునా? ఎవఁడు ప్రవర్తించును? తన్నెవఁడైనఁ దాకినచోఁ దన కగ్నిస్పర్శవలె నున్నదే. తన తండ్రి కమలకుఁ దండ్రి కాఁడు. తన తండ్రి కమలకు భర్త

కాదు. అతఁడు తాఁకినచో గమలకు నగ్ని తాఁకినట్లు లేదా! కమలకుఁ బెండ్లి కాలేదు. తనకును గాలేదు. కాని సారథి తన్నుఁ దాకినపుడు తన కతని స్పర్శ చల్లగానే యున్నది. అట్లే తన తండ్రి తాఁకినపుడు కమలకు స్పర్శ చల్లగానే యున్నదేమో.

ఒకనాఁటి సాయంకాలమున శిరీషుఁడు పదినిమేషము లెచ్చటికో పోయెను. వాసంతి కమల నడిగెను. "నిన్ను నాన్నగారు తాఁకుచున్నారు కదా, నీ కొడలుమండుట లేదా?"

కమల:-మండుట యెందులకు?

వాసంతి:- భర్త కానివానిఁ దాఁకినచో స్త్రీయొక్క శరీరమునకు నిప్పు చూపించినట్లుండును.

కమల:- ఐనచో నా కట్లు లేదు. మీ నాన్నగారు నాకు భర్త యన్న మాట.

అని కిలకిలా నవ్వెను. తాను చమత్కారముగా మాటాడితినని యామెయూహ. వాసంతితోఁ గాకుండ నీమాట యెవ్వరితో ననినను జమత్కారమే. ఈ మాట వాసంతికి మఱియొక యూహను గల్పించెను. తనకు సారథి భర్త యన్నమాట.

మఱునాఁటి నుండి వాసంతికిఁ బోయి సారథినిఁ గలసికొనవలయునని తొందఱ కలిగెను. సారథిని గలిసికొని చాలనెలలు గడచెను. ఈలోపుగాఁ దన యనుభవము చిత్రచిత్రముగా నుండెను. ఆసారథి మఱియొక నాటకమే ప్రారంభింపలేదేమి? తన యింటి కొక్కసారియైన రాలేదేమి? అతఁడు గ్రామములో నున్నాఁడా? లేఁడా? తా నతని యింటికి వెళ్లినచో నతఁడు లేనిచో నేమగును? తా నచ్చటికి వెళ్లి ప్రయోజనమేమి? తన తండ్రి కమలతో నున్నట్లు సారథి యెప్పుడును దనతో లేఁడే? ఈ యూహలతో వాసంతి రెన్నాళ్లు గడపెను. మూఁడవ దినమున మధ్యాహ్నము తాను సారథియింటికి బయలు దేఱెను. సారథిని జూచి చాలదినములైనది. అతనిని జూచివత్తునని తండ్రితోఁ జెప్పెను. శిరీషునకుఁ దన హృదయములోని కోరిక సిద్ధించినట్లయ్యెను. అతనికి మనసులో ననుమానముకూడఁ గలిగెను. తానును, గమలయు నేకాంత మభిలషించుచున్నామనియు, నాయభిలాష వాసంతి గ్రహించి తానిట్లు వెళ్లెద ననెననియుఁగూడ ననిపించెను. కాని వెంటనే యంగీకృతి జూపించినచో నామె యింకను ననుమానపడునేమో యని మొదట నించుక వారించినట్లు పలికెను. ఆమె తప్పకుండఁ బోదు ననెను. శిరీషుఁడు నెమ్మదిగా నంగీకరించెను. కమ

లయు నిదియే వాంఛించుచుండెను. ఆమె కష్టనరా వొక పాఠము చెప్పెను. శిరీషునితో నారీతిగాఁ బ్రవర్తింపవలయును.

వాసంతి వెడలిపోయెను. ఆమె వెడలిపోవుటను వాంఛించిన స్త్రీలు నామె వెడలిపోయినంతనే కొంతసేపు నొకరి కొకరెదురుగా గూర్చుండిరి. ఒకరితో నొకరు మాటాడకుండనే కూర్చుండిరి. వాసంతి యున్నప్పటి యీ చన విప్పు డేమయినది? మూఁడవ మనిసి యున్నప్పుడు ప్రదర్శించెడి యీ చనవు యొక్క యర్థము వేఱును, నదే చనవు తమ యిద్దఱే యున్నప్పుడు ప్రదర్శించుట యొక్క యర్థము వేఱును కాబోలు! లేదా రెంటికి నర్థ మొకటే. ఇతరు లున్నప్పటి యీ చన వెంతదూరము పోయినను దుదిమెట్టు చేరదు. వీరిద్దఱే యున్నప్పుడే యీ చనవు తుదిమెట్టునకుఁ జేరును. తుదిమెట్టునకుఁ జేరు నన్న దోసము వారిద్దఱి యేకాంతసమయమునం దాచనవు ప్రదర్శించుట కడ్డముగ భయము వేసినది. కొంచెదినిముసములైన తరువాత శిరీషుఁడే మాటాడెను. మఱి పదేను నిముసములలోఁ జన వంతయు బయటకువచ్చెను. ఇంక నాచనవు పై మెట్లయందుఁ బ్రవేశించవలయును. ప్రవేశించెను. అదివఱకు లేని కమలను దన తొడలమీఁద వాల్చి ముఖచుంబనము చేయుట జరిగెను. కమల కిప్పట నొక సంశయము కలదు. తా నిదివఱకు మోసపోయినది. ఇప్పుడు మోసపోవుట కిష్టము లేదు. అందుకని శిరీషు డాహద్దు దాటినంతనే "నీవు నన్నుఁ బెండ్లిచేసికొందువా? పెండ్లిచేసికొనవా? చేసికొనినచో నే నంగీకరింతును" అని చెప్పఁదలఁచుకొన్నది. అప్పనరా వామె నట్లు చెప్పవలదనెను. చెప్పఁగూడదనెను. "నీకుఁ బ్రపంచకష్టానుభవ మెక్కువ. నీవట్లు చెప్పినచో నసలు వ్యవహారమే చెడిపోవును. అతఁడు నీయం దాశతో నున్నాఁడు. ఒక కామాంధకారమున నున్నాఁడు. నీ వామాట నడిగినంతనే యతని కామాంధకారము నశించిపోవును. అతనికిఁ దన పరిస్థితియొక్క సర్వజ్ఞానము కలుగును. ఆ జ్ఞాన మిప్పుడు కలుగరాదు. కలిగినచో నీనిలో నింత బాధ్యత యున్నదని యిప్పుడే తోఁచిపోవును. అతనికి నీవు వశమైనచోఁ దరువాత నీ వతని నడిగినచో నప్పుడు తప్పించుకొనలేఁడు. నీ యక్కగారివలె నీవు కూడ గర్భవతివైనచో దానియందు సందేహమే లేదు. జమీందారు వేఱు, శిరీషుఁడు వేఱు. ఎట్టిది జరిగినను జమీందారుఁడు నిన్నుఁ బెండ్లియాడుట జరుగనే జరుగదు. అట్టిది జరిగినచో శిరీషుఁడు పెండ్లియాడుట తప్పక జరుగును. నీవు నీ మాటమీఁదనే నిలువవలయు" ననెను. కాని కమల "రే పితఁడుకూడఁ బెండ్లిచేసికొననిచో నే నేమి కావలయును? రెండవసారి నేను చెడిపోను. అతని నడిగెద" నని పట్టుపట్టెను. అప్పనరా వామె నట్టి తెలివితక్కువ పని జేయవద్దని గట్టిగా బోధించెను.

ఇట్టి యీ యేకాంత సమయములోఁ గమలకా యనుమానము తొలఁగింప నారంభించెను. ఆమె యంగీకరించెను. అంగీకరింపలేదు ఆమె సర్వదా తనకు ననుకూలగా శిరీషునకు భాసించెను. కాని కామభావ పరమార్థమునం దామె తనకు వశము కాలేదు. ఇన్నియైనపై తరువాతఁ దనలో మేల్కొన్న మదనాగ్ని, యింధనప్రాప్తిచేత శిఖాజ్వాలలు ప్రకమ్ముచున్న మన్మథాగ్ని పరమార్థము నందు నిగ్రహీతమై యతనినిఁ జాల బాధించెను. ఇద్దఱును రాత్రి తొమ్మిది గంటలవఱకుఁ గలిసియే యుండిరి. శిరీషునకుఁ గోపమువచ్చి దూరముగాఁ బోయి కూర్చున్నచోఁ గమలయే యతనిదగ్గఱకుఁ బోయి లాలించును. మఱల నతనిని నవ్వించును. మఱల నిద్దఱును నునుకటిగాలె నే యొకరిమీఁద నొకరు పడిపోదురు. మరల శిరీషుఁడు ధైర్యము చేయఁగా నామె ధైర్య విఘటనము చేయును.

రాత్రి తొమ్మిదైనది. శిరీషుఁడు తాను నిరాశ చేసికొని వాసంతికోసము ప్రతీక్ష చేయుట కారంభించెను. అతఁడు కమలను గుఱించి రెండు విధములుగా నూహింప నారంభించెను. "ఈమె యత్యంతముగా ననఘురాలైనఁ గావచ్చును. ఎంత యానక్తురాలయినను నామె నిరాకరణ ప్రపంచ భయముగా లేదు. బుద్ధిపూర్వకముగాఁ బరిహరించుటగా నున్నది. రెండవది యీమె యీవిద్యయందుఁ బండితురాలై యుండవచ్చును. ఈ పాండిత్యము వే లెన్నటినో సంపాదింప నక్కఱలేదు. తన యక్కగారినిఁ బెండ్లిఁజేసినవాఁడే యున్నాఁడు. అతఁడీమెను గూడఁ బెండ్లియాడుట న్యాయము కాదని తనకే సంధానము చేయనెంచి యుండవచ్చును" అతని కీ యూహలు కలిగెను. వాసంతి యింకను రాలేదు. శిరీషుఁడు మఱలఁ దన కోరికను బల్లవించెను. మఱలఁ గమల నిరాకరించెను. అతనికిఁ గోపము వచ్చెను. ఈమాట లనివేసెను. వెంటనే కమలకు మహాదుఃఖము వచ్చెను. ఆమె యేడ్వ నారంభించెను. వెక్కివెక్కి యేడ్చుచుండెను. శిరీషునకు భయము వేసెను. ఏమి చేయవలయునో తెలియలేదు. ఆమెను చాలసేపు లాలించెను. ఆమెచేత నేడ్పును మాన్పించుట శిరీషునకు సులభముగాఁ గన్పింపలేదు. మఱల మన్మథుఁ డొక ప్రయత్నము చేయించెను ఆ ప్రయత్నమునకుఁ గమల నిరాకరింపలేదు. తరువాత నిద్దఱును నొకరియెడల నొకరుతము రొకరొరిద్దఱు కానివారివలెఁ జిత్రముగా ననుకొనఁ జొచ్చిరి. ఇంతకు మున్నామె యేడ్చినపుడు తాను పడిన భయ మిప్పుడు లేదు. ఆమె యిప్పు డేడ్చినచో నిప్పు డతఁడు బతిమాలెడి పద్ధతియే వేఱుగా నుండును. కమల యిట్లనెను: "నీవు నన్ను గుఱించి యెంతమాట యన్నావు? నా బావకు నాకు నేమియు సంబంధము లేదు. నేను మీ పాదముల సాక్షిగాఁ జెప్పుచున్నాను." అని శిరీషుని పాదములు దాఁకెను.

మనోలోకాధిపతి యెవ్వఁడో కాని వాఁడు శిరీషునికిఁ దల్లిప్రేమఁ గమలనుఁ జనకపుత్రినిగాఁ, దనకు భార్యగాఁ, దనకోసమే జన్మించినదానినిగా, ఎండిపోయిన తన జీవితముఁ జిగిర్పించుటకోసము చేయఁబడినదానినిగా భావింపఁ జేసెను. అతఁ డామె నక్కునఁ జేర్చుకొనెను. ఆమెను వంచి నాల్గు ముద్దుపెట్టుకొనెను. ఆమె శరీరమంతయుఁ దనకుఁ జిరపరిచితమైన నేలగాఁ గనిపించెను. ఆమె యతని హస్తములలో నతఁడెల్లు మార్పునెంచినచో నల్లమారెడు ద్రవ్యముగాఁ గనిపించెను.

కమల కావేరి తన జన్మచరితార్థమైన ట్లెంచెను. అతనితోఁ దా నబద్ధము మాటలాడలేదు. ఉన్న నిజమంతయును జెప్పలేదు. ఆ నిజము తనతో నశింపవలసినదే. కాని యా నిజము తెలిసిన వ్యక్తులు నలుగురున్నారు. జమీందారు, పెదమాళ్లి, లలిత, యర్జునరావు.

అప్పటికి నర్జునరావు వచ్చెను. అతఁడు వీధి తలుపు తట్టినంతనే కమలా శిరీషులు దూరదూరముగాఁ గూర్చుండిరి. కమల తలయంతయు గోళ్ళతో దువ్వుకొనెను. ఇంటిలో వాసంతి లేదు. అర్జునరావు గ్రహించెను. వాసంతి ప్రొద్దుపోయి వచ్చునేమో, నేటికిఁ గమల యిచ్చటనే యుండునులెండి యని యర్జునరావు వెడలిపోయెను. వాసంతి యెంతసేపటికిని రాలేదు. శిరీషుఁడు తాను పోయివత్తు ననెను. శిరీషుఁడు వెళ్ళెను. కమల యొక్కర్తయు నిట్లాలోచింప నారంభించెను: "వాడు జమీందారు నెరిగియుండుటయే నేఁడీసుఖమునకు హేతువైనది. అనాడు నాకేమియు దెలియదు. జమీందారునకు ప్రేమయున్నగా నేమో తెలియదు. శిరీషునకుఁ దెలియును. జమీందారును నేను ప్రేమించలేదు. శిరీషుని నేను ప్రేమించుచున్నాను. ఇతడు నాభర్త. జమీందారును నన్నుఁ బెండ్లి చేసికొనుమని తెలివితక్కువతనమున నడుగఁబోయితిని. శిరీషుఁడు నన్నుఁ బెండ్లియాడక పోయినను సరే, ఇతఁడే నాభర్త. ఇతనికి నేను సేవకురాలై యుండెదను." ఆమె యీరీతిగా నాలోచించెను.

పదినిముసములలోననే వాసంతియు, శిరీషుఁడును వచ్చిరి. ముగ్గురును గలసి భోజనము చేసిరి. వాసంతి మాటాడలేదు. ఆమె పోయి తన గదిలోఁ బండుకొనెను. శిరీషుఁడును, గమలయు సావడిలోనున్న రెండు మంచముల మీఁదఁ బండుకొనిరి. ఆ మంచముల కిప్పుడు డెసము లేదని యెవ్వరికిని దెలియదు. శిరీషుఁడు తా నిప్పుడొక స్వర్గలోకములో నున్నాఁడు. వాసంతిని గురించి యూహించుటయే లేదు.

వాసంతి గదిలో పండుకొన్నది. ఆమెకు నిదురపట్టలేదు. ఆమె యేమియు నూహించుటలేదు. కనులు తెఱచియే పండుకొన్నది. కొంతసేపటికి సావడి లోని దీపము ఆరిపోయినట్లు తోఁచినది. ఊరకే తోఁచినది. నలువైపుల నామె మనస్సులో శూన్యతయే తాండవించినది. ఆమె పండుకొనుసరికే రాత్రి పదు నొకండు గంటలైనది. ఆమె నిద్రపోవలెనను ప్రయత్నము కూడ జేయలేదు. ఆమె యింటికిఁ దిరిగి వచ్చుచుండఁగాఁ దనతండ్రి కనిపించెను. ఇద్దరును గలసివచ్చిరి. ఇంతసే పేమి చేయుచుంటివియని తండ్రి యడిగినట్లుండెను. తాను సమాధాన మేమియు జెప్పినట్లు లేదు. తండ్రియు నా ప్రశ్న తిరిగి వేయలేదు. రాత్రి చాల ప్రొద్దుపోయినది. రెండుగంట లైయుండవచ్చును. అప్పటికి వాసంతిమనస్సు కదలుట మొదలుపెట్టెను. ఆమె కా సాయంతనమున జరిగిన విషయము లన్నియు జ్ఞాపకము వచ్చెను. ఆమె మొదటనుంచియు జ్ఞాపకము చేసికొన నారంభించెను. తాను వెళ్లెను. సారధి యింటవద్ద లేఁడు. తాను తడిక తీసికొని లోనికి ప్రవేశించెను. అతనికల గదిలో సారధి గ్రామములో నున్నట్లే కనిపించెను. ఎంతసేప టికిని సారధి రాలేదు. ప్రొద్దుక్రుంకినది. ప్రొద్దుపో నారంభించినది. అప్పటికి రాత్రి యొనిమిదిగంటలైన నయియుండవచ్చును. తా నచ్చట నూఱకే నాల్గుగం టలు కూర్చుండెను. ఆమెకు భయముకూడ వేయలేదు. ఆమెకు భయమన గా నెట్టిదో తెలియదు. ఏమైనను సరే సారధిని గలిసికొని పోవలయునని యామె యచటనే కూర్చుండెను. చీకటి పడినంతనే యామెయే దీపము వెలిగించెను. సారధి రాత్రి తొమ్మిదిగంటల కింటికి వచ్చెను. తన పాకలో దీపము వెలుగు చుండెను. అతఁ డెవరా యనుకొనుచు లోనికి వచ్చి వాసంతినిఁ జూచి "నీవా? ఎంతసేపైనది వచ్చి" యనెను.

వాసంతి - సాయంతనము నాలుగు గంటలకు వచ్చితిని.

సారధి - ఇంతసే పిచటఁ గూర్చుంటివా? నీనాన్న యూరకుండెనా?

వాసంతి - నీతో నొకవిషయము మాట్లాడిపోవ వచ్చితిని. అది యేమైనను సరే తేల్చుకొని పోదమని వచ్చితిని. సారధీ! నేను మూఁడేండ్లుగా నొకవిషయ మును మననము చేయుచుంటిని. ఆసందర్భమున నేనొక నిశ్చయమునకు వచ్చి తిని. అది నీతో చెప్పవలెనని వచ్చితిని. నీతోఁ దక్క మఱియెవ్వరితో నేను జెప్పనక్కఱలేదు. అది యెవ్వరితో నేను జెప్పెడిది కాదు. దీనికి నీవొక్కఁడవే.

సారధి - చెప్పుము.

వాసంతి-నీ వెక్కడికిఁ బోయివచ్చితివి? భోజనము చేసితివా? ఇప్పుడు స్నానము చేయవలయునా?

సారధి - నేను భోజనము చేయనక్కఱలేదు. ఇప్పుడు స్నానము చేయను.

వాసంతి - నాటకములు మానివేసితివా? ఏడాది దాటినది. మఱల నీ నాటకమును దలపెట్టలేదేమి?

సారధి - నీవు చెప్పఁదలఁచికొన్న దేమో చెప్పుము.

వాసంతి - నీవు నాదగ్గఱ కూర్చుండుము. అప్పుడు చెప్పెదను.

సారధి వాసంతిప్రక్కనఁ గూర్చుండెను. ఆమె యతనినిఁ గౌఁగిలించుకొనెను. అతఁడు కొంచెము కదలెను. వాసంతి కదలకుండ కూర్చుండుమనెను. అతఁడు నవ్వుచుఁ గదలకుండఁ గూర్చుండెను

వాసంతి - నీకిప్పు డెట్లున్నది?

సారధి - ఈఁగలు మీఁద ప్రాలినట్లున్నది.

వాసంతి - అది కొంచెమా! నా కెట్లున్నదో చెప్పెదను. నా ప్రాణములో జల్లుఁగా నున్నది. నీశరీరములోనుండి నా శరీరములోనికి సౌఖ్యతరంగములు ప్రవహించి నాశరీరమంతయు సుఖసెలలుగా నున్నది. పూర్వము నీవు నన్ను దాఁకినప్పుడెల్ల నీసుఖానుభూతి కొంచెము కొంచెముగా ననుభవించితిని. తొలుత నాకు దెలియలేదు. నీకు జ్ఞాపకమున్నదో లేదో? నే నొకనాఁడు వచ్చి నీ శయనము సేయుచుండఁగా నాచేలఁ గానట్లు క్రిందఁబడితిని. నీవు నాపాదసంవాహనము చేసితివి. ఆ చేసినంతసేపు నీలోనుండి నాలోనికి సౌఖ్యతరంగములు ప్రవహించుచుండెను. అది నేను గుర్తుపట్టితిని. నీవు శిష్యుని వేషము వేసినప్పుడు నేను నిన్నుఁ గౌఁగిలించుకొంటిని. మోహిని వేషము వేసినప్పుడు గౌఁగలించుకొంటిని. ఈ సర్వకాలములయందు నే నాసుఖతరంగ ప్రప్రవాహమును గుర్తుపట్టితిని. నాకది యెట్టిదో తెలియలేదు. నా కనుమానము బయలు దేరినది. నేను మఱొక స్త్రీనిగాని, మఱియొక పురుషునిఁగాని కౌఁగిలించుకొన్నచో నట్లే యుండునా యని. నాతండ్రి శరీరము, నాశరీరము సన్నికర్ష పొందినప్పుడట్టి అనుభూతి నేను పొందలేదు కనుక తండ్రికంటె నితరులైన పురుషుల శరీర సంపర్కమువలన నట్టి యనుభూతి కలుగునని నేను నిశ్చయించితిని. ఒకపారి నిన్న డిగితిని. నీవు నా కొకమాట చెప్పితివి. పతివ్రతయైన స్త్రీకి భర్తను గౌఁగిలించుకొన్నపు డట్టి యనుభూతి కలుగునని. తక్కిన పురుషులను గౌఁగిలించుకొన్నచో నగ్నిజ్వాలలు లేచినట్లుండునని నీవు చెప్పితివి. అది యెంతవఱకు నిజమో నా కెట్లు తెలియును? నేను, నాతండ్రియు నెప్పుడు నిద్దఱమే యుందుము. ఆమాట యొక్క యాథార్థ్యము తెలియకముందు నిన్ను వచ్చి యడిగినఁ బ్రయోజన మేమి? నీవు నాభర్తవు కావు. నిన్ను గౌఁగిలించుకొన్నప్పుడు నా కట్టి యను

భూతి యెందు కుండవలయును? ఏడాది గడచినది. దొరగారి కోటలో నా పాటకచేరీ పెట్టిరి. ఆయన నాకు బహుమతి యిత్తునని మేడమీఁది గదిలోనికిఁ దీసికొని పోయెను. ఆయన నా చెక్కిళ్లు తాఁకెను. నన్ను ముద్దుపెట్టుకొనెను. నన్నుఁ గౌఁగిలించుకొనెను. నే నతనిని వలదనలేదు. ఆ యనుభూతి యెట్లుండునో నేను విచారించుకొనవలదా? అంతసేపు విచారించుచు నుంటిని. అతఁడు తాఁకినచోట్ల నెల్ల నాకు నిప్పు ముట్టించినట్లే యున్నది. ఆ సంస్పర్శము నాకొక వివేక ముదయించినది. అంతవఱకు నాకు స్త్రీపురుష విభేదము తెలియదు. లోకములో దంపతులకుఁ బిల్లలు కలుగుచున్నారు. ఎట్లు కలుగుచున్నారో తెలియదు. దానిని గుఱించి నే నెప్పుడు నూహించలేదు. ఆ జమీందారునియొక్క ప్రవర్తన చూచినంతనే నాకు సర్వమును దెలిసినది. ఏవగించుకొని నిరాకరించి లేచివచ్చితిని. వచ్చినప్పటి నుండి నాకుఁ బ్రపంచకమంతయుఁ దెలిసినది. కాని మఱి కొంత యనుమానము మిగిలినది. ఇంకొక పురుషుని స్పృశించినఁజూడ నిట్లే యుండునా? అది యట్లే యున్నచో నేను తొలివిషయమును నిర్ధారణ చేసికొనవచ్చును. ఆ మధ్య రంగనాథము మాయింటికి వచ్చుట కారంభించెను. అతఁడు నన్నుఁ దాకునట్లు చేయవలయు నని, నన్ను జుంబించునట్లు చేయవలయు నని యతనితో లేని మక్కువ దెచ్చికొని మిక్కిలి చనవుగాఁ బ్రవర్తించితిని. అతఁడు తనయందు నాకుఁ గోరిక యున్నదనుకొన్నాఁడు. ఒక యేకాంత సమయమున నన్నుఁ జుంబించినాఁడు. సారధీ, అది చుంబించుట కాదు. మండుచున్న కట్టెను దీసికొని వచ్చి మండించుట. అప్పటికి నాకు విస్పష్టమైనది. నిన్నుఁదక్క నే నెవ్వరినిఁ దాఁకినను నాశరీరము మండును. నీవు నాభర్తవు కావు. కనుక వివాహమును గూర్చి కొంత యాలోచించితిని. ఈ భార్యాభర్తృసంబంధము మనుష్యనిర్మితము, దైవనిర్మితము నని రెండువిధములుగా నుండును. లోకములోనిది మనుష్యనిర్మితము. దైవనిర్మితము లోకములో లేదు. ఒకవేళ నేననుభవించునట్టి సుఖమువంటి సుఖ మెచ్చట నుండునో యది దైవనిర్మిత మేమో. మఱియుఁ జూచుచుంటిని. అందఱు స్త్రీలును నావలెనే యుందురేమో. నేఁటికి ఇరువది దినములనుండి రంగనాథముగారి రెండవ కూఁతురు కమల మాయింటికి వచ్చుచున్నది. అదివఱకు నాకు స్నేహమనఁగ నేదియో తెలియదు. నాయన స్వీరీతిగా విప్పాతీన తరువాతఁ గొందఱితో స్నేహము చేయవలె ననిపించినది. కమలతో స్నేహము చేసితిని. మేము పరస్పర మొకరి నొకరు తాఁకినప్పుడు, దగ్గఱగాఁ గూర్చున్నప్పుడు, నే నామెను గౌఁగిలించికొన్నప్పుడు నాయం దొకసుఖము భాసించినది. ఆ సుఖమును నేను పరీక్షించితిని. ఆ సుఖము మనస్సులోనుండి

శరీరములోనికిఁ బ్రవహించుచున్నది. ఇప్పుడు నేను నిన్నుఁ దాఁకి కూర్చున్నాను. ఈ సుఖము శరీరములో నుండి మనస్సులోనికిఁ బ్రవహించుచున్నది. ఆ కమల స్త్రీకనుక నట్లున్నది. పురుషుఁడైనచో నాలోని కగ్నిజ్వాలలు ప్రవహించెడివి. ఈ సుఖభేదమును నేను గనిపెట్టితిని.

"నా సృష్టియే వేఱుగాఁ గనిపించుచున్నది. ఎందుకనఁగా కమలయు, మా నాయనగారును రాచుకొని రాచుకొని తిరుగుచున్నారు. పూర్వమైనచో నేను గ్రహించఁగలిగి యుండెడిదానను గాను. ఇప్పుడు నాకుఁ దెలిసినది. కమల నా తండ్రికి భార్య కాదు. మా అమ్మ చనిపోయినది. కమలకు నా తండ్రి భర్త కాఁడు. వారిరువు రట్లు రాచికొని తిరుగుచుండఁగాఁ గమల యగ్నిస్పర్శ తగిలినట్లు దూరదూరము పోవుటలేదు. నా తండ్రికిఁ గూడ నది సుఖముగానే యున్నట్లున్నది. ఆయన దానినే యపేక్షించుచున్నట్లున్నాఁడు. తరువాత నాలోచించఁగా బలుమంది యువతులు రంగనాథముగారి వంకను, నాయనగారివంకను వికారముగాఁ జూచుట జ్ఞాపకము వచ్చినది. పూర్వము మఱి వాండ్రెనుకొనెడిదానను. ఇప్పుడు దాని సంగతి తెలిసినది. లోకములో స్త్రీపురుషు లొకరినొకరు వాంఛింతురు. వారి శరీరస్పర్శ తగిలినప్పుడు పరస్పరము సహా స్పర్శ తగిలి నాయెడల మండినట్లు వారి కుండెడు సుఖమే. నాది యొకట విపరీత సృష్టి. ఇది యొక ప్రత్యేక సృష్టి. ఈసంగతి నాకుఁ దెలిసినది. నన్ను జమీందారు ముట్టుకొనఁగా రంగనాథముగారు తాకఁగా నేను పరిశీలించితిని. నిర్ధారణఁ జేసికొంటిని. నే నేపురుషునిఁ దాఁకిన మండునే. నీ యొక్కని తనూస్పర్శ నా శరీరమునకు సుఖదాయిగా నున్నది. ఈ సంగతి నీతోఁ జెప్పి దీని యాథార్థ్యము తేల్చుకొని పోవలయు నని వచ్చితిని. ఈ సిద్ధాంతము నిజమైనచో నీవు నాకు భర్తవు. మనకు వివాహము కాలేదు. వివాహమైన గాని భర్త కాఁడు. భర్త యగుట యిట్టి సిద్ధాంతము నాశ్రయించి యుండునా? యని నన్నడిగిపో వచ్చితిని తెలిసికొనిపో వచ్చితిని."

సారథి నిశ్చబ్దుఁడైపోయెను. వాసంతి స్త్రీసృష్టిలో నొక ప్రత్యేక సృష్టి యని సారథికిఁ బూర్వమే తెలియును. ఇప్పుడు మఱియుఁ దెలిసెను. ఆమె యొక ప్రత్యేక సృష్టి కాదు. లోకోత్తరమైన సృష్టి. భవభూతి మహాకవి నిర్మించిన సీతాదేవివంటిది. తా నా రామచంద్రుఁడు కాఁడు. పరమేశ్వరుఁ డెందు కిట్లు చేసెను? అట్టి సీతాతనూసృష్టి వాసంతి యందుఁ జేసి యామెకుఁ దగిన రామచంద్రుని సృష్టి వేఱె యేల చేయలేదు? అట్టి స్త్రీ ననుగ్రహించుటకు దా నెవఁడు? తా నొక భ్రష్టకాముఁడు, దుశ్శీలుఁడు, దుష్టపురుషుఁడు. మహాగ్నిజ్వాల

వంటి యీ వాసంతి తన్ను దాఁకినచోఁ జల్లనగుట పరమేశ్వర సృష్టిలోని మహోన్నత్యస్తమైన గుణము. రాజు వాసంతినిఁ దాఁకెనఁగా సారథికిఁ గోపము వచ్చెను. వాసంతి తన భార్యయా, తన కేల కోపము రావలయు ననిపించెను. అధర్మజనిత కోపముకాని స్వత్వమునుండి పుట్టిన కోపము కాదనుకొనెను. తరువాత గంటసేపు వారిద్దఱట్లే కూర్చుండిరి. వాసంతి నాల్గుసార్లదే ప్రశ్న వేసెను. అతఁడేమియుఁ జెప్పలేదు. వాసంతి చివఱకు గట్టిగా నడిగెను. సారథి కేమియుఁ దోఁచలేదు. ఇట్లనెను. "నేను నీకు భర్తను గాను. నీకుఁ దండ్రివంటి వాఁడను. నేను చెప్పెడి సమాధాన మేమియు లేదు. ఇంక నీవు నాతోఁటకు రాకుము". వాసంతి యతనివంక నివ్వెఱపోయి చూచెను. ఆమె సందేహము పదిమడుంగు లెక్కువయయ్యెను. ఆమె లేచి వెడలిపోయెను.

౧౬

మఱునాఁటి ప్రొద్దున వాసంతి మఱల సారథితోఁటకు వెళ్ళెను. సారథి యామెను జూచినంతనే యిట్లనెను: "నీవు నాతోఁటకు రావద్దు. నీకు, నాకు సంబంధము లేదు. నీ తలలోఁ బిచ్చియూహలు మొలకలెత్తుచున్నవి. నీ మేలు నీకంటె మీ నాయనగారికి నెక్కువ తెలియును. స్త్రీయై పుట్టినంతనే యొకనికి భార్యగా నుండనక్కరలేదు. స్వతంత్రముగా బ్రదుకవచ్చును. నిన్ను భగవంతు డందుకొఱకే సృష్టిచేసినాఁడు. లేనిచో నీ యనుభూతి యిట్లుండదు. లోకములోనున్న యందఱు స్త్రీలవలె నీవు వివాహము చేసికొని సంతానము కనుటకుఁ బరమేశ్వరుఁ డుద్దేశించలేదు. సృష్టిలో ననేకములైన వృక్షజాతులు, లతలు కలవు. కొన్ని పూలు పూచి కాయలు కాచి లోకమున కుపయోగపడుట కేర్పడినవి. మఱికొన్ని పూలు పూయవు; కాయలు కాయవు. వాని కవి బ్రదుకుటయే పరమార్థము. ప్రాతఃకాలపు గాలులకు విప్పుటుట, మధ్యాహ్నపు టెండవేడికిఁ గదలకుండుట, సాయంకాలపు గాలిపొరలలో నుసుచుకొనుట ఈమాత్రమే యావృక్షముల యొక్క బ్రదుకుటలోని పరమార్థము. స్త్రీలలో నీవటువంటిదానవు. నీవిచటకు రావద్దు."

వాసంతి - నేను నీకొఱకు రాలేదు. నీవు చెప్పిన మొక్కవలె బ్రదుకుటకే వచ్చితిని. నా కిరువదియేండ్లు లేవు. నీ కేఁబది దాఁటినవి. నేను నిన్ను పెండ్లి చేసికొనను. నేను నిన్నుఁ బ్రేమించుట లేదు. నే నెవ్వరినిఁ బ్రేమించుటలేదు. ప్రేమ యను పదార్థము నామనస్సున లేదు. నా శరీరములో నున్నచో నన్ను బాధించదు. ఇది యిట్లున్నదని నీతోఁ జెప్పితిని. అంతమాత్రముచేత నిన్నుఁ బెండ్లిచేసికొనుట కోరుకొనుట లేదు. నీతో సంసారము చేయుటను వాంఛిం

కము కాదు. సమాధిలోనికిఁ బోదురు. తిరిగివత్తురు. మఱల లోకములో నుందురు. లోకముతో వ్యవహరింతురు. లోకముతో వ్యవహరించినంత మాత్రమున వారు యోగులు కాకపోరు. యోగియనఁగా లోకవృత్తిని మాని వేసినవాఁడు కాఁడు. లోకవృత్తియందుండి యిది యంతయును మిథ్య యను నిశ్చయజ్ఞానము కలవాఁడు. నిశ్చలమైన శాంతియే. మనశ్శమ దమనము చేసి నాఁడు. మఱల సమ్మ్రనారిని బెంచికొనినాఁడు. పెండ్లియాడినను బ్రహ్మచారియే. బిడ్డలను గని కూడ బ్రహ్మచారియే. ఏమి, కుమారస్వామిని గనలేదా? వసిష్ఠమహర్షికి వందమంది కుమారులు. మా సారథి వసిష్ఠునికంటె బ్రహ్మనిష్ఠుఁడు కాఁడనుకొందును."

వాసంతి యామె పాండిత్యమునకు నివ్వెఱపోయెను. ఆమె పూర్వమెవ్వరు నిట్లు మాటాడలేదు. ఆమె యందు మేల్కొన్న స్త్రీభావముతో నామె కొక క్రొత్తవివేకము వచ్చెను. మాటనేర్పు చేతనయ్యెను. వాదనా నైపుణ్యము వృద్ధియయ్యెను. ఇదివఱ కామె యెన్నిఁటినో చూచినది. ఎన్నిఁటినో విన్నది. అన్నియు నేఁడు చర్వితములుగ నున్నవి. ఆమె మనస్సు ప్రత్యగ్రముగా నున్నది. ఆమె వాదన యామెకే యనుకూలముగా నున్నది. ఈమె తనకొక క్రొత్తగురువుగాఁ గనిపించుచున్నది. ఈమె హితోపదేశము తన కాచరణీయమా? తాను సన్న్యాసి కాఁడు. యోగి కాఁడు. సంసారి కాఁడు. స్త్రీ విషయమునఁ దా నెట్టివాఁడో తనకుఁ దెలియును. ఆ విచిత్రమైన యనుభూతిలో నొక విఘ్నముగాఁ దాను దాని కంటకుండై యున్నాఁడనని తెలియును. అది తన కంటకుండై యున్న యునికట్టిదో తనకు దెలియదు. దానినిఁ బరీక్షించుట యెట్లు? వాసంతి సౌందర్యవతి. విదుషీవతి. అనాఘ్రాతమైన పుష్పము. తన్ను ప్రేమించుచున్నది. ప్రేమించుటలేదు. ఒక విలక్షణమైన యనుభూతిచేత దానే తన భర్త యనుకొనుచున్నది. ఆమెయందు దనకు వాంఛలేదు. అందుచేత దాను స్త్రీ వాంఛను గెలిచినట్లే. తాను నీచుఁడు. తనకు నీచస్త్రీగతమైన వాంఛ యున్నట్టు ఉత్తమస్త్రీ యందు వాంఛ యుండదు. తన బుద్ధి యటువంటిది తాను స్త్రీ వాంఛను గెలువలేదు. ఒక దురదృష్టవశమున నొక పూర్వజన్మకృత దుష్ట సంస్కార ఫలితముగఁ దన మనస్సు నీచస్త్రీల నభిసరించుచున్నది. తాను స్త్రీ వాంఛను గెలువలేదు. తనకు వాసంతియందు ప్రేమలేదా? ఇంత సులభముగాఁ బ్రాప్య కాఁదగిన యామె నంగీకరింపకపోవుటచేతఁ దన కామెయందు ప్రేమ లేదనియే చెప్పవలయును. ఆమెను దాను స్వీకరింపకపోవుట ప్రేమలేకపోవుట చేతనా, యితర కారణముల వలనా? ఆమె తన కంటె ముప్పదియేండ్లు చిన్నది. తన స్నేహితుని కుమార్తె. ఆమెను జిన్నప్పటినుండియుఁ దాను తన

బిడ్డవలెఁ జూచుకొనుచుండెను. తా నామెను జేపట్టినచో నామె జీవితము నాశనమగును. ఆమె పసి కసరుపిందె. తాను వసిలిపోయిన కాయ. ఆమె జీవితమును దాను భస్మసాత్కృతము చేయఁడు. విచారించగా సారథికి నామె యందుఁ దనకున్న యీ ప్రేమయే యామెను నిరాకరింపఁ జేయుచున్నది. ఇది ప్రేమ కాదనునా? ఇది ప్రేమ కాదనుటకు లేదు. తా నామెను ప్రేమించుచున్నాఁడు. తనలో స్త్రీ వాంఛ చావలేదు అబ్బో! అది తేలికగాఁ జచ్చెడి విషయముకాదు. తనలో స్త్రీ వాంఛ చచ్చినదో చావలేదో యది వేఱే విషయము. ఇప్పుడు తాను ప్రేమించుచుండుట విస్పష్టమై తెలిసిన యీ పరిస్థితి నుండి వాసంతిని దప్పించవలయును. ఇది యెట్లు చేయవలయును? వాసంతి తేలికగాఁ దన్ను వదలిపోదు. ఈ యాలోచన చాలసేపు పట్టినది. సులభముగా నొక గంట సేపై యుండవచ్చును. అంతసేపు వాసంతి నవ్వుచునే కూర్చుండెను. చివఱకు సారథి యిట్లనెను:

"వాసంతీ! నేను నిన్ను ప్రేమించుటలేదు. పైగా నీవు నా బిడ్డ వంటిదానవు. నా స్నేహితుని కూఁతురవు. పసిపిల్లవు. నేను ముదిసిన వగ్గును. ఎండిపోయిన కొమ్మను. నాలోఁ బచ్చి మొదటనుండి లేదు. నీ యీ విలక్షణమైన యనుభూతి నాయందుఁ గలుగుట మన యుభయుల దురదృష్టము. నేను నీచుఁడను. శీలవతియు, యాభిజాత్య సంపన్నయు నైన స్త్రీని నే నెఱుఁగను. నేను బహు నీచ స్త్రీ పరిభోగదూషితుఁడను. నేయి తీసికొనిపోయి పెంటప్రోగులో బోసినట్లు నీవు నన్ను గోరరాదు."

వాసంతి-సారథీ! నీ వేమి మాటాడుచున్నావో నీకుఁ దెలియదు నీవు మాటాడెడి మాటలలో నొకదాని కొకదానికిఁ బొంతనలేదు. నీవు నన్ను ప్రేమించనిచో మనవయస్తారతమ్యము నానీమిత్రుని కూఁతురుతనమును మహత్త్వ త్వన్నీచత్వములు ప్రసక్తములు కావు. నేను నిన్నుఁ బ్రేమించుటలేదు. అది యొక పొరపాటు. నీవు మఱియొక నాటకము వేయవలయును నేనందులో మఱల వేసము వేయుదు ననఁగా నీ వీయుపన్యసించుట నాకు బాగుగా లేదు.

సారథి-నీవు నాటకములో వేసము వేయవలయుననియే యున్నచో నూరిలో మహా వైభవముగా నాటకసమాజము జరుగుచున్నది. నీవుపోయి వేసము వేయుదునన్నచో నిన్నుఁ గనుల కద్దికొని తీసికొందురు. నేను వేయ నక్కఱ లేదు.

వాసంతి-సారథీ! నీవు నన్నట్లుకూడఁ జేయుమన్నచోఁ జేసెదను. దాని ఫలితము నాకుఁ దెలియును. అర్జునరావు నాయకుఁడు వేయును. నేను

బాయిగా వేషము వేయుచుండును. అతని కిద్దరు భార్యలున్నారు. కమల కూడ నతని భార్యయేమో నాకుఁ దెలియదు. అతఁడు నన్నుఁ గూడ వారితోఁ బాటు చూచును. అతఁడు నన్ను స్పృశించును. నా యొడలు భగ్గున మండిపోవును. మండిపోదు. నేను పోయి చూచి రమ్మన్నచోఁ జూచివత్తును. ఏమందువు? వెళ్లుమందువా?

సారధి-ఏమి నాటకము వేయుమందువు?

వాసంతి-రుక్మాంగద.

సారధి-నే నది వేయను. కామదహనము వేసెదను.

వాసంతి-కామదహనము వేసినచో వెనుకటిసారివలె నక్కడనే మాని వేయఁగూడదు. చివరిదాఁక వేయవలయును.

సారధి-ఆ నాటక మంతవఱకే వ్రాయించితిని.

వాసంతి-తక్కినదికూడ వ్రాయించవచ్చును. కిరీటి మునుపటికంటె కొంచెము సాగినాఁడు. ఇప్పుడు ఎఫ్.ఏ చదువుచున్నాఁడు. అతనికిఁ బూర్వముకంటె షోకు లెక్కువయైనవి. మూన్నాళ్ళక్రింద నాకుఁ గనిపించినాఁడు. నా వంక నొక తరహాగాఁ జూచినాఁడు. ఇప్పుడు నా కన్నియుఁ దెలియునుగదా. అతనినిఁ బిలిపించుము తక్కిన నాటకము వ్రాయించుము.

సారధికి మనస్సులో నొక యూహ తోఁచెను. ఆ యూహ వెంట నడచినచోఁ దా నీ దుష్కృత్యము చేయుట సంభవించక పోవచ్చును. అతని మనస్సులో మఱియొక యూహ యున్నది. తొలుత నా యూహ వెంట నడచి యది ఫలించకపోయినచో నిప్పుడు వచ్చిన యూహ ననుసరించుటయా, ముందే దీని ననుసరించుటయా? దీని ననుసరించి యది ఫలవంతము కానిచో నపుడు దాని ననుసరించుట మంచిదని నిశ్చయము చేసెను.

సారధి-సరే. రేపు కిరీటిని దీసికొనివచ్చెదను. తక్కిన నాటకము వ్రాయింతును.

వాసంతి-ఆ నాటకము వ్రాయుచుండగా నేనుండవలయును. నా ఇష్టము వచ్చినట్లు వ్రాయవలయును.

సారధి కొంచద్యోతకమైన యొక చిఱునవ్వు కలిగెను. ఇది తనయూహ కనుకూలముగా నే యున్నది. అతఁ డిట్లనెను:

"నీవు లేనిచో నాటకమే లేదు. ఇది నీకోసము వ్రాయఁబడుచున్న నాటకమే. నీవు తప్పకుండ నుండితీరవలయును."

వాసంతి ప్రొద్దుట నెనిమిదిగంటలకు వచ్చెను. అప్పటికిఁ బండ్రెండు గంటలయ్యెను. ఆమె యింటికిఁ దిరిగిపోయెను. ప్రతిదినము వారి యింటిలో బదునొకండు గంటలకే భోజనము చేయుదురు. తన తండ్రి తనకొఱకు వేచుకొని చూచుచుండెనేమో? ఆలస్యముగా వచ్చితి వేమని కోపపడునేమో? రాత్రి కోపపడలేదు. ఇప్పుడును గోపపడఁడు. కమల యింటనుండినప్పుడో గోపపడఁడు. లేనిచోఁ గోపించును. అందుచేత వాసంతి కమలయింటనుండుట నే వాంఛించెను. కమల యెప్పుడును దనయింటిలోననే యుండిపోయినచోఁ దన తండ్రికి దనమీఁద నున్న శ్రద్ధ తగ్గును. తానొకబంధినుండి తప్పించుకొనవచ్చును. ఇదివఱకు పాఱిపోయిన ప్రపంచక జ్ఞానము పంటను బ్రోవు చేసికొనును. బ్రదుకుటలోని పరమార్థ మేమియో తెలిసికొనును. సారథితోడి యీ వ్యవహార మేమియో తెల్పుకొనును. వాసంతి యింటికిఁ బోయెను. తానాలోచించుకొనుచు నెమ్మదిగా వెళ్ళెను. వాసంతి నడచుచుండఁగా నెప్పుడును జప్పుడు కాదు. అందులో నాలోచనలోనుండి యిట్లు నెమ్మదిగా నడచివచ్చుటచేతఁ జప్పుడే కాలేదు. ఆమెకుఁ గమలా శిరీషులు కనిపించిరి. శిరీషుడు కమలబుజముపైఁ జేయివైచి చెక్కిలి చెక్కిలి నానిచి కూరుచుండెను. ఆమె తన పరిపుష్టి కలిగిన శరీరమును గుదించుకొని యతని కౌఁగిలించుకొనెను. ఇద్దఱును తాంబూలము సేవించుచుండిరి. భోజనము చేసిరి కాఁబోలు. వారిద్దఱు తిరిగి కూర్చుండుట

మూలమున వాసంతి వచ్చుటను జూడలేరు. ఆమె బయటనుండి వచ్చుచున్న వెలుతురును గొంతి తన శరీరముచేత నడ్డుటచేత సావడిలోనికి వచ్చిన లేఁత చీకటిని పరామర్శించలేదు. శిరీషుడు తాను నములుచున్న తమ్ములము కమల నోటఁ గందించెను. ఆమె నోటతో స్వీకరించెను. ఇద్దఱు నవ్విరి. ఆసమయమున శిరీషు డామె వక్షస్థలమును గట్టిగా చేతితో స్పృశించెను. వాసంతి చూచెను. పూర్వము తన్నుఁ దొంగ తాఁకిన సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. ఆ దృశ్యమును జూచినంతనే వాసంతికిఁ దన శరీరములో నొక విచిత్రమైన కదలిక కలిగెను. ఆమె యాకదలికనుఁ బరామర్శించెను. జమీందారుఁడు తన్నుఁ దాఁకినప్పు డిట్టి కదలికలేదు. ఇప్పుడు తన్నెవరును దాఁకలేదు. ఇది యేమి కదలిక? ఎందుకు వచ్చినది? ఆమె కర్థముకాలేదు. ఆకదలికయొక్క స్వరూపము నాలోచించుచు నామె తన గదిలోనికిఁ బోయెను. అప్పుడామెను వారిద్దఱు చూచిరి. ఆమె తమరిని జూచెననుకొనిరి. భయపడిరి. మనలఁ జూచి లేచెనేమో యని యనవసరమైన, తమ కనుకూలమైన సందేహము పొందిరి. వాసంతి పోయి తన గదిలోఁ బండుకొనెను. శిరీషుఁ డామెవద్దకుఁ బోయి భయపడుచుఁ గదలిపోవుచుఁ బ్రేమ నభినయించుచు నామెవలన నేమి సమాధానము వచ్చునో యని

జెలఁగంగుచు "నమ్మా! భోజనము చేయునా? నీ వెంత సేపటికిని రాకపోవుటచేత కమల తన కౌకలియాగుచున్న దనఁగా నిద్దఱము భోజనము చేసితిమి. నీ కోసమున్న యెదురుచూచుచున్నది." అనెను. వాసంతి లేచెను. తిరిగి మాటాడలేదు. శిరీషు నెడదలోఁ గొంత శాంతి కలిగెను.

భోజనముపిమ్మట సరిగా మాటాడకపోయినను దరువాత వాసంతి కమలతోఁ, దంత్రితో నవ్వుచుఁ జెలఁగుచునే యుండెను. అందుచేత వా రామె తమ్ముఁ జూడలే దనకొనిరి. వాసంతి తమ్ముఁ జూచుచునే యుండెను. తమరి నే కాదు, లోకమునే చూచుచుండెను. ఆమె క్రమక్రమముగా మాఱిపోవుచుండెను. ఆమెలోఁ గ్రమముగా లోకము వికసించుచుండెను. దర్శనమాత్రముచేత సర్వానుభూతులయొక్క జ్ఞానము నామెకుఁ గలుగుచుండెను. ఆమెలోఁ గొన్ని భావములు దర్శనమాత్రముచేత వెంటనే కల్గుచుండును. మఱికొన్ని యాలోచనచేతఁ గల్గుచుండెను. కమలాశిరీషుల యాపరిష్వంగాదులు తనలోఁ గలిగించిన కదలికయొక్క స్వరూపము వాసంతికి వెంటనే తెలియలేదు. ఆనాటి యర్ధరాత్రమున నామె యాలోచించుచుండఁగా నామెకు దాని రహస్యము తోఁచెను. తన్నుఁ గూడ నతఁడైనఁ గౌఁగిలించుకొనినచోఁ దన కది యిష్టముగా నుండునని దాని యర్థమని యామె యనుకొనెను. తన్నట్లెవరు సేయుదురు? చేసినచోఁ దనకు దుఃఖాపాదకము. తనకు దుఃఖాపాదకము గాకుండ నట్లు చేసెడివాఁ డొక్కఁడే యున్నాఁడు. అతని కిట్లు చేయవలయు నని యూహయే లేదు. తన యొడలు కదలుట యెందులకు? అది కూడ నొక సుఖమె యుండవలయును. సారథి తన్నుఁ దాఁకినచో శిశిరముగా నున్నది. సుఖముగా నున్నదా? శిశిరముగా నుండుట సుఖము కాదా? శిశిరముగా నుండుటయే సుఖ మేల కావలయును? ఉష్ణముగా నుండుటయు సుఖమే. వేసంగిలోఁ జన్నీళ్లెంత ప్రియమో చలికాలములో వేన్నీళ్లంత ప్రియము. వేడి యెక్కువైనకొలఁది చల్లఁదనము నెక్కువగా నున్న నీరము బైట నెక్కువ చలిగా నున్నకొలఁది నెక్కు వెక్కువ వేన్నీళ్లిష్టము. కావున స్పర్శకు స్పర్శగా సుఖము లేదు. ఆస్పర్శసుఖము పెఱవిషయములమీఁద నాధారపడియున్నది. ఐనచో నేవిషయముమీఁద నాధారపడి తనకు సారథిస్పర్శ సుఖముగా, జమీందారు రంగనాథముల స్పర్శలు దుఃఖముగా నున్నవి? ఈ సుఖదుఃఖములకు వేసంగియు, శిశిరఋతువును గారణములు కావు. ఈ స్పర్శసుఖము గాలి తగిలినచో ననుభవించునటువంటిది కాదు, ఇది మనోభావ సంబంధమైనది. అనుకూలమైన మనోభావము లున్నచో నీస్పర్శ సుఖముగా నుండును; అననుకూలభావము లున్నప్పుడు దుఃఖముగా నుండును. సారథియందుఁ దనకు అనుకూలభావ మున్నది. చిన్న

పుట్టినుండి యామెకు మహానటునిపట్ల నాటినుండే నొక యనుకూలభావము పెంచుకొన్నది. తనకు జరిగిందానిగురించి యనుకూలభావము లేకున్నను ననుకూల భావము లేదు. మఱి యాతని స్వప్న మింతెందుకక్కఱలేదే? అందుచేత నీస్పర్శ సుఖమునకు వేఱే కారణ ముండవలెను. ఆకారణ మేది? వాసంతి చాలసే పాలోచించెను. ఆమెకుఁ దరి యగలేదు. ఆమెకు నిదురపట్టెను. నిదురలో నామెకుఁ బలువిధములైన స్వప్నములు వచ్చెను. తా నడవిలోఁ దిరుగుచుండెను. ఒక పెద్దపులి తనకుఁ గనిపించెను. ఆ పెద్దపులి ప్రక్కనే యొక యెలుఁగుబంటి, యొక సింహము మొదలైన క్రూరజంతువులు పోవుచుండెను. పెద్దపులి వానికిఁ దొలఁగిపోయెను. దాని కొక లేడి కనిపించెను. వెంటనే పులి లేడిమీదికి దూకెను. తనకు భయము వేయలేదు. మఱి యింకొక విచిత్రమైన కల వచ్చెను. మఱల నా నడవిలోఁ బోవుచుండెను. చెట్లకుఁ బూవులు లేవు. కాయలు లేవు. ఇంతలో వసంతకాలము వచ్చెను. నిముసములోఁ జెట్లన్నియుఁ బూఁచినవి. అడవియంతయు జగన్మోహనముగాఁ గనిపించెను. మఱియు నా కొక కల. తాను పసిపిల్ల. తా నాడుకొనుచుండెను. చెంబెడు నీళ్ళలో నొకరాయి వేసెను. అది యెంతసేపటికి మెత్తపడలేదు. కొన్ని యాకులు త్రుంపి వేసెను. అవి తడిసినవి కాని మెత్తపడలేదు. కరఁగలేదు. ఇంత మన్ను తీసికొనివచ్చి వేసెను. మన్ను వెంటనే కరఁగిపోయెను. ఆమెకు మెలఁకువ వచ్చిన తరువాత మూఁడుకలలును జ్ఞాపకము వచ్చినవి. మూటిని గుఱించి యాలోచించెను. ఆమెకొక విషయము తోఁచెను. తనకుఁ గలిగిన సందేహములు తనకు వచ్చిన స్వప్నములద్వారా భగవంతుఁడు నివృత్తిచేయుచుండెను. ఈస్పర్శసుఖము కలుగుటకు వేఱే కారణమేదో యున్నదని తా ననుకొనెనుగదా. తా ననుకొనిన దానికి సమాధానము రాలేదు. ఈ సమాధాన స్వరూపమిట్టిది. అనగా లోకములో నొకదాని కొకదానితో సంబంధము. ఇది పరమేశ్వరనిర్మితము. కనుక నీస్పర్శ సుఖము పరమేశ్వరోద్దిష్టమైనది. తనకు సారథితనూస్పర్శయే సుఖోపాదకమగుట పరమేశ్వరోద్దేశ్యమని యర్థము. ఈ స్పర్శసుఖమును గూర్చి తా నింత యేల యాలోచింపవలయును? నాటి మధ్యాహ్నము తాను కమలాశిరీషులను జూచి కదలికపొందెను. ఆకదలికలోఁ దన శరీరము తాదృగనుభూతిని వాంఛించుచున్నదని తెలియుచున్నది. ఒకవేళ వాంఛించకపోయినను దాదృక్సన్నివేశము కలిగినపుడు తాదృగనుభూతి తనకు సహజమని తెలియును. తాను వాంఛించకపోవుట యేమున్నది? వాంఛ రెండువిధములు. మనస్సుచేతఁ జేయునది; మనస్సు కందకుండ నాత్మలో నున్నది. తన వాంఛ తన మనస్సున కందలేదు. తన యాత్మలోననే యున్నది. తన తండ్రి తన్నట్లు పెంచినాఁడు. తండ్రి పంమ

టయే కాదు, తన జన్మయొక్క స్వరూపమట్టిది. దీనిని బట్టి వాసంతి తనకు సారథియందిట్టి ప్రేమయున్నదని నిశ్చయించెను. ఆత్మలోని వాంఛను లోకము మనస్సునందంతటను నింపించికొని ప్రసరించుచున్నది. తన వాంఛ యాత్మయందే లీనమై యున్నది. ఆవాంఛను దానుకూడ మనఃపర్యంతము తెచ్చినచోఁ దాను కూడ లోకమువలె నుండునేమో. అనఁగా నిట్టి స్త్రైలక్షణ్యద్వైవిధ్యములు లేకుండఁ జేయవచ్చును. అప్పుడొక స్త్రీకి నొక పురుషుఁడే కావలయు నని, యొక్క స్త్రీ కొక్క పురుషుఁడే కావలెయునన్న నిబంధన యుండదేమో! అవును, ఆత్మలక్షణముల యందు నిష్ఠగాఁ గూర్చున్నవాని నుదాత్త ప్రకృతి యందురు. ఆత్మనుండి పరిభ్రష్టుఁడై మనస్సును బట్టి నడచెడువానిని నీచుఁ డందురు. కనుక నీయుదాత్తతానీచతలు వాత్మమనస్సమాశ్రయములు. తాను పరమేశ్వరానుగ్రహమువలన నీవిషయమున నాత్మనిష్ఠయై యున్నది. మనోనిష్ఠురాలేల కావలయును? సారథి యంగీకరించఁడు. అది నిశ్చయము. ఐనను దన ప్రయత్నము తాను చేయును. అతఁ డంగీకరించనిచో నేమి చేయవలయును? ఇంతయూహా యెందులకు? దానివలనఁ దన కేమియు బాధ లేదు. తాను గల్పించుకొని యీ విచారణావంతయు దెచ్చుకొన్నది. దీని కంతకు గారణము సారథియొక్క స్పర్శ తనకు సుఖముగా నున్నదని యనుకొని దానిని బరీక్షించుట. అంతటితో నూఱకుండక దానికిఁ జిలవలు పలవలు పెంచుట. ఇప్పుడైన దీని మానివేసినచో బాగుగా నుండునేమో. కాని యీ మనస్సొక దానినిఁ గూర్చి యాలోచన మొదలుపెట్టిన తరువాత నది యూఱకుండదు.

ఇట్లనుకొనుచుండగనే తెఱచియుంచిన గవాక్షమునుండి యొక తెల్లని పలుఁగు వచ్చెను. ఆ పలుగు తెల్లవాఱబోవుచున్నదని చెప్పెను. ఆమెకు నిదుర పట్టలేదు. లేచి ముఖప్రక్షాళనము చేయవలయునని సావడిలోనికి వచ్చెను. సావడిలో దీపము వెలుగుచుండెను. కమలయుఁ దన తండ్రియు నొక్క మంచము మీఁదనే కౌగలించుకొని పండుకొని యుండిరి. వారు పండుకొనిన స్థితి చూచినచో నామె కసహ్యము వేసెను. ఒక యుపహాస్యభావము కలిగెను. కాని వారిరువుర నే చూచివేయు ననిపించెను. అతఁడు తండ్రియగుట నట్లు చూపరా దనిపించెను. ఇన్నిభావము లొక్కసారిగా వచ్చుటచేత నామె కుక్కిరిబిక్కిరి యయ్యెను. ఆమె మాటాడకుండ మెల్లఁ దన గదిలోనికిఁ బోయి పండుకొనెను.

ప్రతిదినము సంగీతాభ్యాసము చేయని దినములలో వాసంతి ప్రొద్దెక్కి లేచును. ఆ ధైర్యముతో శిరీష యిట్లు పండుకొనెను. ఆమెకన్న ముందుఁ దాను లేవవచ్చునని. ఆమె తన కూఁతురగుట కూడ నిర్భయహేతువు.

దానికిఁ దానే పెద్ద సాక్ష్యము. అంతలో నామెమనస్సు తన తల్లిమీఁదికిఁ బోయెను. ఆమె యెట్లుండెడిది? ఆమె ప్రకృతి యెట్టిది? ఆమె పండితురాలా, కాదా? తన యీశరీర సౌందర్యము తన తల్లినుండి తనకు వచ్చినదా? తండ్రిలో మునిఁగిపోయి తాను తన తల్లిని గుఱించి యెప్పుడు నూహించలేదు. తన తల్లి అచ్చుగాఁ దనవంటిదై యుండవలయును. ఆమె శరీరము తన శరీరమును బోలినదై యుండవలయును. ఆమె శరీరము శిరీషపత్రమువంటిది. ఆమె తన తండ్రిని ప్రేమించెను. తన తండ్రియొక్క యేకైక స్పర్శకే యామె శరీరము పులకరించెను. అందుకనియే యామె పెందలకడ చనిపోయెను. కాని తనయందుఁ దన తల్లి యెక్కువున్నది తండ్రి యెక్కువున్నది. తన తండ్రి తనతల్లినివదలి వేసి కమల నిట్లు గ్రహించినాఁడు. అట్లే తన ప్రకృతిలోఁ గూడ సారస్వతమైన మఱియొక వ్యక్తిని స్పర్శించి దుఃఖము కొనిపోయినను మండుచున్న యగ్నిఁ గాకపోయినను సుఖదుఃఖములు రెండును గానిదానిని గోరువెచ్చని స్పర్శను బొందగలదేమో. తన తండ్రి సామాన్యముగా నెప్పుడును దనతల్లివిషయము తనతో మాటాడఁడు. ఒకటి రెండుసార్లు చెప్పెను. ఆ మాట లిప్పుడు వాసంతికి జ్ఞాపకము వచ్చెను. "వీరాయువుకు నేను దేవుఁడను. నేను వృక్షమును; ఆమె లత. నేను చంద్రుఁడను; ఆమె వెన్నెల" వాల్మీకి రామాయణములో రాముని గూర్చి సీత యిట్లన్నదట. నా తల్లి పండితురాలు.

అంతట గవాక్షమునుండి తెల్లని వెలుతురు వచ్చెను. అంత వెలుతురు గదిలోనికి వచ్చుటకు దానికి వంద రెట్లు వెలుతురు బయట నుండవలయును. అనఁగా సూర్యోదయమై యుండవలయును. వాసంతి లేచి సావడిలోనికిఁ దొంగి చూచెను సావడిలో నెవ్వరు లేరు, శిరీషుఁడును, గమలయు మంచములమీఁద లేరు. మంచములు ఒట్టి యున్నవి. ఆమె కాశ్చర్యము వేసెను. తన తండ్రి ప్రతి దినము నిద్రలేచినంతనే పరుపుచుట్టి గదిమంచముమీఁదఁ బెట్టును. మంచ మెత్తి గోడకు వాల్చును. నేఁడట్లు చేయలేదు. వాసంతికి జ్ఞాపకము వచ్చినది. నిన్న గూడ నటు చేయలేదు. అట్లాతఁడు చేయకుండుట తానెన్నఁడు నెఱుఁగదు. అయ్యో! ఆమె యూహ తిన్నఁగ బ్రదుకనిచ్చుట లేదు. ప్రతిచిన్న విషయము తన కొక సందేహము. దానిని గుఱించి యూహించుట-ఆయూహించుట కేకాంతము కావలయును. అన్నము సరిగా సహించుట లేదు. నిదురపట్టుటలేదు. ఇప్పుడు మఱల నూహించినచోఁ గాని యీ రహస్యము తెలియదు. అరే! ఇన్ని విషయములు స్ఫురించుట యేమి? వాని సమాధానము లాలోచింపవలసిన యవసర మేమి? అనఁగా సృష్టి కొంత యాత్మనిష్ఠము; కొంత మనోనిష్ఠము. ఆత్మనిష్ఠమైనది స్ఫురించును; మనోనిష్ఠమైనది యూహింపఁబడవలయును. ఈ

రంగును గలసినచో మనుష్యుఁడు స్త్రీ. వాసంతి తనకుఁ దెలియకుండఁగనే మఱల గదిలోనికి బోయి పండుకొనెను. తన కింతటి యభాగ్యమైన యీ పని యెందుకు మానివేసెను? స్త్రీ పురుష సంబంధమైన యీ యనుభూతి నరుల లోని పగయును దగ్గించునా? శ్రద్ధను నెలకొల్పునా? అలవాట్లను సాగనీయదా? ఎందుకు సాగనీయదు? మనస్సునకుఁ గలిగిన యశ్రద్ధచేనా? శరీరమునకుఁ గలిగిన బడలికచేనా? మానవునందలి యశ్రద్ధయే కావలయును. మఱి శరీరమునందు బడలిక యేల కలుగవలయును? ఆ యనుభూతి భావమునందే మనస్సు లగ్నమై తదితర విషయములం దశ్రద్ధ కలుగును.

ఊహించినది కించిద్విషయమే. కాని యూహించుటకుఁ జాలసేపు పట్టినది. అప్పటి కెనిమిదిన్నర దాటినది. క్రమముగా శిరీషులు కాఫీకూడ త్రావి సావడిలోనికి వచ్చిరి. వాసంతి నిదుర లేవలేదని శిరీషుఁ డనుకొనెను. గదిలోనికిఁ బోయి చూచెను. ఆమె కనులు తెఱచికొనియుండెను. ఆ కనులు మేల్కొని చాలసేపైనట్లున్నవి. అతని కంటిలోఁ గొంచెము కదలిక కలిగెను. ఆమె తండ్రిఁ జూచి లేచెను.

ఆనాఁటి సాయంత్రమున వాసంతి సారధియింటికిఁ బోయెను. కిరీటి యచటనే కూర్చుండెను. కిరీటి వాసంతి వంక నొక సిగ్గుతో, నొక యాశ్చర్యముతో, నొక విలాసముతోఁ, జిఱునవ్వుతోఁ జూచెను. వాసంతి కాచూపులలోని యభిప్రాయము తెలిసికొనెను. తెలివి తేటలు వచ్చినవి గదా. పూర్వము వలెఁ గాదు. ఆమె గ్రహించెను. కొంచెముగా సహించుకొనెను. పూర్తిగా సహించుకొనలేదు. ఆ జ్ఞానముతోనే కొంత స్త్రీ ప్రకృతియు వచ్చును. తనయందుఁ బ్రేమ చూపించుచున్న పురుషుని స్త్రీ యసహ్యించుకొనదు. వానియం దిష్టము చూపింపకపోవచ్చును. కిరీటియు నామెయం దంత కొంచెము విచ్చలవిడిగాఁ దన మనోభావమును దెలుపఁజేయుటకు సారధియే కారణము. సారధి ప్రొద్దునఁ గిరీటియింటికిఁ బోయి "యేమయ్యా! ఆ మన్మథదహన నాటకము పూర్తిగా వ్రాయవలయునట. వాసంతి తపించిపోవుచున్నది. నీవుగాని మఱియెవ్వరును వ్రాయఁగూడదట. నీ వంతటి మహాకవివట. పూర్వమునకంటె బొడుగు సాగితివఁట. మొన్న నెప్పుడో యామె కనపడగాఁ బులకపులకవఁ జూచితివట." ఇట్టిమాట లనెను. ఉన్నవి కొన్నియు, లేనివి కొన్నియు. లేనివి కొన్ని కలుపుకొన్నప్పటికి వాసంతి యుద్దేశమే మారిపోయినది. వాసంతి ఏ యుద్దేశముతో నందులోని కొన్నిమాట లనినదో మఱికొన్నిమాటలు కలుపుసరికి నా యభిప్రాయమే మాఱిపోయినది. నూతనముగా యౌవన మంకురించుచున్న కిరీటికి మనస్సులోఁ గిలికింపితము జరిగినది.

తానే కిరీటి వాసంతిని గుఱించి చాలఁ జెడ్డమాటలు వినెను. సారథికి, వాసంతికి సంబంధ మున్నదని లోక మంద ఱెఱిఁగిన విషయమే. ఇదికాక లోకమున కట్లు తెలిసినదో జమీందారుగారికి, వాసంతికిఁగూడ సంబంధము కలదని. ఈ రెంటిమాట యట్లుంచి రంగనాథమునకు నామెకు సంబంధమని; అర్జునరావునకు నామెకు సంబంధమని. అర్జునరావు తనయుఁడవేను దీసికొనిపోయి వారియింటిలో ప్రవేశపెట్టుట వారి యింటికిఁ దాను యథేచ్ఛముగా రాకపోకలు జరుపుటకని లోకముయొక్క వ్యాఖ్యానము. సారథి విషయములో సందేహమే లేదు. దొరగారి విషయము బహిరంగముగాఁ గాదనలేఁడు. పాతిక వేలరూపాయల ముత్యాల హారమే వాలుగరెట్ల నోళ్లు పెట్టుకొని ఘోషించుచున్నది. కాని కిరీటికొక్కటే సందేహము. తనయందామెకు వాంఛ కలదన్న మాట సారథి నోటివెంట వచ్చుట. సారథికి, నామెకు నిజముగా సంబంధములేదా? ఉన్నచో నతఁడువచ్చి తనతో నిట్లు చెప్పునా? కిరీటి యిదెవఱకు వాసంతి వంక వెక్కిరింపుగాఁ జూచెను. ఆ వెక్కిరింపులోఁ గొంత వాంఛ లేకపోలేదు. స్త్రీని గుఱించి పురుషున కట్టి భావమున్నచో నామెను నిందించినను దిరస్కరించినను నసహ్యించికొనినను మూలభూతమైన స్త్రీ వాంఛ లేకుండ నెప్పుడు నుండదు. అతని కామెయందు గౌరవములేదు. లేకనుపోలేదు. ప్రేమలేదు. లేదనుటకు వీలులేదు. దానినిఁ ప్రేమ యనుటకంటె వాంఛ యనుట మంచిది. అతఁడు పూర్వము స్త్రీ నెఱుఁగఁడు. యౌవనావిర్భావముచేతను, సహజత్వముచేతను, దోడివారిని జూచుటచేతను గలిగిన భావములే కాని మఱియేవియు గావు. తనలో స్త్రీ వాంఛ సహజముగా సముద్భూతమై దానికి దోహదము లేక మిక్కిలి యాలోచనాపరుడైన కుఱ్ఱవాని మనస్సులో ఘోరపిశాచముగా నిరంతర మథ్యమానమగుచున్న యీ వాంఛ యాకులమీఁదఁ బ్రాకాడు పురుగు తన కండబోవుచున్న యాకును సమాశ్రయించినట్లు సారథి చెప్పిన యీ మాటలతో నతని భావము వాసంతి యందుకొనవలె ననిపించెను. ఆ వాంఛలో నామెనుగూర్చి తనకున్న యితర భావములు లుప్తములయినవి. అతని కొక దురూహకూడ కలిగినది. తాను కొంచెమాస్తిపరుడు. సారథి నిర్ధనుఁడు. తనవలన నీరీతిగా సారథి కొంత సంపాదించవలెనని యూహించుచుండెనేమో యని. తనవలన నెందుకు? వాసంతి కాస్తియున్నది. ఆమె తండ్రికి సుక్షేత్రమైన పాతికయెకరముల మాగాని గలదు. అతనికి మగసంతానములేదు. ఆస్తియంతయు వాసంతిదే. ఆమె నడిగినచో నిచ్చియదా? ఇప్పుడు పాతిక వేలదనముగా వచ్చినవి. పాటకచేరీలవలన సంపాదించును. తండ్రి యీయనీయఁడేమో. ఊహలు ఊహలే, వాంఛలు వాంఛలే.

అతని యీ లక్షణములు చూచినంతనే వాసంతి కొకయూహ తోచినది. ఇతఁ డెన్నాళ్లను నాయందు ప్రేమను గలిగియున్నాఁడు. ఇతని స్పర్శనుగూడ బరీక్షింపవలయును. ఈ పరీక్షతో సందేహలేశముకూడ నివర్తితమగును. వాసంతి తనకు వచ్చిన యూహను వెంటనే నాచరించినది.

వాసంతి యిట్లనెను: "ఏమయ్యా! కిరీటీ! ఈ నాటకము చివరిదాఁక వ్రాసి పెట్టవలయును."

కిరీటి-అట్లే! మీ రిచ్చగించినచోఁ గాదందునా?

కిరీటికంఠము వాసంతి యేమి చూచెనో, యెవ్వరెరుగరు. పెద్దది. ఆమె యిదివఱకే నొక విద్యాలయమునఁ బ్రారంభకురాలుగాఁ బ్రసిద్ధిపొందెను. తాను వయసుచేతనే గాక ప్రతిష్ఠచేతఁ గూడఁ బెద్దదాని. అందుచేత నామె నీవనఁగా నతఁడు మీరనెను. ఆమెనుఁ దాను గౌరవింపవలయును. ఆమె తన్ను గౌరవించుట లేదు. ఇప్పుడు కలిగిన వాంఛాసాఫల్యమునకుఁ బ్రతిబంధకమైనవిషయము. తన యందు గౌరవములేని స్త్రీ తన్నెట్లు ప్రేమించును? మఱియు నామె తన్నుఁ బ్రేమించు ప్రవర్తి, యింత మాటలాడుట ప్రకారి నాతఁడు చెప్పినట్లుగా లేవు. వాసంతి యిట్లనెను:

"ఈ నాటకము పూర్తిచేయుటకు సారథి యెందుకు వ్రాయించెనో నీకుఁ దెలియునా?"

కిరీటి-నాకు దెలియదు.

వాసంతి-ఐనచో సారథి నడుగుము.

సారథి ప్రత్యక్షుఁడైపోయెను. ఈ వాసంతికి వివేకము చాల నాలస్యముగా వచ్చెను. వచ్చిన వివేకము శీఘ్రముగ వచ్చెను. ఈమె యసాధ్యురాలుగా గన్పించుచుండెను. సారథి కొంతసేపు మౌనమవలంబించి, యిదియుఁ దనప్రయత్నమున కనుకూలముగా నే యున్న దనుకొని తానే చెప్పనారంభించెను: "కిరీటీ! నీవు చిన్నవాఁడవు. పరమేశ్వరుఁడు నీలో గవితాగుణమును బ్రవేశపెట్టినాఁడు. నేను నీచేత నాటకము వ్రాయించి రెండేండ్లు కావచ్చుచున్నది. ఈ నడుమ నీ కవితాశక్తి యెంత వృద్ధిపొందినదో నాకుఁ దెలియదు. నే నీమాటలు అనవసరముగా మాటాడుచున్నాను. అసలు విషయము చెప్పెదను. నిన్ను నేను నాకు నాత్మీయునిగా గ్రహించుచున్నాను. నీవు బుద్ధిమంతుఁడవు, రహస్య గోపనము చేయఁగలవాఁడవు నని నే ననుకొనుటలోఁ దప్పేమయిన నున్నదా?"

కిరీటి-సారథిగారూ! నే నొక్కమాట జెప్పెదను. మీరు నాకు భగవంతునివంటివారు. మీ యంతటి మహానటకుడు సృష్టిలోఁ బుట్టఁడు. మీ నాట్య

ప్రతిభ లోకమునకుఁ దెలియదు. మూఢమైన లోకము మీకంటె నర్జునరావు గొప్ప నటకుడని యనుకొనును. ఈ మానవ ప్రపంచములో వేయిమందిలో నొక్కఁడు వివేకి. అట్టి వివేకులు వేయిమందిలో నొక్కఁడు పరమరహస్య విజ్ఞాత. పరమరహస్యమైన మీ నాట్యతత్త్వము లోకమున కెట్లు తెలియును? మిమ్ముగూర్చిన నా యభిప్రాయ మిది. మీరు మహానటకుఁడని నేను, కాదని వేయిమంది. వారితో నే నెప్పుడును బోరాడుచుందును. నాకు గోపము వచ్చును. నన్నందఱు వెక్కిరింతురు. వారు మూఢులని నాకు దెలియును. నేను లెక్కసేయను. మీకు నేను శిష్యునివంటివాఁడను; భక్తునివంటివాఁడను. పైగా నే నీయూరిలో కవిగాఁ బరిగణింపఁబడుచుంటి ననఁగా నది మీవలన జరిగిన యుపకారము. మీ రహస్యమును నేను బైటఁబెట్టుదునా?

సారథి కిరీటినిఁ గౌగిలించుకొనెను. వాసంతి కనులలోఁ జెమ్మ యూరికెను. ఆమెకుఁ గిరీటినిగుఱించి పూర్వ మేయభిప్రాయమును లేదు. సారథినిగూర్చి తన కెట్టి యభిప్రాయమో కిరీటికిఁ గూడ నట్టి యభిప్రాయమే యగుటచేత వాసంతికిఁ గిరీటి తన కాప్తునివలెఁ గనిపించెను. సారథి, తాను, కిరీటి ముగ్గురు నొకటి అన్నట్లనిపించె నామె ప్రాణములకు. ఆమెయందు వెంటనే యొక ప్రేమభావ ముదయించెను. సారథినిగూర్చి కిరీటి కట్టి మహాభిప్రాయము కలిగియుండుటకు నతనియెడల నామె మనసులో నొక ప్రశంసాభావ ముదయించి వాసంతి తనచేయి యతని బుజముమీఁద వైచెను. అంతకుఁ బూర్వము కిరీటి యుక్కపోయుచున్నదని చొక్కా యూడఁదీసి కూర్చుండెను. వాసంతి హస్తము ప్రశంసాభావద్యోతక మని కిరీటి గ్రహించెను. ఆమెకు సారథి దేవుడని దానిలోనే తెలిసెను. తన యూహా యస్థానపతితము. వాసంతి చేతిలో నాదర మున్నది. తాను చిన్నవాఁడగుట యున్నది. తన వాంఛానుకూల్యము లేదు.

అతని బుజముమీఁదఁ జేయివేసినంతనే వాసంతికిఁ దా నూహించని స్పర్శలక్షణము భాసింప నారంభించెను. వెంటనే యామెకు స్మృతివచ్చెను. ఆ చేయి తీయకుండ నట్లే యుంచెను. అతని స్పర్శ తనకు శిశిరముగా నుండెను. ఆమె కిది క్రొత్త యనిపించెను. కిరీటిని గౌగిలించుకొన్న సారథి పూర్తిగా నతనిని వదలిపెట్టలేదు. ఇంతలో సారథి కిరీటిని వదలిపెట్టెను. వాసంతి తన చేయి బుజముమీదినుండి తీయలేదు. ఆ చల్లగా నున్న స్పర్శ క్రమక్రమముగా వెచ్చనయ్యుచుండెను. వెంటనే వాసంతికిఁ దెలిసెను. ఈ కిరీటియొక్క స్పర్శ తనకుఁ జల్లగా నుండుటకుఁ గారణము వాని దేహము సారథియొక్క దేహసన్నికర్ష కలిగియుండుట. వాసంతి సారథిని

మఱల గిరీటి మీదఁ జేయివేసి యట్లే యుంచుమని యడిగెను. సారథి కిరీటి మీద మఱల జేయివేసెను. వాసంతికిఁ గిరీటి దేహస్పర్శ మఱలఁ గ్రమక్రమముగా శరీరీకరింపఁబడుచుండెను. సారథిని మఱల జేయి తీసివేయు మనెను. అతఁడు తీసివేసెను. మఱల గ్రమముగాఁ జల్లదనము తగ్గిపోవుచుండెను. సారథికి విషయము తెలిసెను. ఆమె తన స్పర్శానుభూతిని పరీక్షించుకొనుచుండెను. కిరీటి కేమియుఁ దెలియలేదు. అతఁడు నివ్వెఱపోయి చూచుచుండెను. సారథిని తెంచు మూడుసార్లు కిరీటినిఁ దాకుమని, కొంచెముసేపుండి తీసివేయుమని వాసంతి సంపూర్తిముగాఁ దన యనుభూతినిఁ బరీక్షించుకొనెను. చివరకిట్లనెను: "కిరీటీ! నేను వెంటనే యింటికి బోవలయును. నీవు రేపుదయమున వచ్చినచో గూర్చుండి నాటకము వ్రాయుదము."

కిరీటి యిట్లనుకొనెను: "ఎవఁడో గొప్ప యధికారి తన్నాజ్ఞాపించుచుండె"నని. అతఁడు వెంటనే లేచెను. సారథి వంక జూచెను. సారథికూడ నతనిని వెళ్ళుమన్నట్లే యుండెను. తాను వెడలిపోయిన తరువాత వారిద్దరేమి మాటాడుకొందురని యతఁ డనుకొనెను. వాసంతియు వెంటనే లేచి "సారథీ! నేను కొంత విచారించుకొనవలయును. రేపు ప్రొద్దున వత్తును. కిరీటీ! తప్పకుండ వత్తువుకదా" యని వెడలిపోయెను.

కిరీటి తానేభావ మనుకొనుటకు వీలులేకపోయెను. తాను వెడలిపోయినచో వారేదేని మాటాడుకొందు రనుకొనుటకు వాసంతి వెడలియేపోయెను. ఒకవేళ వాసంతికి, సారథికి సంబంధమున్నచో వాసంతి యారీతిగా వెడలిపోఁగలదా? అతనికి వాసంతినిగూర్చి పూర్వమున్న భావము లన్నియుఁ బటాపంచలయ్యెను. ఈమె యొక విలక్షణ ప్రకృతి. ఆమె శాసించునదియే కాని శాసింపబడునదికాదు. ఆమె వెళ్ళుమంచుఁగా సారథికూడ నుండుమనలేదు. ఆమె సారథితో మాటాడునపుడుకూడ సారథిని 'సారథీ' యనియే పిలుచును. లోకమునందువలె వారొకరినొకరు స్పృశించుటకుఁగూడఁ బ్రయత్నించరు. ఒకరినొకరు ప్రక్కచూపులుకూడఁ జూచుకొనరు. లోకజ్ఞుడైన సారథి తానట్టి ప్రయత్నము చేయకపోవచ్చును. వాసంతి యేలకుఁ జేయదు? ఇద్దఱును తన్నొక గుడ్డివానివలెఁ జూడవచ్చును. తాను కొందఱు స్త్రీ పురుషుల నెఱుఁగును. తానక్కడ నుండఁగా వారు తిన్నఁగ గుడ్డివాఁడుగా లెక్కకట్టి తమ శృంగారభావములు నవ్వులలోఁ జూపులలో వ్యాజస్పర్శలలోఁ బ్రకటించుట యెఱుఁగును. ఇద్దఱు స్త్రీ పురుషుల నడుమ నట్టిభావమున్నచో వారు గోపనము చేసికోలేరు కనుక వాసంతికిని సారథికి నేమియు సంబంధములేదు. సరే, ఈ

సంబంధము కాదందము. పాతికవేల ముత్యాలహారము కాదనుట యెట్లు? తక్కిన వన్నియుఁ గాకపోవచ్చును.

కిరీటి లేచి నిలుచుండి రెండుమూఁడు నిముసములు కదలలేదు. ఇట్లే యూహించుచుండెను. సారథియు నేదో యాలోచించుకొనుచుండెను. అతఁడును మాటాడలేదు. అతఁడు కొంతసేపటికి గిరీటితో నిట్లనెను: కిరీటి! నీవు చిన్నవాఁడవైనను బుద్ధిమంతుఁడవు. ఆలోచనాపరుఁడవు. నీవేమి యాలోచించుచుంటివో లీలగా నాకుఁ దెలియును. నీవు సాయంతనమున నీ కళాశాల వదలిపెట్టిన తరువాత నిక్కడికి రమ్ము. నే నెక్కడికిఁబోను. సవు ప్రస్తుతమునకు షికారుపోదము." కిరీటి సరే యని వెడలిపోయెను.

సారథికి వాసంతిని బోయి కలిసికొనవలెనని యున్నది. ఈ వాసంతి మనోభావ మెట్లున్నదో? తన పడకమున కనుకూలముగా నున్నదా? అనుకూలముగా నున్నట్లే యతని కనుమానము కలిగెను. వాసంతి మఱునాఁటి ప్రొద్దున వచ్చునన్నది. ఆమె యనుభూతియొక్క లక్షణము తనకుఁ దెలిసినచో గిరీటితో దాను మరికొంత స్పష్టముగా మాట్లాడవచ్చును. ఆమె రేపు ప్రొద్దున వచ్చుచున్నది. తాను కిరీటిని సాయంకాలమునకే రమ్మనెను. కిరీటిని రేపు సాయంకాలముననైన రమ్మనలేదు.

వాసంతి యింటికిఁబోయెను. కమల యింటనుండలేదు. అర్జునరావు వచ్చి తీసికొనిపోయెనట. కమల రెన్నాళ్లు దివారాత్రములు గిరీశుని యింటిలో నుండుట రంగనాథమునకు, నతని భార్యకు దెలిసెను. రంగనాథముభార్య పెద్ద గొడవ లేవదీసెను. "వ్యక్తురాలైన పిల్లను బరాయియింటికిఁబోనిత్తురా? పలువురు నేమని చెప్పుకొందురు? వారి యిల్లెటువంటిదో యిప్పటికిఁ దెలిసినదే నాయెను. కోటలోనికిఁబోయి ముత్యాలహారాలు తెచ్చికొనెను కొంప' ఇట్లు సాగించెను.

రంగనాథము 'అదియేమి మాటలే? మన పిల్లలు మాత్రము పోలేదా? చీరలు పంపిగిన్నెలు దంతపు బొమ్మలు తేలేదా" యనెను. తాను తన భార్యకనుకూలముగా మాటాడినచో దమకు వారికి సంబంధము చెడిపోయినచోఁ దనకు వాసంతిమీఁద నున్న కోరిక ఫలించెడి మార్గము చెడిపోవునని రంగనాథము భావము.

అతని భార్య యిట్లన్నది:— "ఆఁ, సాటివా తెచ్చినారు! అదియు నిదియు నొకటేనా? పిల్లలు వెళ్లినచో ముద్దుగా నిచ్చిన కానుకలును, పాతికవేలముత్యాహారమును సమానమా?"

అప్పుడు లలితయు, నర్జునరావు నచటనేయుండిరి. వారు మనసులలో నిర్వాంతపోయి బయటకు నవ్వుచుండిరి. కమలకూడ గదిలోనుండి యీ మాటలు

వినుచుండెను. ఎవరి కర్థమైనట్లు వారి కర్థమగుచుండెను. ఇట్టి కథలు కలిచిన రెన్నాళ్లలో రెండుమూడు జరిగినవి. అందుచేత నర్తనరావు కథలను దీసికొని వచ్చెను. కథల యేర్పాటు నింటిలోఁ జరుగుచుండెను. ఎందు కేర్పాటుచున్నదో ఎవ్వరికిని దెలియదు. అడిగినచో చెప్పను. అర్తనరా వామెతో నేకాంతముగా మాటాడుటకు నామెను మఱల వనయింటికిఁ దీసికొనిపోవలయును. అప్పు డెంత ఊఱకే నవ్వుచుఁ గూర్చుండెను.

ఆనాఁడు ప్రొద్దుతిరిగెను. ప్రొద్దు తిరిగెను కాని రొంపలోఁ దీక్ష్ణత తగ్గలేదు. తగ్గలేదు కాని యొంపినాశిపోవుచున్నది. సంగనవేళయుండలి రొంప కామారవయసున్నవంటిది. ప్రొద్దుతిరుగునుగాని దిగజాపోదు. వయసు మఱలుచున్నది. మఱలుచున్నదనుట బహిర్లక్షణము. లేతగాఁ గూడ నంతదనము కాదు. తీయముగూడఁ బైనుండి ప్రారంభించి హృదయమును వఱకు చేర్చును. హృదయముకూడ నెండినఁగాని పూర్తిగా ననేనప్పత్తి రాదు.

సారధి యింటికిఁ దిరిగి వచ్చెను. సారధి కిరీటితోఁ జాలవిషయములు చెప్పవలయు ననుకొన్నాఁడు. సారధి నాలుగురోజులనుండి డోలాయితమైన మనస్సుతో నున్నాఁడు. కిరీటితోఁ దాను చెప్పవలెననుకొన్న మాటలు జెప్పుటకుఁ దా నెవఁడు? తనకే స్వాతంత్ర్య మొక్కఁ డేది! వాసంతి తన్ను ప్రేమించినది. అయ్యో! అదికూడ గాదు. అది యొక విచిత్ర పరిస్థితి. ఆమె యెవ్వరిని ప్రేమించలేదు ప్రేమించదు. ఆమెకే కావలె మెందుకు సముత్పన్నమైనదో తెలిసినది. ఆ తెలియుటలో లోకప్రవృత్తిని ద్వేషించినది ఆరీతిగా నామె తనయందొక యాత్మకు సంబంధించనిది, మనస్సునకు సంబంధించియు సంబంధించనిది, శరీరమునకు నిస్సంశయముగా సంబంధించినది యగు నొక యనుభూతి విశేషమును వాంఛించుచున్నది. ఆ యనుభూతియొక్క ఫలము తనకు సంబంధించినదియై యున్నది. స్థితి ఇది. పరమేశ్వరుఁడు తన్నెంతగాఁ బరీక్షించుచున్నాఁడు! ఇది యొక విచిత్రమైన శిక్షగానున్నది. సారధి తనజీవితము నంతయు బరీక్షించుకొనెను. తన శరీరము బహుస్త్రీ పరిభోగదూషితము. వారిలో నొక్కర్తను దాను ప్రేమించలేదు. వారిలో నొక్కతె తన్ను ప్రేమించలేదు. తన యీలింగప్రవృత్తి మానవేతరమైన యొక పశుప్రవృత్తిగా జీవితమంతయు గడచెను. దాని కిది ముకుటాయమానముగా నున్నది. అద్భుతముగాఁ దనకే సంబంధించిన తనూసృష్టి నొకదానిని భగవంతుఁడు చేసెను. ఓరి పశుప్రాయుఁడా! నీ జీవితమంతయు నిట్లు గడచినది. మనస్సన్నది లేనిది, రసాస్వాదమును బట్టనిదియైన యొక పశుకామమును నీ వవలంబించితివి. ఆ పశుకామమునకు శిఖరాయమాణముగ దీనిని నీకిచ్చుచున్నాను. ఇది నీ జన్మయొక్క పరమావధి.

నీ ప్రాప్తి యింతే. నీకు మోక్షము లేదు. నీవు శరీర లగ్న జీవుఁడవు. శరీరము రసమార్గానుభూతి పొంది ముక్తికి సోపానముగా నే నేర్పఱచితిని. నీవు దానినుండి బహిష్కృతుఁడవయినావు. అందుచేత నీ కీశిక్ష వేయుచున్నాను అన్నట్లున్నది యీ వాసంతి. తా నీమెను స్వీకరింపవలయునా, వలదా? స్వీకరించినచో పరమేశ్వరుఁ డేర్పఱచిన శిక్ష నంగీకరించినట్లే. అంగీకరింపనిచో "అయ్యో, పాపము! వీఁడు మంచిత్రోవనుబడినాఁడు. వీనిని బాగుచేయవచ్చు" ననిభగవంతుఁ డనుకొనవచ్చును. అందుచేత నంగీకరింపకుండుట భగవదనుగ్రహపాత్రుఁడగుట. ఇదియంతయు నాంతరవిషయము. బహిర్విషయ మాలోచించినచోఁ దాను వాసంతిని జేపట్టినచో నామెను వివాహము చేసికొనలేఁడు. అట్లు చేసినచోఁ దాను పొందెడు నప్రతిష్ఠ యంతింతకాదు. శిరీషునకుఁ దనకును విరోధము వచ్చును. తాను పొందెడు సుఖములేదు. తాను దరిద్రుఁడు. దానివలన వాసంతి పొందెడు సుఖములేదు. తన జీవిత మిదివఱకే యూషరక్షేత్ర మైనది. ఇంక నామె జీవితమునుఁగూడ నూషరక్షేత్రమునుజేయుట మిగిలియున్నది. తాను వృద్ధుఁడు. ఆమె చిన్నది. తా నింకెన్నాళ్లు బ్రదుకునో తెలియదు. తన వలె బ్రదికినవాఁడు. ముగ్గుముదియఁడు. ఎప్పుడో హఠాత్తుగా రాలిపోవును. వాసంతి యేమికావలయును?

కిరీటియొక్క స్పర్శను నాటి యుదయమున వాసంతి పరీక్షించినది. ఆ పరీక్షలోఁ దనకొక యనుమానము కలిగినది. అతని శరీరస్పర్శ తనకు శిశిరముగా నున్నచోఁ దన్ను రెండు మూఁడుసార్లు తాఁకుమనియు మఱల వదలి పెట్టుమనియు ననియుండెడు. కిరీటి దేహమునకుఁ దన దేహమునకు సన్నికర్షకలిగినపుడు తత్స్పర్శ శిశిరముగా నుండి, యెడమైనప్పు డుష్ణముగా నుండియుండవలయును. అందుచేతఁ గిరీటి స్పర్శ శిశిరముగా లేదన్నమాట. కాని తన మేనితోడి సంస్పర్శము కలిగినపుడు శిశిరముగా నున్నది. ఈ కిరీటిని దనవలెఁ జేయవలయును. తన తనూత్వము నాతనియం దారోపింపవలయును ఇది చాల క్లిష్టమైన పని. ఇది యెట్లు చేయవలయును? ఇది యెవరో యోగులు చేయవలసిన పని. నే నొకవిధముగా యోగిని. నా యోగము సంప్రదాయమార్గమునఁబోవుట లేదు. ఈయోగమునకుఁగూడ నేదియో ఫల ముండును. అది క్షుద్రమైనఫలము. నా తనూలక్షణము లింకొక్కనియందుఁ బ్రవేశపెట్టుట నా యోగముయొక్క పరమార్థము కావలయును. దీని కించిత్ఫలముతో నుత్తరజన్మయైనను మంచిది సంపాదించుకొనవలెనని చేసెడు నా ప్రయత్నము దీనితో విఫలమగుచున్నది. ఈ శరీరమునందుఁ జేసిన ప్రయత్నముయొక్క సర్వఫలితము నీ శరీరముతో డనే సమాప్త మగుచున్నది. దుష్కర్మ మాత్రము మిగులుచున్నది. నా

యుత్తరజన్మ యింతకంటె క్షుద్రమగుటకుఁ జక్కని మార్గము వేసితిని. ఓహో! నావలె బ్రదికెడివా రందఱి బ్రతుకి ట్లేయగును. భగవంతుని మార్గము లవేద్యములు. శరీర సుఖమువలెఁ గనిపించి ముక్తిమార్గమున కెన్ని యడ్డంకులు భగవంతుఁడు కల్పించును? ఏదో సుఖము మార్గాపతిత మయినదని దానియందు వ్యామోహము పూని పరమేశ్వరానుగ్రహమునకు దూరమగుట కింతకంటె వేఱే యుదాహరణ మేమికావలయును? వాసంతి దారిని వాసంతిఁ బోనిమ్ము. ఆమె యేమైన నాకేమి యని యూఱకుందునా? ఆమాత్రము వివేకము నాకున్నచో భగవంతుఁడు నామార్గమునం దీబంగారు ముండ్లకంచె నెందుకు కనిపింపఁజేయును? వలసినచో నింక నొక వంద జన్మ లెత్తుదును. నా మార్గమెట్లును జెడినది. వాసంతి మార్గమును బాగుజేసెదను. అనగా నాకు వాసంతి యందు వాంఛయున్నదని యర్థము. ఆ వాంఛను నాయంతట నేను తీర్చుకొనుటకు శారీరకముగా, సాంఘికముగా నామె భవిష్యత్తుయొక్క దృష్టితో నిరాకరించుచున్నాను. దానియందు విరక్తి కలిగి నిరాకరించుట లేదు. అనఁగా ప్రేమ యున్నది. ఆ ప్రేమను బొందుటకు, ననుభవించుటకుఁ దగిన శక్తి లేదు. ఇంతలోఁ గిరీటి వచ్చెను. కిరీటి వచ్చినంతనే యూహయంతయు నాఁగిపోయెను. కిరీటితో నీ సంగతి చెప్పవలయునా, వలదా? చెప్పవలెననుట నూటికిఁ దొంబదిపాళ్లు. వలదనుట మిగిలినపాళ్లు. కిరీటి వచ్చినంతనే సారథి తానూహించుచున్నట్లే కనిపించలేదు. అతనిని వచ్చితివా యని పరామర్శించెను. పిచ్చియుఁ బాటయుఁ గొంతసేపు మాటాడిన తరువాత నిద్దరును సముద్రమువైపు వాహ్యాళికిఁ బోయిరి. ఆ యిసుకపఱ్ఱమీద నేకాంతముగా నొకచోట గూర్చుండిరి. ప్రతినిమేషము సారథి తన కేదో చెప్పునని కిరీటి ప్రతీక్షించుచుండెను. సారథి చెప్పబోవుచున్నట్లుండెను. ఎంతసేపటికిని సారథి మొదలుపెట్టడు. కిరీటి చివర కిట్లనెను-"సారథిగారూ! మీరు నాకేదో చెప్పుటకు రమ్మంటిరి. సూర్యుఁడస్తమించినాఁడు. మన మింక బయలుదేఱిపోవలయును. చెప్పవలదనుకొన్నచో మానివేయుఁడు. నే నెందు కిట్లనుచుంటి ననఁగా మీరు బాధపడుచున్నట్లున్నారని తోచుచున్నది. నావలన మీరు బాధపడుట యెందులకు?"

ఈ మాటతో సారథికిఁ గనువిప్పయ్యెను. తన మొగములో బాధకనిపించుచున్నది కాఁబోలు. అయ్యో వాసంతీ! నీ వెటువంటి దుర్దశలో నుంటివి? పరమేశ్వరుఁడు నీ శరీరము నిట్లు స్పృశించె నేమి? దీనితో నాకు ముడిపెట్టె నేమి? నా మనస్సులో నింతవరకు పచ్చియాఱకపోవుట యేమి?

సారధి నిశ్చయించుకొనెను. అతఁ డిట్లు చెప్పనారంభించెను: "కిరీటీ! నీ వొక విధమైన కుఱ్ఱవాఁడవని నే ననుకొనుచున్నాను. లోకముకంటె భిన్నమైన ప్రవృత్తి కలవాఁడవు నీవు కావలయును. ఒక విలక్షణమైన ప్రవృత్తి కలవాఁడ వైనచో నామాటలు నీ కర్థమగును. లేనిచో నర్థముకావు. అర్థముకావుసరికదా, నేను పరిహాసభాజనుఁడనుగూడ నగుదును."

కిరీటి:- సారధిగారూ! ఒకవేళ మీరు చెప్పిన మాటలు నాకు విశ్వాసహేతువులు కావనుకొనుఁడు. ఐనను మిమ్ము నేను పరిహసించను. సృష్టిలో వేయిమందిలో నొకఁడు, కాదు పదివేలమందిలో నొకఁడు మీవంటివాఁ డుదయించును. గొప్ప యదృష్టవంతులు కలరు. ధనవంతులు కలరు. అధికారులు కలరు. పండితులు కలరు. కాని మీవంటి నటకుఁడు పుట్టఁడు. నటకుని గొప్పదన మేమి యని యడుగుదురేమో. అది వేషములు వేయుటలో లేదు. అనుభవవిశేషములో నున్నది. మిమ్ము నేను ప్రశంసించుచుంటి ననఁగా మీనాట్యమును నేను మెచ్చుకొనుచుంటి ననఁగా వేషములు వేయుదురని కాదు. ఆ సమయమునందు మీరు రసము ననుభవించి, యనుభవించుటయే కాదు తద్రసానుభూతి నితరులకుఁ గూడఁ గలిగింపఁగలిగిన శక్తి మీయందున్నదని. కొంద ఱనుభవించుట మాత్రమే చేయగలరు. మఱికొంద ఱు తా మనుభవించిన దాని నితరుల కందీయఁగలరు. అట్టివాఁడు మహాశిల్పి. వాఁడు నటకుఁడైన నేమి? కవియైన నేమి? చిత్రకారుఁడైన నేమి? మీరు నటకులగుట యాదృచ్ఛికము మీరు కవులైన నిట్టే చేసెడివారని నాయుద్దేశము. కాని కవులైనచో నిట్లు చేయలేరేమో యని నాయనుమానము. ఎందుకనఁగా నివి రెండు శక్తులు. ఒకటి తన యంతటఁ దా ననుభవించు శక్తి. రెండవది తన యనుభవ సర్వస్వమును బరుల కందించు శక్తి. రెండు శక్తులొకచోట నున్నప్పుడే వాఁడు మహానటకుఁడో, మహాకవియో, మహాగాయకుఁడో, మహాశిల్పియో యగును. కొందఱ కనుభవించు శక్తి యుండును. దాని నితరుల కందించెడు శక్తి యుండదు. కొందఱ కనుభవించెడి శక్తి యుండును. ఇతరుల కందించెడు శక్తికూడ నుండును. కాని వారు దాని నందించెడు మార్గము తెలిసికొనలేక పోవచ్చును. ఇతరుల కందించెడుశక్తి వాని కొక త్రోవవెంటఁ బరమేశ్వరుఁడు సిద్ధింపఁజేయును. వాఁ డింకొక త్రోవనంట నేగినచో నతని యాశక్తి ఫలించదు. మీరు కవులైనచో నింతవారు కాకపోయి యుండవచ్చును. అనఁగా మీయనుభూతి పరమార్థమును నాట్యము ద్వారానే పరుల కందింపఁగలుగుదురన్నమాట. అది భగవదుద్దేశము. ఇట్టి మహానుభూతి ప్రసన్నమునకు ఫలిత మేమని యడుగుదురేని చెప్పెదను. అట్టిదాని ఫలిత మెప్పుడును విస్తారముగా నుండదు. మీ యీ యనుభూతిని

# తె లి చే జు

మీ నాట్యముద్వారా యనుభవించి బ...కారము మేము ము...ము
కనిపించు చున్నాము. మొదటివా రుమాప... ...యుగాఁ
బరిపాకము గలవారై మీ నాట్య దర్శనము చేసి ... నిముసములో
సిద్ధిపొందినవారు. తెలిసిన విషయ మిదిగో యని పుస్తుపట్టినవారు సూరయ్య
గారు నాకొకకథ చెప్పెను. వశిష్ఠమహర్షి శ్రీరామచంద్రునితో నిట్లు చెప్పెనట.
వివిధ్యయైనను జరిగినంతమాత్రమునఁ బ్రయోజనము లేదు. అనుభవములోనికిఁ
దెచ్చుకొనవలయునని. శ్రీరామచంద్రుఁడు కామశాస్త్రమును జదివెనట. అందు
బరకీయాసంగమును మిక్కిలి సుఖప్రదమని వ్రాయఁబడెనట. ఏకపత్నీ
వ్రతుఁడైన శ్రీరామచంద్రునకుఁ బరస్త్రీభావ మెట్లు రావలయును? ఏకపత్నీ
వ్రతుఁడనఁగా రామచంద్రుని విషయములో నది యేర్పాటుచేసికొనిన నియ
మము కాదు. అది యాయనకు సహజము. ఆయనభావము పరస్త్రీమీదికే పోదు.
అయ్యూహ రానేరాదు. మరి కామశాస్త్రమునందలి యీ విషయము సుబోధక
మెట్లగును? అందుచేత శ్రీరాముఁడు తాను స్త్రీవేషము వేసికొని యన్యవారి
పురుషవేషము వేసి దాని మర్మమేమో తెలిసికొనవలయు నని యూహించె
నట. రాముఁడు స్త్రీవేషములో నుండెను. ఆ సమయమున వశిష్ఠాశ్రమములో
నొకఁడు, హృదయ పరిపాకము పొందినవాఁడు చనిపోవుచుండెను. భగవంతుఁ
డెవఁడో యని ధ్యానించినచో ముక్తుఁడగును. ప్రాణము నిముసములమీఁద
నున్నది. అతనికిఁ జూపించుటకు వశిష్ఠుఁడు శ్రీరామచంద్రుని సంస్మరించెను.
రాముఁ డప్పుడేకి యీ స్త్రీవేషముతో సిద్ధమయ్యెను. వశిష్ఠుఁడా చనిపోవుచున్న
వానికి రామచంద్రుని జూపించెను. వాఁడప్పుడు మోక్షపదగామి యయ్యెను.
మీ నాట్యదర్శనమునం దుమాపతిగా రట్టివారు. ఆకథ లయనాత సేవోద్దైన-.
అనుభూతిలోనికిఁ దెచ్చికొనుమనఁగా సద్విషయముగాని యసద్విషయము
కాదని వశిష్ఠులు చెప్పిరట.

"మీవలన బాగుపడిన రెండవ వ్యక్తి వాసంతి. ఆమెను గూర్చి నేను పలు
మాటలు విన్నాను. మీతో నోరు విడిచి చెప్పుచున్నాను. లోకసామాన్యముగ
నేను ననుమానపడితిని. నామన స్సెట్లున్నను నాయాత్మ యామెను గూర్చి
వినిన మాటలను విశ్వసించుటలేదు. ఆ విశ్వసించక పోవుటకుఁ గారణ మేదియు
కాదు. ఒక్కటే కారణము. ఆమె మీ రసానుభూతిని బొందిన స్త్రీయైనచో
లోక మనుకొనునట్టి ప్రవర్తన మామె యందుండదని. మూఁడవవాఁడను నేను.
సారధిగారూ! నేను మీ నాట్యమునే చూడనిచో నే నేమైపోయెడివాఁడనో
తెలియదు. మీ నాట్యదర్శనము నాలో దివ్యజ్యోతిని వెలిగించినది. పరమార్థ
భూతమైన యిట్టి రసానుభూతి పొందెడువాఁడు పదివేలమందిలో నొకఁడుం

డును. దానిని జూచెడి వారిలో గ్రహించెడివాఁడు నట్లే యుండును. కాని వో నింతటి పట్టణములో మీరింతటివారని తెలిసికొన్నవారు ముగ్గురా? ఇది మీయందు నాకు గల యభిప్రాయము. మీరు చెప్పఁబోవుమాట నేను పరమ రహస్యముగా నుంచెదను” అనెను.

## ౧౭

సారథి కొంతసే పట్లు కూర్చుండి కిరీటినిఁ గౌగిలించుకొనెను. ఆ కౌగిలింత చాలసేపు గౌగిలించుకొనెను. కిరీటి కాకౌగిలింత యానందదాయిని యయ్యెను. అంత గొప్పవాఁడు తన్నట్లు గౌగిలించికొనె ననఁగా నతని కానందమయ్యెను. సారథి గొప్పవాఁడు కాఁడు. ధనవంతుఁడు కాఁడు. అధికారి కాఁడు. ప్రసిద్ధుఁడైన పురుషుఁడును గాఁడు. అతఁడు మహానటుఁడు. రస సాక్షాత్కృతి పొందిన జీవుఁడు. లౌకికదృష్టితోఁ జూచినచో నసామాన్యుఁడు. అతఁ డెనినచోఁ బట్టణములో బెద్ద గౌరవము లేదు. అతని యాంతరంగికమైన యీ రససంపత్తినిఁ జూచి, యతని నాట్యకౌశలమును జూచి యతఁడు గొప్ప వాఁడనుకొనెడు కిరీటివంటి జీవులు సాధుజీవులు కాక మరెవరుందురు? తాను జీవితములో నెట్టివాఁడైనను సారథి పరుల కపకారము చేయఁడు. అతనికి ధనాశ లేదు. గొప్పవాఁడ ననిపించుకొందమన్న కోర్కె లేదు. అతనికంటె సాధు వెవఁడు? ఈరీతిగా వారి యీ సమాగమము సాధుసమాగమమయ్యెను. అట్టి సాధుసమాగమము జరిగినచోట దేవతలు సంగీతము పాడుదురు. దేవతలు నృత్యము చేయుదురు. వారి యందు దేవతలు వసింతురు. ఆ కౌగిలింతలోఁ గిరీటి తన శరీరము చల్లనగుచున్నట్లు భావించెను. సారథి శరీరములోనుండి కిరీటిశరీరములోనికి నేదియో సుధాస్రవంతి ప్రవహించిన ట్లతని కనిపించెను. ఈ సాధు పురుషుని శరీర సంపర్కముచేత దానెవో మారిపోవుచున్నా ననిపించెను.

సారథి యోగి కాఁడు. కొదనుటకు వీలు లేదు. కూర్చుండి హఠయోగాదు లభ్యసించి కొందఱు యోగు లగుదురు. ఇది పాతంజలమార్గము. మనోబుద్ధిను చేత, నేకవిషయమును నిరంతరభావన చేయుటచేతఁ గొందఱు యోగు లగుదురు. ఇది శాంకరమతము. ఈ శాంకరమత సంబంధమైన యోగమార్గమున లేశభావము సారథియందు లేకపోలేదు. అతఁడు తన జీవితమువంతయు నొక లక్ష్యముతో గడపెను. అతనికంటె జారుఁడు లేఁడు. కాని యతనికిఁ గల స్త్రీవాంఛ లోకమునందున్న స్త్రీ వాంఛతోఁ బోల్చినచో సహస్రాంశ లేదు. అతఁ డబద్ధములు చెప్పఁడు. అతనికి దురాశలు లేవు. కామక్రోధములు లేవు. అయ్యో!

నా జీవిత మెట్లయిన చిన్న దిగులు బోలెనంత యున్నది. చనిపోయిన తరువాత నే నేవుడు నన్న యతని యాలోచన యిక్కటముగా నుండెను. అతఁడు యోగమార్గములో లేఁడనట యెట్లు సాధ్యమగును? అతఁడు యోగి యగు నను టకో, కాదనుటకో కామక్రోధదూషితమైన లోకమున కేమి తెలియును? బట్టి బహిరాచార సంపత్తికి నిలకడ్డ లోకమునందలి వారి కేమి తెలియును? అతఁడు యోగి యన్న విషయము ఆధ్యాంతరవృత్తి మాత్రరసికుఁడైన పరమేశ్వరునకుఁ దెలియును. ఇట్టియోగము ప్రయత్నము లేకుండ సంకల్ప మాత్రముచేత ఫలవంత మగును. తనలోని శక్తి కిరీటియందు వ్యాపింపవలెనని యతఁడు ప్రొద్దుటి నుండి యనుకొనుచున్నాఁడు. ఇపుడు కిరీటి మాటాడిన మాటలతోఁ గిరీటియం దనధికమైన ప్రేమ కలిగెను. ఆ ప్రేమలోఁ గౌగిలించుకొనెను. ఆ కౌగిలింతలో పతి డనుకొనకుండ నతని సంకల్పము వ్యాపారవంత మయ్యెను. అతని లోని శక్తి కిరీటిలోనికిఁ బ్రవహింపజొచ్చెను.

ఈ సంగతి సారధికి దెలియదు. కిరీటికిని తెలియదు కాని తనలో నేదో మార్పు కిరీటి పొందఁజొచ్చెను. అది యిదమిత్థమని యతనికిఁ దెలియదు.

కొంతసేపైన తరువాత నిద్దఱును గౌగిలింత వదలి కొంచె మెడముగా గూర్చుండిరి. కిరీటి సారధితో నిట్లనెను: "మీరు నాకేమి చెప్పదలఁచుకొనిరో చెప్పనె లేదు."

సారధి "రేపు సాయంతనమున జెప్పెదను. చెప్పుటకు నా కింకొక విషయము తెలియవలయును. అదిగూడఁ దెలిసినతరువాతఁ జెప్పవలసిన విషయ మిది. నీతో నీనాఁడే చెప్పవలె ననుకొంటిని. అందులోఁ గొంత చెప్పి నీ వెటు వంటివాఁడవో తెలిసికొని సర్వమును చెప్పవలయునో, చెప్పరాదో నిర్ణయిం చుద మనుకొంటిని. కాని నీ విప్పు డనిన మాటలచేత నీవు సంపూర్ణముగాఁ జెప్పదగినవాఁడవని నాకుఁ దెలిసిపోయెను. కనుక నా మిగిలిన కొంచెము విష యమును గూడఁ దెలిసికొని సర్వమును రేపు నీకుఁ జెప్పెదను." అని లేచెను. వెంటనే కిరీటియు లేచెను. బాగుగాఁ జీకటిపడెను. ఇంచుమించుగా నొకరి నొకరు కౌగిలించికొనియే నడిచిరి. నడచినంతసేపు కిరీటి తనలోనికి సారధిలో నుండి యేదో యొక శక్తి వ్యాపించుచున్నట్లే తలచెను. కొంత సేపటికి సారధికిఁ గూడ నట్లనిపించెను. తనలోనుండి యేదియో సారధిలోనికిఁ బ్రవహించుచున్నది. అట్టి యూహ వచ్చుటయే కష్టము. అట్లనుభవించుట మఱియుఁ గష్టము. కాని యిద్దఱు విచిత్రమైన జీవులు తామట్టి యనుభూతి పొందుచున్నచో నది కాదనుట కెట్లు సాధ్యము? వారు దాని ననుభవించు

చుండిరి. అట్టి యనుభవము లోకములో మఱెచ్చటను లేదు. కనుక నట్టి యనుభవ మసంభవమనుట ప్రత్యక్ష ప్రమాణజ్ఞు లందురుగాక.

సారథి యింటిదగ్గఱ నిద్దఱును విడివడిపోయిరి. మఱునాటి ప్రొద్దునఁ గిరీటి రావలయును. వాసంతి వచ్చును. నాటకరచన సాగవలయును. కిరీటి వెడలిపోయెను. సారథి తన వాకిటిముందు చాలసేపు నిలుచుండి తాను శిరీషు నింటికిఁ బోయెను. అప్పటికిఁ గొంత ప్రొద్దుపోయెను. వాసంతీశిరీషులు భోజనము చేసి పండుకొనిరి. సారథి పోయి తలుపు తట్టెను. శిరీషుఁడు తలుపు తీసెను. ఇంత ప్రొద్దుపోయి వచ్చితి వేమి యనెను. తండ్రిమాటలు వాసంతి విని గదిలో నుండి బయటికివచ్చెను. సారథి వాసంతితో "నీతో మాటాడవలయునని వచ్చితిని. నాయింటికిఁ బోదము వత్తువా? మఱల నిన్నుఁ దీసికొనివచ్చి యిచట దిగవిడిచెద" ననెను. వాసంతి బయలుదేరెను. శిరీషుఁడౌననలేదు, కాదనలేదు.

శిరీషునకుఁ గమల వెళ్లిపోయినప్పటినుండి దిగులుగా నుండెను. తన యూహేమి, కమలయూహేమి? రంగనాథునకుఁ, దనకుఁ బెద్దస్నేహము లేదు. వట్టి పరిచయము. కమల మైనారిటీ వెళ్లనిపిల్ల. వారు తనమీఁద నభియోగము తేవచ్చును. ఒకవేళ కమల గర్భవతియైనచోఁ దానేమి చేయవలయును? ఆమెను వివాహము చేసుకొనునా? చేసికొనినచో వాసంతి యేమగును? అతనికి మఱల నింకొక యూహతోఁచెను. వారిదిది నాటకమాడుచున్నారు. తన యాస్తి మీఁది చూపుతోఁ దామే కమలను దమయింటికిఁ బంపించిరి. ఇప్పుడిది యొక క్రొత్త యెత్తు. అంత యిష్టములేనివారైనచోఁ గమల గడచిన యీ మూఁడు రోజులే తన యింటికి వచ్చెనా? అదివఱకు నెలనాళ్లనుండి వచ్చుచున్నది. ఇన్నాళ్ళనుండి లేని యభ్యంతర మీనాఁ డేల రావలయును? ఇది యంతయు వారి నాటకము. ఒకవేళ నిది యర్జునరావు వేసిన యెత్తేమో. తాను పెద్దపిల్ల నెటు చేసికొనెనో, రెండవపిల్లను దానటు చేసికొనుటకు నర్జునరావు పన్నిన పన్నుగడ కావచ్చును. ఐనను దల్లిదండ్రులకు దెలియకుండ నుండునా? ఏది యెట్లయినను కమలను వారు బాధపెట్టుదురేమో! తా నది సహించలేఁడు. వారి యింటికిఁ బోయి కమలను దీసికొని రావలయునని యున్నది. తాను వెళ్లినచోఁ గమల వెంటనే వచ్చివేయును. అందులో సందేహము లేదు కమల తన్ను ప్రేమించినది. ఈ రెండు మూఁడు దినములలో మీరే నాకు భర్తలని యెన్నిసార్లనినది! నేను మిమ్ము వదలి మఱియొకరిని బెండ్లియాడ నని యెన్నిసార్లనినది! అది సాధ్యము కానిచో నాత్మహత్యయైనఁ జేసికొందును కాని మావాండ్రు మఱియొకరిని బెండ్లియాడు మనినచో నే నొప్పుకొనని కమల గట్టిగాఁ జెప్పినది. కానితాను వారి యింటికిఁబోయి "కమల నా భార్య. పంపివేయుఁడు." అని యడిగినచో

గమల నింటిలోఁ బెట్టి తాళము వేసి బిగింతురు. తా నక్కడ నప్రతిష్ఠ పడిపోవును. ఇన్నాళ్లు మర్యాదగా బ్రదికినాఁడు. అందుచేత నొక్కటియే యుపాయము. కమలను దొంగతనముగా లేవఁదీసికొని రావలయును. తాను మఱలఁ బంపించఁడు. వాఁడభియోగము తెచ్చినచోఁ దెచ్చికొననిమ్ము. న్యాయస్థానము వారు జరిమానా విధించినచో దానిని గట్టును.

ఇట్టి యూహలతో శిరీషుఁడు పవలెల్ల బాధపడుచుండెను. అతఁడా నాఁడు భోజనము సరిగాఁ జేయలేదు. అతనికి నిద్రపట్టుటలేదు. అట్టి స్థితిలో సారధి వచ్చి వాసంతినిఁ దనవెంట దీసికొనిపోఁగా నతఁడేమియు నూహింపలేదు. వారిద్దఱు వెడలిపోయినతరువాత నతని కీయూహ వచ్చెను. అర్ధరాత్రమువేళ వచ్చి తన కూతును సారధి తీసికొనిపోఁగాఁ దా నెట్లూఱకుండెను? ఇదివఱ కెన్నఁడు రాని యూహ యతనికి మఱునాఁడు వచ్చెను. మూన్నాళ్లు కమలతోఁ దాను కలసియున్నాఁడు; తనకు, నామె కెట్టి సంబంధ మేర్పడినది? వాసంతికి, సారధికి నట్టి సంబంధ మేల యుండఁగూడదు? సారధికి వాసంతికి నంత వయస్తారతమ్య మున్నదికదా. సారధి యట్లు చేయునా? కమలకుఁ, దనకు మాత్రము లేదా? తా నాలోచించి యూఱకుండెను? సారధి వాసంతికిఁ దండ్రి వంటివాఁడు. తాను మాత్రము కమల కట్టివాఁడు కాఁడా? కాఁడు. రంగనాధమునకును దనకును చెలిమిలేదు. కమలను దాను పసిబిడ్డనువలె నెత్తికొని పెంపలేదు. పెంచుట మిక్కిలి ప్రేమము కలిగించును. కనుక సారధికి వాసంతికి నిట్టి సంబంధ ముండదు. ఐనను పట్టణములోఁ బద్వేషయుక్తమైన యపనింద లేకపోలేదని యతనికిఁ జూచాయగాఁ దెలియును. అతఁడు దాని నెప్పుడు విశ్వసింపలేదు. అట్టి సంబంధమే యున్నచో సారధి వచ్చి యింత బహిరంగముగాఁ దన కూతును వెంటఁ దీసికొనిపోవునా? అందుచేత నుండదు. వాసంతీ సారధులను గుఱించి యిట్టి యూహ యెప్పుడును దనకు రాలేదు. ఈనాఁ డెందుకుఁ వచ్చినది? తాను గమలతో సౌఖ్యము కలిగించుకొన్నాఁడు గనుక వచ్చినది. లోకము తన యనుభవమునుబట్టి యితరుల నూహించును. తా నిప్పు డీ స్థితిలో నున్నాఁడు గనుకఁ దన కిట్టి యూహ వచ్చెను. వాసంతీ సారధుల కిట్టి సంబంధము లేదు. ఇంత యాలోచనయు నైనతరువాత శిరీషుఁడు దానుకూడ సారధియింటికిఁ బోదమనుకొన్నాఁడు. వెళ్లినచో దాని రహస్యము తెలియునుగదా. ఒకవేళ సారధి యింటిలో వీరిద్దఱు కామప్రవృత్తులైయున్నచోఁ దాను-చూచి యేమి చేయును? ఏమి చేయునా? మాటాడకుండ నూఱకుండును. వాసంతి నింటికి దీసికొని వచ్చును. ఆమె నిదురపోవుచుండఁగా నామెను బొడిచి చంపును. ఆమె కాలు సేతులు కట్టి నోట గుడ్డలు గ్రుక్కి నూతిలోఁ బాఱవేయును. లేదా యామె

చేత బలవంతముగా విషము త్రావించును. ఇట్లూహించుచున్న శిరీషునకుఁ గనుల తల్లిదండ్రులుకూడ నామె నట్లే చేయవచ్చు నన్నయూహ పోలేదు.

వంటకత్తియ పడమటింటిలో నిదురపోవుచుండెను. ఆమె పదియేండ్ల నుండి వంటయింటిలోననే నిదురపోవుచుండును. తెల్లవారిన తరువాతఁ దలుపు తీసికొని యామె సావడిలోనికి వచ్చునుగాని గదిలోనను, సావడిలోనను దొంగలు పడి దోచుకొనిపోయినను సరే యామె వెలికిరాదు.

శిరీషుడు వీధి తలుపునకు తాళము పెట్టి బయలుదేరెను. అతఁడు పోవుచుండగా దారిలో నెవరో నిలిపి కొంతసేపు మాటాడిరి. ఇతనికిఁ దొందరగా వెళ్ళవలయునని యున్నది. ఆ మాటాడెడివాడు వదలిపెట్టడు. కొందరు మాటాడినచో "వారిని నిలఁబెట్టితిమే, వారి కేమి పని యున్నదో" యన్న విచారణ చేయరు. నాకుఁ బనియున్నది, పోవలయునని చెప్పినగూడ నిదిగో యీయొక్క మాట విని పొమ్మని నిలబెట్టుదురు. ఆ యొక్క మాట యనుసరికి నైదునిముసములు పట్టును. నీ వన్నిసార్లు పోవలయు నన్నను వాఁడు "ఇదిగో యీ యింకొక్క మాట వినిపో"మ్మనును. అట్టివారు కొందరుందురు. వారిలో నొకఁడు శిరీషు నప్పరాత్రమున బట్టుకొనెను. శిరీషుడు మొగమాటి. ఈబాధ మొగమోటము కలవారికే యెక్కువ. అట్లు తెలియకుండ శిరీషు డచ్చట నొక గంటసేపు నిలుచుండెను. ఇంటిలోఁ జేసిన యూహతోడనే యరగంట ముప్పావుగంట యయ్యెను. శిరీషుడు చివరకు వానిని వదిలించుకొని బయలుదేరెను. అతఁడు సారథి యింటి సందు మలుపు తిరిగెను. వాసంతియు, సారథియుఁ దన కెదురుగా వచ్చుచుండిరి. ఇంక దానేమి చేయును? ముగ్గురును దిరిగి శిరీషు నింటికి వచ్చిరి. సారథి వారిని దించి వదలిపోయెను.

మఱునాఁటి ప్రొద్దున సారథియు, గిరీటియు, వాసంతియు గలసికొనిరి. నాటకరచన విషయము ప్రసంగించుచుండిరి. వాసంతి మనస్సులో నాటక విషయ మున్నది. సారథిమనస్సులో నాటకవిషయము లేదు. కిరీటిమనస్సు నాటకము మీద లేదు. నాటి సాయంతనమున సారథి తన కేమి చెప్పఁబోవుచున్నాడో యతని మనస్సు దానిమీదనున్నది. ఎంతసేపటికి సారథి యావిషయము నీవిషయము మాటాడునుగాని నాటకమును సాగనీయఁడు. సారథి రాత్రి వాసంతితో మాటాడెను. వాసంతి కిరీటిని దాకినప్పు డామె పొందిన యనుభవము సారథితోఁ జెప్పెను. ఆ యనుభవస్వరూపము తా ననుకొనినట్లేయున్నది సారథికి. రాత్రి తాను గిరీటియుఁ గలిసికొన్నప్పుడు తనలోనుండి యేదియో యొక ప్రవాహము కిరీటిలోనికిఁ బ్రవహించుచున్నట్లు తోచినదికదా ఇప్పుడు వాసంతి కిరీటిని స్పృశించినచో నెట్లుండునో తెలిసికొనవలయునని యాతని

యుద్దేశ్యము. మార్పున్నచో సారధి తన ప్రయత్నమును గొనసాగించవచ్చును. నాటి సాయంకాలమున కిరీటితోఁ జెప్పఁబడిన మాటలన్నియు నిస్సందేహముగా జెప్పవచ్చును. వాసంతిచేత కిరీటిని స్పృశించునట్లు చేయవలయును. నిన్న నామె తనయంతట దాను కిరీటినిఁ దాఁకినది. నేఁ డెట్లు తాఁకును పరిస్థితి యేర్పరచవలయును నిన్న కిరీటి నెందుకు స్పృశించినది? అతడు తన్ను మిక్కిలి ప్రశంసించగా నామె యతని స్పృశించినది కిరీటి తన్నంతగాఁ బ్రేమించుచున్నాఁడని, గౌరవించుచున్నాఁడని యామె కతనియందు స్నేహమును, జనవును కలిగినది. సారధి కేయూరాహ వచ్చినవెంటనే కిరీటితో నిట్లనెను: "ఏమయ్యా కవీ! నిన్న సాయంకాలమున నీవు నన్ను గురించి మిక్కిలి గొప్పగా జెప్పితివి. ఆమాట లన్నియు నిజమేనా? నేను నమ్మవచ్చునా? అప్పుడు నీవు, నే నిద్దఱమే యుంటిమి. సాక్ష్యమే లేదు. ఇప్పుడిచ్చట వాసంతి సాక్ష్యముగా నున్నది. నేను కౌముదీహాసనాటక మాడినపుడు సభలోనుండి యర్జునరావుగారు తానొక్కమాట మాటాడలేదు. తరువాత నొకనాటిరాత్రి రహస్యముగా మేమిద్దఱముగలసినపుడు "మీరు మహానటులు" అని నన్నుఁ బ్రశంసించెను. ఆయన నన్నిట్లు బ్రశంసించెనని నే నెవ్వరితో నైనఁ జెప్పినచో నెవ్వరును నమ్మరు. అర్జునరావంతటి నటుడు సారధినిఁ బ్రశంసింపవచ్చునా యని. ఒకవేళ నర్జునరావు నాటకమైనంత నే నన్ను సభలో బ్రశంసించెననుకొనుము. నలుగురును నేను గొప్పనటుడ ననుకొనరు. మర్యాదకోసమట్లు చెప్పెననుకొందురు. నేను గొప్పనటుడ నని నిజముగా నతని యభిప్రాయమయినచో, నతనికి యథార్థమైన ప్రవర్తన యున్నచో నతఁడు నాపరోక్షమునందుఁ బ్రసంగము వచ్చినపుడీమాటలు చెప్పవలయును. అతఁ డట్లు చెప్పఁడు. చెప్పినచో నతని గొప్పదనము చెడిపోవును. ఒకవేళ నేను నిజముగా నటుడను కానియే యతని యుద్దేశమేమో. ఏకాంతముగా నాతో నేను సంతోషించవలయునని చెప్పెనేమో. నీ వర్జునరావువంటివాఁడవుకా వనుకొందును. నిన్నఁ జెప్పిన మాటలు నిజమో కాదో యని నా కనుమాన ముండుటలోఁ దప్పు లేదుగదా" యనెను. కిరీటికిఁ గనులు జేవురించెను. మొగములో నావేశము వచ్చెను. అతడు కోపముతో లేచిపోవునా యన్నట్లుండెను. సారధి వెంటనే గ్రహించెను. అతడు నవ్వుచు నిట్లనెను: "నీకుఁ గోపము రావలయునని కాదు; నీ వామాటలు మరలఁ జెప్పినచో నేను వినవలయునని."

వాసంతి యీ చమత్కారమును జూచుచుండెను. కిరీటికి వచ్చిన యీ న్యాయమైన కోపమున కామె యెంతయు సంతోషించెను. నిన్నటినుండియు నామెకుఁ గిరీటిమీఁద బ్రసన్నత యేర్పడెను. దీనితో నామె ప్రసన్నభావము

మఱింత వృద్ధియయ్యెను. అపుడు కిరీటి ఇట్లనెను: "సారధిగారూ! ఈయూరిలో మనము నలుగురమే యున్నాము. మీరు, ఉమాపతిగారు, వాసంతి, నేను. మీ మహాభినయవేత్తలము మేము మువ్వురము. నాట్యరసమూర్తి మీరు. నిన్నఁ జెప్పినదే మరలఁ జెప్పుచున్నాను. ఈవాసంతికిఁ గోపము వచ్చినను నాకు భయము లేదు. రసస్వరూప మిట్టిదని సిద్ధాంతతః సంపూర్ణముగాఁ దెలిసికొనియుండి దాని సంపూర్ణస్వరూపము మీయందుఁ జూచినవారు ఉమాపతిగారు. మీ నాట్యమును జూచి తన మనస్సునకు దెలియకుండ నాత్మయందుమాత్రమే గ్రహించి క్రమక్రమముగా బాగుపడినది వాసంతి. నేను మీ నాట్యమును జూచి, రసస్వరూప మిది; దానినిర్ణయమిట్టిదని యాలోచించి తెలిసికొనినవాఁడను. నాల్గవ వ్యక్తి యీపట్టణములో లేదు. ఇది నావిశ్వాసము. నేను మిమ్ముఁ బొగడుటకు జెప్పుటలేదు. మిమ్ముఁ బొగడవలసిన యవసరము నాకు లేదు. నేనూఱకే ఎవ్వరిని బొగడను!" అప్పుడు వాసంతి యిట్లనెను: "అనఁగా కిరీటీ, ఆయన నాట్యస్వరూపము నాయాత్మకుఁ దెలిసినదని గాని నామనస్సునకుఁ దెలియలేదని గదా నీయభిప్రాయము? మనస్సుతోఁ దెలిసినదే తెలిసినది. అందుచేత నాకుఁ దెలియ లేదని యర్థము."

కిరీటి—కాదు, ఆత్మతోఁ దెలిసినదే తెలిసినది. మనస్సుతోఁ దెలిసినదే తెలిసినది కాదు. ఆత్మతోఁ దెలిసికొనుటకు మొదట మనస్సుతోఁ దెలిసికొనుట మెట్టు. ఇది శరీరధారుల మార్గము. సామాన్యజీవుల మార్గము. ఉత్తమ జీవులు వెంటనే యాత్మతోఁ దెలిసికొందురు. నీవు త్తమజీవి వన్నమాట. నీమనస్సునకుఁ దెలియదు. నీయాత్మకుఁ దెలియును.

వాసంతి—లౌకికముగా నేను తెలివితక్కువదాననని యేకదా నీయర్థము?

కిరీటి—నిస్సందేహముగా నదియే నాయుద్దేశము వాసంతమ్మగారూ,

వాసంతి—నన్ను 'గారూ' యని పిలువవద్దు. మన మిద్దఱము సారధి యాత్మలోని యాత్మలము. నిన్ను నేను గౌరవించుట లేదు. నీవు నన్ను గౌరవించవద్దు. వాసంతీ యని పిలువుము.

కిరీటి- నా కలవాటైనది. నాకు వెంటనే రాదు. 'గారూ'యని పిలుచుచున్నను నిజానికి నీయం దంతటి గౌరవము లేదు. నే నొక విచిత్రమైన వ్యక్తిని. వెనుకటికి రావణుఁడు కైలాసపర్వతమునకుఁ బోయి సాక్షాత్పరమేశ్వరియైనను స్త్రీకనుక పార్వతీదేవికి నమస్కరింపలేదట. నే నట్టువంటివాఁడను. నీ సంగీతమునకుఁ జెవులుకోసికొనెడువారిలో నే నొకఁడను. సారధిని భగవంతునివలె నీ వారాధింతువుకనుక నీ వన్నచో నాకు గౌరవము. కాని లౌకికముగా నీవు

తెలివితక్కువ దానవు. నీకు మనస్సు లేదు. నీ వాత్మలో నున్న విషయమును మనస్సునకుఁ దెచ్చికొని విచారింతువు కాని మనస్సులోని విషయమును దీసికొనిపోయి యాత్మానుభవము పొందలేవు. జీవుఁడు బాధపడుటకు మనస్సులోని విషయము నాత్మలోనికిఁ దీసికొనిపోయి యనుభూతి పొందవలయును. ఆత్మలోని విషయమును మనసులోనికిఁ దెచ్చికొనుట లోకానుభూతి. మనసులోని విషయము నాత్మలోనికిఁ దీసికొనిపోవుట రసానుభూతి. నీవు దిగివచ్చుచున్నావు నేను పైకిఁ బోవుచున్నాను. ఇది నీకును నాకును భేదము. నిన్నుఁ జూచినచో నా కట్లనిపించుచున్నది. నన్ను రెండేండ్లనుండి చూచుచున్నావు నీ వేమియో తెలిసికొనవలయునని ప్రయత్నించుచున్నావు. నీపైని నాయందు స్పందనకు లగ్నమైనదో నాకుఁ దెలియదు.

వాసంతి దిగ్భ్రాంతినంది కిరీటివంకఁ జూచుచుండెను. ఆమె కిరీటివంక నట్లే రెండుమూడు నిముసములు చూచెను. చివరి కిట్లనెను: "కిరీటీ! నీ వెవ్వఁడవో భగవంతుఁడవో కాని మనుష్యుఁడవు కావు. నా సంగతి నీ కింత బాగుగా నెట్లు తెలిసినదో నాకుఁ దెలియదు. ఈ సంగతి సారథికూడ గ్రహించలేదు."

కిరీటి- నే నెందుకు గ్రహించితి ననఁగా నీయగాధమైన యాత్మస్వరూపమును, బరిణామమును బొందిన నా యాత్మయొక్క స్వరూపమును రెండు నొక్కటి కనుక నేను గ్రహించితిని. నీవు తెలియకుండ సారథియాత్మను దర్శనమాత్రముచేతఁ దెలిసికొంటివి. నేను విచారించి యతని యాత్మను దెలిసికొంటిని. పర్యవసానము రెండు నొకటే.

వాసంతి- నీవు చెప్పినది చాల నిజము. నీవు చెప్పిన దంతయు నాకిపుడు తెలియుచున్నది. ఈ యాలోచనను నే నొక్కర్తెను జేసికొనుచున్నాను. చాల శ్రమపడుచున్నాను. ప్రతి చిన్నవిషయమును తెలిసికొనుటకు బాధపడుచున్నాను. నాకుఁ దోడులేకుండ నున్నది. నాకిది యిది యని చెప్పెడువారు లేరు. నే నొకవిషయము ననుభూతిలోనికిఁ దెచ్చికొనుటకు లౌకికముగాఁ జేయరాని పనులు చేయవలసి వచ్చుచున్నది.

అని వాసంతి విచారముతోఁ గూర్చుండెను. సారథి యాశ్చర్యపోయెను. ఆమె విచారపడుట తా నిదివఱ కెన్నఁడు నెఱుఁగడు. ఈమె యిన్నాళ్లు మనుష్యురాలు కాదు. ఈమె మానవస్త్రీగా మాఱిపోవుచున్నది అంతట సారథి తోటలోని కేదో మేక వచ్చి మొక్కలు కొఱుకుచుండుట చూచి దానినిదోలుటకు వెడలిపోయెను. వాసంతియొక్క విచారము క్రమముగా దుఃఖములోనికి దిగెను. ఆమె కన్నీళ్లు పెట్టికొనుచుండెను. కిరీటి యామెను జూచెను. తా

నన్న మాట లంత యథార్థమగుట యాతని కాశ్చర్యము కలిపించెను. తా నెదో యాదృచ్ఛికముగా ననినాడు. అతఁడు రెండేండ్లనుండి యుమాపతిదగ్గఱకుఁ బోయి యెన్నో విషయములు వినుచుండెను. ఉమాపతి వలదన్న నతని వద్దకుఁ బోవుచుండెను. అతఁడు చదివికొని రమ్మన్నాఁడు. ఇతఁడుమాత్రము వదల లేదు. ఇతఁడు పాశ్చాత్యగ్రంథములు చదువఁడు. సర్వదా యాంధ్రకావ్యములను జదువును. అర్థతాత్పర్యములతో నున్న సంస్కృతకావ్యములను జదువును. ఈ రెండేండ్లలోఁ గిరీటి చదివిన కొంచెము నుమాపతియొక్క సంసర్గము చేతఁ బ్రదీప్తముకాఁగా నొక మంచి యూహాశాలియైన కుఱ్ఱవాఁ డైనాఁడు. ఉమాపతి మనస్సులోని యగ్ని తన్నంటుకొనినది. అతనినంటుకొనినదని కిరీటికిఁ దెలియు. నుమాపతికిఁ దెలియును. ఈ సంగతి సారథికిఁ దెలియదు. కిరీటి యీ రెండుదినములనుండి మాటాడుపైఖరి క్రొత్తగా నున్నది. మిక్కిలి వివేకవంతముగా నున్నది. ఈ యేణ్ణర్థములోఁ గిరీటి పెరిగినాఁ డనుకొనెనుగాని యిది యుమాపతి ముద్ర యని సారథి యనుకొనలేదు.

ఆత్మ మేలుకొన్నచో నది చిత్రచిత్రముగా మాటాడించును. అట్టి పురుషుఁడు మన స్సందుకొని బహువిషయములను మనస్సునకుఁ దెలిసిన వానిఁగుఱించి మాటాడినట్లు మాటాడును. ఉమాపతి సంసర్గము చేతఁ గిరీటి యాత్మ మేల్కొన్నది. ఈ రహస్యము కిరీటికిఁగూడఁ దెలియదు. ఇది యతని మొదటి యనుభూతి. తాను తనకుఁ దెలియకుండ వాసంతియొక్క యథార్థస్వరూపమును నోటితోఁ జెప్పెను. వాసంతి తా నంగీకరించినవెంటనే యతనికి మిక్కిలి యానందమయ్యెను. తాత్కాలికముగాఁ దా నొక మహాపురుషుఁడె ననుకొనెను. వాసంతి పరస్త్రీ. తాను ముట్టుకొనరాదని మఱచిపోయెను. మఱచిపోవుట కాదు. మఱచిపోయిన ట్లుండెడు. మఱచిపోలేదు. జ్ఞాపకము నుంచలేదు. ఆమెను విచారపడ వలదని యోదార్పవలయు ననిపించెను. ఆమెను దాఁకవలయు ననిపించెను. అపుడు సారథి యచట లేకపోవుటచేతఁగూడ నది వీలయ్యెను. ఒకట యామె విచారము; రెండు సారథి లేఁడన్న ధైర్యము; మూఁడు తా నింత మహావిషయమును గ్రహింపఁగలిగితినన్న యొక యానందము; నాలు గామె యీ పరిస్థితిలో విచారించదన్న ధైర్యము; ఐదు తాను భాగశః తనయొడలు తాను మఱచిపోవుట. ఈ కారణములచేత నతఁ డామె చేతిమీఁదఁ జేయివైచి “వాసంతీ, దీనికి విచారపడ నక్కఱలేదు. నీ వెవ్వనినైన వివేకవంతుని వివాహమాడినచో వాఁడు నీకు లోకానుభవమును గలుగఁజేయును. నీ యాత్మ యిదివఱకే పరిపక్వమై యున్నది. మనస్సుద్వారా యాపరిపాకమును నిర్ధారణము చేసికొనవలయును. అప్పుడు సృష్టిలో నీకంటె ధన్యజీవిని యుండదు” అనెను.

ఆమె యా యా వేళములో నతనిమీఁద దనచేయి వేసెను. ఆచనవుకలన నతఁ డామెమీఁద దనచేయి మఱికొంత వ్యాపింపఁజేసెను. కౌఁగిలించుకొనలేదు కాని యిద్దఱు నించుమించుగాఁ గౌఁగిలించుకొన్నట్లయినది. వాసంతి కప్పుడు స్మృతివచ్చినది. వెంటనే గ్రహించినది. అతని హస్తస్పర్శ తొలుత నుష్ణముగా లేదు. ఇప్పుడు కొంచె ముష్ణముగా నున్నది. ఆమె వెంటనే యతనిచేయి తీసివేసి తాను దూరముగాఁ గూర్చుండెను. కిరీటి భయపడెను. ఆమె యిట్లూహించ నారంభించెను. అతనిస్పర్శ తొలుతనుండి యుష్ణముగా నుండె నిప్పుడు తాను గుర్తుపట్టినదా? తొలుత శీతముగా నుండెనా? తన కర్థముగాలేదు. ఇంతలో సారథి వచ్చెను.

సారథి వచ్చినంతనే వాసంతి యిట్లనెను: "సారథీ! రాత్రి మనమిద్దఱము మాటాడితిమి. కిరీటి యొక్క స్పర్శనుగురించి నన్నడిగితివి. నేను నీతోఁ జెప్పితిని. నేఁ డతని స్పర్శ నిన్నటిదానికంటె భిన్నముగా నున్నది. నిన్న నీ వతనిని దాఁకియున్నపుడు చల్లగా నుండె నీ వతనిని వదలిపెట్టిన వెంటనే వెచ్చగా నున్నదని నీతోఁ జెప్పితినికదా. ఇప్పుడు నీవు దూరముగాఁ బోయినపుడు మే మిద్దఱ మొకరినొకరము తాఁకితిమి. తొలుతఁ గొంతసేపు నేను విచారించలేదో యేమో తెలియదు. వేడిగానున్నట్లు లేదు. కొంతసేపటికి వేడి యనిపించినది" యని కిరీటితో "నీవు మఱల నన్ను ముట్టుకొను" మనెను. అతఁ డేమియుఁ దెలియక దిగ్భ్రాంతి పొంది కొంతసేపు సారథి వంక, కొంతసేపు వాసంతి వంక జూచి, సారథి తాకుమని సన్న చేయఁగా నతఁ డామెను స్పృశించెను. మఱల నామె యతనిని విస్తారముగా స్పృశించెను. రెండు మూఁడు నిమేషము లతని స్పర్శ వెచ్చగా ననిపించలేదు. తరువాత వెచ్చగిల్లెను. ఆమె సారథితో నీ సంగతి చెప్పెను. సారథి యామెతో "క్రమక్రమముగా నతని స్పర్శ నీకు సంపూర్ణముగా శీతముగా నుండు"నని చెప్పెను.

వాసంతి "మఱి నాటకము వ్రాయుట మాట యే"మనెను.

సారథి "క్రొత్తనాటకము వ్రాయ నవసరములేదు. ప్రాత నాటకమే యాడుద" మనెను.

వాసంతి "యట్లయినచో 'మోహినీ రుక్మాంగద' యాడవలయు" ననెను.

సారథి యంగీకరించెను.

ఆనాటి సాయంతనమునఁ గిరీటియు, సారథియు వాహ్యాళిపోయి యచట గూర్చుండిరి. వాసంతియొక్క సర్వవృత్తాంతము సారథి కిరీటికిఁ జెప్పెను. కిరీటి యాశ్చర్యపోయెను. అతనికిఁగూడ జమీందారుమీదఁ గోపము వచ్చెను.

అతని కోపమును సారథి చూచి "నీకుఁ గోప మెందుకు వచ్చినదో తెలి
యునా? వాసంతిమీఁద నీకుఁ బ్రేమ లేదు. వాసంతియు నీవు నొక్కటే.
నీ వామెను ప్రేమించుచున్నావు. ఆమె నిన్ను నాద్వారా ప్రేమించుచున్నది.
నీవైన నామెను నాద్వారానే ప్రేమించుచున్నావు. ఆమె కింతేఁగాని ప్రేమ
యనగా నేమో తెలియదు. ఉత్కంఠతో నొక పురుషుని వాంఛించుట యామె
యెఱుఁగదు. ఆమెయందా యుత్కంఠ నీవు పెంచఁగలిగినచో నామె నీ
భార్య యగును. ఆమె యద్భుతమైన పూవు. ఆపూవు నెవ్వరును తాకలేదు. ఆమె
యితరులచేతఁ దాకఁబడుట యెట్టిదో తెలియని స్త్రీ. నీ వామెనుగూర్చి నిజము
చెప్పితివి. ఆమె కనుభూతి జ్ఞానము తన యాత్మలోఁ గలదు. ఈ వాంఛ మన
స్సులో వ్యాపించలేదు. అది మనస్సునందు సర్వత్ర వ్యాపించినపుడు లోకము
వలెనే యామెకూడ ప్రవర్తించును. ఆమె స్త్రీ పురుష సంబంధమైన పరిజ్ఞాన
మును మనసుతో నూహించినది. కాని దానినుండి యామె కుత్కంఠ కలుగలేదు.
ఆ యుత్కంఠ కలుగుటకు నామె శరీర స్పర్శ యామె కిష్టమువచ్చుచున్నది.
ఆ స్పర్శ నావిషయములో నష్టముగాదు. నే నామెకుఁ దండ్రివంటి వాఁడను,
చెడిపోయినవాఁడను, వృద్ధుఁడను. ఆమెకు, నాకు సంబంధములేదు. భగవంతు
డామెకీ యన్యాయము జేసెను. నాకీశిక్ష చేసెను. నీ స్పర్శ నేఁ డామెకు
నిన్నటిదానికంటె నధిక శిశిరముగా నున్నది. ఎక్కువకాల మోర్చినది. దానికి
గారణము నీయాత్మయు, నా యాత్మయు నొక్కటియే. అన్ని యాత్మలు నొక్క
టియే కాని ప్రత్యేకలక్షణవిశిష్టుఁడైన జీవుఁడు లోకమునందుఁగూడ సధర్ము
డైన జీవునితోఁ గలియును. మన యిద్దఱి జీవుల నడుమఁ జాల సామ్య మున్నది.
ఈ సామ్యమే దానికి గారణము" అనెను.

కిరీటి- నిన్న నా స్పర్శ నెచ్చగా నుండి నేఁడు కొంతసేపు శిశిరముగా
నున్నదనుటకు నే నిట్లూహించుచున్నాను. నిన్న సాయంతనమున మన మిరువు
రము కౌఁగిలించుకొనినపుడు మీలోనుండి యేదో శక్తి నాలోనికి ప్రవహించు
చున్నట్లు నే ననుకొన్నాను. అదియే కారణ మనుకొందును.

సారథి-నిజమే. నేను నట్లే యనుకొన్నాను. కనుక నాలోని శక్తి నీలో
నికి సంపూర్ణముగాఁ బ్రవహించునట్లు చేయవలయును. ఆమెకు నీ స్పర్శ సర్వ
థా శిశిరముగా నుండునట్లు చేయవలయును. నీ శరీర మామెకు స్పర్శసహమైన
చో నామెను పరిష్వంగచుంబనాదులచేత, చక్కిలిగింతలచేత నామె మనస్సును
మేల్కొలుపవచ్చును. మనసు మేల్కొన్న తరువాత నామె నీయందే రమిం
చును. నే నింకొకటికూడ నాశపడుచున్నాను. నాలోనున్న యీశక్తి సర్వము
నీయందు సంలగ్నమైన తరువాత నా శరీర మామెకు శిశిరముగా నుండక

పోవచ్చును. అప్పుడు నీమార్గ మవ్యాహతముగా నుండును. ఓయీ! కిరీటీ! సృష్టిలో నీకంటె సదృశవంతుఁ డుండఁడు. వాసంతివంటి యనాఘ్రాతపుష్పము, అనాస్వాదిత మధురసము, కరాలూనకిసలయము, అనావిద్ధరత్నము, అఖండపుణ్యఫలము భార్యయగుటకంటె బహుజన్మమెత్తిన తరువాత వాంఛింపదగిన దేమున్నది? ఆమెకు నేను దగను. నేను శిథిలదేవాలయమువంటివాఁడను ఎక్కడికక్కడ పడిపోయి విగ్రహములన్నియు బగిలిపోయి పునర్నిర్మాణము చేయుటకుగాని, తిరిగి సంప్రోక్షణము చేయుటకుగాని తగనివాఁడను. నీశరీరము క్రొత్త దేవళము. ఇచట నీకు సందేహముకూడ నక్కఱ లేదు. లోకమునకు మనస్సు ప్రమాణము. అట్టున్న యాత్మయు నిట్టున్న దేహమును లౌకికమైన మనస్సును సమర్థించుచుండును. ఉత్క్రాంతమైన స్వర్గానుభూతిచేత నామె యాత్మ నాయందు లగ్నమైనదనుటకు వీలులేదు. మనోతీతమైన యాత్మ యంతటియందొక్కటియేగదా. స్త్రీయాత్మకు స్త్రీత్వము లేదు; పురుషుని యాత్మకుఁ బురుషత్వము లేదు. స్త్రీత్వ, పురుషత్వములు శరీరమునకు సంబంధించినవి. అవి మనస్సుచేత నిర్వహింపఁబడుచున్నవి. మనస్సున నున్న దీప్తిమాత్రమే యాత్మది. ఆయాత్మ మనఃపర్యంతము వచ్చినప్పుడు మనస్సు శరీరమునందు స్వత్వము కలిపించుకొన్నప్పుడే స్త్రీత్వ, పురుషత్వ భేదము. మనస్సుచేతఁ దాఁకఁబడని యామె స్త్రీభావవిశిష్టమైన శరీరము కలుషితము కాలేదు. ఆమెయాత్మ నాయందున్న మనస్సును వదలిపెట్టి శరీరముతో సంబంధ మేర్పరచుకొన్నది. మానసిక ప్రపంచమున నది యొక పాతివ్రత్యము. లోకములోఁ బరమేశ్వరుఁడు దని నెప్పుడెట్లు చేయునో తెలియదు. ఆమెకు నాయందుఁ బ్రేమ కలదను భావము నీకుఁ గలిగినచో నేను చెప్పిన మాటలవలన నీ కది తొలఁగిపోవలయును. ఈ రెన్నాళ్లనుండి చూచుచుంటిని. నీవు తొలుతటి కిరీటివి కావు. నీయాలోచనాశక్తి తాళ్ప్రమాణముగఁ బెరిగినది. నీ విప్పుడు సర్వస్వము నర్థముచేసికొనఁగలవు. అర్థము చేసికొనుటయే కాదు. ఒకవిషయము నించుమించుగా నుమాపతివలెఁ జెప్పఁగలవు.

కిరీటి—ఈ రెండేండ్లు నే నుమాపతిగారివద్ద శుశ్రూష చేసితిని.

సారథి—అట్లు చెప్పుము. దానిలోని రహస్యము నాకిప్పుడు తెలిసినది. కనుక నీకుఁ గోపము రానిచో నీవు చెప్పినట్టే నేను నీకు గురువువంటివాఁడను. మీ రిద్దఱు భార్యాభర్తలైనచో నేను తండ్రిని. ఉమాపతి మీ పెద్ద యన్నగారు. కిరీటి! ఇది నేను నిన్నడుగుట కాదు. నిన్ను వేడికొనుట. నిన్నుఁ బ్రార్థించుట. బాబూ! నన్ను రక్షింపుము. వాసంతిని సముద్ధరింపుము. నీవొక లోకోత్తర ప్రేమసామ్రాజ్య మేలుకొనుము.

అని సారథి కిరీటినిఁ గౌగిలించికొనెను. కిరీటి మఱలఁ గౌగిలించికొనెను అది వేసంగి యగుటచేత నిద్దఱు వంగీల నూడఁదీసికొనియే కూర్చుండిరి. ఇద్దఱి శరీరములు పరమసన్నికృష్టము లయ్యెను. ఆకౌఁగిలింతలో సారథిలోని శరీరగతమైన యొక స్పర్శేంద్రియాంత ర్నిహితా నిర్వాచ్యమైన యొకశక్తి కొండమీదినుండి సెలయేఱు పడఁబోసికొనినట్లు కిరీటి శరీరములోనికిఁ బ్రవహించెను. వా రైదునిముస లట్లే యుండిరి. ఆప్రవహించుట యాగిపోయిన దన్న యొక నిమేషము వచ్చెను. దాని నిర్వ్యారను గ్రహించిరి సారథి కౌగిలింత వదలిపెట్టెను. వదలిపెట్టి వెనుకకుఁ బడిపోయెను. కిరీటికి భయమువేసెను. కొంతసేపూరకే పండుకొనె ననుకొనెను. నాలుగైదుసార్లు పిలిచెను. అతనినిఁ దాకుటకు గిరీటి వెనుకాడెను. తనలోని శక్తి మఱల నతనిలోనికిఁ బోవునేమో యన్న భయమా? అతఁ డేదో యోగమునం దుండెను. ఆ యోగసమయములో నతనినిఁ గదలింపరాదన్న భయమా? ఇది యతని మృతి కాదన్న ధైర్యమా? ఆశక్తి యతనిలోనుండి వెడలిపోవుటచేత నతఁడు తాత్కాలికముగా నిస్సారపడి పోయెనా? కాని యతనిలోఁ బ్రాణమాడుచున్నది. ఆసంగతి విస్పష్టముగానే కనిపించుచున్నది.

కిరీటి మాటాడకుండ నట్లే కూర్చుండెను. సారథి యొకగంటసేపట్లు పండుకొనెను. తరువాత నెమ్మదిగా లేచి కూర్చుండెను. క్రమముగా లేచెను. గృహాభిముఖుఁ డయ్యెను. కిరీటి యతని ననుసరించెను. సారథియింటిముందు వఱకు వెళ్లినతరువాత సారథి యిట్లనెను: "నేనొడలు తెలియకుండ బడియున్నప్పుడు నీవు నన్నుఁ దాఁకలేదుగదా!"

కిరీటి—తాఁకలేదు.

సారథి—మంచిపని చేసితివి. మూన్నాళ్ళైన తరువాత నావద్దకు రమ్ము. అప్పుడు నీతోఁ గొంత మాటాడెదను.

కిరీటి సమాధానము చెప్పుటకు వీలులేనంత తొందరగా సారథి తనయింటిలోనికిఁ బోయి తడిక వేసికొనెను. కిరీటి యచటనే కొంతసేపు నిలుచుండెను. అతని శరీరము మబ్బులమీఁదఁ దేలిపోవుచున్నది. గాలిపడగవలె నున్నది. అతఁడు బాణమువలెఁ దనయింటికిఁ బోయెను. అతని కన్నము తినవలయు నన్న కోరికయే లేకపోయెను. వాహ్యాళికి పోకముందు కొంచెముగా వేయుచున్న యాకలికూడ యిప్పుడు లేదు. తన కన్నము క్కఱ లేదని చెప్పి యతఁడు పండుకొనెను. ఇంటిలోనివారందఱును నిద్రించుచుండిరి తానొక్కఁడే మేలుకొని యుండెను. అతని కప్పుడు వాసంతి జ్ఞాపకము వచ్చెను. వాసంతి మనస్సునకు దగిలినంతనే యతని యొడలు మండిపో నారంభించెను. అతఁడు మంచముమీద

ండుకొనలేకపోయెను. లేచి కొంతసేపు గదిలోఁ దిరిగెను. ఆతాప మార్పరానిదిగా నుండెను. అతని కేమిచేయవలయునో తోచలేదు. అతని కెంపుచేతనో "వాసంతిని గౌగిలించుకొనవలయును. ఈ తాపము చల్లారవలయు" నన్న యూహ పుట్టెను. ఆయూహ పెకలించరానిదిగా నుండెను. అప్పుడు బయలుదేరి శిరీషునింటికిఁ బోవలయు ననిపించెను. వెళ్లినచో నేమగును? వాఁడు తలుపు దీయునురా? తీసి, యెందుకువచ్చితి వనఁగా నేమి చెప్పవలయును? అంద్రి యింటిలో లేనిచో వాసంతిని గౌగిలించుకొనవచ్చును. ఆమె యేమియు ననదు. తన స్పర్శను బరీక్షించుకొనును ఇప్పుడు నా శరీరస్పర్శ యామె కెట్లుండునో? ఇప్పుడు నాయొడలు మండిపోయినట్లే యామె మేనునుకూడ మండిపోవునా? మండినచోఁ దా నేమి కావలయును? తన శరీ తాప మిట్లే యుండిపోవలయునా?

అతనికి వెంటనే సారథిమీఁదఁ గోపమువచ్చెను. సారథి తానేమో మహా నటకుఁడ ననుకొన్నాఁడు. అతఁ డొక మాయలమారి. వట్టి నటకుఁడు కాఁడు. అతఁడు మహారసానుభూతి కలవాఁ డనుకొన్నమాట యబద్ధము. అతఁడేవియో క్షుద్రవిద్యలు నేర్చినవాడు. ఆ క్షుద్రవిద్యా బలముచేతఁ దన్నిట్లు చేసినాడు.

కోళ్లు కూసినవి. పరమనిశ్శబ్దమైన యా యపరరాత్రమునందుఁ గోడికూత పెద్ద యినుపకార్ఖానాలోఁ గరఁగించిపోసిన మండుచున్న యినుపనీటి కాలువ వలెఁ బ్రవహించెను. కిరీటికి జీవితి కేమియుఁ దోఁచక తన సంగతి పోయి యుమాపతితోఁ జెప్పవలయు ననుకొనెను. అతఁడు తన యింటి తలుపు తీసి లోపల గడియ వేసికొనుఁడని యెవ్వరితోఁ జెప్పకుండఁగనే వెడలిపోయెను. ఉమాపతి యింటికిఁ బోయెను. పదినిముసములు తలుపుతట్టిన తరువాత నెవరో తలుపు తీసిరి. వారందఱు కిరీటి నెఱుఁగుదురు. అతఁడు ప్రతిదినము తమ యింటికి వచ్చెడి వాడే. ఉమాపతిని లేపిరి. ఉమాపతి రాఁగా గిరీటి యేడ్చుచుండెను. అతఁడు సంగతి యేమిటి యని యడిగెను. "చెప్పెదను. తన నంటరి"మ్మని కిరీటి యనెను. సమీపమునందున్న యొక దేవాలయములోనికిఁ బోయిరి. ఆ దేవాలయపు సింహద్వారము వేసియున్నను బ్రహరీగోడ పడియుండుటచేత లోనికిఁ బోయిరి. కిరీటి యీరెన్నాళ్లు జరిగిన సర్వకథయు నుమాపతితోఁ జెప్పెను. తన యనుభూతి, తాను మాటాడిన మాటలు, వాసంతియనుభూతి, సారథి చెప్పిన యామెపూర్వకథ, తాను రెండుసార్లు సారథిని గౌగిలించుకొనుట, మొదటిసారి యనుభూతి, రెండవసారి యిట్లగుట, యర్ధరాత్రము వఱకుఁ దన శరీరము పరమలఘువుగా నుండుట, యాకలి చచ్చిపోవుట, వాసంతినిగూర్చి

తాపాలోచింపనంతవఱకుఁ దన కీబాధలేకపోవుట, యామె మనస్సునకు వచ్చినం తనే యీతాప మారంభించుట, సర్వమును జెప్పెను. అప్పటికి మార్గోద యమై కొంతసేపైనది. ఇద్దఱును గాల్యకృత్యములు తీర్చలేదు. కిరీటి, తన శరీర మింకను దహింపబడుచునే యున్న దనెను. అప్పు డుమాపతియుఁ, గిరీటియు సారథియింటికి బోయిరి. సారథి తోటలోఁ దిరుగుచుండెను. వీరు కనిపించినం తనే కనులు పెద్దవిచేసి వారివంక చూచెను. ఉమాపతి యిట్లనెను: "ఏమయ్యా! సారథీ! నీవు బలేవాఁడవు, క్షుద్రవానిని సుడిగుండములో దింపితివి. ఇతనికి వాసంతి మనసులోనికి వచ్చినంతనే శరీరము మండిపోవుచున్నది. తెల్లవాఱులు నిద్రలేదు. నీవేవో క్షుద్రవిద్యలు నేర్చికొంటివి. వాని నతనిమీఁదఁ బ్రయోగించితివి. నీ వింత పెద్దవాఁడవు. నీ కిది తగునా" యనెను. అనుచు నుమాపతి నవ్వుచుండెను. సారథి యిట్లనుకొనెను: 'ఓహో! నాకుఁ దెలియకుండ వాసంతి మీఁద నా కింత కోరిక యున్నదా? ఏమి జీవలక్షణము! మనస్సునకు లోని పొరలు పైని పొరలు నెన్నికలవు? పై పొరలతో నేను వాసంతిని నిరాకరించుచు లోఁబొరలలో నామెమీఁద నింతటి వ్యామోహము కలిగియున్నాఁడను కొంబోలు. పరమేశ్వరుఁడు నన్ననుగ్రహించినాఁడు. నా తపస్సు ఫలించినది. తెల్లవాఱులు నేను మేల్కొనియే యున్నాను. వాసంతి యూహయే నాకు రాలేదు. రెండేండ్లుగా నేను వాసంతి గుఱించి యూహింపకుండ నెప్పుడుంటిని? వాసంతి నాలోనుండి వెడలిపోయినది. ఇతని యందావేశించినది. నాలో నిట్టి శక్తి యుండుట యాశ్చర్యము. ఇది పరమేశ్వర సంకల్పము. ఇట్టి స్థితి నే నెన్నఁ డెఱుఁగను. వాసంతి నాశరీరస్పర్శ నాదరించియున్న స్త్రీ సంబంధి కామభావము. ఆ కామభావన యంతయు నిట్లు కిరీటిలోని కోడ్చుకొన్నది. ఇట్లోడ్చికొనుట నా సంకల్పము. అది యెట్లు జరిగినదో నాకుఁ దెలియదు. నే నేక్షుద్రవిద్యలు నేర్చిన వాఁడను గాను. క్షుద్రవిద్యలు నేర్చినవారైన నిట్టి ప్రయోగములు చేయుట సాధ్యము కాదు. ఇది పరమేశ్వర సంకల్పము. అటువంటి వాసంతి నా సంయోగము చేత దూషితయగును. కిరీటి శలాటువు, అతఁడు పండి ఫలమగును. ఇప్పుడీకిరీటి తాప మపనయించుట యెట్లు? నేనెదో క్షుద్రవిద్య కలవాఁడనన్న యనుమానము తీసివేయుట యెట్లు? అయ్యో! ఎంత యాలోచింపకుండఁ జేసితిని? వాసంతికంటె నితఁడు చిన్నవాఁడు వారి శాఖ, వీరి శాఖ యొక్కటి కాదు కిరీటియొక్క యాస్తిపాస్తులు నాకుఁ దెలియవు. వాసంతి యితనిని దప్ప మఱియొకనిని బెండ్లియాడ నని భీష్మించి కూర్చున్నచో నీవ్యవహారము కొంతవఱకు పరిష్కారము కాఁగలదు. కాని మఱియొక మార్గము లేదు. ఆమె కీయభిజ్ఞ లేదు. ఏమి చేయవలయును?"

సారథి యిట్లాలోచించి యాలోచించి తుదకిట్లు చెప్పెను : "కిరీటీ! మూన్నాళ్లైన తిరువాత మనము కలసికొందుమని నీతోఁ జెప్పితిని. నీవు నన్నుఁ దొందఱపెట్టుచున్నావు. నీవు నేఁటి సాయంకాలమున రమ్ము. నీ తాపము తగ్గుటకుఁ బ్రయత్నము చేసితిని. నీవు బుద్ధిమంతుఁడవు. నేను క్షుద్రవిద్యలు నేర్చిన వాఁడను కాను. నమ్మియు నిన్ను మోసము చేసినచో నాకు వచ్చెడి లాభము లేదు. నీ శరీరము వాసంతీ స్పర్శయోగ్యముగాఁ జేయవలయుననియే నా సంకల్పము. ఆయూహను నేను శరీరముతో, మనస్సుతో, నాత్మతో దృఢముగా భావించితిని. ఏ పురాకృతపుణ్యము నాయందున్నదో, యే పురాకృతయోగశక్తి నాయందున్నదో యిట్లు జరిగినది. నాలోనున్న శక్తి నీలోఁ బ్రవహించుచున్నదని నేను మొన్నటి సాయంకాలమున క్రొత్తగా గ్రహించినదే. దానిని గాఢముగా వాంఛించితిని. సంకల్పించితిని. ఆచరణకుఁ దీసికొని వచ్చునట్లు భావించితిని. నా కేదుష్టశక్తియు లేదు. ఇదికూడఁ బరమేశ్వరుని సంకల్పము. నీవు నేటి సాయంకాలమున రమ్ము. దీనినిగుఱించి యాలోచించెదము". అని తన పాకలోనికిఁ బోయెను. ఉమాపతి కిరీటులిద్దఱు వెడలిపోయిరి.

కిరీటికి సారథి దగ్గఱకు వచ్చినప్పటినుండియు నతనిఁ గౌగిలించికొనినచోఁ దనకీభావము తగ్గిపోవునని యూహ కలిగెను. వాసంతి నూహించుటచేతఁ దనకుఁ గలిగిన శరీరతాపము తనకు రాత్రి సహింపరానిదిగా నుండెను. ఇప్పుడా తాప మొకసుఖము కలిగించుచుండెను. ఈతాపము తగ్గిపోయినచో నా సుఖముకూడఁ బోవునేమో. అందుచేత నతఁడు పోయి సారథినిఁ గౌగిలించికొనలేదు.

తిరిగిపోవుచు నుమాపతితో నాప్రస్తావనయే చేయలేదు. ఇంటికిఁబోయి స్నానము చేసెను. అప్పటికిఁ బది కావచ్చినది. భోజనమునకుఁ గూర్చుండెను. అతఁడు ప్రతిదినము తిను నాహారమున కానాఁడు నాల్గయిదురెట్లు తినెను. పిల్లవాఁడు రాత్రి భోజనము చేయలేదు కనుక నెక్కువ తిన్నాఁడని తల్లి యనుకొనెను. ఎంత యెక్కువ తిన్నను నలుగురి తిండియా? భోజనము చేసినంతనే యతనికి నిద్దురవచ్చెను. పండుకొనెను. అతని యొడలతనికిఁ దెలియదు. అతఁడు మేల్కొనుసరికి సాయంకాలమున నాల్గుదాటెను. కళాశాలకుఁ బోలేదు. సారథి యింటికిఁ బోవలయును.

సారథి యాప్రొద్దుటఁ గిరీటిని బంపించి శిరీషునింటికిఁ బోయెను. వాసంతినిఁ దనయింటికిఁ దీసికొని వచ్చెను. శిరీషుడు వెంటవత్తుననఁగా సారథి వల

దనెను. శిరీషునకుఁ గోపము వచ్చెను తాను వచ్చుటకు వీలులేనిచో వాసంతి వచ్చుటకు వీలులేదనెను. వాసంతి తండ్రిని బతిమాలినట్లు, కొంత దుఃఖించి నట్లు మాటాడెను. సారథి యిటనెను: "శిరీషా! నామీఁద నీ కేమైన ననుమానమా? నేను నీవంటివాఁడను కాను. వాసంతిని నా యింటికిఁ బంపించినచో నే నామెతో దుష్టముగాఁ బ్రవర్తించ"ననెను. శిరీషునకు గోపమువచ్చి "నే నటు వంటివాఁడనని నీ వనుచున్నావు. నీ వట్లనగల" వనెను. సారథి తొందఱలో "నీవు కమలతో నెట్లు ప్రవర్తించితివో నాకు వాసంతి చెప్పిన" దనెను. శిరీషుఁడు మాటాడకుండ నింటిలోనికిఁ బోయెను వాసంతియు, సారథియుఁ గలిసి సారథి యింటికి వెడలిన తరువాత వాసంతి సారథితో నిట్లనెను: "ఆమాట నేను మా నాయనగారితో ననుమంటినా? నే నింటికిఁ బోయిన తరువాత నాయన నన్ను సాధించును. సారథీ! నీవు బలేవాఁడవు ఇంతకు నిన్ను నడిగిన పని యేమున్నది? ఇదియంతయు నేను చేతులారఁ జేసికొన్నది. హాయిగా నున్న దానను లేనిపోని యీ యాలోచన పెట్టుకొని యీ స్పర్శవిచారణ పెట్టుకొని నీ వన్నమాటలు నిజమనుకొని యేవని స్పర్శ నాకు సుఖముగా నుండునో వాఁడే నాభర్త యనుకొంటిని. నే నట్లనుకొనునట్లు నీవు చేసితివి. నీవు నన్ను పెండ్లి చేసికొనవలయునని యున్నది. నేను నిన్నుఁ బెండ్లి చేసికోను. నేను మఱియొకరి నయినఁ జేసికొందును. అతని స్పర్శ యెట్లున్నను సరే. స్పర్శ శిశిరముగా నే యుండవలయునని యున్నదా? ఉష్ణముగాగూడ నుండవచ్చును. ఈలోకములో నింతమంది స్త్రీలును, పురుషులును గలసియుండుచున్నారు. వీరందఱు స్పర్శ సుఖము విచారించి భార్యాభర్తలుగా నుండుటలేదు గడితినుచున్నచో నదియే యలవాటగును. ఔత్తరాహులు గోధుమలు తిన్నవారే మనుష్యులని యనుకొందురు. మన దాక్షిణాత్యులు వరిబియ్యము తిన్నవారే మనుష్యు లనుకొందురు. టిబెట్టులో నుప్పులేకుండఁ దిందురఁట. ప్రకృతియు నేకవిధములు. "వాసంతికి కొంచెము కోపము వచ్చెనని సారథి యనుకొనెను. ఇట్లనెను: "కాదమ్మా! నిజమునకు మీ నాయన కమలను జేసినట్లు నిన్ను నే నెప్పుడైనఁ జేసితినా? నేను నిన్ను బాగుచేయవలెనని తీసికొనివచ్చుచుండగా మీ నాయన యనుమాన పడుటలో నేమైన నర్థమున్నదా?" అప్పుడు వాసంతి యిట్లనెను:

"ఓయి సారథీ! ఇదివఱకు నాతో నీ వట్లు ప్రవర్తించలేదు. నన్ను వివాహమాడిన తరువాతఁ బ్రవర్తించవా?"

సారథి- నేను నిన్ను వివాహమాడను. నా స్పర్శను నీ వింకను బరీక్షింప వలయును. నా స్పర్శయు నీ స్పర్శయు సమానములు కావు. నేను పూర్వపు

సారథిని కాను. నేను నీకు గొద్ది పొరపాటుగాఁ జెప్పితిని. ఎవని స్పర్శ శిశిరముగా నుండునో వాఁడు భర్త కాఁడు. స్పర్శ శిశిరోష్ణముగా నుండవలయును. గోరువెచ్చగా నుండవలయును. కొంతసేపు చల్లగా నుండవలయును. కొంతసేపు వెచ్చగా నుండవలయును.

వాసంతి-నీవు మాట మార్చుచున్నావు.

సారథి-అంతదాక నెందులకు? నీవు నన్నిప్పుడు తాఁకుము ఎట్లుండునో చూడుము.

వాసంతి-నీవే తాకుము కౌగిలించికొనుము. బుగ్గమీఁద ముద్దుపెట్టుకొనుము నేను పరీక్షించెదను.

సారథి సంశయించుచు నామె నట్లు చేసెను. ఆమె కతని స్పర్శ సుఖదాయకముగా లేదు. శిశిరముగా లేదు. ఒక కొయ్యను ముట్టుకొనిన ట్లున్నది. అతఁడు కౌగలించుకొనినప్పు డొక మనుష్యుఁడు కౌగిలించుకొన్నట్లు లేదు. ఒక శరీరముతో మఱియొక శరీరమునకు సంసర్గము కలిగినట్లు లేదు. తన పూర్వానుభూతి యంతయు వ్యత్యస్తమయినది.

వాసంతి యాశ్చర్యపోయెను. ఇది యేమి మార్పు? పైగా దాను సారథియొక్క స్పర్శను విచారించి యుత్తరము పైన నయినది. ఈలోపుగా నతఁ డెవ్వో మాఱిపోయినాఁడు. తా నెవ్వో మాఱిపోయినది. తాను లోకమునందలి సర్వస్త్రీలవలె నైనదా? ఆమె కేమియు నర్థము కాలేదు. ఆమె కొంతసేపు మాటాడకుండఁ గూర్చుండెను. చివఱ కిట్లనెను:

"సారథీ! నీవు నన్నుఁ బెండ్లిచేసికొనుట యిష్టములేక యేవో గారడీ చేసితివి. నా కదియును తెలియలేదు. నేను నిన్ను ప్రేమించుచుంటిని. నిన్న కిరీటి మాటాడిన మాటలవలన నాకుఁ దెలిసినది. నీవు మహానటకుఁడవని నాకు దెలియకుండ దెలిసినది. నా యాత్మ గొప్పది. నా మనస్సు పూర్వము మేలుకొనలేదు. నాతండ్రి దానిని జిచ్చికొట్టి నిదురబోగొట్టినాఁడు. నాతండ్రిమీఁద నా కెంతయైనను గోపముగా నున్నది. ఆయన స్వార్థపరుఁడు. తా నొక లక్ష్యము పెట్టుకొని నేను మానవజన్మ మెత్తితినని, నా సుఖదుఃఖములు నావి యన్న యభిప్రాయము లేకుండ నన్నుఁ బెంచినాఁడు. తా నేమైన నటుఁవంటివాఁడా? తాను కమలతో లోకసామాన్యముగాఁ బ్రవర్తించినాఁడు. నే నిట్లున్నచో నేమగునో తెలియునా? నే నెట్లును జెడిపోయితిని. నీవుకూడ జెడిపోవలయునా యనును. చెడిపోవుటయో బాగుపడుటయో యెవనియంతట వాఁడు

చేసికొనవలెయును గాని తల్లితండ్రులయొక్కయు, నన్నగారలయొక్కయు నభిప్రాయమువలనఁగాదు. ఆ చెడిపోవుటయు బాగుపడుటయు లౌకికముగా నుండవలయును. ఆధ్యాత్మికముగా నుండరాదు. పురుషుఁడుగానో, స్త్రీగానో పుట్టిన తరువాత నీ స్త్రీ పురుష సంగమము శరీరమువలన ననుభవించెడు సుఖముయొక్క పరమావధిగా గనిపించుచున్నది. లోకమునందు స్త్రీకి బహుపురుష సంగమము, పురుషునకు బహుస్త్రీసంగమమును దోషముగాఁ బరిగణింపఁబడుచున్నది. తల్లితండ్రు లట్టిదోషమును బరిహరించుటకుఁ జూడవలయునుగాని ప్రధానభూతమైన జీవియొక్క యీసుఖమునుండి తమసంతానమును బహిష్కరింపఁజూచుట పాపహేతువు. నన్నడిగినచో వారికి మంచి లోకములు లేవు. తండ్రియైనను నే నిట్లనక తప్పదు. లోకములో నున్న సామాన్యస్త్రీలకైనచో "నేను నీకీసంబంధము కుదిర్చినాను. నీవు చేసికొను"మని చెప్పవచ్చును. ఆస్త్రీ లెట్టివానితోనైన సంసారము చేయఁగలరు. కాని విశిష్టప్రకృతి గల స్త్రీలుందురు, పురుషులునుందురు. వారు వారుకోరిన స్త్రీ పురుషులతోడనే శరీరావధిభూతమైన శరీరముయొక్క యీపరమసుఖము ననుభవించఁగలరు. వారిని నియమించుట వారిజీవితములం దీసుఖపరమావధి వారికి లేకుండఁ జేయుట. ఇది పాపహేతువు. నేను మఱియు విశిష్టప్రకృతిని. లోకములో నొకవిశిష్టప్రకృతియైన స్త్రీయొక్క పురుషునే వాంఛించినదనగా నామె తన మనోబలముచేత నొక దివ్యమైన లక్ష్యముచేతఁ బ్రేరేపింపబడినది. నేను నిన్ను భర్తగా వరించితి ననఁగా నీ నిర్ణయము నామనస్సు చేయలేదు. నాబుద్ధి చేయలేదు. ఇది నాశరీరము నిర్ణయించినది. కిరీటి చెప్పినట్లు నాశరీరము నాయాత్మతో లగింపఁబడి యున్నది. నాయాత్మలోని విషయము నేను గ్రహించుటకు నాశరీర ముపకరణమైనది. శరీర మెప్పుడు నుపకరణమే. మనస్సుకూడ నుపకరణమే. నీవు నాభర్తగా నాయాత్మ నిర్ణయించినది."

సారథికి గుండెలో రాయిపడెను. తా నంతయు సిద్ధమైనదనుకొన్న వ్యవహారము మఱలఁ బూర్తిగా వెనుకకుఁ దిరిగెను. ఇప్పు డేమి చేయవలయునో తెలియలేదు. అతఁడు మాటాడకుండఁ జాలసేపు కూర్చుండెను. చివరి కిట్లనెను: "నిజమే. అప్పుడు నీశరీర మట్లు నిర్ణయించినది. ఆ నిర్ణయమున కప్పటి నీశరీర స్పర్శ కారణము. ఇప్పటి నీశరీరస్పర్శ కాదనుచున్నది. ఇది వేదాంత విషయము కాదు. ఆత్మవిషయము కాదు- దాని యాథార్థ్యమెప్పుడు నొక్కటియే యనుటకు. ఇది శరీరవిషయము. శరీరము మాఱుచుండును. ఒకసారి వివాహమైన తరువాత దానిమార్పులు పాటించక పోవచ్చును. వివాహము కాకముందు మార్చుకొనవచ్చును.

నేను వాసంతి యనియే పిలువవలయు నంటివికదా. నిన్ను గురించి తలంచుకొని నపుడెల్ల నాయొడలు మండిపోవుచున్నది. తెల్లవారులు నాకు నిదుర లేదు. తెల్లవారిన తరువాత నాబాధ కొంత తగ్గినది. ఇపుడు నీవు కనిపించినంతనే మరల నాయొడలు మండిపోవుచున్నది. నిన్నుఁ గౌగిలించికొనినగాని నాయీ తాపము తీఱదనిపించుచున్నది. నే నిట్లు చెప్పుచున్నందుకు క్షమించుము. లోకసామాన్యమైన యూహయే కాని నా కీవ్యవహార మేమియుఁ దెలియదు. నిన్నుఁ గౌగిలించుకొనినచో నీతాపము తగ్గునేమో నేను చూడవలయును. నీ వంగీకరింతువా ?”

వాసంతి “నేను నిన్నుఁ గౌగిలించుకొనవలదన్నానా ? నీ కాతాపము తగ్గుననిపించినచోఁ గౌగిలించికొనుము” అనెను.

ఈ ప్రసంగము జరుగుచున్నపుడు లోకజ్ఞులై శరీరవేత్తలైనవా రెవరున్నను బొట్టపగులునట్లు నవ్వకమానరు. శృంగారరస మిట్లుండునా ? ఆలంకారికుల కిట్టి స్థితి యుండునని తెలియదుగాని తెలిసినచో వారును సిగ్గుపడియుందురు. ఇందులోని కొంత రహస్యము ఋష్యశృంగుని సృష్టించిన వాల్మీకి కొక్కనికే తెలియును. ఆయన కెందుకు దెలియు ననగా, నిజమో కాదో కాని యాయన నిజముగా బూర్వమెప్పుడో కిరాతుడైయుండినచో నాకిరాతుఁడెఱుగుటవలనఁ దెలియును.

కిరీటి యామెనుఁ గౌగిలించుకొనెను. అతనికి యౌవనప్రాదుర్భావ మయ్యెను. అతని యాత్మలో మనస్సులో నిలీనమైయున్న యౌవనాగ్ని సర్వము సహస్రశిఖాప్రదీప్తమగునటు కౌగిలించికొనెను. వ్యగ్రమైయున్న వాసంతి మనస్సునకు నతని కౌగిలింతలోని నిప్పు ముట్టుకొనెను ఆమె యాతనిని మరల నంతిగాఢముగాఁ గౌగిలించికొనెను. అతఁ డామెను చుంబించెను. ఆ చుంబనములో వేడి కలదు. సుఖము కలదు. వాసంతికిఁ బ్రొద్దున సారథి చెప్పిన మాట జ్ఞాపకమునకు వచ్చెను. ఓహో! నిజముగాఁ బసిబిడ్డ యితఁడు. కాని—

ఇద్దఱు నొకరి కౌగిలింత నొకరు వదలుకొనలేక యుండిరి. వారి నొకరొకరానికొని కూర్చుండియుండఁగా వారికిఁ బరమసుఖముగా నున్నది. తన తండ్రి కమఁతో నున్న యొక యద్దని మేపకాల నామె చూచెను. కిరీటి అట్లు చేయునేమో యని యామె యెదురు చూచెను. అతఁడు నరీక్షితుఁ డగుటచేత నతఁడు సాహసింపలేదు. అరీక్షితునకుఁ దెలిసినదికూడఁ దెలియనట్టే యుండును. ఆమె కొంతసే పెదురుచూచి యతని చేయి తీసి తానే తన యొమ్ముపైన నాన్చుకొనెను. ఆమె కథకసుఖ మనిపించెను. ఆమె యిట్లనెను: “ఓయి కిరీటీ! రంగనాథముగారి కూతురు కమల నెలనాళ్లనుండి మాయింటికి వచ్చుచున్నది.

చేయి నా ఱొమ్ముమీద వేసికొనను. నే నట్లు చేసినచో నాకుఁ జాల బాధ కలుగును. సారథి నన్నిట్లు చేసినను నాకు సుఖముండదు. ఎట్లుండునో చూడ వలయునని యిందాక నన్నుఁ గౌగిలించుకొను మంటిని. అతఁడు కౌగిలించి కొనెను. ఆ కౌగిలింతలో సుఖమే లేదు. ఒక ఱాతిని కౌగిలించికొనిన ట్లున్నది. ఒక కొయ్యను కౌగిలించికొన్న ట్లున్నది. పూర్వ మతని స్పర్శ యట్లుండెడిది కాదు" కిరీటికి సర్వమును దెలిసి పోయెను. ఈమె సారథి యన్న ట్లనాఘ్రాత పుష్పము. కరాలూనకిసలయము. అనాస్వాదితరసము. ఈమధుపాత్ర సారథి తన కోసము సిద్ధము చేసినాఁడు అతఁ డామెను వెంటనే మఱల కౌగిలించుకొనెను. అప్పటి వారి యిద్దఱి పరిష్వంగము నేల బడిపోయిన చెట్టుమీఁదఁ దీఁగ యల్లి బిల్లిగా నల్లుకొని క్రిందఁబడి మీఁదఁబడి నలిగి మన్నుకొట్టుకొన్న ట్లున్నది. ఆ సమయమున సారథి వచ్చెను. ఆస్థితిలో వారిద్దఱినిఁ జూచెను. అప్పటి వారి తన్మయత్వస్థితిలో సారథి వచ్చుచున్న కాలి యలికిడికూడ వినిపించలేదు. అతఁడు వచ్చి వారి వంక నరనిముసమట్లే నిలఁబడి చూచినంతవఱకు వారికి సారథి వచ్చెనని తెలియలేదు. కిరీటి సారథిని జూచినంతనే సిగ్గుతో జలుకుతో భయముతో వాసంతిని వదలిపెట్టి దూరముగాఁ బోయి తలవంచుకొని కూర్చుండెను. వాసంతి నవ్వుచు సారథివంక జూచుచుఁ గూర్చుండెను. సారథి యామెవంకఁ జూచుచు నొక మహానంద మనుభవించుచుండెను. అతఁ డిట్లనెను: "వాసంతీ! దుష్యంతమహారాజుతో శకుంతల కలిసికొన్న దనఁగాఁ గణ్వమహర్షి తెలిసికొని యెంత సంతోషించెనో నే నిప్పు డంత సంతోషించుచున్నాను"

వాసంతి యిట్లనెను. "క్షోభము కలిగించు విషయములు రెండున్నవి కాదు, మూఁడున్నవి. ఒకటి శకుంతల కణ్వుని ప్రేమించలేదు. రెండు శకుంతలకుఁ గలిగిన శృంగారభావము కణ్వుఁడు నేర్పలేదు. మూఁడు కణ్వుఁడు దుష్యంతుని తనవలె శకుంతల కొఱకు సిద్ధపఱచి యట్టిపెట్టలేదు" కిరీటి వాసంతి వంకఁ జూచెను. అప్పటి యతని యనుభూతి తన కెవరో బ్రహ్మరథము పట్టిన ట్లున్నది.

## ౧౮

రంగనాథమునకుఁ గథ యష్టముగాఁ దిరిగినట్లు కనిపించెను. తనకు వాసంతి మీఁద నభిలాషగా నుండెను. ఆ యభిలాష వట్టి యభిలాష కాదు. కొంత పగతీర్చుకొనవలయు ననికూడ నున్నది. ఆ పగ పట్టుటకుఁ గారణము కనిపించలేదు. చాలమంది వయసుకత్తెలు తన్నభిగమించిన నభిగమింపక పోయి

వొకఁడు పంద్రెండేండ్లకుఱ్ఱవాఁడు ఒకఁడు పదునాలుగేండ్లకుఱ్ఱవాఁడు. వాఁడు మొదటి ప్రహ్లాదుఁడు; వీఁడు రెండవ ప్రహ్లాదుఁడు. రెండవ ప్రహ్లాదుఁడే నాటకము వేసినను మొదటి నాయకుఁడగుచుండెను. వాఁడు పిక్క బలిసియుండెను. అతని గొంతు కిన్నరుల గొంతు. అతఁడు పెద్దవాఁడైనచో మహాగాయకుఁడగును. అతని రాగప్రస్తారవైఖరి మహాపండితుల నాశ్చర్యపఱచుచుండెను. తుంబురు నారదులు వచ్చి వాని గొంతులోఁ గూర్చుండిరి. అతఁడన్నచో దొరగారికి బహిఃప్రాణము. ఏ రైదుగురు దొరగారిని నిట్టనిలువున దోచుచుండిరి. నాటకములకు వసూలయ్యెడి మొత్తము పెరుమాళ్ళ సేవకే సరిపోవుచుండెను. వీరి కోపములు, తాపములు, లాలనలు, నాటకము వేళకు వచ్చుటకు వారెల్ల దొరగారి మీఁదనే పడుచుండెను. ఏడాది తిరుగకమున్నే దొరగారి నగ విలువయున్న లక్ష లైపోయినవి. వారు రెండుమూఁడు లక్షల క్రొత్తగా నప్పుచేసిరి. అక్కడ పోయిన లక్ష లిక్కడఁ గనిపించవు గదా. ఇక్కడను గనిపింపవు. ఏమై పోయినవో తెలియదు. ఎట్లు కనిపించును? నాలుగువందల రూపాయిలు పెట్టి కొన్న చీర నెలనాళ్లలో దానిమీఁది మోజుపోయిన చీర డబ్బుగాఁ గనిపించదు. ఇరువదివేలు పెట్టికొనిన మోటారుకారు లారీవలె నడుపఁబడుచున్న కారు డబ్బువలెఁ గనిపించదు. ఆరుగురు కలిసి మదరాసు మొదటి తరగతిలో వెళ్లి వచ్చినచో దారివంట టిక్కెట్టు వసూలు చేయువారికి రైల్లు నడిపెడివారికి టిక్కెట్లు తనిఖీ చేయువారికి ప్రశాంతిగదులలో వీరికి సహాయములు కలిగించెడివారికి నీరీతిగాఁ జెప్పరానన్ని వ్యయములు. వివేకములేని వ్యయములు. రూపాయి పెట్టెడి చోటఁ బదిరూపాయలుగాఁ బెట్టెడి వ్యయములు ధనమును లెక్కకుఁ దీసికొనిరావు. అప్పు మాత్రము లక్షలు కనిపించును. వీరిలోఁ బట్టచొక్కాగాని మఱిదేనినీ దొంగరు జరీనుపుట్టలుగాని వేయరు పెట్టెలో నావేళకుఁ జొక్కాలేదు. నంబినే పోయి కుట్టించవలయును ఆకుటించుట డజను కన్నఁ దక్కువ కుట్టించినచో దరా తక్కువ. గంటలో వాడు కుట్టి యీయవలయును. పట్టుచొక్కా కుట్టి యిచ్చినచో సామాన్యముగా మజూరీ రెండురూపాయలైనచో వీరు దొడ్డదొరలు కనుక ఏ రైదురూపాయ లిత్తురు. గంటలోఁ గుట్టి యీవలయును గనుక ఎనిమిదిరూక లిత్తురు. చిల్లరలేదు కనుకఁ బదిరూపాయి లిచ్చివేయుదురు.

ఇట్లుండఁగా స్విట్జర్లాండునుండియో, హాలెండునుండియో తెలియదు- ఒక యందగత్తె వచ్చెను. ఆమె దొరగారి పటణముకూడ వచ్చెను. ఆమె యొక్క రాత్రికి రెండువేల రూకలు పుచ్చుకొనునట. ఆమెతోఁ బాటిక ముప్పదిమంది యుండిరి. ఆమె రోజుకు వందరూపాయ లద్దెయిచ్చి యొక మేడ తీసికొన్నది.

పోడిమి పొన్న కాయపాళెముగా నున్న పుడే చేయవలయును. అందుచేత రంగనాథము బయలుదేఱెను. దొరగారి దర్శనము చేసెను. ఇపుడు దొరగారి దర్శనము చేయుట చాల సులభము. పూర్వము మనదేశములో కలెక్టరులకుఁ గూడ జమీందారుల దర్శనము కలిగెడిది కాదట. ఒక జమీందారు గవర్నరుయొక్క దర్బారులో నుండెడివాఁడట. బ్రిటిషురాజ్యము వందియేండ్లు గడచినతరువాత మన దేశపు జమీందారులు పోలీసు సబినస్పెక్టరులు, సబ్‌రిజిస్ట్రారులు మొదలయిన వారి ప్రమాణములోనికి వచ్చిరి. మన జమీందారు నాటకశాలయందు టిక్కెట్లమ్ము వాని స్థితిలోనికి వచ్చెను. దొరగారి కొక్కొక్కప్పుడు టిక్కెట్లమ్మెడి చోటఁ గూర్చుండుటయుఁ గలదు. ఆ నవాబైన మొదటి దొరగారి కాపురాట కావలయును. మఱి కూర్చుండెదా? కూర్చున్నను దొరగారివలెనే కూర్చుండురు.

రంగనాథమును, దొరగారును మాటలలోనికి దిగిరి. దొరగారు కమల ప్రస్తావన తెచ్చిరి. రంగనాథము శిరీషుఁడు దుర్మార్గుఁడనియు, తనకూఁతురు ముక్కుపచ్చలారని పసిపిల్ల యనియు, వాసంతి కొంపలు తీసిన కోతి యనియుఁ జెప్పెను. వాసంతినిఁ గొంత నిందించెను. కొంత పొగడెను. దొరగారు వాసంతికి గొప్ప పలుగల ముత్యాలహార మిచ్చెను. ఆమె నెక్కువగా నన్నచో దొరగారికిఁ గోపము వచ్చునేమో. అందుచేత రంగనాథము తన మాట నేర్పంతయు వినియోగించి కఱ్ఱ విఱుఁగకుండఁ బాము చావకుండ మాటాడఁగల తనశక్తినంతయుఁ బ్రదర్శించెను. రాజు మనసులో నవ్వుకొనెను. వాసంతికిఁ, దనకు సంబంధము లేదు. కమలను దా నెఱుఁగును. ఈమె మంచిది, ఆమె చెడ్డది. దొర మనస్సులో నొకభావ మున్నది. ఆనాఁడు కమల వచ్చుటయుఁ జంద్రమతి యామెను బరిహసించుటయుఁ దా నెఱుఁగనట్లు నటించుటయు జరిగెను. కమల యారీతి వచ్చుటకుఁ గారణము తన్ను వివాహమాడుమని యడుగుట కని దొరగారికిఁ దెలిసెను. కోటలోని రహస్యములే బయటకుఁ దెలియును కదా. బయటి రహస్యములు కోటలోనికిఁ దెలియుటలో నాశ్చర్యమేమున్నది? ఈ రహస్యము రంగనాథమునకు, నతనిభార్యకు వాసంతి శిరీషులకుఁదక్క ఆయూరిలోఁ దెలియనివారు లేరు. రహస్యము లిట్లుండును. దొరగారు కమలమీఁద జాలిపడెను. తాను చేసినది తప్పనుకొనెను. ఆమె యమాయకురాలని తెలిసికొనెను. ఐన నామెమీఁదఁ గోరిక పోలేదు. కోరిక తాను పురుషుఁడైయున్నంతకాలము పోదు. దొర రంగనాథముతో నిట్లనెను: "రంగనాథముగారూ! అది యట్లు జరిగినచో విచారించవలసినదే కాని మీ యమ్మాయిని శిరీషుగారి కిచ్చి పెండ్లి చేయుటయే యుత్తమమైన విషయము."

మేర్పఱచి నెలకు బదియో, యేబదియో, జీతమిచ్చి చేసినచో నది తమ గొప్ప దనమునకు దగినట్లుండును." అనెను.

దొర-రంగనాథముగారూ! మీరేయున్నారుగదా. మీరే యాస్థానకవులు

రంగనాథమునకుఁ దానేబది రూకలు పుచ్చుకొనుట కిష్టములేదు. పార బాటున దానేబదిరూకలనెను. దొర యిట్లనునని తనకు దెలియదు. కనుక మాట మార్చి యిట్లనెను: "ప్రభూ! తమరి యనుగ్రహము నాయందున్నచో జాలును. నాకొ పదవి యక్కరలేదు. అవధానిగారున్నారు. గ్రామములో జాలమంది కవు లున్నారు. అగ్గునరావుగారి స్నేహితులే యిద్దఱు కవులున్నారు. ఆస్థానకవి నిర్ణయమున కొక సంఘము నేర్పఱచి వారెవరిని నిర్ణయించినచో వారిని వేయుట న్యాయము, ధర్మము" అనెను. సంఘమునుగూడ నారప్పుడే నిర్ణయించిరి. ఒకరు పెరుమాళ్లు, రెండు అగ్గునరావు, మూడు రంగనాథము. సంఘములో స్త్రీకూడ నొకతెయున్నచో బాగుండును గనుక జంద్రమతియున్నచో బాగుండునని రంగనాథమనెను. ఆదొరగారు వాసంతిని వేసినచో బాగుగా నుండుననెను. రంగనాథ మామె యొప్పుకొనునో యొప్పుకొనదో యనెను. ఆమె యొప్పు కొనినచో నామె, లేనిచో జంద్రమతి గా నిర్ణయించికొనిరి

రంగనాథము వాసంతిని బోయి కనుగొనుటకు నతని కిష్టములేదు. వారి తమ గృహపరిస్థితులట్లు చేసినవి. ఇట్లుండగా మఱునాడు దొరగారు శిరీషు కొఱకు వార్తనంపిరి. శిరీషుని కెందుకో తెలియలేదు. కమల విషయమని యను మానము తట్టెను. రంగనాథము పోయి చెప్పికొనియుండెను. ఐననిందులో దన తప్పేమి? దొరగారేమి నిషధానౌహాస్యుడా? తన్నీ విషయములో మందలింద వలయునని పిలిపించుటకు పెళ్లిగలయున్నా, వలదా. ఎటివాడైనను దొరగదా? వెళ్లక పోయినచో బాగుగా నుండదు. నిష్పృగల మనసుతో మాటకు మాట యనవలయు నన్న నిశ్చయముతో నవసరమైనచో నీ వింతకంటె నేమి పలుకజెటితి వర మొగముమీద ననివేయవలయునన్న సంకల్పముతో శిరీషుడు కొలకు వెళ్లెను. అతని కచట నెంతయో గౌరవముతో స్వాగతము నొసఁగబడెను. దొరగారు నవ్వుచు వచ్చిరి. శిరీషుడు లేచి నిలుచుండగా ఘనవారేమి కూర్చుండు డనిరి. ఫలాహారమును, కాఫీ యిచ్చిరి. శిరీషుడు దిగ్బడిపోయెను. చివఱకు దొరగారు తామాస్థానకవిని నియమింప నెంచుచుంటిమనియు, నిర్ణయసంఘ మొక టేర్పాటుచేసి దానిలో వాసంతి నొక సభ్యురాలుగా నెన్నుకొంటిమనియు జెప్పెను. శిరీషు డంగీకరించెను. శిరీషుడు లేచి సెలవుపొందబోవుచుండగా దొరగా రిట్లు చెప్పెను. శిరీషుగారూ! రంగనాథముగారి రెండవ కుమార్తె తమరున్నచో మిక్కిలి క్షేమముగా నున్నదట. మిమ్ముఁవదలి మరియొకరిని వివాహము చేసికొ

చేత సుసంగతముగాఁ గనిపింపఁజేయును. అతని మాటలయందు సామాజికు లింత శ్రద్ధవహించుట కతనియం దొక పరమేశ్వరదీప్తి కలదు. సుకుమారముగా, మధురముగాఁ జేసిన యతని కవితారచన కొండఱు భావుకుల నతనియందుఁ బ్రసన్నులఁ జేసినది. అతఁడు సోమరి. అందుచేత నెక్కువ చదువలేదు; వ్రాయలేదు. అతఁడు చదివిన దెక్కువ యింగ్లీషుభాష. అతఁడు పట్టణములో నాల్గయిదుపన్యాసములేర్పాటుచేసి యజ్ఞనరావు స్నేహితులలో రామశాస్త్రి యనువాతని నాస్థానకవిగా నిర్ణయించుట సమంజసమన్నట్లు నిరూపించెను. ఇందులోఁ గొంత నేర్పున్నది. యజ్ఞనరా వట్లు చెప్పినచోఁ బెరుమాళ్ళట్లు వినుచుండెను. చంద్రమతి యజ్ఞనరావుమాట వినును. నిర్ణయసంఘము తీర్మానము చేసినను జీవము కంగీకరించుట దొరగారి చేతిలో నున్నదికదా. దానికిఁ జంద్రమతి యవసరము. వాసంతిమూడ యజ్ఞనరావుమాట కొంత వినవచ్చును. ఇంతకును రామశాస్త్రి యేబదియేండ్లవాఁడు. అతఁడనేక నాటకములను వ్రాసెను. అతని నాటకములు దేశమునం దంతట నాడుదురు. అవధాని యొక్క యీ యూరిలోనే ప్రతిష్ఠ కలవాఁడు. రామశాస్త్రికి దేశములో గొంత ప్రతిష్ఠ యున్నది. రంగనాథ ముపన్యాసములిచ్చినపుడు వాద్యముగా రామశాస్త్రి కిమ్మని చెప్పలేదు. అతనియుపన్యాస మొక గారడీ. అది యొక శక్తి. చివరకేమి చెప్పినాడని యాలోచింపగా నేమి చెప్పెనో తెలియదు. మనసులలో నంతయు మాత్రము రామశాస్త్రి కీయవలయునని నిశ్చయించుకొనిరి. రామశాస్త్రి కీయవలయు నని యతఁడు చెప్పెనని రొకఁ డన్నచో రెండవవాఁడు వెంటనే కాదని చెప్పవచ్చును. రామశాస్త్రి కవిత్వములోని గుణములు చూపించె నన్నచో నవధాని కవిత్వములోని గుణములను జూపించెను. అతనిమాటలలో లేదు; అతని యభినయములో నున్నది. అతఁడు గొప్ప ప్రజ్ఞాశాలి యనుటకు సందేహము లేదు. అతని ప్రజ్ఞ యసన్మార్గమునఁ బోవుననుటయే కాని ప్రజ్ఞలేదనుటకు వీలులేదు. న్యాయముగా నవధాని కిప్పింపవలయును. లేదా తా నూరకుండవలయును. నావిడిచి తన కిమ్మని యడుగవలయును. ఆత్మాభిముఖముగాఁ బ్రయత్నము చేసికొనవలయును. దొరగా రన్నప్పుడు మొగమోటము తన సంగతి తాను చెప్పుకొనుటకు కొలుపు. అవధానికి రాకుండఁ జేయవలయునని పట్టింపు. మనసులో నింకొక యూహ. తన యూరిలోనివారి కెవ్వరికిని రాఁకూడదు. వచ్చినచోఁ దన కమర్యాద. పరాయియూరి వాని కిప్పించినచోఁ దనకు రెండు లాభములు. మొదటి తనకప్రతిష్ఠ లేదు; రెండవది వారిమీఁద బగ తీర్చికొన్నట్లగును. ఇట్టి యలుపపు టూహలు చేయునుగాని లేనిచో నతఁడు సమర్థుడు. నిజముగా నాస్థాన

లోకమిట్లుండును. ఇదికాక యిల్లు చేయుట తప్పకదాయని నేనే కరీటి వడిగి తిని. అతి డిట్లు సమాధానము చెప్పెవాడు. ఏమనగా "వాసంతీ, అందతివలెనే నీవును పొరపాటు పడుచున్నావు నేనతని గుఱించి వ్రాసితి ననగా నతని గుఱించి వ్రాయలేదు. అతనిలోని కొన్ని లక్షణములు తీసికొని నేనొక పాత్ర సృష్టించి యాపాత్రయందు వీరినికూడ సంయోగపఱచితిని. మనమొక గ్రంథము వ్రాసినచో మనము కొన్ని పాత్రములను సృష్టింతుము సృష్టించుట యనగా నేమి? మనము లోకములో జాలమందిని జూచుచుందుము. వారి స్వభావములను గుర్తించుచుందుము. పరిస్థితులను దెలిసికొందుము. ఆపరిస్థితుల నే గ్రంథములందు గల్పింతుము మనముకల్పించిన పాత్రలమీద మనము లోకములో నెఱిగియున్న మనుజుల స్వభావముల నారోపింతుము ప్రధానముగా నవల వ్రాయువాడెవ్వ డైన నీపనియే చేయును. నవల చారిత్రికమైన బొతకులు గుర్తుపట్టలేరు. సాంఘిక మైనచో బోల్చుకొందురు పోల్చుకొనినను సమాన లక్షణముల నే పోల్చుకొందురు. ఎఱిగియున్న వారియందు నెఱిగిన విషయములం దభిమానము పెంచికొని కామ క్రోధాది దూషితులగువారు గ్రంథము జదువుట కనర్హులు. గ్రంథము చదివి నప్పుడొక యలౌకికానుభవమును బొందవలయునుగాని యిట్లు పోల్చుకొని మాత్సర్యగ్రస్తులు కాకూడదు. అది సాత్వికలక్షణము కాదు మఱియు నొక విచిత్రమైన ప్రకృతి యొక పురుషునియందున్నచో గ్రంథకర్త తా నెఱిగియున్న వానియందా లక్షణములున్నవని వ్రాయుట మానివేయును ఒక గ్రంథమును వేలమంది చదువుదురు. కవియెఱిగియున్న యావ్యక్తిని కొద్దిమంది యెఱుగుదురు. ఆకొలది మందియే యామనిసిని బోల్చుకొందురు. తక్కిన వేలమందికి నాపాత్ర సృష్టి కావ్యానందమును సమకూర్చును. మన మందరమును గొన్నాళ్లకు జనిపో దుము. కావ్యము బ్రదికెడిది. భవిష్యత్ప్రజలకు నీకావ్యమునందు బ్రదికి యున్న యావిచిత్ర ప్రకృతిగల మనుష్యునితో సంబంధమేమి? వారిది కేవలమైన సారస్వతదృష్టి. మనయూరిలోనివారిది ప్రస్తుతము వ్యక్తిగత దృష్టి. ఎక్కువ తప్పు ఆమనిసిని బోల్చుకొని కోపము పొందెడివారిదికాని కవిదిగాదు. కవి వాని నేల పరిహరింపరాదు? ఇంక నే నే విలక్షణమైన ప్రకృతిగల మనుష్యులు లేరా, వీని నే సృష్టింపవలయునా యని యన్నచో నాకని యతని నెందుకు వదలిపెట్టవలయును? అతనియందున్న వైలక్షణ్యము మిక్కిలి విలక్షణత్వము కలది. కావ్యములయం దధిక వైలక్షణ్యముకల ప్రకృతులే యుపాదేయములు. మఱియు నో వాసంతీ, అతని నెవ్వనినో చిత్రించితినని నీకు దిగులెందుకు? నాలోనున్న నాకు దెలిసిన దోషములు వికారములు నానవలలో నీపాత్ర యందు నిక్షేపించితిని. పైగా నన్ను దిట్టుకొనినంత వానిని దిట్టలేదు.

ములో వేసి యట్టిపెట్టిన హారతికర్పూర మింతకంటె నెక్కువదినము లాతి పోషింప నుండును.

ఇట్టిస్థితిలో విద్యుచ్ఛాఖవారికిఁ దన వందయెకరముల తోటలు నిచ్చినఁ గాని యీ తాకిడికి దట్టుకొనుట సాధ్యము కాదని దొరగారు నిశ్చయించుకొనెను. రంగనాథముగారు ప్రోత్సహించెను

ఒకనాఁడు పోయి తోటలన్నియు తనిఖీచేసికొనుటకు నచటనున్న వారి నందఱిని లేచిపొమ్మనిరి. తక్కిన పేదవారు కొందఱు కాళ్ళ వ్రేళ్ళఁ బడిరి. సారథితోటదగ్గఱకుఁ బదిమంది పరివారముతో రంగనాథమును దొరగారును వెళ్ళిరి. సారథి కీవ్యవహారమే తెలియదు. అతఁడు పండుకొని నిదురపోవుచుండెను. అతనిని దొరగారి పరిచారకులు నిదుర లేపిరి. దొరగారు వచ్చిరని చెప్పిరి. సారథి పోయి వారిద్దఱిని దర్శించెను. రంగనాథమీ సంగతి యంతయుఁ జెప్పెను. సారథి యెప్పుడు లేచిపొమ్మందురనెను. రంగనాథము నాఁడే లేచిపోవలయు ననెను. సారథి యట్లే యనెను. రంగనాథము దొరగారితో సారథి పొగరుబోతనియు, నతఁడు పేచీపెట్టు ననియు, నతని మూలముగా నీవ్యవహారము కోర్టులలోనికి దిగవచ్చు ననియుఁ జెప్పుటయే కాక యతఁడు మంచి బలశాలి; కొట్టుటకుఁ గూడ రావచ్చు ననెను. అట్టి సారథి వెంటనే నేను వదలిపోవుదుననఁగా దొరగారి కాశ్చర్యము వేసెను. మఱియు సారథి లోనికిఁ గూడఁ బోకుండ బయలుదేరి వదలిపోవుచు మఱల వెనుదిరిగి వచ్చెను. ఇట్లనెను: 'అయ్యా! మీతోటలోనికి మఱలఁ బోయెడి వాఁడను కాను. కాని పాకలో నా సంచి యున్నది. నాఁడీ కట్టియున్నది. వీని రెంటికోసము తిరిగి రావలసివచ్చె'నని యనెను. దొరయొక్కయు రంగనాథము యొక్కయుఁ గన్నులు పెద్దవి యయ్యెను. సారథి లోనికిఁ బోయి యారెండు వస్తువులను దెచ్చెను. తెచ్చి వదలిపోవుచుండెను. పోవుచున్న సారథిని దొరగారు వెనుకకుఁ బిలిచిరి. 'ఎక్కడికి బోవుదు'వని యడిగెను. సారథి "అయ్యా! నేనొక బైరాగి వాఁడను. నా కేమి భయము? ఆస్తులు పోయినచోఁ బ్రభువులు భయపడవలయును. వారికి బ్రదుకుట చేతఁగాదు. వారి బ్రతుకులను గొందఱు భంగపఱతురు. భంగపఱుపఁబడుటకు మాకు బ్రతుకే లేదు. మమ్ము బాగు చేయవలెనని గాని, పాడుపఱచ వలయునని గాని రంగనాథమువంటి లౌకికు లూహించరు. మా నాటకభవనము తమరు తీసికొనిరి. అది యేమి బాగుపడినది? అంతకుఁ బూర్వము దొరగారికి దమ్మిడీ ఋణము లేదు. నేఁ డన్నియు ఋణములే. ఇప్పుడు నేను వదలిపోవుచుంటిని. ఈ తోటలవలన దొరగారి ఋణములు తీరునా? తీరినచో నేను సంతోషింతును. కాని కొందఱు మెఱిమించి

ప్రక్కనే కూర్చుండెను. శిరీషు డప్పటనే యుండెను. అతఁ డాశ్చర్యపోయి చూచుచుండెను. కూఁతుతో నేమియు మాటాడలేదు. వీరిద్దఱి కంతటి పరిచయ మెప్పుడైనదో యతనికిఁ దెలియలేదు. ఈ పరిచయము సారథి పరిచయముతోడి కంటె బదిరెట్లుండెను. వాసంతి యిట్లనెను. "కిరీటీ, దొరగారు సారథి తోటను విశేషముగ కొనిరట. సారథియే వచ్చి నాతోఁ జెప్పెను. అందుచేత నే నప్పటికి రాలేదు. ప్రతిదినము నీవు వత్తువని యనుకొంటిని. నీవు రానేలేదు. సారథి యేమైనాఁడో తెలియదు. మాయింటిలో నుండుమని యడుగుద మను కొంటిని. అతఁడు నిలచినాఁడా? అతఁడు వంచిన తల యెత్తకుండ వెడలిపో యెను. అత డెప్పట నున్నాడో నాకు దెలియదు. అతని వార్త యేమైనదో తెలిసికొందమన్నను నే నెవ్వరి ద్వారా తెలిసికొనఁగలను? నీద్వారా నే తెలిసికొనఁగలను. నీవు వచ్చుటయే మానివేసితివి." కిరీటికి మనసులోఁ గోప ముబికివచ్చుచుండెను. వాసంతికి సారథిమీఁద నున్నంత ప్రేమ తనమీఁద లేదు. ఈ విషయము కిరీటికిఁ గ్రొత్తగాఁ దెలియునా? తనమీఁద వాసంతికిఁ ప్రేమ కలుగుటకుఁ గారణము సారథియే కదా. అంతయుఁ దెలిసికూడ నావిష యములోఁ గిరీటిమనస్సునఁ గోపము కలుగుటయే యాశ్చర్యము అతఁడు మరల గోపము సర్దుకొనెను. అట్లే వారిద్దఱు చాలసేపు కూర్చుండిరి. భోజనవేళ యైనది. కిరీటి నచటనే యుండి భోజనము చేయుమని వాసంతి బలవంతము చేసె ను. కిరీటి గూడ మెను వదలిపోలేకుండెను. భోజనము చేయుచుండిరి. వాసం తియుఁ గిరీటియు దగ్గఱ దగ్గఱగాఁ గూర్చుండిరి. వాసంతి తాను భోజనము చేయుచుఁ గిరీటి తనకుఁ గూర యెక్కువ నవదని చెప్పఁగా నాకూర తాను తీసి కొని తన కంచములో వేసికొనెను. శిరీషునకుఁ గోపము వచ్చెను. కను సైగ చేసి చూచెను. కాని వాసంతి తండ్రివంక నే చూచుచుండుట లేదు. భోజ నము లైనవి. రాత్రి ప్రొద్దుపోయెను. కిరీటి తా నింటికిఁ బోదు ననవలయునో, యచటనే యుండవలయునో తెలియలేకుండెను. తాంబూలసేవన మైనతరు వాత వాసంతి కిరీటినిఁ దన గదిలోనికిఁ బిలిచెను. తలుపు గడియ వేసెను.

శిరీషుఁ డొక్కఁడు సావడిలోఁ బండుకొనియుండి తలక్రిందులగుచుండెను. అతనికి సాయంకాలమునఁ గిరీటి వచ్చినప్పటినుండియు జరుగుచున్న వ్యవహార మంతయుఁ బట్టరానిదిగా నుండెను. పూర్వపు దినములలో నైనచో నెట్లు ప్రవర్తించెడివాఁడో తెలియదు కాని కమలావ్యవహార మైనతరువాత నతనిలోఁ జాల మార్పు వచ్చెను. పైగా నీరోజులలో నతఁడు కమలావిరహ మనుభవించు చుండెను. సర్వవేళల నామెనుగూర్చియే విచారించుచుండెను. అతని మన స్సులోఁ దక్కిన భావములన్నియుఁ లొంగుబడియుండెను వాసంతీకిరీటుల ప్రతిచిన్న హేలయు నావాఁగును గొంచెము గొంచెముగా నూఁచివేయుచుం డెను. వారిద్దఱును బోయి గదిలో నుండి యిట్లు తలుపు వేసికొనినంతనే

యాతని కోపాగ్నిపై మన్ను గొంచెమైన తెలిబూదియుఁ బొఱగేచిపోయి నిప్పులు కణకణలాడెను. అతఁడు మఱికొంచె మాలోచించెను. దానిలో భగ్గుమని మండెను. వారు తలుపు వేసికొనినతరువాతఁ బదినిముసములకు శిరీషుఁడు పోయి తలుపులు పమ్మెటలతోఁ గొట్టివెట్లు గొట్టెను. తలుపు తీయుమని యఱచెను. అంతటివఱకుఁ గిరీటిమనస్సు శాంతముగా నుండెను. అతఁ డాశ్చర్యపోవుచుండెను. తమ సంగతి శిరీషునకుఁ దెలియువనుకొనెను. ఇదట వింత సౌముఖ్యముండెనని తెలిసినచో నిదికఱకే గచ్చెడివాఁడె యనుకొనెను. ఈ మాటలన్నియు వాసంతితోఁ జెప్పెను. వారిద్దఱు గాఢాలింగనసుఖ మనుభవించుచుండఁగా శిరీషుఁ డిట్టి పిడుగులు పట్టు తలుపులు గొట్టుటయు, బెట్టిగా నఱచుటయు జరిగెను. అతనికి బై ప్రాణములు పైన లేచిపోయెను. వాసంతితో నిది యేమి, యిది యేమి యని గాబరాపడుచు నడిగెను. వాసంతి "నీ వూరకుండు"మని యతనిని శాంతపఱచి తాను తలుపుతీసెను. అప్పుడు శిరీషు డనిన మాటలు గ్రంథములలో వ్రాయఁదగినవి కావు. అతడు కిరీటిని గొట్టుటకు బయలుదేరెను. వాసంతి కిరీటి కడ్డమువచ్చి యిట్లనెను: "నాన్నగారూ! మీరనినమాట లేవియు బాగుగా లేవు. మీ కిష్టము లేనిచో నే నింటిలోనుండి వెడలిపోయెదను. అతడు నాకు భర్త. మా యిద్దఱకును నాల్గునెలలనుండి సంబంధము. సారథి మా యిద్దఱకు వివాహము చేసెను. పరమేశ్వరుడు నాకు నిర్ణయించిన భర్త సారథి. ఆ సారథి తాను నన్ను పెండ్లి చేసికొనినచో నా కన్యాయము చేసినట్లగునని, పైగా దనకు నేను బిడ్డవంటిదాన నని నన్నితని కిచ్చినాడు. నా కితడే భర్త" అనెను. శిరీషుడు "నిన్నిచ్చుటకు వాడెవడు? వాడు నన్నింత మోసము చేయునా"యని సారథిని మఱికొన్ని తిట్టెను. శిరీషు డన్ని తిట్టినను దిట్టినవన్నియు దిట్టనిచ్చి వాసంతి సమాధానము చెప్పుచుండెను. వాసంతి యిట్లనెను: "నన్ను గిరీటి కిచ్చుటకు సారథికే యధికార మున్నది. నేను లోకము వంటిదానను గాను. అందఱివలె నేను పసువును కాను. నేను మానవురాలను. నా కొక్కడే భర్త. లోకములో స్త్రీపురుషులు వ్యభిచరింతురు. వారికి నిజమైన శరీరసుఖము తెలియదు. నిజమైన శరీరసుఖ మెట్లుండునో నా యొక్కతెకే తెలియును. భర్త కానివాడు నన్ను స్పృశించినచో నా యొడలు మండిపోవును. నిజముగా మండిపోవును. ఆ మండకుండుట నా కొక్క సారథి శరీర స్పర్శలోననే కలదు. అతడు నాకు దండ్రివంటి వాడైనాడు. అందుచేత నతడు తన శరీర శక్తిని గిరీటియందు సన్నిహితపఱచి నాకు గిరీటిని భర్తగా నియమించినాఁడు. నేను సారథి కట్టి శిష్యురాలనో కిరీటి సారథి కట్టి శిష్యుఁడు. మే మిద్దఱము సారథికి భక్తులము. మా యిద్దఱి యాత్మ లొక్కటి. మా యిద్దఱి దాంపత్యము భగవంతు డంగీకరించినాడు. సారథి యనుగ్రహించినాడు. సారథి మ మ్మాశీర్వదించినాడు. నేను గిరీటిని గామించకొన్నచో నే నన్ను

పట్టణమంతయుఁ దెలిసెను. అది యొక విడ్డూరముగాఁ జెప్పికొనఁజొచ్చిరి. కథ యీరీతిగా వ్యాపించెను. పారధి యొక యోగి. అతనివద్ద ననేకములయిన యోగశక్తులు కలవు. వాసంతి యతనిని ప్రేమించినది. అతఁడు విరాగికనుక తన యోగశక్తిచేతఁ గిరీటినిఁ దన్నుగాఁ జేసి వాసంతి నతనికిచ్చి పెండ్లిచేసెను. ఇది స్థూలరూపము. దీనికిఁ జిలవలు పలవలుగా వేయి కల్పించికొని చెప్పుచుండిరి. ఈస్థితిలో పారధిని రంగనాథము సాధించిన దేమియు లేదు. తానొక్క జమీందారునే సాధించెను. వాసంతిని దాను సాధింపలేదు సరికదా కిరీషుఁడే తన కూఁతును సాధించెను. తాను జక్కని కవి. అన్నోదకములు కలవాఁడు. తన కీపతిత్రిమార్గ మెందులకు? చదివి గొప్పవాఁడు కావచ్చును. మంచికావ్యములు వ్రాయవచ్చును. అవధానివలె గనకాభిషేకము జేయించుకొన వచ్చును ఎవరికో సాధింతమని కూర్చున్నచో నయ్యేది ఫల మిదియని రంగనాథమునకు దెలిసెను. కాని పైకిఁ జెప్పఁడు. అద్భుతముగాఁ దొల్లింటిత్రోవలు వదలిపెట్టలేఁడు. పాప మాజీవుఁడు త్రిశంకుస్వర్గమున నుండెను.

నాటక ధినము పాడుపడెను. దానికిఁ దొల్లింటిస్థితి వచ్చెను. క్లబ్బు వారు మాత్రము దానినిఁ బట్టుకొని ప్రేలాడుచుండిరి.

వంశపారంపర్యములతో టయిను దొరగారు స్వాధీనము చేసికొనిరి. కాని యచట గాలిపటలు తిరుగనారంభించెను. రాజకీయముగారి విద్యుత్ ప్రణాళిక ధనాభావము చేతఁ దాత్కాలికముగా మనిపేయఁబడెను. దొరగారియూరే వదలిపెట్టి పోయి మద్రాసులో నుండుటకుఁ బ్రయత్నము చేయుచున్నారు. ఆయన స్వంతికముతో మంతయు నమ్మకమైనఁగాని ఋణములు తీరవు. ఆయనకుఁ బది గ్రామము లున్నవి. ఆరు గ్రామములు లిదవఱకే యమ్మివేసెను. మిగిలిన నాలుగు గ్రామములలో నన్నపుజట్టే లున్నవి.

కిరీటికి వాయూరి కళాశాలలో నుద్యోగము కుదిరెను. అతని కెనుఁబది రూకల జీతము. అతఁడు వేఱే సంసారము పెట్టుద మనుకొనెను. కిరీషుతోఁ జెప్పెను. కిరీషుఁడు "పెద్దలు వివాహము జేసికొనవలయు" ననెను. నాలుగు వేలు ఖర్చుపెట్టి కిరీషు వాసంతి కిరీటుల వివాహము చేసెను. కిరీటితల్లియుఁ జెల్లెండ్రును దమ్ముఁడును వచ్చిరి. తండ్రి రాలేదు. కిరీషుఁడు వాసంతి పేరఁ బదియెకరములు వ్రాసెను. కిరీటి వేఱే కాపురము పెట్టెను. దొరగారిచ్చిన ముత్యాలహారము నమ్మెను. ఆ సొమ్ము బేంకులో వేసెను. అతని పని బాగుగా నున్నది. ఆకళాశాలవారే యతని నొక యేడాది ట్రెయినింగుకు బంపింతు మనుచుండిరి. తిరిగివచ్చిన తరువాత నూటపదిరూకలిత్తురు.

ఒకనాఁడు కమలయు కిరీషుఁడును యాదృచ్ఛికముగా వీధిలోఁ గలసికొనిరి. అప్పటికిఁ గమలకుఁ బదునెనిమిదేఁడులు దాటినవి. ఆమెకు మైనారిటీ దాటెనో పెళ్లిలేదో. కిరీషు కమలను దనయింటికిఁ దీసికొనిపోయెను. తన కిల్లు

న్నది. పదునేనెకరముల పొలమున్నది. కమల మాటాడకుండ వెళ్లిపోయెను. ఈసంగతి రంగనాథమునకుఁ దెలిసెను. ఇంటిలో నెవ్వరు నేమియు మాటాడ లేదు. ఊరిలో సంగీతపుఁ గచ్చేరీలు లేవు. నాటకములు లేవు. సారస్వతసభలు లేవు. ఎవని బ్రదుకు వాఁడు బ్రదుకుచుండెను.

సారధి యేమయ్యెనో యెవరికిని దెలియదు. కమల కాపురమునకు వెళ్లిన తరువాతఁ బ్రతిదినము సాయంకాలమున శిరీషునింటిలోనో, యదువరావునింటి లోనో, కిరీటియింటిలోనో మూఁడు సంసారములు కలియుచుండును. లలితయుఁ గమలయు వాసంతియు నష్టన కిరీటి శిరీషులును లలితకూఁతురును గలిసి కాలక్షేపము చేయుచుందురు.

ఒకనాఁడు డగ్గువరా విట్లనెను: "సారధి యేమయ్యెనో తెలియునా? సారధి యొక క్రైస్తవస్త్రీని బ్రేమించెనట. ఆమెను వివాహము చేసికొనెను. క్రైస్తవ మతములోఁ గలసెను. వారి యింటనే యుండి భోజన పానాదులు చేయుచుండెనట. ఈకథ జరిగి యేఁడాదిపైన జరిగెనట. అతఁడా మతములోఁ గలిసిన తరువాత బైబులులోఁ బెద్దపండితుఁ డయ్యెనట. ఇప్పుడతనికి నెలకు రెండువందల రూపాయలట!" వాసంతి మొగము వాంచెను. శిరీషుఁడు నవ్వెను. కిరీటి తన భార్యను దీసికొని వాహ్యాళి వెళ్లెను.

మఱికొన్నాళ్లయిన తరువాత నొకనాటి సాయంకాలమున శిరీషుఁ డిట్లు చెప్పెను: "వాసంతీ! ఈవార్త విన్నావా? మన సారధి యేమైనాడో! అతఁడు క్రైస్తవమతమును వదలిపెట్టెనట. ఒక తురకదానిని బ్రేమించెనట. ఆక్రైస్తవభార్యను వదలిపెట్టెను. సాహెబులందఱు నతనిని గొట్టుటకు వచ్చిరట. అతఁడు క్రైస్తవ మతమును వదలిపెట్టి బుఱ్ఱ గొరిగించుకొని ముసల్మానులలో జేరెను. ఇప్పుడు నమాజు చేయుచున్నాఁడు. ఖురానులో పెద్ద పండితుఁ డయ్యెనట. కాజీలుకూడ వానిని మన్నించుచుండిరట" వాసంతి తల వాంచెను. దిగులుపడుచుండెను. కిరీటి యామెదగ్గఱకుఁ బోయి కూర్చుండి యామె బుజముమీఁదఁ జేయివైచి యోదార్చి యామెను వాహ్యాళికిఁ దీసికొని పోయెను.

తరువాత రెండుమూఁడేండ్లలో సారధి యామతమును గూడ వదలిపెట్టెనని, కొన్నాళ్లు జైనమత మవలంబించెనని, కొన్నాళ్లు బౌద్ధమత మవలంబించెనని, చివఱ కొకయూరిలోఁ బూటకూళ్లు బసపెట్టెనని వార్తలు వచ్చెను. అతఁడు ఒక మతము విడిచి పెట్టుటయుఁ గొన్నాళ్లు నాటకములలో వేషములు వేయుటయు మఱల నింకొక మతము స్వీకరించుటయు నిట్లు జరుగుచుండెను. అతఁ డెప్పుట నాటకములు వేసినను వాని తొలినాఁటి నాట్యసరస్వతీశోభ వెలార్చుచునే యుండెను. ఆనాట్యరసాధిదేవతా స్వరూపము మఱుగుపడి పోయిన దేశములో వాని ప్రతిష్ఠ బైటికి రాలేదు. చివఱ కతఁడు మరల

హిందూమతములోఁ జేరెను. బ్రాహ్మణుల పూటకూళ్లు బస పెట్టెను. అచటకుఁ బోయి బ్రాహ్మణులు తినుచునే యుండిరి.

ఒకనాఁడు సారథి యాయూరు వచ్చి రుక్మాంగద నాటకము వేయునని గోడలమీఁదఁ గాగితము లంటించఁబడెను. కిరీటి యా కాగితములు చూచి వాసంతితోఁ జెప్పెను. వాసంతి కిరీటినిఁ బోయి యతనిని బట్టుకొని రమ్మని చెప్పెను కిరీటి యతనినిఁ బోయి వెదకెను. అతఁడు రాననెను. వాసంతియే యచటకి వచ్చెను. మోహినివేషము తాను వేయుదు ననెను. అతఁ డంగీకరించలేదు. వాసంతి నాటకము వేయకుఁ దానే పోయి మోహినీ వేషము వేయు నొక స్త్రీని బతిమాలి తాను రంగములోనికిఁ బోయెను. సారథి యేమి చేయును? నాటకమాడుచుండెను. ఆయూరి ప్రజలు నాటకము చూచి యెన్నాళ్లయినదో? జనము విరుగఁబడిపోయిరి. ఆ శిథిలమైన నాటకభవనములోననే నాటకమాడఁబడుచుండెను. ఒక రంగములో వాసంతి సారథినిఁ గౌగిలించుకొనెను. ఆ కౌగిలించికొన్నప్పుడు "మోహనాంగ" యన్న మొదటి పాట పాడుచుండెను. ఇద్దఱును పరిపూర్ణ పారవశ్యమును బొందుచుండిరి. ఇప్పటికి నొకరు తెలియలేదు. ఏవిద్యుచ్ఛక్తియు సారథిశరీరమునుండి కిరీటిశరీరములోనికిఁ బ్రవహించినదో యా విద్యుచ్ఛక్తియే సారథిశరీరమునుండి వాసంతికి వేయిమడుంగు లెక్కువగ కనిపించెను. సారథికి వాసంతియందుఁగూడ నదే కనిపించెను. రంగభూమియందే యాకౌగిలింతలోననే యిద్దఱి ప్రాణములు శరీరములనుండి వెడలిపోయెను.

సమాప్తి

Printed at the Andhra Patrika Press, Madras—

